ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow
@mohanpublications




- డా॥ ఆండ్ర కమలాదేవి

# తిక్కన భారతము - రసపోషణ

# తిక్కన భారతము - రసపోషణము

డా॥ ఆంధ్ర కమలా దేవి

ఆంధ్ర విశ్వవిద్యాలయము డాక్టరేట్ పట్టమునకు ఆమోదించిన
సిద్ధాంత గ్రంథము

తిక్కన భారతము - రసపోషణము

రచయిత్రి

డా॥ ఆండ్ర కమలా దేవి



ప్రథమ ముద్రణ :
ప్రజోత్పత్తి నామ సంవత్సరము జ్యేష్ఠ మాసము (జూన్) 1991

ప్రతులు : 1000

వెల : రూ॥ 100

ముద్రణ :
ప్రింటోరియం
హైదరాబాదు

ప్రతులకు - వివరాలకు :

Dr. A. Kamala Devi,
C/o. Lt.Col. J.L. Rao (Retd.),
88, Methodist Colony,
Begumpet,
Hyderabad-16.

సుల్తాన్ బజార్
హైదరాబాద్ - 500195

(తెలుగు విశ్వవిద్యాలయమువారి ఆర్థిక సహాయముతో ముద్రితము)

# అంకితము

"మాతామిత్రం పితాచేతి స్వభావాత్రితయంహితమ్
కార్యకారణాతశ్చాఽన్యే భవంతి హిత బుద్ధయః"



కేవలం విద్యా వినయ సంస్కారాల నలవర్చటం మాత్రమేగాక, చిన్నప్పటినుంచి ప్రతివిషయంలో తగిన ప్రోత్సాహమిచ్చి, నన్ను తీర్చి దిద్దిన అనురాగ మూర్తులు, పూజనీయులు, గురుతుల్యులు అయిన నా తలిదండ్రులు కీ. శే. ఆంధ్ర శివప్రసాదరావు, శ్రీమతి లక్ష్మీ బాయమ్మలకు ఈ గ్రంథము అంకితమిచ్చుచున్నాను.

# ఆశీస్సులు - అభినందనలు

ఆచార్య కె.వి.ఆర్ నరసింహం
రిటైర్డు ప్రొఫెసరు,
తెలుగుశాఖ,
ఆంధ్ర విశ్వవిద్యాలయము,
వాల్తేరు.

శ్రీమతి ఆంద్ర కమలాదేవి రచించిన సిద్ధాంత వ్యాసమును ఆమూలాగ్రముగ పరిశీలించితిని. నిజముగా రసపోషణమున తిక్కనను మించిన మహాకవి ఆంధ్రమున లేడు. శ్రీనాథుని వంటి మహాకవి కూడ తిక్కన రసాభ్యుచిత బంధమును ప్రశంసించి యున్నాడు. మహాభారతమున వివిధ ఘట్టములలో వివిధ రసములు పోషింపబడి యున్నవి. వాని నన్నిటిని సమగ్రముగ పరిశీలించి శాస్త్రీయముగ పరిశోధన చేసినవారు ఇంచుమించుగ లేరని యే చెప్పవచ్చును. అట్టియెడ శ్రీమతి కమలాదేవి 'తిక్కన భారతము - రసపోషణము' అను సిద్ధాంత వ్యాసమున తిక్కనగారి రసపోషణ సామర్థ్యమును వివరించియున్నది. ఇది నిజముగ ప్రశంసనీయమగు విషయము. ఇటువంటి సిద్ధాంత వ్యాసమును రచించిన శ్రీమతి కమలాదేవికి ఆయురారోగ్య ఐశ్వర్య సౌభాగ్యములను సర్వదా ప్రసాదింపుమని భగవంతుని ప్రార్థించుచున్నాను.

కె. వి. ఆర్. నరసింహం

(కె.వి.ఆర్.నరసింహం)

వాల్తేరు
25-12-90

ఆచార్య చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి
రిటైర్డు ప్రొఫెసరు,
ఆంధ్రవిశ్వ విద్యాలయము,
వాల్తేరు.

కవిత్రయంలో ద్వితీయుడై కూడా కావ్యనిర్మాణ దక్షతలో తిక్కన అద్వితీయుడు. అసలు కవిత్రయమే అట్టిది. తిక్కనది రసోదంచితమైన రచన అని ప్రసిద్ధి.

మహాభారతము ఆయాఘట్టములలో నవరసములు ఒలికించుటకు అనుగుణమైనది. వ్యాసుడు అటుల చేయకపోలేదు. అనువాదము కావించుచున్న తిక్కన ప్రత్యేకత ఏమి అనుప్రశ్న ఉదయించి తీరును. అనువాదమునకు కొన్ని ప్రతిబంధకములు లేకపోలేదు. కవిత్రయము కేవలానువాదకులు కారు. ఆయా ఘట్టములను మననము చేసికొని, స్వతంత్ర రచనలా అన్నట్లు వానిని రూపొందించిన ప్రతిభా సంపన్నులు ఆ కవులు. అనగా భారతము స్వతంత్రప్రాయమైన రచన. ఆదృష్టితో పరిశీలించినప్పుడు మాత్రమే తెలుగు భారతము నిలుచును. తొలికవుల కంటె తర్వాతి కవులు కొన్ని మెరుగులు దిద్దుటకు అవకాశమున్నది.

సిద్ధాంత వ్యాసములో లక్ష్య లక్షణ సమన్వయము కావించబడినది. శాస్త్రీయ దృష్టిలో సర్వము వివేచింపబడినది. ఆయా ఘట్టములను ఏకరువు పెట్టుట చర్వితచర్వణము కాగలదు. పండిత ప్రకాండులు వానిని పరిశీలించి తృప్తి పడగలరు. వర్ధిష్ణువులు మేలు పొందగలరు.

చి॥సౌ॥కమలాదేవి అవిరళకృషి వలన రూపొందిన వ్యాసమిది. బహుముఖ ప్రజ్ఞాపాటవములు గలిగిన ఈమె నుండి మరింత సారస్వత సేవ జరుగగలదని ఆశించుచున్నాను. ఆశీర్వదించుచున్నాను.

(చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి)

వాల్తేరు
15-3-91

డా॥ కోలవెన్ను మలయవాసిని
ప్రొఫెసర్ & హెడ్,
తెలుగు శాఖ,
ఆంధ్ర విశ్వకళా పరిషత్,
విశాఖపట్టణం.

'నానారసాభ్యుదయోల్లాసి' యైన విరాటపర్వమాది భారతమును రసాభ్యుచిత బంధములో కూర్చిన మహాకవిత్వ దీక్షాపరుడు తిక్కన.

ఆ మహాకవి తీర్చిన పదునేను పర్వములలో గల నవరసములను పరిశీలించి క్రోడీకరించుటలో పూర్వ విమర్శకుల అభిప్రాయములను కూడ గ్రహించుచు కొన్నియెడల వానిని సమర్థించి కొన్నియెడల ఆ అభిప్రాయములతో భేదించి సోదాహరణముగ సోపపత్తికముగ వివరించిన సిద్ధాంత గ్రంథము 'తిక్కన భారతము-రసపోషణము' – డా॥కమలా దేవిగారి రచనము.

నవరసముల పరిశీలనమే గాక తిక్కన భారతమున అంగిరసమును నిరూపించుటలో, రససాంకర్యమును సమీక్షించుటలో డా॥కమలా దేవి గారు చూపిన నేర్పు మెచ్చదగినది.

కవిబ్రహ్మ తిక్కన భారతమునందలి రసపోషణమును సమగ్రముగ దర్శించు వాగ్దర్పణము ఈ సిద్ధాంత గ్రంథము. సిద్ధాంత గ్రంథరచనలో రచయిత్రి ప్రదర్శించిన విశ్లేషణ ఎన్నదగినది.

ఈ విదుషీమణి కలమునుండి మరికొన్ని మంచి విమర్శక గ్రంథములు వెలువడవలెనని ఆకాంక్షించుచూ.

కోలవెన్ను మలయవాసిని

(కోలవెన్ను మలయవాసిని)

వాల్తేరు,
10-6-91.

*Dr. (Smt.) T.Susheela*, M.A., Ph.d.,
Reader. M.I.L.Dept.,
Delhi University,
Delhi-7

దుర్గమార్థగౌరవం గలిగి, విశ్వవిజ్ఞాన సర్వస్వమైన భారతాన్ని విమర్శించడమే దుష్కరకార్యం. అందులో దానిలోని రసప్రతీతిని గూర్చి చర్చించడం దుష్కరతరం. ఇటువంటి కృషికి ఉభయ భాషా పాండితితోపాటు, సూక్ష్మాంశాలను వెలికి తీయగల సునిశిత పరిశీలనా సామర్థ్యం కూడ అవసరం. రచయిత్రిలో ఈ రెండూ వున్నాయని ఈ పరిశోధనా వ్యాసం వల్ల విశదమౌతుంది.

తిక్కన భారతంలోని రసావిష్కరణ చేయడానికి రచయిత్రి రససిద్ధాంతాల నన్నిటినీ కూలంకషంగా పరిశీలించారు. మహాభారతంలో అంగిరసం శాంతమనీ తక్కినవన్నీ అంగరసాలనీ చెప్పి తిక్కన భారతం నానారసాభ్యుదయోల్లాసి అనే ఉక్తిని సమన్వయ పూర్వకంగా నిరూపించారు.

భారతంలో హాస్యం లేదనే వాదాన్ని ఖండిస్తూ తిక్కన హాస్యరసాన్ని విభావాది సామగ్రీ పరిపుష్టం చేయనప్పటికీ సందర్భానుసారంగా సముచిత స్థానాన్ని కల్పించి పోషించాడని అన్నారు. అలాగే తిక్కన అంగాంగీ భావంతో శృంగార కరుణముల సాంకర్యమెట్లు చేసారో "మెలుపారగా బట్టి మొలనూలి మణులు" అనే పద్యాన్ని ఉదాహరించి కరుణానికి శృంగారం పోషకమైందని వివరించారు.

కొందరు విమర్శకులభిప్రాయపడినట్లు భారతంలో ధర్మవీరం లేదనీ, ఇందులో ఉన్నది శాంతమేననీ రచయిత్రి విస్పష్ట వివేచన చేసారు. అశ్వమేధం తర్వాత ధర్మజానిలో ధర్మవీరం అడుగంటిందనే వీరి దృష్టే దీనికి కారణం.

ఈ పరిశోధనా గ్రంథం భారత భారతికి ఒక నూతనాలంకారం. వీరి కృషి సాహితీప్రియుల ఆదరణని, పండిత విమర్శకుల మన్ననని పొందగలదని విశ్వసిస్తున్నాను. రచయిత్రి శ్రీమతి కమలాదేవిగారికి నాశుభాశాసనములు, అభినందనలు.

సుశీల

(సుశీల)

న్యూ ఢిల్లీ,
1-11-1990.

# విషయసూచిక

# కృతజ్ఞత

ఏకమప్యక్షరం యస్తు గురుః శిష్యే నివేద యేత్

పృథి వ్యాం నాస్తి తద్ ద్రవ్యం యద్ దత్వాసోஉ నృణీ భవేత్'

అను న్యాయానుసారము గురువుల ఋణము తీర్చలేనిది. నన్ను తీర్చిదిద్దిన ఉపాధ్యాయులందరికిని నమస్కారములు. వారిలో విశేషించి ఇరువురికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

'తిక్కనభారతము-రసపోషణము' అనునది నాపరిశోధన విషయము. పరిశోధన చేయుటకంటె చేయించుట కష్ట బహుళము. ఆకష్టమునకు బాధ్యత వహించి తమ బహుముఖ వైదుష్యముతో నన్నొక పరిశోధకురాలిగ తీర్చి దిద్దిన వారును, అత్యంతాదరముతో సిద్ధాంత వ్యాసమునందలి ప్రతివిషయమును పరిశీలించి అమూల్యమైన 'సలహా'లనొసగి వలయుచోట్ల చక్కని సవరణలు చేసి నన్ను కడుంగడు ప్రోత్సహించిన వారును, మత్పరిశోధన పర్యవేక్షకులును నగు డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నావినయ పూర్వకమగు కైమోడ్పులు.

తొల్దొల్త ఈ విషయమై పరిశోధన చేయుమని ప్రోత్సహించినవారు, నా డాక్టరల్ కమిటీ సభ్యులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆంధ్రశాఖకు నాటి అధ్యక్షులు, కొంతకాలము ఎమెరిటస్ ప్రొఫెసరుగా పనిచేసినవారు డా॥కె.వి.ఆర్.నరసింహంగారు పుస్తకము అచ్చు వేయు సందర్భమున వారిని అడిగినంతనే కాదనక తమ అమూల్యాభిప్రాయమును ఆశీస్సులను అందజేసిన సౌజన్యమూర్తియగు పూజ్య ఆచార్య వర్యులకు నా నమస్సుమాంజలులు.

తమ అమూల్యాభిప్రాయములతోపాటు అభినందన మందారాలనందించి, ఆత్మీయతకు, స్నేహశీలతకు మరో పేరుగ ప్రసిద్ధి చెందిన డా॥టి.సుశీలగారికి, డా॥కోలవెన్నుమలయవాసిని గారికి అక్షరాంజలులు.

నాడు పరిశోధనము చేయుటకు అనుమతినిచ్చిన సెయింట్ థెరిసా కళాశాల అధికారవర్గము వారికి, పరిశోధన చేయ ననుమతించిన ఆంధ్రవిశ్వవిద్యాలయము వారికిని, గ్రంథాలయాధికారులందరికి నా భక్త్యంజలులు.

ఈ సిద్ధాంతవ్యాస విషయమున నాకు ఉపకరించిన వెన్నియో గ్రంథములు కలవు. అయినను మరింత ముఖ్యమయినవి ఆచార్య భూపతివారి

భారతము-తిక్కనరచన, ఆచార్య కేతవరపువారి తిక్కన కావ్యశిల్పము, ఆచార్య నరసింహంగారి సాహిత్య దర్శనము-ఈముప్పేటల ముత్యాల సరమునందలి అనర్ఘరత్నములను కొన్నింటిని నా ఈసిద్ధాంతవ్యాసమున చేర్చికొనుటకు అవకాశమును కల్గించిన ఈ ముప్పురు పండితులకును నాప్రత్యేక కృతజ్ఞతాభివందనములు.

రచనా వ్యాసంగమున ప్రోత్సహించి, నాసాహితీ భవిష్యత్తు బంగారు బాట కావాలని ఆశించుచు అన్నిట చేదోడు వాదోడుగ నిలిచిన నా జీవిత భాగస్వామి శ్రీ భమిడిమర్తి సుధాకరరావుగారికి, ఆర్థిక సహాయమును అందించిన తెలుగు విశ్వవిద్యాలయమువారికి, ఈగ్రంథమును సకాలములో ముద్రించిన 'ప్రింటోరియం' అధినేత శ్రీ పి.సుబ్బయ్యగారికి, కె.మురళీకృష్ణగారికి, ముద్రణకు సంబంధించిన సర్వ బాధ్యతలు స్వీకరించిన శ్రీ కొన్నూరు మోహన్ గారికి, ప్రచురణలో సహకరించిన శ్రీమతి ఆకుల నాగమణి గారికి నాకృతజ్ఞతాభివందనములు.

ఈగ్రంథమున కొన్ని ముద్రణా స్ఖాలిత్యములకు తావు కలిగియుండవచ్చును. కంటవత్తిపెట్టుకొని సవరించినను వానిలో కొన్ని మరుగుపడియుండవచ్చును. ఆయాతావులందు వానిని సవరించుకొనవలసినదిగా సహృదయములకు నామనవి.

ప్రత్యక్షముగా, పరోక్షముగ ఈనాకృషికి దోహదము చేసిన వారందరికిని, మిత్రులు, హితులు, శ్రేయోభిలాషులకు, కుటుంబ సభ్యులకు, తలిదండ్రులకు, నాయిష్టదైవమునకు నామనస్సు నమస్సులు.

ఆంధ్ర కమలాదేవి

ఆంధ్ర (భమిడి మర్తి) కమలా దేవి

# ఉపోద్ఘాతము

"తిక్కన భారతము తెనుఁగు సంస్కృతి కొక వెలుగుబాట. ఆంధ్ర సరస్వతి కఖండ దీపారాధనము. సారస్వత రసికులకు నిత్యనీరాజనము' - మహాభారతము నందలి రసపోషణము ఎట్టిదియో, రసపోషణమునం దాతని మెలకువ లెట్టివియో చూపుటయే ఈ సిద్ధాంతవ్యాసము నందలి ప్రధానోద్దేశ్యము.

వేదం వేంకటరాయశాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావు గారు, డా॥ నండూరి రామకృష్ణమాచార్యుల వారు, ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావు గారు, ఆచార్య కోరాడ రామకృష్ణయ్యగారు, ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారు, ఆచార్య యస్వీ జోగారావు గారు, మున్నగు పండిత విమర్శకు లెందరో తిక్కన భారతముపై విశేషకృషి సలిపి, ఉత్తమ విమర్శ గ్రంథములను వెలయించి యున్నారు. ఆంధ్రసాహిత్యమున నొక్కొక్క రసవిషయమై డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, ముట్నూరి సంగమేశం, మాణిక్యం వేదవల్లితాయారు, డా॥నండూరి రాధాకృష్ణ ప్రభృతులు ఉత్తమకృషి సల్పినారు. ఈ సిద్ధాంత వ్యాసమునకు ఈ గ్రంథము లన్నియు అగ్రగాములు. ఈ వ్యాసరచనమునకు ఆయా గ్రంథము లన్నియు బాట చూపినవి. భూపతి, కేతవరపు, నండూరుల; డా॥ సుబ్రహ్మణ్యం, సంగమేశం, వేదవల్లి, రాధాకృష్ణులు గ్రంథములు విశేషించి ఉపకరించినవి. అవి తత్తత్ రచనాప్రణాళికానిబద్ధ సమగ్రసుందరములు. అయినను ఆయా వారలు సల్పిన కృషి యందు తిక్కన భారతము నందలి రసవిషయము పాక్షికమే యగుట వలన సమగ్రముగ చర్చించుటకు అవకాశము లేకపోయినది. తత్పరిపూర్తికై ఈసిద్ధాంతవ్యాసమున తిక్కన రసపోషణము వివరింప బడినది.

ఈసిద్ధాంతవ్యాసము పదునారు ప్రకరణములుగ విభక్తము. మొదటి ప్రకరణమున మహాభారత ప్రాశస్త్యమెట్టిదియో, ఆంధ్రీకరణవిధానమెట్టిదియో వివరింప బడినది. రెండవ ప్రకరణమున తిక్కనను గూర్చియే కాక, తిక్కన గారి భారత భాగమగు

పదునేనుపర్వము లందలి విషయమును స్థాలీపులాకన్యాయముగ నిరూపింప బడినది. రసపోషణమును గూర్చి పరిశీలించుటకు ముందు రససామగ్రీ విశేషము లెట్టివియో తెలిసికొనవలసి యున్నది. కావున వివిధాలంకారిక గ్రంథముల సాహాయ్యమున రసస్వరూపమును పరిశీలించి రసమునకు సంబంధించిన సర్వ విషయములు మూడవ ప్రకరణమున వివరింప బడినవి. గ్రహణసౌలభ్యము కొఱకై ఉపశీర్షికలుగ విభజింపబడి రసనిర్వచనాది దోషపర్యంతము వివరింప బడినది. గ్రంథవిస్తరణ భీతిచే రసస్వరూప సిద్ధాంతాది విషయమున గల వాదోపవాదముల విపులచర్చల జోలికి పోక సంగ్రహముగ మాత్రమే వివరణ జరుప బడినది. చతుర్థ ప్రకరణమున తిక్కన ఆయా పర్వములలో కావించిన రసపోషణమును గూర్చి స్థూలవివేచనము గావింపబడినది. ఐదవ ప్రకరణము మొదలుకొని పదమూడవ ప్రకరణము వరకు నవరసములను విడివిడిగా గ్రహించి, ఒక్కొక్క రసము సోదాహరణముగ వివరింప బడినది. తదుపరి ప్రకరణమున భారతము నందలి అంగిరసవిషయమై గల వాదోపవాదములను పరిశీలించి అంగిరస నిరూపణము చేయుట జరిగినది. పదునేనవ ప్రకరణమున రససాంకర్యము, పదునారవ ప్రకరణము ఉపసంహృతి. తిక్కన రసమును వాచ్యము గావించిన తావులు అనుబంధమున జూపబడినవి.

ఈ సిద్ధాంతవ్యాస విషయమున ఆచార్య కేతవరపు వారి మార్గము ననుసరించుటచేత తిక్కన భారతము మూలముతో పోల్చి చూపబడలేదు. తిక్కన ఏ గ్రంథము నాధారముగ చేసికొనేనో స్పష్టము కాకపోవుటచేతను, పాఠాంతరములలో నేహితాంతరమును పాటించె ననుటకు ఆధారము లేకపోవుటచేతను, దీనిని స్వతంత్ర కావ్యముగ భావించుటచేతను, మూలముతో పోల్చిచూడక తిక్కన కావ్యమున రసము ఏరీతిలో నున్నదో వివరింప బడినది. వ్యాసుని భారతమున రస మెట్లు కలదు? అనురీతిని విమర్శ జరుపబడలేదు. ఇది శబ్దానువాదము, వాక్యాను వాదము, అర్థానువాదమును గాక, కేవల భావానువాదము మాత్రమే అగుటచే నిట్లు విమర్శ జరుపబడినది. అయినను ఒండు రెండుచోట్ల వ్యాసునితో పోలికలు స్థూలముగా మాత్రమే చూపబడినవి. తిక్కన భారత భాగము నందు రసపోషణ మెట్లు జరుపబినదో, ఏరసము ఏరీతిగా కలదో చూపుటయే ప్రస్తుత సిద్ధాంతవ్యాస ధ్యేయము.

ఒండు రెండు ప్రకరణములలో ఉద్ధరణముల సంఖ్య మిక్కుటమైనది; కించిద్దీర్ఘములైనవియును గలవు. విషయసమగ్రతకు పూర్వవిమర్శకుల

అభిప్రాయములను ఎక్కువగా ఉదాహరించుట జరిగినది. ఆయా పండిత విమర్శకుల ఎడ రచయిత్రికి గల గౌరవమును దానికి ప్రోత్సాహక మయినది.

తిక్కన గారి రచన యందలి ఛందోఽలంకార గుణవృత్త్యాదులు ఎట్లు రసోపస్కారులైనవో ఈ సిద్ధాంతవ్యాసమున బహుధావివృతము కాలేదు. పూర్వవిమర్శకులు ఈవిషయమై కృషిసల్పి యుండుటచేతను, ఇందలి ఒక్కొక్క విషయము ఒక్కొక్క పరిశోధనవ్యాసము అగుటకు తగినంత విషయ విస్తృతి కలిగియుండుటచేతను, పరిశోధనకాల, గ్రంథపరిమితులకు లోబడుటచేతను ఈ విషయమై ప్రత్యేకమైన చూపు పెట్టలేదు.

ఈ సిద్ధాంతవ్యాసము గ్రాంథికభాషలో వ్రాయబడినది. అయినను పఠన సౌలభ్యముకొరకు పలుతావుల విసంధియే చేయబడినది. శకటరేఫ సాధురేఫల నియమము అంతగా పాటింపబడలేదు. అర్ధానుస్వార నియమమును విడువ బడినది.

'ఏరసమును తీసికొన్న ఆరసము నట్లే తావలచినట్లు వాసింపచేయగల వలంతి' తిక్కన. ప్రపంచ మహాకవులలో పంక్తి తీర్పదగిన మహాకవి తిక్కన. ఆతని మార్గము సకల సాహిత్యవ్రతులకును అవశ్యము అనుసరణీయము. ఈ మహాకవి మార్గము రస రమణీయము.

విషయ మతివిస్తరము. జ్ఞానమత్యల్పము.

'క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్ప విషయామతిః
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపే నాస్మిసాగరమ్'

అను నార్యోక్తిరీతిని ఇమ్మహావిషయమును గూర్చి విమర్శించుటకు సాహసించితిని. భారతము మహాసముద్రము. దుర్గమార్థజలగౌరవ భారత భారతీసముద్రము దరియంగ నీదుటకు విధాతృనకైనను శక్యము కాదని అనన్య ప్రతిభాశాలి యగు నన్నయయే సంకోచమును ప్రకటించియుండ, తద్గ్రంథవిమర్శనము సామాన్యులకు, అందును అస్మదాదులకు దుష్కర మనుటలో సందియము లేదు. రసజ్ఞులగువారు నాఈ సాహసమును సైరించి, స్ఖాలిత్యములను సవరించి, యొప్పులనుపలాలించి, నన్ను ప్రోత్సహింతురని ఎంతయు మనమున నమ్మి కరంబులు మొగిడ్చి ఈ రచనోపహారమును సమర్పించుచున్నాను.

ఆండ్ర .కమలాదేవి.

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీంచైవ తతో జయముదీరయేత్॥

నారాయణః పరబ్రహ్మ నారాయణ పరంతపః
నారాయణః పరోదేవః సర్వనారాయణః సదా॥

విశ్వకర్మన్ నమస్తేఽస్తు విశ్వాత్మన్ విశ్వసంభవ
అపవర్గోఽపి భూతానాం పంచానాం పరతఃస్థితః॥

# 1వ ప్రకరణము

## మహాభారత ప్రాశస్త్యము – ఆంధ్రీకరణ విధానము

"ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్"[1]

వ్యాస భారత శ్లోకము నందలి చకార చతుష్టయము వలన లభ్యమగుచున్న తాత్పర్య మేమన ధర్మార్థ కామమోక్షము లను పురుషార్థములలో ఏ యొక్క దానినైనను, లేక యన్నింటిని సాధించుటకైనను మార్గము భారతములో ఉన్నదియే యితర శాస్త్రముల యందును ఉన్నది. భారతమున లేని క్రొత్త ఉపాయము మరియే యితర శాస్త్రము నందును లేదు అని. అందువలన చతుర్విధ పురుషార్థ సాధన మయిన పరమ ప్రశస్తమయిన గ్రంథము భారత మనుట నిస్సంశయము. భారతము భారతీయ విజ్ఞాన సర్వస్వము.

సంస్కృత వాఙ్మయమున వ్యాసభారతమున కెట్టి విశిష్టత కలదో ఆంధ్ర సారస్వతమున కవిత్రయభారతమున కట్టి వైశిష్ట్యమే కలదు. మహాభారతమునకు సంబంధించిన పలు విమర్శక గ్రంథములను పరిశీలించిన, మహాభారత ప్రాశస్త్యము నుగ్గడించు విశేషము లనేకములు గోచరించును. ప్రాచీన భారతీయుల విజ్ఞానమును, నాగరికతను వ్యక్తపరచు సద్గ్రంథములలో వ్యాసప్రణీత మగు మహాభారతము ముఖ్యమైనదనియు ప్రాచీన విజ్ఞానము నంతను సులభగ్రాహ్యమగు విధమున బోధించుచుండుటయే గాక రసవత్తర మగు లౌకికవృత్తముతో నొప్పు మహాకావ్యము కూడ నగుటచే భారతము సారస్వతమునందాక విశిష్ట రచనయై యొప్పుచున్నదనియు

---

1. వ్యాసభారతము – స్వర్గారోహణము, అ. 5, శ్లో. 44

మాపతివారు చెప్పియున్నారు.[2] కావ్యకర్త లోకసంగ్రహమునకు బూనిన మహర్షి; ఇతివృత్తము ఉదాత్తము; ఇందు ఆధ్యాత్మిక విషయము ప్రాధాన్యము వహించును. ఈ కారణముల వలన భారతము విశిష్ట రచన యగుచున్నది. భారతము ఇతిహాసము. 'ఇతి-హ-ఆస' అను దానిని బట్టి జరిగినవిగా అంగీకరించిన విషయములను ప్రసంగించునట్టి గ్రంథము భారతము. ఇందు భారతీయ జీవనమునకు సంబంధించిన భౌతికధ్యాత్మిక విషయము లన్నియు క్రోడీకరింప బడినవి. ధర్మప్రాధాన్యము గల గ్రంథముగా వ్యాసునిచే ఇది పరిష్కృతము. కాని ఇతివృత్తము లౌకికము. 'వేదమూలో ధర్మః' అని యుండుట వలన వేదవ్యాసుడు వేదవాఙ్మయమును – దీనియందు ఉపనిషత్తులను గతార్థములే – కథకు ప్రధానమైన లౌకికాచార విచారములతో కలబోసి భూమ్యాకాశములకు నిచ్చెనవేసినాడు. వేదముల నాపోశన పట్టిన వ్యాసునిచే పరిష్కృతమైన భారతము పైకారణమున పంచమవేదమై ప్రామాణ్యమును సంతరించుకొన్నది. పురాణలక్షణములును దీనికి వర్తించు చున్నవి.
'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ వంశానుచరితం చేతిపురాణంచ పంచలక్షణమ్' అని పురాణలక్షణము.

ఈ భారతము మొదట వ్యాసునిచే జయగా నుద్భవించి, జనమేజయుని సర్పయాగ సందర్భమున వైశంపాయన ప్రోక్తమైన భారతముగ రూపొంది, చివరకు మహాభారతమైన దని పండిత విమర్శకుల యభిప్రాయము. జనమేజయుని సర్పయాగ సందర్భమున వైశంపాయనుడు పఠించిన భారతము ఇరువదినాలుగువేల శ్లోకములు కలదనియు, నైమిశారణ్యమున శౌనకాది మహర్షులకు సూతుడు, ఉగ్రశ్రవసుడు చెప్పిన భారతము ఏకలక్షశ్లోకసంభృత మహేతిహాస మనియు వీరి యభిప్రాయము. శ్లోకసంఖ్యా విషయమున నెట్టి యభిప్రాయభేదములున్నను, ఎన్నియో పాఠాంతరములు చేరినవనియు, ప్రక్షిప్తములు కలవనియు నభిప్రాయము లున్నను, భారత ప్రతిపాదిత విషయ ప్రాశస్త్యములను గురించి మాత్రము అందరును ఏకాభిప్రాయమునే కలిగి యున్నారు.

వ్యాసుడు పరబ్రహ్మము వంటివాడు. అతని భారతేతిహాసమును తెనిగించిన నన్నయ తిక్కన ఎఱ్ఱనలు ముమ్మూర్తుల త్రిమూర్తుల వంటి వారు. కాగా ఈ

---

2. భారతము – తిక్కన రచన, పు. 1–3

మువ్వురి కలబోత యగు మహాభారతము వైయాసిక్యతేజమును సంతరించుకొని ఆంధ్రసాహిత్యమునకు మూలకందమై యొప్పుచున్నది. 'సక్రమ మగు ఆంధ్రభాషాభ్యాసము మహాభారత పఠనముతోనే ప్రారంభమగునని విజ్ఞులందురు. చరిత్ర, భాషా సౌందర్యము, విమర్శనదృష్టి మొదలగు నన్నియు ఈ గ్రంథమునందే తుది మెరుగులు దిద్దుకొన్నవనియు, అందువలననే దశదిశల తన విజ్ఞానదీధితులను ప్రసరింపజేయు బహుముఖరత్నము భారత మని తజ్ఞులు వివరింతురు'[3] అని శ్రీ కోరాడ వారు మహాభారతమును గూర్చి చెప్పిరి.

మహాభారత ప్రాధాన్య ప్రాశస్త్యముల నుగ్గడించుచు 'వాఙ్మయమున మొదటి గ్రంథ మగుటయే గాక భాషా ప్రయోగవిషయమున గాని, కవితా ప్రాధాన్య విషయమున గాని, దానిని మించిన గ్రంథమీ భాషలో పూర్వమునగాని, పరమున గాని బయలుదేరి యుండలేదనుట సాహసోక్తి కానేరదు'[4] అనియు శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు వ్రాసిరి.

సంస్కృతమున వ్యాసునిచే రచింపబడిన భారతమునకే ప్రాశస్త్యము కలదు కదా! మరి భాషాంతరీకృతమగు నీ ఆంధ్రమహాభారతము యొక్క ప్రాశస్త్యమేమి? అను సందేహము కలుగును. సంస్కృత భారతమునకు ఉండవలసిన ప్రాశస్త్యము దానికి ఉండగా ఆంధ్రమహాభారతమునకు ఉండవలసిన ప్రాశస్త్యము దీనికిని గలదు. దేని ప్రాశస్త్యము దానికే గలదు. ఇట పోలికలనావశ్యకము.[5] కొందరి దృష్టి ననుసరించి వ్యాస భారతము కంటె నిది ఎక్కుడు మోదమును గూర్చు గ్రంథమట. పేరునకు భాషాంతరీకృత మయినను స్వతంత్రగ్రంథ మనిపించుకొని మూలము కంటె రసవత్తర మనిపించుకొని యుండవచ్చును.

ఆంధ్రమహాభారరతము అష్టాదశపర్వ విస్తృత మయినది. ఇందు ఆది సభాపర్వములను, అరణ్యపర్వమున కొంతభాగమును నన్నయ ఆంధ్రీకరింపగా, తుది పదునేను పర్వములను తిక్కనామాత్యుడాంధ్రీకరించినాడు. నన్నయ కృత

3. 'It is only proper that a critical and historical appreciation of the Telugu language & literature should begin with a study of that great work. Critics are prone to remark that the last word on Telugu Bharata has already been said and that there is nothing more to be worked on that subject. Bharata is a diamond with many facets, still demanding the view and appreciation of the critics of Andhra*. - మహాభారతోపన్యాసములు, పు. 107

4. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 2

5. ఈ విషయము ఈ ప్రకరణము తుదను వివరింప బడినది.

అరణ్యపర్వ శేషమును పూరించిన వాడు ఎఱ్ఱన. ఈ కవిత్రయము వారి ఆంధ్రీకరణ విధానమును స్థూలముగ పరిశీలించిన ఆంధ్రమహాభారత సంబంధ మగు మరికొన్ని అంశములు మనకు పొడగట్టును. మొదటి మూడు పర్వములును నన్నయ యుద్దేశ్యమునకును, అతని వైదికసంపత్తికిని తగినవై యాతని పాలబడుటయు, నంతకంటె రసవత్తరంబై యూర్జిత కథోపేతంబైన భాగము తిక్కన పాలబడుటయు ననునది యాంధ్రలోకము చేసికొనిన మహాపుణ్యఫల మని కొందరి తలంపు. ఈ ఆంధ్రమహాభారతము ఆంధ్రావళి కనవరతము మోదమును గూర్చుచు ఆంధ్రజనసామాన్యమునకు పురాణ పఠన శ్రవణ యోగ్యమై, రసికవరులకు రసాస్వాదనను గొల్పుచు, లక్షణకర్తలకు పరమ ప్రమాణంబగు, లక్ష్యమై, నీతివేత్తలకు నీతిదాయకమై, భాషాతత్త్వ జిజ్ఞాసువులకు ప్రాచీనాంధ్రభాషా జాతీయ ప్రయోగ చమత్కృతులందు చవిగొల్పునదియై, అనంతరకాలము నందలి యాంధ్రకవితకు మార్గదర్శకమై నెగడి మిక్కిలి ప్రశస్తిని గాంచియున్నది. ఈ విషయము నన్నయ గారి–

'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
      యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
      కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
      యైతిహాసకు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
      యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁజేసె భారతంబు' [6].

అను పద్యము వలననే సువిదిత మగుచున్నది. మరియు నన్నయ గారిచే భారతమహిమ విపులముగ వర్ణింపబడి యున్నది.

---

6. భారతము – ఆది. 1 – 32

'కమనీయ ధర్మార్థకామ మోక్షములకు
నత్యంత సాధనంబయిన దాని
వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్నవారల క
భిమత శుభకరంబయిన దాని
రాజుల కఖిల భూరాజ్యాభివృద్ధిని
త్యాభ్యుదయ ప్రదంబయిన దాని
వాఙ్మనఃకాయ ప్రవర్తితానేక జ
న్మాఘ నిబర్హణంబయిన దాని
సత్యవాక్ప్రబంధ శతసహస్ర శ్లోక
సంఖ్యమయిన దాని సర్వలోక
పూజ్యమయిన దాని బుధ నుత వ్యాసమ
హాముని ప్రణీత మయిన దాని' [7]

అను పద్యమే దీనికి తార్కాణము. 'ఆంధ్రమహాభారతమును రచించిన వారిలో మొదటివాడు నన్నయభట్టు. ఆంధ్రభారతమే తెలుగు కావ్యములలో మొదటి దని విశ్వసించుటచే నీ కవిని ఆదికవి యనియు, భారతమును ఆదికావ్య మనియు తలంచుచున్నారు. ఈతని కాలము ఆంధ్రవాఙ్మయచరిత్రలోనే యొకపుణ్యఘట్టమని, ఆంధ్రవాఙ్మయము యొక్క సువ్యక్త మగు నారంభము నన్నయ భారతముతో నారంభమయినదని నన్నెచోడుని 'మును మార్గకవిత లోకంబున వెలయగ దేశికవిత పుట్టించి తెనుగున నిలిపి రంధ్ర విషయంబున జన చాళుక్యరాజు మొదలగు బలువుర్' అను పద్య మావిషయమునే ధ్రువపరచు చున్నద[8] ని శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు నుడివి యున్నారు.

నన్నయ్యభట్టు క్రీస్తు శకము పదునొకండవ శతాబ్ది మధ్యమున తెనుగు దేశమును పరిపాలించిన రాజరాజనరేంద్రుని యాస్థానకవి. రాజరాజనరేంద్రుడు వేగి దేశమునకు నాయకరత్నమైన రాజమహేంద్రపురమున రమ్యహర్మ్యతలమున మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంత విలాసినీ పరివృతుండయి, అపార శబ్దశాస్త్రపారగులైన వైయాకరణులను, భారత రామాయణాద్యనేక పురాణప్రవీణులైన పౌరాణికులను, మృదుమధుర రసాభావభాసుర నవార్థ వచనరచనా

7. భారతము - ఆది. 3 -9

8. ఆంధ్రవాఙ్మయచరిత్ర, పు. 55

విశారదులైన మహాకవులును, వివిధ తర్క విగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయః ప్రభృతులైన తార్కికులును, వైణిక గాయకులును, నాదిగా కలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాస గోష్ఠిసుఖోపవిష్టుడయి ఒకనాడు తన కులబ్రాహ్మణుడు, అనురక్తుడు, అవిరళ జప హోమతత్పరుడు, విపుల శబ్దశాసనుడు, సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు, నగు నన్నపార్యుని మహాభారతమును తెనుగున వినిర్మింపుమని అభ్యర్థించెను ః ఆది. 1-8, 9ః. బహుభాషల, బహువిధముల, బహుజనముల వలన భారతవృత్తము వినిపించుచున్నదని పలికినాడు. వేద విజ్ఞానమునను, సనాతనాచార ధర్మవిశ్వాసము నందును అత్యంత గౌరవము కల మహాపండితుడును, లౌకికి విజ్ఞానసంపన్నుడును అగుటచే నీ నన్నయభట్టు 'విశ్వశ్రేయఃకావ్య'మ్మను తలంపుతో వేదవ్యాసరచితమైన మహాభారతమును ఆంధ్రీకరించి రాజరాజనరేంద్రున కంకిత మిచ్చెను.'పూర్వోక్తగుణగణ గరిష్ఠుడైన నన్నయభట్టారకుడు పంచమవేదమును ఆంధ్రీకరించుటకు సర్వథా సమర్థుడు అతడు నాటికే ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు కూడను. భారతము వినుట వలన కలిగెడి ఫలమును పర్వానుక్రమణిక యందు నన్నయ యొక సీసపద్యమున 'ఆయురర్థులకు....'ః భార-ఆది, 1-32 ః, అని సంక్షేపముగ చెప్పియున్నాడు. భారతమును భక్తితో నెప్పుడును వినుచుండెడి భక్తియుక్తులైన భాగవతులకు భక్తవత్సలుడైన శ్రీవల్లభుడు భవభయములను బాపి యిష్టార్థసిద్ధిని కరుణతోడ సమకూర్చును. నన్నయ ఆసంకల్పముతోడనే ఆంధ్రభారతమును జగద్ధితంబుగ రచించె ననవచ్చును. నన్నయగారి దీగ్రంథమును వ్రాయుటకు ఆనాటి సాంఘిక మతపరిస్థితులు కూడ ఒక విధముగ హేతువయినవి. వైదికధర్మోద్ధరణమునకై పుట్టిన గ్రంథమైనను 'విశ్వశ్రేయఃకావ్యమ్' అను నుత్తమ కావ్యధర్మమును పాటించినవాడు నన్నయ. మంగళాచరణ శ్లోకమున 'శ్రేయసే' అను పదమును వాడి కావ్యప్రయోజనమును గూడ తెలిపినాడు. తానాంధ్రీకరించిన భారతకావ్యరచన కవితా విషయమును గూర్చి-

'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలు నానితరులక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్'[9]

---

9. భారతము - ఆది. 1 - 26

అని ప్రతిజ్ఞ చేసియున్నాడు.

కవీంద్రులు మేలనునట్లు ప్రసన్న కథను, అర్థగాంభీర్యమును, రమ్యమైన శైలిని కలిగియుండునటుల నన్నయ ఆంధ్రభారతమును రచించెను. పై పద్యము వలన నన్నయగారి కవితా విశేషములు - 1. ప్రసన్నకథా కలితార్థయుక్తి, 2. అక్షరరమ్యత, 3.నానారుచిరార్థసూక్తి నిధిత్వము అని తెలియుచున్నవి. ప్రసన్నకథాకలిత అర్థయుక్తి అనగా ప్రసన్నకథతో కూడిన అర్థయుక్తి అనిగాని, కథను ప్రసన్నముగా చేయగల అర్థయుక్తి అని గాని చెప్పవచ్చును. చక్కని భావములను, సుందరమైన పదముల పొందికచె నిమిడ్చి భావగాంభీర్యమును స్ఫురింపచేయు శక్తి తన కవితాశిల్పమున గలదని చెప్పికొనినాడు. రెండవది అక్షర రమ్యత. రమ్యమయిన పదప్రయోగముచే శ్రావ్యతను సంపాదించుట. భారతీంద్రీకరణ రమ్యత ఎన్నటికిని క్షరము గాక సుస్థిరముగ నుండునది అనియు చెప్పవచ్చును. ఇక నానారుచిరార్థ సూక్తినిధిత్వము - మనోహరమైన అర్థ సూక్తులతో నిండియున్నట్లు తెలుపబడినది. 'అర్థసూక్తులనగా నాక ధర్మమును సూటిగా నొక పద్యమున చెప్పుట. ఇట్టి పద్యములు రసవంతములై రమణీయ భావస్ఫోరకములై అందరిచేత నిత్యవ్యవహారములందు ప్రమాణవచనములుగా, నీతి బోధకములుగా, క్లుప్తములుగా వాడుకొనబడు సూక్తులు'[10] అని దేశిరాజు భారతీదేవి గారి యభిప్రాయము. ఈతని ఆంధ్రీకరణ విధానము స్వతంత్రపద్ధతిని నడచినది. మక్కికి మక్కిగ, ఫక్కికి ఫక్కిగ కాక వలసిన తావుల పెంచి, కొన్నితావుల క్లుప్తీకరించి ఔచిత్యమును పాటించి పురాణరూపముగ నున్న వ్యాసభారతమును కావ్యరూపముగ మలచినాడు. ఈతని శైలి సరళమై, రమ్యమై, అనర్గళ ధారామాధుర్యమును కలిగి ఉండును. ఈతని కావ్యమున ఋత్వాది ప్రకృతివర్ణనలు, శృంగారాది రసప్రతీతులు చోటుచేసికొన్నవి. ఉభయ వాక్ప్రౌఢి కలిగిన సరళ దీర్ఘసమాసములతో కూడిన పద్యము లీతని రచనలో పెక్కులు కాననగును. ఈతనిది సంస్కృత సమాసభూయిష్ఠ రచన. ప్రధానముగ శైలి ఆఖ్యానశైలి, ఈరీతిని నన్నయ రెండున్నర పర్వములను రచించినాడు.

నన్నయకు పిమ్మట రెండువందల సంవత్సరముల అనంతరము భారతాంధ్రీకరణమును చేపట్టినవాడు తిక్కన. నన్నయ తరువాత రెండు శతాబ్దముల కాలమున తెలుగు దేశమున కవులే పుట్టలేదా? భారత మేల అసంపూర్తిగ నిలచిపోయినది?

---

10. 'కవిత్రయ కవితారీతులు - తరువాతి కవులపై వారి ప్రభావము', పు. 15

అను ప్రశ్నలుత్పన్న మగును. వీనికి సమాధానము నరయవలసి యున్నది. ఈమధ్యకాలమున నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికి, మున్నగు మహాకవులు పలువురు కలరు. వీరు భారతమును పూరించుటకు పూనుకొనకపోవుటకు గల ముఖ్యకారణము వీరు శివకవులగుటయే. శైవులలో నతివాదులు వీరశైవులు. సంఘమున నొక ప్రత్యేక మతమును వెలయించిన వీరు వాఙ్మయమున కూడ నొక స్వతంత్రసారస్వతోద్యమమును నెలకొల్పినారు. అరూఢ గద్య పద్య సంస్కృతభూయిష్ఠ ప్రబంధరచన మానుగ సర్వసామాన్యంబు గాదని పాల్కురికి సోమనాథుని ప్రవచనము.

ఈ శివకవులు నన్నయ విపుల శబ్ద శాసనత్వము నంగీకరించినారు కాదు. వీరు నన్నయ అరూఢ గద్య పద్య ప్రబంధభూయిష్ఠ రచన, ఉదుతర గద్యపద్యోక్తులు, శబ్దశాసనత్వము, ఇత్యాదులపై పూర్వపక్షము చేసినట్టివారై సర్వతంత్ర స్వతంత్ర మగు నూత్న సారస్వతోద్యమమును స్థాపించిరి. కావుననే నన్నయ భారతమును పూర్తిచేయు కవులు లేకపోవలసి వచ్చినది. ఇట్టి స్థితిగతులలో భారతమును పూరింప సాహసించు మహాకవి లేకపోయి యుండును. వేములవాడ భీమకవి సాహసించెనే కాని అతని ఉద్యమము కడదాక కొనసాగినట్లు కానరాదని డాక్టర్ నండూరిరామకృష్ణమాచార్యులు గారి అభిప్రాయము. వీరు 'భారతము వంటి మహేతిహాస రచనకు కవులందరును నధికారులు కారు. అదియొక సామాన్యకవి కసాధ్యమైన పని. ఒక సారస్వత పరిషత్తు లేదా పరిషత్తు వంటి మహాకవి సాధింపవలసిన కర్తవ్య మిది'[11] అని భావించిన దంతయు ప్రత్యక్షర సత్యము. ఈ రీతిగ ఆనాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితులను దృష్టియందిడుకొని పరికించిన భారతమును పూరింపగల కవులు లేక రెండు శతాబ్దముల తరువాత తిక్కనామాత్యునిచే ఈ మహత్తర కార్యము తిరిగి కొనసాగింపబడిన దనిపించును.

తిక్కన నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి ఆస్థానమున మంత్రివర్యుడు. కవిశేఖరుడు. ఈతడు విరాటాదిగ పదునేను పర్వములను రచించినట్టివాడు. మరల నిట మరియొక చిన్న సందేహము కలుగును. నన్నయ రెండున్నర పర్వములను వ్రాయగా, నీతడు అసంపూర్ణముగనున్న అరణ్యపర్వమును పూరింపక, విరాటపర్వము నుండి ఏల ప్రారంభించెను? నన్నయ అరణ్యపర్వమును వ్రాయుచు మరణించెనని,

11. కవిత్రయము, పు.47, 48

తాను ఆభాగమును రచించుటకు పూనుకొనిన తానును అట్లే మృత్యువువాత పడుదునను భయముతో వ్రాయలే దందురు. ఇది సరికాదు. రాజ్యతంత్ర మవలీలగ నడిపి పరదేశముల కేగి రాజులను మెప్పించి, పరమతములను ఖండించి దిగ్విజయము గాంచి అత్యంత మేథావంతుడుగ, ధైర్యస్థైర్యములు గల వానిగ పేరు పొందుటచే నిట్లు భయపడె ననుట సంగతము కాదు. మరికొందరి దృష్టి ననుసరించి నన్నయ పూర్తిగ మూడు పర్వములను వ్రాసెనని, తదుపరికాలమున కొంతభాగము క్రిమిదష్టమగుటచే అది ఎఱ్ఱనచే పూరింపబడిన దని, కావున తిక్కన విరాటము నుండి ప్రారంభించెనని అందురు. కాని ఇదియు సమంజసము కాదు. అన్ని ప్రతులును ఒకేరీతిగా క్రిమి దష్టములు కాజాలవు కదా! తిక్కన విరాటము నుండి రచించుటకు గల కారణమును ఇట్లు చెప్పవచ్చును. నన్నపార్యుని కృతి రాజరాజనరేంద్రున కంకితము. అనగా నరాంకితము. తిక్కన తన కృత్యమును హరిహరనాథాంకితము చేయదలచినాడు. అందుచేతనే నన్నయ కృతమగు అసంపూర్ణమగు భాగము నట్లే వదలినాడు. నన్నయ కేరీతిగా ఆనాటి సాంఘిక, రాజకీయ, మత పరిస్థితులు భారత రచనకు దోహదము చేసినవో, తిక్కనామాత్యునకు కూడ నట్లే ఆనాటి సంఘ స్థితిగతులు ప్రథమకారణము లయినవి. రాజరాజు కాలమున విజాతీయులగు శత్రువుల దండయాత్రల వలనను, జైన బౌద్ధమతముల వ్యాప్తి వలనను, వేద ప్రమాణములను తిరస్కరించు చార్వాకాది మతవ్యాప్తి వలననుసంఘము మతకల్లోలములకు లోనైయుండి ఆర్యధర్మములు వెనుకబడగా వానిని పునరుద్ధరించుటకై భారతరచనమును చేపట్టినాడు నన్నయ. ఇట్లే తిక్కన కాలము శైవ వైష్ణవ మతవిషయక విభేదములతో చిక్కువడియుండగా, అట్టి క్లిష్టపరిస్థితుల నుండి సంఘమును రక్షించు నుద్దేశ్యముతో భారతమును పూర్తిచేయ సంకల్పించినాడు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు పరబ్రహ్మయొక్క అంశము లనియు వారొనర్చు సృష్టిస్థితి లయములు సగుణాత్మకమగు పరబ్రహ్మలీలలనియు కనుక శివకేశవులు ఆ పరమాత్మ యొక్క భిన్నమూర్తులు అనుజ్ఞానము ప్రజలకు కలిగించుటకై తిక్కన హరిహరమూర్తిని తన యిష్టదేవతముగా స్తుతించి భారతమును ఆ దేవున కంకిత మిచ్చినాడు. తిక్కనామాత్యుని యుదారాశయము దానివలన ఫలించి శివకేశవ భేదములు కొంతవరకు అడంగినవి. తిక్కన తరువాతి కవులు శైవులైనను, వైష్ణవు లైనను, పరమతదూషణమును గావించువారు కాక పరమత సహనమును ప్రదర్శించువారైరి. ఈ రీతిగ తిక్కన

హరిహర రూపముచే శివకేశవ భేదమును పరిహరించుటయే కాక జీవాత్మ పరమాత్మైక్యమును బోధించు నద్వైతమును కూడ భారతమున ప్రతిపాదించిన ఆంధ్రసంఘము నేకైకమత సూత్రనిబద్ధమగునట్లు కావించినాడు. ఇదియే ఈతడు స్థాపించిన హరిహరాద్వైతము.

తిక్కన తొలి కావ్యము ఉత్తరరామాయణము. మలికావ్యము భారతము. ఈతడు విజయసేనము అను కావ్యమును రచించినట్లుగ పెదపాటి జగ్గనార్యునిచే సంకలిత మయిన ప్రబంధరత్నాకరమును, మానవల్లి విరచిత ప్రబంధమణిభూషణ పీఠికయు సాక్ష్య మిచ్చుచున్నవి. కృష్ణశతకము, కవి వాగ్బంధనము అను మరిరెండు కృతులు రచించినట్లు వదంతి : స్రవంతి 1964-65 Dec. / Jan ఈ గ్రంథము లన్నియు నలభ్యములు. లభ్యములైనవి ఉత్తరరామాయణము, భారతము మాత్రమే. ఉత్తరరామాయణము నాటికి తిక్కన శైవుడు. భారత రచనా కాలము నాటికి శివకేశవులక భేదమును సాధించిన హరిహరనాథోపాసకుడు. ఉత్తరరామాయణ రచన నాటికి 'అమలోదాత్త మనీష నేనుభయ కావ్య ప్రౌఢి పాటించు శిల్పమునన్ బారగుఁడఁ గళావిదుఁడ' [12] నను అహంభావము భారత రచన నాటికి తత్త్వ పరిపూతమైన వినయముగా మారి -

'కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనా
భ్యర్చితమైన భారత మపార కృపాపరతంత్రవృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁబ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి, నా
నేర్చిన భంగిఁజెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' [13]

అని చెప్పించినది. నాటికి సోమయాజి కాడు. నేడు యజ్ఞము చేసి సోమయాజి యయ్యెను. తిక్కన వ్యక్తిత్వములో నేర్పడిన మహత్తర పరిణామ వికాస మిది. "తొలినాడు శైవుడైనను మలినాడు 'విష్ణురూపాయ నమశ్శివాయ' అని అనగలిగిన మహోదారుడు తిక్కన" అని నండూరి వారు [14] మతము నందు తిక్కన శైవ, వైష్ణవములకు సమన్వయమును సాధించిన ధర్మాద్వైతమూర్తి కావున తన కృత్యమున కాదియందే -

---

12. ఉత్తరరామాయణము, ఆ. 1-13
13. భారతము - వి.వ., ఆ. 1-28
14. తిక్కన - భారతదర్శనము, పు. 18

'శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్'[15]

అని చెప్పినాడు. ఈతని భారత భాగమున కళాసౌందర్యము, నద్వైతభావము చక్కని సమ్మేళనమును పొందియున్నవి. నన్నయ కేవల కర్మపరమైన వైదిక మతదృష్టితో కొంతభాగమును రచించినను, ఈ భారతమును కృష్ణద్వైపాయనుడు అద్వైతార్థబోధకంబగునటులనే రచించి యున్నాడు గాని మతవైషమ్యములను పెంచుటకు గాదు. వేదములకు స్మృతివాదములకు నిది సమన్వయ మార్గమును చూపునట్టిది, అని తిక్కనార్యుడు ఈ భారతము యొక్క ధర్మాద్వైతస్థితిని-

'వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైనచోటులను దా, మూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్' [16]

అని వ్యక్తము చేసినాడు. ఈతడు దీనిని ప్రబంధమండలిగా రచింపదలచినాడు. సాత్యవతేయ సంస్మృతిని శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ ధర్మాద్వైతస్థితిని భారతసంహితను తెనుంగుబాస రచింపబూనిన ఈ తిక్కనామాత్యుని ఆంధ్రీకరణ విధాన మెట్లున్నదో స్థూలముగ చూతము.

విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి గారు 'తిక్కన-భారత రచన' అను వ్యాసమున ఈతని ఆంధ్రీకరణ విధానమును గూర్చి యిట్లు చెప్పియున్నారు-'మన కవిబ్రహ్మ తన యాంధ్రీకరణమున క్లుప్తీకరణ విపులీకరణముల సాహాయ్యమున గ్రంథమంతయు నడపినాడు. మరియు కొన్నిచోట్ల ఔచిత్యమునే ప్రధానముగ చేసికొని మూలమున నున్న దానిని తెనిగింపక విడుచుటయు, మూలమున లేని దానిని కల్పించి పెంచుటయు చేసినాడు. ఇట్టి మార్పులు తప్పక కవులెల్లరు చేయవలెనని ధ్వనిమార్గ ప్రతిష్ఠాపనాచార్యుడగు నానందవర్ధనుడు చెప్పెను. అలంకారికమార్గము ననుసరించి, దానిని చక్కగా పరిశీలించి, యౌచిత్యానౌచిత్యములను గుర్తించి తిక్కన తన భారతమును తీర్చిదిద్దినాడు'. [17]

'స్వేచ్ఛతో కూడిన మూలానుసరణ విధానమునే తిక్కనయు అనుసరించెను

15. భారతము - విరాటపర్వము, 1-1
16. భారతము - విరాటపర్వము, 1-4
17. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, 1938-39, సంపుటి 27, సంచిక 3, పు.139

కాని యాయనమార్గము దివ్యమై కావ్యరసమును కొనియాడునట్లుండు ననియు, వ్యాసుని భావము అనెడు బంగారమును తన మూసలో ఆత్మీయ ప్రతిభాగ్నిని కరగించి క్రొత్తదయిన రూపమును సృజించునట్లు రచించుటయే తిక్కన శిల్పము'[18] అని ఆచార్య గంటి జోగిసోమయాజి గారిచే చెప్పబడినది.

ఆచార్య యస్వీ జోగారావు గారి గ్రంథమున తొలికిపలుకు నందు శ్రీ కె.ఎల్. రావుగారు 'తిక్కన సోమయాజి సంస్కృత భారతము నుండి కేవల కథావస్తువును మాత్రమే స్వీకరించెను. కాని దాని యనుకరణమేమాత్రము వారి యుద్దేశము కాదు. అందుకే పద్యశైలిలోను, వర్ణనా విశేషములోను, రూపకల్పనలోను, వారి స్వతంత్రపద్ధతి విశదముగా దృగ్గోచర మగుచుండును. శృంగార, వీర, కరుణ రసాదులను సమస్థాయిలో నడిపి కేవల కథావర్ణనము మాత్రమే గాక, యందలి పాత్రల విశిష్టతలను కళ్లకు గట్టునట్లు తెలియచెప్పినాడు తిక్కన'[19] అని చెప్పియున్నారు.

'తిక్కన మక్కికి మక్కిగ తెనిగించి యుండిన యెడల నీ యాంధ్రభారత మింత యుత్తమోత్తమ కావ్యముగ నుండకయే పోవును,[20] అని శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారి అభిప్రాయము. ఈ సందర్భముననే వ్రాయుచు విజ్ఞాన సర్వస్వ సంపాదకులగు శ్రీయుత కామఋాజు లక్ష్మణరావు పంతులు గారు 'సంస్కృత భారతము బంగారుపు ముద్ద వంటిది. ఆంధ్రభారతము ఆ ముద్దలో నుండి కావలయునంత బంగారమును తీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతో చేయబడిన చక్కని సువర్ణకమలము వంటిది. ఉభయ భారతములలోని యీ భేదమును చూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడి చేయటయే మా యుద్దేశము' అని వ్రాసియున్నారు. ఇది ఎంతయు సయుక్తికము సమంజసము నైన వాదము. ఈ వాదములకు విరుద్ధముగా శ్రీ కాశీభట్ల బ్రహ్మయశాస్త్రులు గారు 'ధర్మప్రధాన మగు భారతామ్నాయమును రసప్రధాన మగు భారత ప్రబంధముగా మార్చి తిక్కనసోమయాజి మహాభారతమును చాల హీనస్థితిలోనికి తెచ్చుట సత్యమగున'[21]ని వ్రాసిరి. ఈ

---

18. తెలుగు వాఙ్మయము, గంటి జోగిసోమయాజి.
19. మహాకవిమార్గము - విరాటపర్వ విమర్శ, వ్యాసునివాణి- తిక్కనబాణి, పు.॥
20. తిక్కన సోమయాజి
21. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - రజతోత్సవ సంపుటము, తిక్కనార్యకృత విరాటపర్వ విమర్శనము

అభిప్రాయము సముచితము గాదు. ఏలన ఇతిహాసము శాస్త్రేతిహాసముగా గాని, కావ్యేతిహాసముగా గాని యుండవచ్చును. కవిత్రయము భారతేతిహాసమును కావ్యేతిహాసముగానే తీర్చిదిద్దిరి. తిక్కన దీనికి అపవాదము గాదు. ఆచార్య దివాకర్ల వెంకట అవధాని గారు 'వ్యాసుడు-తిక్కన' అను తమ వ్యాసమున 'వ్యాసునిది పౌరాణిక నైతికదృష్టి. తిక్కనది కావ్యదృష్టి. వ్యాసుడు తన రచనకు పురాణ మూర్తిని సృష్టింప తిక్కన దానికి కావ్యమూర్తిని గల్పించెను. వ్యాసుడు ధర్మప్రవచనమునకు ప్రాధాన్య మొసగతిక్కన రసపోషణమునకే ప్రాధాన్యమొసగెను,[22] అని చెప్పిరి. వీరే 'తిక్కన-ధర్మాద్వైతము' అను వ్యాసమున ఇదే అభిప్రాయమును 'వ్యాసుడు తన సృష్టిని సంహితగనో, పురాణముగనో, ఇతిహాసముగనో దర్శింప, తిక్కన దానిని ప్రబంధముగనో, కావ్యముగనో దర్శించె ననియు, స్పష్టముగ చెప్పవలె నన్న వ్యాసుడు భారతమున ధర్మప్రవచనమునకు ప్రాధాన్యమొసగ, తిక్కన రసపోషణమునకు ప్రాధాన్యమొసంగె ననియు, తిక్కన నానారసాభ్యుదయోల్లాసి అని చెప్పుటయు, శ్రీనాథుడు రసాభ్యుచిత పరబంధ మని చెప్పుటయు దీనికి నిదర్శనములు'[23] అని చెప్పియున్నారు.

తిక్కన అనువాద పద్ధతియు నన్నయగారి వలె స్వతంత్రానువాద పద్ధతియే. ఈతడు గూడ మక్కికి మక్కిగ ననువదింపక స్వతంత్రమార్గమున అనువదించినవాడై భారతమునకు కావ్యగౌరవమును కల్పించినాడు. ఈతని కవితావిశేషములలో ఎన్నతగినవి పాత్రపోషణరీతులు, రసపోషణరీతులు, అల్పాక్షరముల అనల్పార్థ రచన వర్ణనాబాహుళ్యము, నాటకీయత, అలతి అలతి తునియల కాహలసంధించినట్లు రచించుట, అలంకారముల పొందిక, మనస్తత్వచిత్రణము, జాతీయపద ప్రయోగము ఇత్యాదులు. ఇట్టి కవితాలక్షణములు కలవాడగుటచేతనే తను కావించిన సృష్టితక్కొరునిచేత కాదనిపించుకొన గలిగినాడు ఈ కవిబ్రహ్మ. నన్నయగారికి సంస్కృతపద ప్రయోగమునందెక్కుడు మక్కువ కాగా తిక్కన గారికి తెనుగుపద ప్రయోగమునందాసక్తి ఎక్కువ. మూలములో లేని అనేక దేశీయాచారములను ప్రవేశపెట్టి ఆంధ్రతాముద్ర వేసినట్టివాడై ఆంధ్రదేశాభిమానమును, తెనుగుభాషా పద ప్రయోగ బాహుళ్యముచే ఆంధ్రభాషాభిమానమును ప్రకటించుకొనినట్టివాడు.

---

22. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక
23. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - 1959-60, Vol. 49 సంచిక 5,6.

తెనుగుపదముల సొంపు, కూర్పు, ఈతనితో సమానముగ వ్రాయువారు లేరని పండితుల అభిప్రాయము. చిన్న చిన్న పద్యములలో నధికమైన భావమును, విషయమును ఇముడ్చుశక్తి ఈతని కొక్కనికే గలదు. ఈతనిని గూర్చి వీరేశలింగం గారు తమ ఆంధ్రకవుల చరిత్రలో ఇట్లు చెప్పియున్నారు. 'ఈయన కవిత్వము లోకోక్తులతో కూడి జాతీయములుగా నుండును. ఈయన పదలాలిత్యము, యుక్తిబాహుళ్యము, అర్థగౌరవము, రచనాచమత్కృతి, శయ్యావిశేషమును, సందర్భశుద్ధి, కల్పనాకౌశలమును అన్యులకు రావు. ఈ కవిశిఖామణి యొక్క కవిత్వమునందొకవంతు సంస్కృతపదములును, రెండువంతులు తెలుగు పదములును ఉండును'. ఈ విధమైన ప్రస్తుతి మరి ఏకవిని గూర్తి పంతులు గారు చేయకపోవుటచే తిక్కన గారి పట్ల ఆయనకు గల గౌరవాభిమానములు వెల్లడి మగుచున్నవి. కావ్యము రమణీయముగా నుండటకు కావలసిన కావ్యవిశేషము లన్నియు నీతని కావ్యమున గలవు. శ్రీ ఆరుద్ర తిక్కనను గూర్చి, అతని కవితను గూర్చి 'భారతంలో పదిహేను పర్వాలను రమారమి 16,457 గద్యపద్యాలలో రసబంధురంగా రచించారు. తనకాలపునాటి తెనుగు నుడికారపు విరజాజుల సౌరభం నేటికీ తమ కవితారసంలో భద్రపరచారు. తన సర్వతోముఖ ప్రతిభను భారతంలో అడుగడుగునా ప్రదర్శించి దాని నద్వితీయం చేసారు'[24] యుద్ధాలలోని బీభత్సాన్ని చూచి భయపడే భీరువులు కారు యుద్ధవర్ణనలు అభిరామములు; ఈయనచే సృష్టించబడిన స్త్రీ పాత్రలు చైతన్యసంపుటాలు; కరుణ, జాలిపుట్టించు సందర్భము లందుకూడ చలనమున్న స్త్రీనే వర్ణిస్తారు అనియు వీరి అభిప్రాయము. శ్రీ చాగంటి వారు 'ఆంధ్రభాషాభివృద్ధినే మనమున నిడికొని విశేషముగ జాతీయపదములనే యుపయోగించి రసముప్పతిల్లునట్లు కావ్యరచన సాగించినాడీ మహాకవి'[25] అని చెప్పుచు ఈతని కవిత్వము సర్వజనాకర్షణీయ మగుటకు గల కారణములను కొన్నిటిని చూపియున్నారు. అందు మొదటిది తన కవితాశక్తిని ప్రదర్శించుటకు అనువగు ఇతివృత్తము. 2. పదసౌష్ఠవము-ఏతావున ఏపదము నుపయోగించిన రసముప్పతిల్లునో యీ కవిచంద్రునకు బాగుగ తెలియును. సంస్కృత సమాస మెచ్చటనైన నున్నను అది మృదుపద సంయుతమై మనోహరముగ నుండును. 3. అర్థగాంభీర్యము. 4. వ్యర్థపద రాహిత్యము. 5. పాత్రౌచిత్యము. 6.

---

24. సమగ్ర ఆంధ్ర సాహిత్యం – Vol. 2, పు. 50
25. ఆంధ్ర కవితరంగిణి, 2nd Vol. . పు. 152

భావ్రపకటనము. 7. రసపోషణము. 8. లోకజ్ఞాన ప్రదర్శనము. మొత్తము మీద ఈతని ఆంధ్రీకరణవిధానము స్వతంత్రానువాదపద్ధతియై భారతమునకు కావ్యగౌరవము నాపాదించి స్వతంత్ర కావ్య మనిపించునట్లు చేసినది. 'అనువాదకరణమున తిక్కన ఛాయాగ్రాహకుడు కాడు. చిత్రకారుడు. చేపట్టిన మహాభారతేతిహాసదర్పణమునకు కావ్యత్వపు కళాయి పెట్టిన ఆయన వ్యక్తిత్వాంశలలో అతిముఖ్యమైన దాయన రసికత. రసికత లనగా కేవలము శృంగారైక దేశస్వారసికమైన చిత్తవృత్తి కాదు. సర్వరసాభి ముఖ్యము గల సామనస్యము'[26] అని ఆచార్య యస్వీ జోగారావు గారును చెప్పియున్నారు.

కవిత్రయములో మూడవవాడు ఎఱ్ఱాప్రెగడ. ఈతడు నన్నయభట్టు రచింపగా మిగిలిన భారతారణపర్వశేషమును పూరించుటయే గాక నృసింహపురాణము, రామాయణము, హరివంశము అను గ్రంథములను రచించినాడు. ఈతడు నన్నయ తిక్కనల మార్గమును అనుకరించి తృప్తిపడుటయే గాక, ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నన్నయ తిక్కనలతోపాటు ఒక స్వతంత్ర కవితారీతిని స్థాపించినట్టివాడు. నన్నయ ప్రసన్నకథా కలితార్థయుక్తికి, తిక్కన పాత్రల చిత్తవృత్తుల వర్ణనతో గూడిన నాటకీయశిల్పమునకు మూలపురుషులైనట్లే ఎఱ్ఱన వర్ణనాత్మక శయ్యకు మార్గదర్శకుడై ప్రబంధపరమేశ్వరుడయ్యెను. ఈతడు నన్నయ యొక్క సరస సారస్వతాంశ ప్రశస్తి తన్ను చేరినదని చెప్పికొనెను. 'తద్రచనయకా' నారణ్యపర్వశేషమును రచింతునని చెప్పి అట్లే చేయగలిగినాడు. పదములు జటిలముగాను, సమాసములు తరచు కఠినమై సంస్కృతపదభూయిష్ఠముగాను తోచును. ఈతడు వ్రాసినది మూడున్నర ఆశ్వాసముల భాగము మాత్రమే. అయినను అందన్ని పోకడలను చూపెను. కవిత్వము రసవంతమై, సూక్తి వైచిత్రిని కల్గియున్నది. కావుననే శ్రీనాథుని వంటి మహాకవిచే 'పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు' అని అనిపించుకొనగలిగినాడు. 'శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం....' 4-142 అను పద్యము నన్నయ గారి చివరి పద్యము కాగా, 'స్ఫుర దరుణాంశురాగరుచి....' అరణ్య.4-143 అను పద్యముతో ఎఱ్ఱన కవిత్రప్రారంభమైన దందురు. ఈతని అనువాదపద్ధతియు పై యిరువురి మార్గము ననుసరించియే యున్నది. కవిత్రయము వారు ముగ్గురి అనువాదపద్ధతియు స్వతంత్రానువాదపద్ధతియే.

---

26. మహాకవి మార్గము - విరాటపర్వ విమర్శ - వ్యాసునివాణి- తిక్కనబాణి, పు. 126-129

వారు తు.చ. తప్పకుండ అనువదింపవె నను శృంఖలములకు బద్ధులుగారు. వీరు ముప్పురను గూర్చి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులవారిట్లు చెప్పియున్నారు. 'తిక్కన మూలమున లేకున్నను, వివక్షితములు కాకున్నను కూడ, నేవేని కొన్ని యనుభావములచే మూలభావమును బోషింప దొరకొనును. అనువాదమున సామాన్యదృష్టియు, కదళీపాకము, స్వతంత్రమగు నుక్తివైచిత్రయు, తెనుగు సంస్కృతముల సమాదరణమును, పాంచాలీరీతియు, జనులను తృప్తిపరచుటలో శ్రద్ధయు నెఱ్ఱన కున్నది. అనువాదమున ననుభావ విశేషములచే మూలగత భావముల నుజ్జ్వలముగ ప్రదర్శించుటయు, ద్రాక్షాపాకమును, తెనుగు జాతీయ మగు నుడికారము సొగసున నత్యధికమగు దృష్టియు, కొలది ప్రబంధధోరణియు, అర్ధకైశికీవృత్తియు, సామాన్యముగ వైదర్భీరీతియు, జనానంద సంధానమున జూపును తిక్కనది. మూలగతము లగు భావములను వివక్షితములగు విశిష్ట భావాన్తరములచే వ్యంగ్యసరళిని పోషించి రసపరితవములుగ నాస్వాదింపచేయునట్టి మహోజ్జ్వలమగు ననువాదమున రసైకప్రవణమైన దృష్టియు, లోకుల వాడుక యందలి సంస్కృతమున నెక్కు డాదరమును, తెనుగున స్వభావాదరణ గల తీరును, సహజమగు కైశికీవృత్తియు సుందరతరమగు వైదర్భీరీతియు, ద్రాక్షాపాకమును, లోకహితైక మగు నిరతమగు దృష్టియు నన్నయభట్టారకునిది'[27] పంచమవేదమని ధర్మశాస్త్ర మని ప్రసిద్ధి చెంది పవిత్రగ్రంథముగ బూజింపబడుచున్న మహాభారతమును తెనుగున రచించుటకు సాధారణులగు లౌకికకవులు కాక ఋషితుల్యులగు కవిత్రయము వారు లభించుటయు, వారి యాశయము ప్రజాహిత మగుటయు తెనుగు వారి భాగ్యము : "నానృషిః కురుతేకావ్యమ్" అను నార్యోక్తి కవిత్రయము వారి విషయమున పూర్తిగ సమన్వయించు చున్నది'[28] అని భూపతివారు చెప్పిరి.

వైదికమత పరిణామమును సువ్యక్తము చేయునట్టిది, ధర్మాధర్మ సంరంభమున ధర్మ విజయమును సహస్రముఖముల ప్రతిపాదించునది, సాంఖ్య, కర్మ, జ్ఞాన, భక్తి యోగములను సమన్వయ పరిచినది, జ్ఞానోపార్జన వేదాధ్యయనము వలన కంటె ధర్మారాధనము వలన సులభముగ సాధ్యమగునని విశదము చేయునట్టిది, వేదాంతము 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములచే ప్రతిపాదింప బడిన మోక్షము, 'సర్వధర్మాన్

27. ఆంధ్రమహాభారతోపన్యాసములు-ఎఱ్ఱనమహాకవి-అరణ్యపర్వశేషము, పు.89-90
28. భారతము - తిక్కన రచన, పు. 16

పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను భక్తి సాధన మూలమున ప్రతిపాదించునదియు, నగు భారతముతో తులతూగగల కావ్యము ఇంతవరకును మరల సృష్టికి రాలేదని, నాటికిని నేటికిని కవిత్రయ భారతమే లోకకళ్యాణ ప్రతిపాదిక మగు మహాకావ్యముగ ఆంధ్రుల విజ్ఞాన సర్వస్వముగ ప్రశస్తిని గాంచినదని చెప్పనొప్పును. ఇట్టి ప్రాశస్త్యము గల భారతమును మన కవిత్రయము వారు స్వతంత్రమార్గానుయాయులై అనువదించిరి. వారిది కేవల శబ్దానువాదమును, అర్థానువాదమును గాక భావానువాదముగ చెప్పనొప్పును. కావుననే భారతమును భాషాంతరీకరణ గ్రంథమగను, అనువాదగ్రంథముగను భావింపక పలువురు పండిత విమర్శకులు స్వతంత్రకావ్యముగనే తలంచి యున్నారు. అచ్చముగ తొలుత ఆంధ్రముననే రచింపబడిన గ్రంథ మేమో యను భావము పాఠకులకు కలుగునట్లు రచింపబడినది. దీనిని స్వతంత్రకావ్యముగ భావించుటచేత నీ సిద్ధాంతవ్యాస సందర్భమున మూలభారతముతో పోల్పబడక, ప్రత్యేక కావ్యమను దృష్టితోడనే పరిశీలనము జరుపబడినది. సాధారణముగ తెనుగు భారతమునకు సంబంధించిన ఏ అంశమును పరిశీలించిన మూలభారతముతో తప్పక పోల్చి చూడవలయునని కొందరు భావింతురు. కాని స్వతంత్రకావ్యముగ భావన చేయుటచే మూలముతో పోల్చు నావశ్యకత అంతగాలేదని తద్విధమగు పరిశీలనము విడువబడినది. ఈ విషయమున ఆచార్యకేతవరపు రామకోటిశాస్త్రి గారి అభిప్రాయములను కొంతవరకు చెప్పుట సమంజసము. వీరు తమ సిద్ధాంత వ్యాసమున 'సంస్కృతాంధ్ర భారతములను పోల్చి విమర్శించుట కవకాశములేదు అని స్పష్టముగ చెప్పిరి' [29]

ఈయన వాద సారాంశ మిది – తెనుగు భారతమును గూర్చి చర్చించుటకు ముందుగ కవిత్రయము వారు సంస్కృతము నందలి సర్వవిషయములను అనువదించిరా! లేదా? ఆ అనువాద మెట్లుగలదు? అను విషయమును గూర్చి చెప్పవలసి యుండును. ఈ పద్ధతి పైకి ఉచితముగనే కనిపించినను, విషయ పరిశీలనమునకు దిగినచో నది అంత సమంజసము కాదనియు, అసాధ్య మనియు తెలియ గలదు.

సంస్కృత భారత మొకరిచే ఒకరకముగ వ్రాయబడి ఒకచోట లేక పలువురిచే పలువిధములుగ వ్రాయబడి పలుప్రదేశము లందుగలదు. ఈ విధముగ నున్న వివిధ సంస్కృత భారత ప్రతులలో స్థూలముగ కథ సమానముగా నున్నను మిగిలిన విషయములందు వైవిధ్యము గోచరించుచున్నది. ఏ భారతప్రతి రెండవ దానితో

---

29. తిక్కన కావ్యశిల్పము, పు. 149-158

సంవదించుటలేదనియు, కథాక్రమములో మార్పులేకపోయినను ఏ ప్రతి యొక్క ప్రత్యేకత దానికే గలదని ప్రస్ఫుట మగుచున్నదనియు, విషయక్రమము, శ్లోకసంఖ్య, అధ్యాయముల సంఖ్య-ఇత్యాది అంశములలో ప్రస్తుతము లభించు భారతప్రతులు వేనియుందును పోలికలేదనియు అయ్యర్ గారు చెప్పినమాటలు సత్యమనిపించును.[30] ఈ విధముగా నింత వైవిధ్యము గల సంస్కృత ప్రతులలో ఎవరు ఏ ప్రతిని చూచినారని చెప్పుటకు ప్రమాణములు లేకపోగా, నన్నయగారు చూచిన ప్రతినే మిగిలిన వారిరువురు చూచినా రనుటకును సరియగు ప్రమాణము లేదు. వీరిలో విడివిడిగా ఎవరెవరేప్రతి నాధారముగ గ్రహించిరో చెప్పుటకును అవకాశము లేకపోయినది. నన్నయగా రనుసరించిన భారతప్రతి ఇది అయ్యుండును అని నిర్ణయించుటకు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు కృషి చేసియున్నారు. వారి శ్రమకు కలిగిన ఫలితమును వారిమాటలలో చెప్పవలె నన్న - 'అందుచే నన్నయ ఏసంస్కృత భారతప్రతి ననుసరించి యుండెనో యిదమిత్థమని చెప్పుట కవకాశము లేకపోయినది' - ఇది వారి గ్రంథము తొలిపలుకులోని వాక్యము. ఈ వాక్యము మాత్రమే గాక వారు గ్రంథమున మరికొన్ని అంశములను చెప్పిరి. నన్నయ ప్రధానముగ దాక్షిణాత్యప్రతులనే యనుసరించినను కొన్ని యుత్తరప్రతులను కూడ తెప్పించి వానిని గూడ తరచుగ పరిశీలించి అందు తనకు ఉచితములని తోచిన భాగములను గ్రహించి తన భారత భాగమున చొప్పించి యుండునని, లేదా ఉత్తర దక్షిణ ప్రతుల యందలి కథా క్రమములతో కూడిన ఒక సంకీర్ణప్రతి యుండి యుండునని, అది మనకిప్పుడుపలభ్య మగుటలేదని చెప్పవచ్చును. లేదా నీలకంఠుడు తాను వ్యాఖ్యానము వ్రాయు సందర్భమున బహుప్రాంతము లందలి ప్రతులను చూచి పాఠముల నెట్లు నిర్ణయించుకొనెనో అట్లే నన్నయయు తనవాటికి లభ్యములగు వివిధ భారత ప్రతులను తెప్పించి, చదివి, నారాయణభట్టు వంటి మిత్రుల సాహాయ్యమున కొన్నిటియందు మాత్రమే కానవచ్చు నధిక పాఠముల ఔచిత్యానౌచిత్యములను చర్చించి, ఉచితములైన వానిని గ్రహించి, అనుచితములను

30. 'Even a ensary examinations of these copies discloses the fact that though in the main they agree as to the text of the epic, the divergence among them as to the portion of the same is palpably great. No one text agrees with another in the number of slokas it gives. The sequence of the chapters is often found varied. The arrangement of matter differs, frequently in respect of even individual chapters whose Adhyayas or chapters, given in one edition are looked for in vain in the others'.

-the MahaBharatha. V.V. Iyer pp1, 2

పరిహరించి తానె యొక భారత ప్రతిని కూర్చుకొని యుండవచ్చును. మొత్తము మీద ఆకాలమునకు, ఈకాలమునకు నడుమ కొన్ని శతాబ్దముల వ్యవధి యుండుటచే మార్పులు చేర్పుల కవకాశము కలిగి ఆతని భారతప్రతికి 'ఇది మాతృక' అని చెప్పుట దుర్లభమనిరి. చివరికి ఈ విధముగా లభ్యములగుచున్న సాధనముల ననుసరించి ఆధారమలనుబట్టి నన్నయ అనుసరించిన భారతప్రతి ఎందును లేదనియే నిర్ణయము చేయవలసి యున్నదని వ్రాసిరి.[31]

ఆచార్య అవధాని గారి ననుసరించి కవిత్రయము వారి భారతమేయే సంస్కృత ప్రతుల ననుసరించి యున్నదో తేల్చిచెప్పుట కవకాశము లేదని స్పష్టమగుచున్నది. నన్నయ గారి ప్రతి తెలియనంతమాత్రమున తిక్కనగారనుసరించిన ప్రతిని గుర్తింపలేమా? అను ప్రశ్నకు, పర్వ సంగ్రహము, శ్లోక సంఖ్య, స్పష్టముగ వ్రాసిన నన్నయ భారతమునకే ప్రతి యిదమిత్థమని తెలియనప్పుడు పర్వసంగ్రహముగాని, శ్లోక సంఖ్య గాని చెప్పని తిక్కనగారి భారతమునకు మూలప్రతి గుర్తింపబడుట కేవల మసాధ్యమనక తప్పదు.

భండార్కరు పరిశోధనాలయము వారు అనేక ప్రతులను సంపాదించి సిద్ధము చేసిన ప్రామాణికమైన సంస్కృత ప్రతి కవిత్రయ భారతమునకు మూలము కాదా! అనవచ్చును. కాని యిట్లు భావించుటకు వీలులేదు. ఏలన వారికిని అన్ని ప్రతులు లభ్యములు కావు. దొరకినంతవరకు ప్రతులను వారు సంప్రతించిరి. మరియు కాశ్మీరము నందలి శారదాక్షరములలోని సంస్కృత ప్రతిని ప్రధానముగ భావించిరి. ఇతర ప్రతుల యందలి శ్లోకము లించుమించుగా నిందుండుటచేతను, ప్రక్షిప్తములేవియు నందుండి యుండవని యూహించుటచేతను, దీనిని ప్రమాణముగా భావించిరి. మరి ఈ ప్రతి కవిత్రయము వారి భారతమునకు మూలము కాదా ! అనిన అట్లనుట సమంజము కాదు. ఎందువలననగా వారు మూలమును నిర్ణయించుటలో మన తెలుగు భారతమును ప్రమాణముగ స్వీకరించిరి. కొంతలో కొంత తెనుగు భారతముబట్టి నిష్కర్ష చేయబడిన సంస్కృత భారతప్రతిని తిరిగి తెనుగునకు మూలమనుటలో నంత యర్థము కనిపించుటలేదు. ఇక మరియొక విధముగ చూచిన కవిత్రయము వారు దక్షిణదేశము వారగుటచే వారనుసరించినది దాక్షిణాత్యప్రతికావచ్చునని, దక్షిణదేశప్రతులను సంప్రతించి సంపాదించిన శ్రీ పి.పి. యస్.శాస్త్రిగారి సంస్కృత

---

31. నన్నయ - ఆంధ్రవాఙ్మయారంభ దశ, పు. 479

ప్రతివీరికి మూలము కాదా? అని తలంపవచ్చును. కాని కవిత్రయము వారు చూచిన ప్రతులు శాస్త్రిగారు సంప్రతించిన ప్రతులలో నుండు నను నమ్మకము లేదు. పైగా ఉత్తరదేశ ప్రతి నేల చూచియుండరాదను శంక కలుగవచ్చును. కావున శాస్త్రిగారి ప్రతియు మూలము కాదు.

ఇక తిక్కనగారి విషయమై కృషి చేసిన కోరాడవారు తిక్కన వారి మూలగ్రంథ ప్రతి యుత్తరదేశ ప్రతులలో ప్రాచీనములగు వానికి చేరువగా నుండునని యూహింప తగియున్నదని వ్రాసిరి.[32] ఇది మరింత కష్టము. ఏలన ఉత్తరదేశప్రతులలో ఏవి ప్రాచీనములు,? అవి ఎన్ని కలవు? అవి తిక్కనగారిచే ఎట్లు సంపాదింపబడెను? అవి యిప్పుడేల అలభ్యములు? - ఇత్యాది పలు విషయములను విమర్శింపవలసి యుండును. ఇంతియ గాక దక్షిణదేశపు ప్రతిని వదలి ఉత్తరదేశపు ప్రతిని ఏల గ్రహించి యుండెనో కూడ యూహింపవలసి యుండును. ఆ ఉత్తరదేశపు ప్రతి అయినను 'ఇది' అని నిష్కర్షలేదు కావున ఇదియును సరికాదు.

సంస్కృత భారతప్రతుల స్థితిగతులిట్లున్నందువలన కవిత్రయము వారి భారతమునకు దేనికదిగా, విడిగా సంస్కృతభారతముతో ప్రసక్తిలేకుండ విమర్శించు పద్ధతియే యుచితమనిపించుచున్నది. సంస్కృత భారతముతో విమర్శించు పట్ల వ్యాసులవారిని కొన్ని సందర్భములందు కవిత్రయము వారి కంటె ఘనులుగ, కొన్ని సందర్భము లందు అల్పులుగ నిర్ణయింపవలసి వచ్చును. మనకు కావలసినది వారి కావ్య నిర్మాణ కౌశలము గాని వారి అల్పత్వ, ఘనత్వములతో పనిలేదు.

సంస్కృత భారతప్రతులొక విధముగా లేకపోవుటచేతను, కవిత్రయము వారనుసరించిన ప్రతిగాని, ప్రతులు గాని 'యిదమిత్థమ్' అని నిర్ణయించుట సాధ్యము కాకపోవుటచేతను, మనకు దగ్గర అందుబాటులో నున్న ఏదో ఒక సంస్కృత భారత ప్రతితో పోల్చిన వ్యాస నింద అనివార్య మగుచుండుటచేతను, ఏది వ్యాసుడు వ్రాసినదో ఏది కాదో స్పష్టముగ తెలియనందు వలనను, నిన్న నేడు దేశమున సంపాదింపబడిన భారతప్రతులు వారికి మూలమని భావించుట అంత ఉచితము కాకపోవుటచేతను, సంస్కృతాంధ్ర భారత ప్రతులను పోల్చి చూచు నవకాశము

32. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 191

లేదని స్పష్టముగా చెప్పవచ్చును.

సంస్కృతాంధ్ర భారతములను విమర్శించినవారు దివాకర్ల, కోరాడ, గుఱ్ఱం వేంకట రామసుబ్బయ్య, మున్నగువారు. ప్రాయికముగా ఆంధ్ర భారతమునకే పరిమితమగు విమర్శ గావించినవారు భూపతివారు, కాళూరి వారు, నండూరి రామకృష్ణమాచార్యులు, నండూరి బంగారయ్య గారు, విశ్వనాథ సత్యనారాయణ గారు, ఖండవల్లివారు, కేతవరపు వారు మొదలగువారు.

సంస్కృత భారత విమర్శనము కంటె ఆంధ్ర భారత విమర్శనమే శ్రేయస్కరమను శ్రీ కేతవరపు వారి మాటలను ఇట ఆయన మాటలలోనే చెప్పికొనుట శ్రేయస్కరము. 'అసమగ్రమై యున్న సంస్కృతాంధ్ర భారత విమర్శనము కంటె విరాటపర్వ మాదిగా బహువిధముల విస్తృతి చెంది ప్రకృతి తత్త్వమును సుగమము చేసి శాంత్యధిష్ఠితమగు స్వర్గారోహణముతో సమాప్తి చెందిన భారత భాగమును రచించుటలో తిక్కన ఎట్లు తత్తత్సన్నివేశముల కనుగుణముగ తన కవితాశిల్పము నుచిత విధమున ప్రదర్శించి నదియు సహేతుకముగ నిరూపించు ఆంధ్రభారత విమర్శనమే సమగ్రమును, రుచిరమునునై కన్పించుచున్నందున ఈ విధమైన విమర్శనమే చేయుటకు తగినదిగ నిర్ణయించు లెస్స'.[33]

శ్రీ కేతవరపు వారి అభిప్రాయముతో నేకీభవించి, ఆంధ్ర మహాభారతమును కేవలానువాదముగా గాక స్వతంత్ర మగు కావ్యముగ భావించి ప్రత్యేక కావ్య దృష్టితో పరిశీలన చేయదలంచుటచేత, ఈ సిద్ధాంతవ్యాసము నందు తిక్కన గారి రచనను వ్యాసభారతముతో పోల్చి చూపు ప్రయత్నము జరుగలేదు.

ఈ రీతిగ స్వతంత్ర కావ్య ప్రతిపత్తి గల ఆంధ్ర భారతము మనోరంజకమగు కథావిశిష్టతను బట్టియే గాక, నన్నయ తిక్కనాదుల మృదుమధుర శైలిలో వర్ణింపబడి పాఠకులకు అత్యంత ఆకర్షణీయముగ నొనర్పబడినదియై 'తింటే గారెలే తినాలి - వింటే భారతమే వినాలి' అను రీతిని ప్రశస్తిని గాంచి యున్నది.

---

33. తిక్కన కావ్యశిల్పము, పు. 175

# 2వ ప్రకరణము

## తిక్కన – తత్కృత భారత స్థూల పరామర్శ

'ఉభయ కవిమిత్రు నత్యంత శుభచరిత్రు
భానుసమతేజు, కొమ్మయప్రభు తనూజు
సుకృత విభాజి తిక్కన సోమయాజి
ప్రణుత బహుదేశ కవిరాజు ప్రస్తుతింతు'

తిక్కన మహామనీషి. సకలశాస్త్ర పారంగతుడు. ఒక మహాసామ్రాజ్య మునకు మంత్రియై, దండనాథుడై, రాయబారియై ప్రభురాజ్య స్థాపనా చార్య బిరుదమును వహించినవాడు. రూపమున మన్మథుడు. సకల సంపదలతో తులతూగి మహాభోగియు, రాజలాంఛనోపేతుడు, కృతికర్త, కృతిభర్త, దానశీలి, సోమయాజియునై సహస్రచంద్ర దర్శనోత్సవమును గావించుకొని పూర్ణజీవితమును గడిపిన భాగ్యశాలి"[1] అని సముద్రాల వారిచే కొనియాడబడిన ఈ తిక్కన పదమూడవ శతాబ్దివాడు. నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి కడ మంత్రియు, నాస్థాన కవియునై యున్నట్టివాడు. నియోగి బ్రాహ్మణుడు. గౌతమగోత్రుడు. తండ్రి కొమ్మన దండనాథుడు. తల్లి అన్నమ. "కొట్టరువు తిక్కనికిన్, కొట్టరువు మంత్రి తిక్కనిన్, కొట్టరువు కొమ్మశౌరి, కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుడు తిక్కశౌరి, కొట్టరువు తిక్కనామాత్యునకు నిజస్థానంబడు....."[2] అనువానిని బట్టి ఈతని యింటిపేరు కొట్టరువు వారని తెలియుచున్నది. కేతనచే రచింపబడి, తిక్కనకు కృతిగా నీయబడిన దశకుమారచరిత్రము ఈ కవిశేఖరుని యొక్క చరిత్రమును వెల్లడి చేయుచున్నది.

---

1. సాహితీ సుధాలహరి, పు. 26
2. దశకుమారచరిత్రము, 1-4, 8, 81, 88, 10

'తిక్కన దండాధీశా : ఆ. 12-1:, తిక్కన చమూపా : ఆ. 8-1ఫ, మంత్రి తిక్కండెలమిన్ : ఆ. 3-1:' అని కేతన తిక్కన నభివర్ణించుటచే మనుమసిద్ధి రాజునకాస్థాన కవియు, నమాత్యశేఖరుడును నైనట్లు విదితమగుచున్నది. 'విక్రమ సింహపురమున కధీశ్వరుండును : ఆ. 1-12:....... కీర్తిపాత్రంబైన మనుమసిద్ధి మహీవల్లభునకు కరుణాపాత్రంబైన కొట్టరువు తిక్కనామాత్యుండు నిజకులక్రమాగతంబగు మంత్రి పదంబున వర్ధిల్లుచు : ఆ. 1-20:' అనియు చెప్పబడుటచే తండ్రి తాతల తరముగ తిక్కన వంశ్యులు నెల్లూరు రాజ్యమునకు మంత్రులుగ నుండిరని విదిత మగుచున్నది. ఉత్తర రామాయణ పీఠిక యందు 'వీరి నివాసస్థలము కృష్ణా మండలములోని వెల్లటూరను గ్రామము. ఉద్యోగధర్మమున మంత్రి భాస్కరుని కాలములో గుంటూరున నుండుటంజేసి గుంటూరు వారని పేరు వచ్చినదే కాని వీరి యింటిపేరు కొట్టరువు వారు. ఈ కొమ్మనామాత్యుడు నెల్లూరిలో ధర్మపత్నింగైకొని బంధుత్వమున నెల్లూరికి రాకపోకలు జరుగుచుండ మనుమసిద్ధి నృపాల పరిచితి కలిగెననియు, దానంజేసి మనుమరాజీ కవికుటుంబము నాదరించి నెల్లూరికిం బిలిచికొని వచ్చి పూర్వము హరిహరనాథాలయ ముండిన యిప్పటి రంగనాథ దేవాలయము దగ్గర నిల్లు గట్టించి తిక్కన నందు గాపురం బుంపగా.... పినాకినీ తీరంబున జన్నంబుసేసి తిక్కన సోమయాజి నాబరగె'[3] అని కలదు. 'తిక్కన పూర్వులు గుంటూరు మండలమున రేపల్లె తాలూకాలో 'పట్లెటూరు' గ్రామ కాపురస్థులైనట్లును, ఈ కవి తాతగారు మంత్రి భాస్కరుడు గుంటూరు పట్టణాధిపతిగాను, తండ్రి కొమ్మనామాత్యుడు గుంటూరులోనే దండనాథుడుగా నున్నట్లును, తరువాత తిక్కనగారు నెల్లూరున కేగి యచ్చట మనుమసిద్ధి కడ నాస్థాన కవియై, మంత్రియై రాజ్య పునస్థాపనాచార్యుడైనట్లు కందుకూరి వీరేశలింగకృతాంధ్ర కవుల చరిత్రలో నుదహరింపబడి యున్నది"[4]. తిక్కన నివాసస్థలము పట్లెటూరని కొందరు, వెల్లటూరని కొందరు, పాలూరని కొందరు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది.

ఉత్తర రామాయణమును రచించి మనుమసిద్ధి కంకిత మిచ్చుటచే అతనికి సమకాలికుడనియు, సిద్ధేశ్వర చరిత్రము, సోమదేవరాజీయము ఆధారముగ తిక్కన ఓరుగంటి కాకతి గణపతిదేవుని సందర్శించి యతని సాహాయ్యమున మనుమసిద్ధిని

---

3. ఉత్తర రామాయణము - పీఠిక - పు. 3-4

4. కవిత్రయ కవితారీతులు - తరువాత కవులపై వారి ప్రభావము, పు. 27

రాజ్యస్థితుని చేసినట్లుగ చెప్పబడుటచే నాతనికి సమకాలికుడనియు, వీరిరువురును 13వ శతాబ్ది మధ్యభాగము వరకు జీవించి యుండిరని సిద్ధాంతీకరింపబడుటచే తిక్కన కాలము కూడ పరమూడవ శతాబ్ది నడిమిభాగ మనియు నిర్ధారింపబడినది. శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు తిక్కనను గూర్చి 'విద్వద్వంశ్యుడు, గొప్ప విద్వాంసుడు, మహాకవి, నీతిపారగుడు, కరుణగలవాడు, సుందరుడు, గొప్పదాత, అఖండైశ్వర్య సమన్వితుడు, హరి హరోభయభక్తుడు, కవిపోషకుడు, శ్రౌతస్మార్త కర్మనిష్ఠాపరుడు....'[5] ఇత్యాదిగ ప్రస్తావించి యున్నారు. మనుమసిద్ధి వలన నీతడు పొందిన రాజచిహ్నములు 'అందలంబు గొడుగు అడపంబు మేల్కట్టు చామరంబులు జమిలి శంఖములును..... ః ద॥కు॥చ॥ 1-21 ః అని పరిగణితములు. అంతియగాక నీతడు రాజులవలె పెక్కూళ్ల నగ్రహారములుగా నిచ్చుచు దానకర్ణుడని పేరుగాంచినాడు. సుకవి బృందముల పాలిటి కల్పతరువో అన పేరుదాల్చె ః ఆర్థిమై బెక్కూళ్ల నగ్రహారములుగా నిచ్చి నను౯ట పొగడ్త పాలము 1-92ః. ఈ రీతిగ తిక్కన సకల సంపత్కళా పరిపూర్ణుడై, లౌకికాధికార ధూర్వహుడై, మనుమసిద్ధికి దక్షిణహస్తమై యుండినట్టివాడు. మంత్రిపదస్థుడయ్యును విద్యావిషయమున నతి పరిశ్రమ చేసి ఆంధ్ర మహాభారతమును రచించి కవిబ్రహ్మగ ప్రఖ్యాతి గాంచినట్టివాడు. శ్రీ మా॥ నరసింహాచార్యులవారు 'ప్రపంచమున పంచమవేదమునాబరగి జన సంప్రార్థ్యంబై లోకమెల్లెడ వ్యాపించి యశేష జనసంసేవ్యంబై నానార్థశాఖలు గలిగి కల్పతరువుంబోలి యాశ్రిత జనంబులకు కామితార్థంబుల నిచ్చుచు నపవర్గ రమాధాయకంబై యలరారు మహాభారత గ్రంథము నాంధ్రీకరించిన మహాకవులలో నగ్రగణ్యుండైన యిమ్మహామహుండెవ్వరికి స్తోత్రపాత్రంబు కాడు'[6] అని చెప్పిరి.

తిక్కన మహావిద్వాంసుడు, ఉభయభాషల యందు ననమాన పాండిత్యము గలవాడును అగుటచే నీతని యపారమగు ప్రజ్ఞను పసలువురు కవులు పలుపలు విధముల నుతించియున్నారు. 'నన్నయ భారతాంధ్రీకరణమునకు సుమారు రెండు శతాబ్దముల యనంతరము తిక్కన సోమయాజి పదునేను పర్వముల భారతమును జాను తెనుంగు నుడికారపు సొంపు పెంపెసలార రచించి యావత్కావ్య నిర్మాణ

---

5. తిక్కన సోమయాజి విజయము, పు. 6-12.

6. 'తిక్కన సోమయాజి జీవితము' - ఆంధ్ర సా॥ప॥ప॥, సంపుటి, 8, సంచిక 4

శిల్పమునకు తెనుగు తోటయై విరాజిల్లినవాడు"[7] అని శ్రీ యడవల్లివారు చెప్పియున్నారు. తిక్కనార్యుడు మహాకవిత్వ దీక్షావిధి నాంది భారతమును చంపువుగనే రచించినాడు. కాని ఉత్తర రామాయణము వలె కేవల పద్యరచనగా రచింప దొరకొనలేదు. ఉత్తర రామాయణ కాలమునాటి కంటె భారతమునాటి కాతని చిత్తమెట్లు వికాసము నొందినదో ముందే వివరింపబడినది. ఉత్తర రామాయణ పీఠికలోని 'ఎట్టి కవికైన తన కృతి యింపుపెంపుజాలు గావున....... : 1-9:; జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడ...... : 1-14:; లలితపద హృద్యపద్యంబులన..... :1-16:' అను పద్యముల వలన ఈతడు ఆనాడు కవితావిలాసములోనే చిక్కుకొనినట్లు తెలియుచున్నది. భారతము నాటికి కవిత్వతత్త్వ నిరతిశయానుభవానంద భరితాంతఃకరణుడు కాగలిగెను. కవిత్వతత్త్వ స్వరూప మవగతమయినతోడనే నీ బాహ్యాడంబరములు, బాహ్య నియమము లీతనికి వెగటుగ తోచినవి. 'రామాయణ మందలి అవతారికా విషయముల నీభారతావతారికా విషయములతో పోల్చి చూచినచో తిక్కనార్యుని యనుభవ పరిపాకము, బుద్ధి పరిణతి, కళాప్రతిభకు కలగిన నూత్న వికాసము లెట్టివో మనకు స్పష్టమగున"[8]ని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు. ఉ|రా| న 'భూరి వివేకచిత్తులకు.....': ఉ|రా|| 1-5: అని సుకవి లక్షణమును చెప్పుటయే గాక 'కుకవుల్ ధర దుర్విటులట్ల చూడగన్' :1-6: అని కుకవి నిందను కూడ చేసినాడు. 'తెలుగు కవిత్వము చెప్పందలచిన కవి........' : ఉ|రా|| 1-7:, 'అలవడ సంస్కృత శబ్దము తెలుగు బడి విశేషణంబు తేటపడంగా.....' : ఉ|రా|| 1-8: అని తెలుగు కవిత్వ మెట్లుండ వలయునో సూచించినాడు. ఎట్టి పదము నెట్లుపయోగింపవలయునో తెలిపి తాను ఆయా దోషములను పరిహరించి గుణముల నాదరించియే కవిత చెప్పుచున్నానని సూచించినాడు. భారతము రచించునాటికి ఈ కృత్రిమ నిబంధనముల నన్నిటిని పాటింపవలెనను భావము నతిక్రమించినాడు. 'అమలోదాత్త మనీష....' : ఉ|రా|| 1-13: అని ఉ|రా|| నాడు ఆత్మశ్లాఘాపరాయణుడైన తిక్కన -

'భారత సంహిత చెప్పగంటి నాపుట్టు కృతార్థతం బొందవే' : భా. విరా. 1-27:

'నానేర్చిన భంగి చెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికిన్' : విరా. 1-28:

---

7. 'తిక్కన శిల్పపు తెనుగుతోట' - భారతి, 1957 సెప్టెంబరు, సంపుటి 34, సంచిక 9, పు. 17

8. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 168

అని భారతమునాటికి వినయానతుడైనాడు. 'భారతమున నీ బాహ్యాచారముల నన్నిటిని, అనగా కుకవినింద, సుకవి స్తుతి, కవితాలక్షణ ప్రతిపాదనము, మొదలగు వానిని వదలివేసి స్వప్నవృత్తాంత కథనము మూలముగ మహోద్భుతము, నత్యంత పావనంబు నగు నొక విచిత్ర సన్నివేశమును గల్పించి, కాళిదాసు శాకుంతలమున వాయు పథమున మారీచాశ్రమమునకు గొంపోయినట్లే ఊర్ధ్వలోకమునకు గొంపోయినాడు. అక్కడ హరిహరనాథుని యందద్వైత స్వరూపమును గోచరింపచేసినట్లే యీ యవతారిక యందే కవిత్వ లక్షణ మిట్టిది యని చెప్పక కవితాతత్త్వ స్వరూపమునే చూపినాడు.'[9] అని శ్రీ కోరాడ వారు చెప్పియున్నారు.

ఈ స్వప్న వృత్తాంతము కడుంగడు రమ్యముగ వర్ణింపబడి తిక్కనార్యుని స్వాభివికతకు లేదా ప్రత్యక్షీకరణశక్తికి చక్కని నిదర్శనమగు చున్నది. తన గ్రంథము నందు ఎచ్చట జరుగు ఏ విషయము నందయినను తన అప్రతిమాన మగు ప్రతిభాశక్తిచే కనులముందు కట్టునట్లు నిర్ణయింపగల సమర్థుడు తిక్కన. అనన్య సామాన్యమయిన ఈ విశేషగుణమే తిక్కనార్యుని తదితర కవితావిశేషము లన్నింటికిని మూలాధార మయినది.

ఈతని కవనమును గూర్చి శ్రీ వేదం వారు 'ఇమిడిక, పెంపకము, లక్షణానుసరణము, భాషాస్వాభావ్యము, పరిశుద్ధి, రససంపద, జాతీయము అనునవి తిక్కన కవనమున గల విశేషములు'[10] అని చెప్పిరి. చిలుకూరి వీరభద్రరావు గారు 'తిక్కనసోమయాజి, అనుతమ గ్రంథములో తిక్కన తాతతండ్రులను గూర్చియు, నివాసస్థానమును గూర్చియు విమర్శించిన పిదప 'ప్రాభవము కలిగిన ప్రభువంశమున జనించి ప్రతిభాశాలియై యాంధ్రప్రపంచ మజ్ఞానాంధకారమునబడి కన్నుగానక తడువుకొనుచు తపించుచున్న కాలమున జ్ఞానతేజస్సును బఱపి సముద్ధరించి యానందాబ్ధి నోలలాడింతునని ప్రతిజ్ఞాదీక్షను వహించి సార్థకజన్ముడైన ధన్యుడు. అక్షరాభ్యాస సంస్కారానంతరమున తిక్కన వేదాది సమస్త విద్యాభ్యాసవిభాసి యగుచు ననుదిన ప్రవర్ధనంబు చెందెనని కేతన వ్రాకుచ్చి యున్నాడు' అని తెలిపిరి. కేతన తిక్కనను ఉదాత్త వేదవిద్యా ప్రతిపాలకుడు, వేదోదిత కర్మవ్రతుడు

---

9. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 171-172
10. తిక్కనసోమయాజి విజయము, పు.16

నానావేదాంగతత్త్వజ్ఞుడు, అనితరగమ్య వాఙ్మయమహార్ణవ వర్తనకర్ణధారుడు....ఇత్యాదిగ వర్ణించి యుండుటచే తిక్కన సాంగోపాంగముగ వేదముల నభ్యసించి తనకాలము వారిచే వాక్పతినిభుడని కొనియాడబడు చుండెనని తెలియుచున్నది. నండూరి వారు 'ఈతడు అనుష్ఠాన వేదాంతి అనియు, తిక్కన సందేశమున కర్మాచరణమే యోగసాధనమని, జీవితమే కురుక్షేత్రమని, కురుక్షేత్రము ధర్మక్షేత్రము సంకులధర్మ సమరక్షేత్రము' [11] అని చెప్పియున్నారు.

'త్యజేదేకం కులస్యార్థే
గ్రామస్యార్థే కులంత్యజేత్
గ్రామం జనపదస్యార్థే
ఆత్మార్థే పృథివీమ్ త్యజేత్'

అను నీతి ననుసరించి ఉత్తరోత్తర విస్తృతి కలుగువాని కనుగుణముగ పూర్వపూర్వ విషయములు పరిత్యక్తములు కానగును. అట్లే పరిధి ఎక్కువగల ధర్మము కొఱకు అల్పపరిధి గల ధర్మములను త్యజించుట సమంజసము. అవస్థాభేదమును బట్టి ఒకొక్క ధర్మము ప్రబలముగ కానవచ్చుచున్నను శాశ్వతధర్మ మొక్కటే అనియు, దేశ కాల పాత్రములనుబట్టి అది వివిధములుగ గోచరించుననియు తెలియదగును. ధర్మమునకు అద్వైతస్థితినే-ధర్మాద్వైతము అన నిదియే- వేదవ్యాసు డిట ఎలుగెత్తి చాటుటచే నీ భారతవర్షము ధర్మభూమి, కర్మభూమి అని ప్రసిద్ధి నొందినది. తదుపరి అపరవ్యాసుడగు తిక్కన మహాకవి ఇట ఈ ధర్మాద్వైతమును స్థాపించుటచే, తెనుగు భారతమునకు ఏ దేశభాషలలోను, ఎక్కడను లేని ప్రాధాన్యము, ప్రతిష్ఠ కలిగినవి. భారతదేశ జాతీయగ్రంథమును మరియు తెనుగుభూమిలో జాతీయగ్రంథము కూడ భారతమే అయినది.

'నిండార విచ్చిన నెత్తమ్మి పూరేకుల మొత్తమ్ములు పరచి తెనుగు సాహితీసరస్వతికి అడుగులొత్తనీయని మెత్తని రాజబాట కల్పించినాడు. ఆమెను మానవలోక సంచారిణిని గావించినాడు. తిక్కన కవితారసపిపాసి'[12] అని శ్రీ శిష్టా

11. కవిత్రయము, పు. 87

12. 'తంజావూరు తెనుగు కవులు'-ఆంధ్ర.సా.ప.ప., సంపుటము 49

లక్ష్మీ కాంతశాస్త్రి గారిచే కొనియాడబడెను. ఇక గుత్తిం వెకట సుబ్బరామయ్యగారు 'తిక్కన కవిత పాలమున్నీటిం బోనిది కావున త్రచ్చుకొలది అందు భావరత్నములు రసామృతము వెలువడును' [13] అని ఈతని కవితను గూర్చి చెప్పిరి. శ్రీ నోరి నరసింహశాస్త్రి గారు 'అన్నింటికంటెను అతని మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైకశీలత అతని సోమయాగము చేయించి ఆర్యధర్మనిష్ఠను సుస్థిరము చేసినది. అంతట పురోడాశపవిత్రమైన ఆ సోమయాజి వాక్కున ఆంధ్ర మహాభారతము విరాటపర్వ మాదిగా తెనుగు భూమికి ప్రసాదించున ట్లనుగ్రహించినది'[14] అని చెప్పిరి. ఉత్తరరామాయణము నాటికి తిక్కన అమాత్యుడే కాని యజ్ఞము చేసిన సోమయాజి కాడను విషయమును వీరిట్లు చెప్పిరి. గురజాడ శ్రీ రామ మూర్తిగారు 'కవిజీవితములు' అనుగ్రంథమున తిక్కన సోమయాజి కాలమును గూర్చి, నివాసస్థలమును గూర్చి విమర్శచేసి తిక్కనకు సంబంధించిన కొన్ని అంశములను పేర్కొనియున్నారు. [15] డా॥ రంగారావు గారు తమ సిద్ధాంత వ్యాసమున 'కుకవులను దుర్విటులతో పోల్చికుకవి నిరాసనము చేయుచు తిక్కన వ్రాసిన పద్యములో కావ్యశయ్య, రసనిర్వహణము, కావ్యానందము అను మూడును మహావిషయములు వ్యంగ్యములుగ చెప్పబడినవి. భారతమున పెక్కుప్రధాన సన్నివేశ పాత్రచిత్రణ స్థలము లందు 'ఉచిత' అను పదము ఉపయోగింప బడినది. ఈ యౌచిత్యదృష్టి యున్నపుడే పలుకుల పొందిక లేకపోవుట, రసభంగము జరుగుట యనునవి కలుగక హృదయానందము లభించును. దీనినిబట్టి తిక్కన పరమౌచిత్యవేత్త యని తెలియుచున్నది. లక్షణయుక్తము, నియమబద్ధమైన భాషకే తిక్కన ప్రాముఖ్య మిచ్చినట్లు స్పష్టము. ఆంధ్ర సాహిత్యమున కావ్యకళా శిల్పరస నిర్వహణాదులను గూర్చియింత స్పష్టముగ, నిష్కర్షగ తమ యభిప్రాయములను ప్రకటించినవారు చాల తక్కువ. అట్టివారిలో తిక్కనదే అగ్రస్థాన మనవచ్చును' అని వ్రాసియున్నారు'.[16]

---

13. 'తిక్కన విరాటపర్వము'-భారతి, 1928 : 2:, డిసెంబరు, సంపుటము 5, సంఖ్య 12, పుటలు 873-879
14. 'ఆంధ్రకవుల ఆదర్శములు - అమాత్య తిక్కన' - భారతి, 1947:1:, 'మే' నెల, సంపు.24,సంచిక 5
15. 'కవి జీవితములు'- 'తిక్కన సోమయాజి' - పు. 75
16. Conception & Practice of Poetry of Kavitrayam and Nachana Somana.

కాశీనాధుని నాగేశ్వరరావు గారు 'తిక్కన రచన సంస్కృతాంధ్రసారముల సమ్మేళనము పొంది ఆంధ్రహృదయము నకు లక్ష్యముగ నున్నదనియు తిక్కన అద్వైతి అని, ఈతని కావ్యము పరిపక్వమైన దని' [17] తమ ఆంధ్రవాఙ్మయచరిత్ర యందు వ్రాసినారు.

ఈ రీతిగా పలువురు పండిత విమర్శకులు తిక్కనను గూర్చి తిక్కన కవితను గూర్చి, అతని విశిష్టతను గూర్చి విమర్శించి యున్నారు. పైవిమర్శనము లన్నిటి వలన తిక్కనామాత్యునికి సంబంధించిన పలువిషయములు మనకు తెలియవచ్చుచున్నవి. ఇట్లు పలువురు ఈతని గూర్చి గ్రంథములు వ్రాయుటకు గాని, వ్యాసములు వ్రాయుటకు గాని గల కారణము అతని వ్యక్తిత్వపు విశిష్టతయు, అతని కవితావైశిష్ట్యమును. ఇట్లు పలువురి మన్ననలకు పాత్రుడైన ఈ తిక్కన కృత భారతభాగము పదునైదు పర్వములని ముందే చెప్పికొంటిమి.

ఈతని భారత ఉపక్రమణ మేరీతిని ఉన్నదో చూతము. ఈతడు కృత్యాదిని 'శ్రీ యన గౌరినాబరగు' అను పద్యమును చెప్పియున్నాడు. ఉత్తర రామాయణమున 'శ్రీ రాస్తాం మనుక్షితేశ్వర...' అని సంస్కృత శ్లోకమును, భారతమున సంస్కృతపద భూయిష్ఠమగు పద్యమును చెప్పితనకు సంస్కృత భాష యందు గల గౌరవమును, అభిమానమును చాటుకొనినాడు. ఈతనికి తెలుగు దేశాభిమానము, భాషాభిమానము అధిక మను విషయము సత్యమై నను సంస్కృతముపట్ల కూడ గౌరవాభిమానములు కలవాడని పై నిదర్శనము వలన తెలియుచున్నది.'తిక్కనకు సంస్కృతభాష యందెంత మాత్రము అభిమానము లేదు' అనువాదము పరాస్తముచేయు రీతిని ఇట్లు సంస్కృత సమాసభూయిష్ఠ రచన చేసియున్నాడు. భారతకృతి యందును వలసినచోట్ల సంస్కృత పదములను వాడుటయు నీతనికి గలదు. శ్రీ కాశీభట్ట బ్రహ్మయశాస్త్రి గారు ఈతని సంస్కృతాభిమానము గూర్చి చెప్పుచు "భారతములో మొదటి పద్యము సంస్కృతశ్లోకము కాకపోయినను, సంస్కృతపద భూయిష్ఠమై యున్నది. 'శ్రీ యన గౌరినాబరగు...'। విరా.1-1। కేవల సంస్కృతశ్లోకము కాకపోయినను సంస్కృతపదబహుళమై, గీర్వాణశ్లోకతుల్యమై తిక్కనార్యునకు గల దేవభాషా

---

17. ఆంధ్రవాఙ్మయచరిత్ర, పు. 66

గౌరవము నీక్రిందిరీతిని వేనోళ్లచాటుచున్నది'.[18] అని వ్రాసి మరికొన్ని యుదాహరణములను చూపియున్నారు. ఈరీతిగా ఈతడు కృత్యారంభమును చేసినవాడై 'విష్ణురూపాయ నమశ్శివాయ అని పల్కెడు భక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వమును' ‹విరా.1-1› ఇష్టసిద్ధికై గొల్చెద ననినాడు. ఇట్లు సకల బ్రహ్మ ప్రార్థనము చేసినావాడై తత్ప్రసాదాసాదితవైన కవిత్వతత్త్వముచే నిరతిశయానుభావానంద భరితాంతఃకరణుడైనాడు తిక్కన. ఈ కృత్యాది సందర్భమును గూర్చి 'హరి వేరని హరుడు వేరని కలహింప నక్కరలేదు. కావున భక్తిగల్గి 'వైదికధ్యానము' చేయుడనగా వేదములో నిర్ణయింపబడిన పద్ధతిలో స్వామిని భజింపుడు, అట్లు చేసినయెడల నాభక్తునకు, వైకుంఠమే గాక, కైలాసమే గాక ఆపదమునకు మించిన పరతత్త్వమే ప్రాప్తించునని సూచించెను" [19] అని దేశిరాజు వారు చెప్పియున్నారు.

ఈ ప్రార్థన తరువాత-

'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం

పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు గృ

ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠంబూని కావించె ధ

ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్'‹ విరా.1-3›

అనియు,

'వేదములకు, నఖిల స్మృతివారములకు బహుపురాణవర్గంబులకున్ వాదైనచోటులను దా, మూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్' ‹ విరా.1-4› అనియుఁ చెప్పికొనినాడు. భారత రచన యందు తిక్కనకు భవ్యకవితావేశమును కల్పించినది ఈ ధర్మాద్వైత తత్త్వనిరూపణమే. ఈ భారతము ఆదరణీయ సార వివిధార్థ గతి స్ఫురణము గల్గి అష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యున్నదని, అందాది దొడంగి మూడుకృతులు ఆంధ్రకవిత్వ విశారదుడు, విద్యాదయితుడు, అగు నన్నయ దక్షతతో నొనర్చెననియు చెప్పినాడు‹ విదా. 1-6› తన భారతభాగమును

18. తిక్కనార్యుని సంస్కృతాభిమానము-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటి 27, సంచిక1

19. కవిత్రయ కవితారీతులు-తరువాతి కవులపై వారి ప్రభావము, పు.29

గూర్చి 'హృదయాహ్లాది....' (విరా.1-7) అని చెప్పికొనినట్టివాడై, భారతామృతమును కర్ణపుటముల నార(గోలి, ఆంధ్రావళి మోదమును పొందునట్లుగ, సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతో, మహాకవిత్వదీక్ష నొంది, పద్యములను, గద్యములను రచియించెద ననినాడు. తనకు వైదికమార్గము నందుగల యభిమానమును గూర్చి తనకు ప్రత్యక్షమైన యిష్టదేవత చెప్పినట్లుగ -

'వైదికమార్గ నిష్ఠమగు వర్తనముందగ నిర్వహించుచు
న్భేదములేని భక్తి నతి నిర్మలవృత్తిఁగఁ జేయుచుండు మ
త్పాద నిరర్మరణ తత్పరభావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్'
–(విరా. 1-15)

అని యిట్లు తెల్పియున్నాడు. ఇందలి కావ్యరస పదమును గూర్చి కావ్యరస మనగా శృంగారాది రసమనే గాక 'బ్రహ్మానందరసమని' యర్థము స్ఫురించుచున్నది. 'రసోవైసః' అని ఉపనిషద్వాక్యం. బ్రహ్మము రసమేయని యర్థము. ఇంతియేగాదు, 'కవి'అనగా 'బ్రహ్మ' యని కూడా యర్థము. అందుచే కావ్యరసము బ్రహ్మమున సంబంధించిన యానందము బ్రహ్మానందము అని భావము'[20] అని దేశిరాజు భారతీదేవి గారు విమర్శచేసి యున్నారు. జనులకు ఆరాధ్యమయిన పంచమవేదమును భక్తితో తెనుగున రచింప ప్రయత్నించుట మోక్షమును గోరుటయే యని 'భవ్య పురుషార్థతరు పక్వఫలము గాదె' (1-19) ఆతని కలలో చెప్పినాడట. కల యందు గోచరించిన ఈ హరిహరనాథుని భక్తితో కొలిచినవాడై 'ఇంక జన్మాంతరదుఃఖముల్ తొలగునట్లుగ చేసి సుఖాత్ముఁజేయవే' (విరా. 1-21) అని ప్రార్థించినాడు తిక్కన. అట్లు తిక్కన ప్రార్థింపగా ఆ జగన్నాథుడు 'జనన మరణాదులైన సంసార దురితములకు నగపడకుండగ తొలగు తెరువు గను వెలుంగు నీకిచ్చితి నన, సంతోష మెదనిండ నెలవుకొనగా మేలుకాంచినాడట (విరా.1-22,23). ఇది ఈతని స్వప్నవృత్తాంతము. ఈతని స్వప్నవృత్తాంతము మహాభారత రచనముననే కాక, ఆంధ్రవాఙ్మయముననే మిక్కిలి ప్రాముఖ్యమును వహించి యున్నది. తిక్కన తరువాత కాలమున ఎందరో కవులు తిక్కనను అనుకరించిన వారై ఈ రీతిగ తమ తమ గ్రంథారంభములను స్వప్నకథతో ముడిపెట్టినారు. ఈ సందర్భమును గూర్చి శ్రీ నండూరి వారు 'ఆంధ్రవాఙ్మయమున

20. కవిత్రయ కవితారీతులు- తరువాతి కవులపై వారి ప్రభావము, పు.29

నెన్నియో గ్రంథములకు తత్కవుల స్వప్నములే ఆద్యప్రకృతులు. ఏ ముహూర్తమున తిక్కనకా స్వప్నము వచ్చినదో తరువాత యుగయుగాంతరములు స్వప్నకథ సాహిత్యసంప్రదాయమై కవులు కలలుగనుచునే యున్నారు. కలలు కవులను వెంబడించుచునే యున్నవి' [21] అని చెప్పియున్నారు. ఈ స్వప్నవృత్తాంతము వలన తిక్కన యాశయము భవబంధవిమోచన మని తెలియుచున్నది.

భారత విరాటపర్వ కృత్యాదిని గల ఈ పైపద్యముల వలన ఈతడు పదునేను పర్వములను తుదముట్ట రచించుటకు సిద్ధపడినట్లు తెలియుచున్నది. ఈ సందర్భముననే ఈతడు 'అని రచనాకౌతుకమున మన మలరగ నీ ప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుని పేర్కొనువాడనో' : విరా. 1-3: అని ప్రబంధమండలి అను పదమును ప్రయోగించినాడు. దీని ననుసరించి ఈతడు రచింప దలచుకొనినది ప్రబంధమండలి కాని, ఒక్క కృతి మాత్రము కాదని స్పష్టమగు చున్నది. ఈతడు ఇందలి ఏఘట్టమునకా ఘట్టమునే ఒక ప్రబంధముగ చేయదలచినట్లు కనపడుచున్నది. ఈతని భారతము నించుక పరిశీలనాదృష్టితో పరికించిన విరాటపర్వ మొక్కటియె ఒక ప్రత్యేక ప్రబంధ మనిపించును. ఇందలి లక్షణములే అర్వాచీన ప్రబంధకవులకు మార్గదర్శకము లైనవని చెప్పవచ్చును. ఈ ప్రబంధ పదము కర్ణపర్వము తుదిని కూడ ప్రయుక్తమయినది. ఈ భారతభాగము నందలి ప్రతిఘట్టమును తన రచనాకౌశలముచే ప్రబంధముగ వ్రాయదలచినట్లు కనపడుచున్నది. శ్రీ నండూరి వారు ' ఈ భారత రచనా విషయము నెట్టి పూజ్య భావముల, నెట్టి భక్త్యావేశమును, ఎట్టి కవితావేశమును, ఎట్టి జ్ఞానసంపత్తిని, ఎట్టి ధర్మపరత్వమును, ఎట్టి యద్వైతభావ నిరూఢత్వమును, ఎట్టి ముముక్షుత్వమును, ఎట్టి వైదికమార్గ నిష్ఠమగు వర్తనమును, ఎట్టి మాతృభాషాభిమానమును ఈ యవతారికామూలమున వ్యక్తము చేసినాడో పరికింపుడు. ఇట్టి మహాపురుషుడు ఆంధ్రదేశమున మరియొకడు బయలుదేరలేదనుట యతిశయోక్తి కానేరదు'[22] అని చెప్పియున్నారు.

పింగళి వారు 'భారతము నంతయు నొక ప్రబంధమండలిగా, అందలి ఒక్కొక్క పర్వము ఒక్కొక్క ప్రబంధముగా పర్వాంతర్గతము లగు నుపాఖ్యానములు

21. కవిత్రయము, పు.99
22. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు.165-166

అవయవములైన ఖండకావ్యములుగ నూహించి ఏభాగమునకు ప్రాధాన్యము చెడకుండ అవయవముల కన్నింటికి అవయవితో పొత్తు చెడకుండ సర్వాంగసౌష్ఠవమును ఆద్యంతసుందరమును, రమణీయ భయానకమును అయిన భారతసారస్వతమూర్తిని శ్రీకృష్ణుని విశ్వరూపము వలె తీర్చిదిద్దెను' అనిరి [23] ఇదే అభిప్రాయమును పలువురు వెలువరించి యున్నారు.

కేతవరపు వారు ఈ విషయమై కొంత విమర్శచేసి యున్నారు. వీరి విమర్శనము ఇట్లున్నది- శ్రీ లక్ష్మీకాంతం గారు చెప్పిన ప్రబంధలక్షణములు భారతము నందలి ఏపర్వమునకును అన్వయింపవు. భారతమున నొక్కొక్క పర్వమున కొక్కొక్క నాయకుడు ప్రత్యేకముగా లేకపోవుటయే గాక ప్రతి పర్వమున అష్టాదశవర్ణనలును లేవు. శృంగారరస ప్రధానముగ ప్రతిపర్వము లేదు. అలంకారిక శైలిలేదు. ఏ లక్షణమును సరిపోవకపోవుటచే ప్రతిపర్వమును నేడు మనమనుకొను ప్రబంధ మెట్లుకాగలదో బుద్ధి కందుట లేదు. భారతము కథ కంతటికి నాయకుడు ధర్మజుడు. రసము శాంతము. అయినచో ప్రబంధము కాని ప్రబంధమండలి కాని ఎట్లగును? ఏకనాయకాశ్రయత్వము ఏపర్వమునకు పట్టదు. మరియు విరాట పర్వమున కీచకవధకు నాయకుడు భీముడన్న ఉత్తరగోగ్రహణమునకు నాయకుడు అర్జునుడగును. ఉత్తర వివాహఘట్టమున మరల నాయకుడు మారును. ఉద్యోగపర్వమునకు నాయకుడెవడు? ఒక కథతో నున్న ఒక గ్రంథమునకు నాయకుడు ఒక డుండును కాని పలువురు ఉండరు. ఏపర్వమున కాపర్వమున, ఏ యాశ్వాసమున కాయాశ్వాసమున నాయకనిర్ణయము, రసనిర్ణయము వేనికవి ప్రత్యేకముగ చేయబడుట భారతీయాలంకారిక సంప్రదాయమునకు విరుద్ధముగా కన్పించుచున్నది. ప్రబంధమును ఒక కావ్యప్రక్రియగా మన మనుకొనుచుంటిమి కాని తిక్కనగా రనుకొనలేదు. పెద్దనాదులే అనుకొనలేదు. మరి తిక్కనగారు వాడిన ప్రబంధమండలి- పుణ్యప్రబంధములు అనువానికి అర్థమేమి చెప్పవలయునని ప్రశ్న-ఈ ప్రశ్నమునకు సమాధాన మిట్లూహింపబడుచున్నది. వైష్ణవసంప్రదాయమున ప్రబంధశబ్ద మున్నది మరియు కొన్ని ప్రబంధములతోడి ప్రబంధ మున్నది. ఇవన్నియు తమిళ గ్రంథములు. ముఖ్యముగ శఠకోప ఆళ్వారు చెప్పిన 'తిరునిరుత్తము, తిరువాశిరియము,

23. గౌతమ వ్యాసాలు-ఆంధ్రవాఙ్మయ స్థూలరూపము, పు.15

పెరియతిరువన్దాది, తిరువాయిమొళి' అను నాలుగును ప్రబంధములు. అన్నియును కలిసి దివ్యప్రబంధము. దివ్యశబ్దము తిరుశబ్దము వంటిది. ఆనాలుగు ప్రబంధములును ఋగ్యజూరధర్వసామవేదముల సారముగా వైష్ణవసంప్రదాయము చెప్పును.[24] ఆ ప్రబంధము లన్నియు భక్తి భావ శబలితములు. తిక్కనగారి కంటె బహుకాలము పూర్వము నుండి ఈ వైష్ణవ సంప్రదాయము దేశమున ఉన్నది. ప్రబంధపఠనము ఒక ఆరాధన విశేషము. తిక్కన కంటె ముందు రామానుజుల వలన వైష్ణవము ప్రబలియున్నది. ఈ వైష్ణవ ప్రబంధములను దృష్టియందుంచుకొనియే తిక్కన ఆ శబ్దమును వాడి యుండును. అయిన నీభారతమునకు ఆ ప్రబంధములకు ఏమి సామ్యమను ప్రశ్న-దానికి సమాధాన మిది. ఆ ప్రబంధములు వేదతుల్యములు. మరియు వేదసారభూతములు. భారతము పంచమవేదము. మరియు వేదములకు, నఖిల స్మృతివాదములకు...మూదల. చతుర్వేదసారభూతములు ప్రబంధములు కాగా, తదర్థోపబృంహితమే భారతము. ఆ ప్రబంధములు భక్తి రూపమున జ్ఞానమును ప్రబోధింపగా నిది కర్మజ్ఞానరూపమున వేదార్థము నంతయు బోధించినది. అంతియగాక వేదపరమార్థమును సాధించినది. కావున ఇది ప్రబంధమండలి కావచ్చును. ద్రావిడ ప్రబంధములన్నింటి యర్థములతోడను ఈ భారతముండుట వలన ప్రబంధమండలి కావచ్చును. పుణ్యప్రబంధము అనుట దివ్యప్రబంధములకు దగ్గరగా నున్నది.

ఇది ఏమి సాగసుగా నున్నదని కొందరు ప్రశ్నింపవచ్చు. ఆయన హృదయము ఇది కావచ్చునని కొన్ని ఉపపత్తుల వలన చూపబడినది. ఇది ఊహ మాత్రమే ఆయన ఏమనుకొనినది మనకు తెలియదు. శైవ వైష్ణవముల కొక సమరసభావమును కలిగించు యత్నములో నొకభాగమై యుండును / ఈ ప్రబంధమండలి అనుట/. శైవులకును వైష్ణవులకును యిరువురికి దీనిపట్ల ఆరాధనభావము కలుగుట ఈతని యాశయమై యుండును.[25]

వీరి యభిప్రాయము సయుక్తికముగనే కనిపించుచు, వీరి నిశిత విమర్శన పాటవమును వెల్లడి చేయుచున్నది. స్థూలదృష్టితో చూచిన ఈ ప్రబంధమండలి ప్రయోగవిషయమున ఇంతటి విమర్శనము అనవసరమేమో అనిపించును. కాని తిక్కన గారి యాధ్యాత్మిక దృష్టికి ఇది సూచకము గాదగియున్నది.

24. Life and teaching of Ramanuja, p.9

25. తిక్కన కావ్యశిల్పము, పుటలు 192-202

శ్రీ కోరాడ వారి అభిప్రాయములు వీరి అభిప్రాయములకు పూర్తిగా భిన్నములు. శ్రీ కోరాడ వారు తిక్కన కవితయే ఆంధ్రప్రబంధమునకు మూలము, పుట్టుక స్థానము అని చెప్పదగియున్నదని సోపపత్తికముగ నిరూపించిరి. వీరు 'భారతకథ అను మేలిమిబంగారమున తన సహజ కవితాచాతుర్యముచే నసమాన తేజోవిరాజమానంబులగు ప్రబంధమణులను పొదిగి యాంధ్రవాణి కమూల్యాలంకారములను చేసినవాడు తిక్కన. పైబంగారము మీద వికృతపు నగిషీలను విపరీతముగా చేసి చూపుటచే నందు పొందు పరుపబడిన ప్రబంధమణుల సహజవిలాసమును కాంతిని తగ్గించిన వారు తరువాతి ప్రబంధకవులు'[26] అని చెప్పియున్నారు. తిక్కన ఆంధ్రదేశీయతా గుణము ఆంధ్రజాతీయమును అచ్చుపడునట్లొనర్చి, అసమానమయిన తన కళాప్రతిభలనువెలయించి స్వతంత్రమగు ఆంధ్రకవితాబీజములను వెదజల్లి ఆంధ్ర ప్రబంధశాఖకు మార్గదర్శకుడయ్యెననియు, ప్రబంధలక్షణములలో నుత్తమ లక్షణములు ఈతని కవిత యందే కానవచ్చుటచేత ఈతని కవితయే ప్రబంధమునకు మూలమనియు వీరు అభిప్రాయపడిరి.

పై విమర్శనముల నట్లుంచి ఆచార్య కె.వి.ఆర్. నరసింహంగారి సిద్ధాంత వ్యాసమున చెప్పబడిన అంశములను పరిశీలించి ఒక నిర్ణయమునకు వత్తము. వీరు ప్రాచీనాలంకారికులు చెప్పిన కావ్యభేదములలో నెచ్చట ప్రబంధశబ్దము కానరాదని, ధ్వన్యాలోకకారుడు చెప్పిన నిర్వచనములో మాత్రము ప్రబంధశబ్దము కలదని, ఈతడు పేర్కొనిన విధానము ననుసరించి ఈ ప్రబంధశబ్దము సర్వసామాన్య వాచియా అను సందేహము కలుగుచున్నదని చెప్పుటయే గాక విశ్వనాథుడు కావ్యప్రబంధశబ్దములను సమానార్థకములుగ వాడియుండెనని, ఈతడే యితిహాసమగు భారతమును ప్రబంధముగా వ్యవహరించె నని, ఇట్లు దృశ్యశ్రవ్యములను ప్రబంధము లనుటయే గాక కొందరాలంకారికులు తమ యలంకార గ్రంథములను కూడ ప్రబంధము లనియే వ్యవహరించిరని చెప్పిరి. 'రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో ప్రబంధశబ్దమును పలుమారులు వాడియున్నాడు. ఈ ప్రబంధశబ్దమును తిక్కన, కేతన, ఎఱ్ఱన, మంచన, శ్రీనాథుడు, పినవీరన, మొదలగు వారందరును వాడిరి. వీరిట్లు ప్రయోగించుట ననుసరించి శతకములు మొదలగు అనిబద్ధకావ్యములు తప్పతక్కిన గ్రంథములన్నియు ప్రబంధములే యనవచ్చును. ఆంధ్ర గ్రంథములే

26. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 378

యననేల, సంస్కృతాంధ్రము లందు రచింపబడిన శ్రవ్యదృశ్య కావ్యములను, అలంకార గ్రంథములను ప్రబంధములే యనుటలో విప్రతిపత్తిలేదు. ప్రబంధపదము భారతాది గ్రంథ వాచకమయ్యును ఇటీవల ఒక ప్రత్యేక కావ్య భేదముగ ఆంధ్రులచే పరిగణింప బడుచున్నది. కథాకథనమున దృష్టిని నిల్పి వ్రాసిన వ్రాతను పురాణధోరణి అని, కవితాశిల్పము నందు దృష్టిని నిల్పి వ్రాసిన వ్రాతను ప్రబంధధోరణి యని స్థూలముగ వ్యపదేశింప వచ్చును'[27] అనిరి.

తిక్కన కవితా శిల్పమును దృష్టినం దిడుకొని రచన చేసినవాడే కావున వీరి అభిప్రాయానుసారము ఆతని గ్రంథము ప్రబంధము అగుటలోను, అతడు ప్రబంధకవి అగుటలోను ఎట్టి విప్రతిపత్తియు ఉండబోదు. ఆచార్య నరసింహంగారు ప్రబంధనామమున వెలువడిన గ్రంథముల నన్నిటిని అమూలాగ్రముగ పరిశీలించి ప్రబంధలక్షణములను పేర్కొనిరి. ప్రబంధమునకు ప్రధానముగ కావలసినవి వస్త్వైక్యము, ఏకనాయకాశ్రయము, అష్టాదశవర్ణనలు, శృంగారరసము, అలంకారికశైలి, మొదలైనవి. ఈ లక్షణము లన్నియు యథాతథముగ భారతమునకు సరిపోకపోవచ్చును. కాని ప్రబంధచ్ఛాయలు మాత్రము అనేకము భారతమున గోచరించును. ఉదాహరణమునకు కీచకవధ ఘట్టము ఇంచుమించుగ అన్ని ప్రబంధలక్షణములను కలిగి ప్రబంధమనిపించుకొన్నది. మనః ప్రవృత్తి వివరణ కౌశలము ప్రబంధకవులకు ఒక ముఖ్యలక్షణము. పాత్రల బహిరాకార చేష్టలతోపాటు వారి హృదయగతము లగు అభిప్రాయములను కూడ వ్యక్తము చేయుటనే మనఃప్రవృత్తి వివరణకౌశలమందురు. ఇది మన తిక్కనామాత్యునకు వలసినంతగా కలదు. ఈ లక్షణము ఈతని భారతభాగమున పలుతావుల కాననగును. ఇక పురాణములకు ప్రబంధములకు గల ముఖ్య భేదములలో వర్ణనావిషయము ఒకటి. ఇవి కథాగతిని పెంచునవిగా నుండవలెను కాని దానిని బాధించునవిగా నుండరాదు. దృశ్యము కన్నులకు కట్టునట్లు చేయుటకును, కథను పేలవముగా కుండనూత్న చైతన్యమును కల్గించుటకు నివి యావశ్యకములై యున్నవి. మరియు నీ వర్ణన విషయమున ఏ అంగమున కాఅంగమును వర్ణించుటకంటె, కవి ప్రధానముగ చెప్పదలచిన దానిని, దాని ఆకారము నంతటిని మన స్మృతిపథమున నిలుపుట మేలు. తిక్కన ఈ విషయమునను సిద్ధహస్తుడై ప్రబంధకవితాధోరణికి మార్గదర్శకుడయినాడు. అర్వాచీన కాలమున వెలువడిన ప్రబంధము లాధారముగ

27. ఆంధ్రప్రబంధము-అవతరణ వికాసములు

చేసికొని వానిని లక్ష్యములుగా గ్రహించి నిర్ణయించిన ప్రబంధలక్షణములను దృష్టిలో నిడికొని ప్రతిలక్షణము దీనికి సరిపోయినదా! లేదా! అని విమర్శించుట భారతముపట్ల అంతగా తగదు. అయినను తిక్కన ప్రబంధమండలి అను పదము నేయుద్దేశ్యముతో వాడినాడో చెప్పుట కొంత కష్టము. కావ్యప్రబంధములు సమానములు అని ప్రాచీనాలంకారికుల లక్షణము ననుసరించిన ఈతడు అదే అభిప్రాయముతో, అనగా కావ్యమను దృష్టితోడనే ఆ పదమును వాడినట్లు ఊహింపవచ్చును. లేదా ప్రబంధచ్ఛాయలు కొన్ని గోచరము లగుటచేతను, భారతమున కంతటికిని ఈ లక్షణములు వర్తింపకున్నను కొన్ని ఘట్టములకైన ఈ లక్షణములు సరిపోవుటచేతను ఇది ప్రబంధమండలి కావచ్చును. చివరకు దీని సారాంశమేమన ఈ ప్రబంధమండలి పదమును తిక్కన ఏయుద్దేశ్యముతో వాడెనో సరిగా చెప్ప లేము కాని ప్రబంధచ్ఛాయ లనేకము లిందు గోచరించుటచే ప్రబంధకవితాశాఖకు మార్గ దర్శకుడు తిక్కన అని మాత్రము నిరాఘాటముగ చెప్పవచ్చును. ఇక ఈ విషయముపై విజ్ఞులు యథాశక్తి వారి వారి బుద్ధ్యనుసారము ఊహింతురు గాక!

తిక్కనార్యుని భారతభాగము నందలి పదునేను పర్వములు వరుసగా విరాటోద్యోగ భీష్మద్రోణ కర్ణ శల్య సౌప్తిక స్త్రీశాంతి అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణములు. విరాటపర్వమును మూలముతో పోల్చిన నిది విస్తృతిని కలిగియున్నదని, మూలమున నాలుగు పర్వములు కలదానిని 1600 పైగా వృత్తములు సీసములతో కూడిన దానినిగా తెలుగు చేసినాడు తిక్కన అని అందురు. కోరాడవారు 'ఈతడు మూలము నందలి కథ నంతగా మార్చకపోయినను ఆయా విషయములనే సందర్భానుసారముగ వలసినట్లు వర్గీకరించుకొని ప్రదర్శించుటలో తన కవితాచాతుర్యమును, కళాశక్తిని వ్యక్తపరచు చుండును'[28] అని చెప్పిరి. ఆచార్య యస్వీ జోగారావు గారు విరాటపర్వమున కొక విశిష్టత కలదనియు, దాని కనుగుణమగు శైలిలో రచించి అత్యంత ఆకర్షణీయముగ నొనర్చి, కరుణ, శృంగార, వీరరస సమ్మిళితమైనరీతిని రచించి అత్యంత శ్లాఘనీయు డయ్యెనని చెప్పుచు 'కీచకోదంతమున ఏకత్రైవనిష్ఠమై, అభాసమైన శృంగారము ఉత్తరాభిమన్యుల వివాహప్రబంధమున ఫలశ్రుతి పలికించు కొన్నది. సిద్ధముగానున్న రస సందర్భములకు శిల్ప ప్రసిద్ధమైన పరిష్కారము లేర్పడిన పట్టులివి. దక్షిణగోగ్రహణ యుద్ధానంతరము

---

28. ఆంధ్రమహాభారతోపన్యాసములు – విరాటపర్వము, పు.133

పాలికలను వర్ణనమున మూర్తిమంతమైన బీభత్సము, ఉపకీచక శ్రాద్ధానంతరము వీట ప్రవేశించిన ద్రౌపదిని చూచి పౌరులు పొందిన భయాందోళన స్పందనమున పొటమరించిన హాస్యము తిక్కన యుత్పాదించిన రస సందర్భములు. భీముని భీషణ ప్రతిజ్ఞలు సముద్యమ సంరంభములు. నిపుణ నిర్వహణములు. క్రోధము పరాకోటిముట్టిన రసపట్టులు. శిల్పసముద్రుడు తిక్కన చేసిన రుద్రాభిషేకములు. ఉత్తర గోగ్రహణ యుద్ధరంగములో ఫల్గుణ పాత్రప్రవేశ సన్నివేశమే వీరరస విస్ఫారితము. ఇట్లెక్కడ పట్టి చూచినను తిక్కన రచనలో మూలాతిశాయియైన రాసలీలా రామణీయకము గోచరించును. రసజ్ఞతను సన్నిహితబంధువు సౌందర్యాభిజ్ఞత'[29] అని చెప్పిరి. ఈ విరాటపర్వమును ప్రబంధముగా చేయుటకు అనువగు రీతిని కథావస్తువునం దొక విధమగు నైక్యసంపాదనము, పాత్రోన్మీలనచాతుర్యము, రసోద్బోధకత్వము, వర్ణనాచాతుర్యము, మనఃప్రవృత్తివివరణ నైపుణ్యము, భావావిష్కరణశక్తి రూపకల్పనా చాతుర్యము, శబ్దయోగనైపుణ్యము ఇత్యాది లక్షణములు తిక్కనార్యునిచే కడుచక్కనగు రీతిని ఆవిష్కరింప బడినవి. ఇట్టి గుణగుణగరిష్ఠ మగుటచే నీ విరాట పర్వము భారతపర్వములలో కెల్ల ప్రశస్తిని గాంచినది. అష్టాదశపర్వ భారతమును చదువుటకు ప్రారంభించునపుడు ఆదిపర్వముతో గాని, తదితర పర్వములతో గాని ప్రారంభింపక విరాటపర్వముతో నారంభింతురు. ఇది ఉత్తరాభిమన్యుల వివాహఘట్టముతో ముగియుటచే శుభప్రదమగు పర్వమని పెద్దల తలంపు. మరియు ఈ పర్వము లౌకికేతివృత్తముతో నుండి, రసవత్తరమగు రచన మగుటచే ప్రతియొక్కరును, ఈ పర్వమును ఒక కావ్యముగ భావించి చదివి ఆనందించుచుందురు. ఇట్టి ప్రాశస్త్యము గల ఈ విరాటపర్వము ఐదాశ్వాసముల పర్వము.

ఉద్యోగపర్వము నాల్గాశ్వాసముల పర్వము. ఇందు రాయబార ఘట్టములు ప్రధానములు. ఈ పర్వ విషయమున అనువాదము సరిగాలేదని అసమగ్రమని కొందరి భావన. 'మూలము నందలి సనత్సుజాతీయము ఇంచుమించుగ లుప్తమైనదని కొందరు తిక్కనను మహాపరాధిగా పరిగణించుచున్నారు. కాని కావ్యదృష్టితో చూచినపుడు ఈ శాస్త్రగ్రంథము ఇక్కడ లేకుండుట వలన రసము, వస్తువు రెండును నిక్షిప్తములు కాలేదు. శాస్త్రభాగము నంతను శాంతి, అనుశాసనిక అశ్వమేధ పర్వములలో

---

29. మహాకవిమార్గము - విరాటపర్వవిమర్శ, పుటలు 129 - 130

విశదీకరింప వచ్చుననికావ్యరన తత్త్వవేత్తయగు తిక్కన నిర్ణయించుకొని యుండవచ్చును. శాస్త్రభాగము చాల పునరుక్తి అగుటచే తిక్కన దీనిని పూర్ణముగ జీర్ణము చేసికొని : సనత్సుజాతీయము, భగవద్గీత, ఉత్తరగీత: వానిని ప్రత్యేకముగ కేటాయించి సమర సంరంభము ముగిసిన వెనుక శాంతియుతముగ కూర్చున్నప్పుడు ధర్మజాదుల ప్రసంగములలో క్రోడీకరించినాడు. ఇట్లగుటచే విషయ విభాగమునందును, రసస్ఫూర్తి యందును ఆంధ్రమహాభారత మున్నత సోపానము అధిరోహించుచు మూలమును మించుచున్నది[30] అని నండూరి బంగారయ్య గారు విమర్శ చేసియున్నారు. ఈ పర్వము రాజకీయ విషయ ప్రధానమై తిక్కనామాత్యుని రాజనీతిజ్ఞతకు తగియున్నది. ఈ పర్వమునకు విశిష్టతను చేకూర్చిన ఘట్టములలో విదురనీతి ఘట్టము ఒకటి. లోకమున నీతిప్రసంగ మెచ్చట వచ్చినను ఈ విదురనీతి నొక్కపరి స్మరించుట కాననగును. అలతి అలతి తునియల కాహల సంధించిన రీతిగ నీ విదురనీతి పద్యములు ఉండుటచేత తెలుగుదన మంతయు ఇందు కరడుగట్టిన దనవచ్చును. ఇవి తెలుగుదేశమున బహుళప్రచారము నంది జనరంజకములైనవి. దీని వెనువెంటనే వచ్చు సనత్సుజాతీయమును 'సనత్సుజాతీయుండాధ్యాత్మ విషయములగు వివిధ వాక్యంబుల సోపాన ప్రకారంబున....' :ఉద్యో.2-106: అని ఒక్క వాక్యములో సంగ్రహించెను. ఈ పర్వమున తిక్కనార్యుని అల్పాక్షరముల అసల్పార్థ రచనమునకు ఉదాహరణ ప్రాయముగ నిలుచు జనరంజక మగు మరియొక ఘట్టము కృష్ణరాయభారఘట్టము. 'పురోహిత సంజయ కృష్ణరాయబారములను రచించుటలో తిక్కన చూపిన వైవిధ్య మతని లోకజ్ఞానమునకును, రాజ్యాంగ పరిజ్ఞానమునకును సాక్ష్యమగుచున్నది. కృష్ణరాయబార ఘట్టమున శ్రీకృష్ణుని జీవితతత్త్వము కూడ సూక్ష్మముగ వెల్లడియైనది. ఇంతియే గాక ధృతరాష్ట్ర దుర్యోధనాదులయు, కుంతీ కర్ణాదులయు, మానసిక ప్రకృతులను, స్వభావములను ప్రదర్శించు సన్నివేశములకు తిక్కన రచన చైతన్య మాపాదించినది. మనుమసిద్ధికి మంత్రియై రాజ్యాంగములను స్వయముగా నిర్వహించియుండిన కారణమున తిక్కనకు రాయబారముల గూర్చిన స్వానుభవ ముండుట కవకాశము గల్గినది[31] అని భూపతి వారు చెప్పిరి.

---

30. ఆంధ్రమహాభారతోపన్యాసములు - ఉద్యోగపర్వ విమర్శ, పుటలు 148-149
31. భారతము - తిక్కన రచన, పు.67

భీష్మపర్వము మొదలుకొని సౌప్తికాంతము వరకును వర్ణనీయవస్తువు యుద్ధమగుటచే నీ పర్వపంచకమునకు యుద్ధపంచక మని వ్యవహారము. భారతయుద్ధమునందలి వ్యూహనిర్మాణము అత్యద్భుతము, అతిప్రధానము. ఇందలి వర్ణన మూలమున తిక్కనార్యునికి యుద్ధరంగమునెడ గల ప్రీతి స్పష్టమగు చున్నది. ఈ వ్యూహవర్ణనము మాత్రము సంస్కృత భారతమున కంటె తెనుగుననే చిత్రవిన్యాసములతో వర్ణింపబడిన దని పలువురి అభిప్రాయము. అత్యంత మనోహరములును, ప్రకృతి సిద్ధములను హృదయంగమములు నగు ఉపమానములను సందర్భోచితముగ ప్రయోగించి ఎంతటి జుగుప్సావహమగు దృశ్యమునకైనను మనోహరత్వమాపాదించుట తిక్కనార్యుని రచనలో గల ఒక విశేషము. మానవ జీవితమున సంభవించు వివిధములగు సంఘటనల వలన అతని హృదయమున పరివర్తనము కలుగుచుండును. ఆ కారణమున అతని ప్రవర్తన యందు వ్యక్తమగు నైజశీలస్వభావములను ఈ ఘట్టము అందు రసవత్తరముగ పోషించినాడు తిక్కన. భిన్న భిన్న సన్నివేశము అందు పాత్రల మానసిక స్వభావాదుల కత్యధికముగ ప్రాధాన్యమిచ్చి ఈ యుద్ధ వర్ణనమును మానవ జీవితమునకు సన్నిహిత మగునట్లు గావించి యుండెను. రూపకకర్త వలె తాను తెరవెనుక నుండి ఈ ఘట్టములను నాటకము నందలి రంగముల వలె నిర్మించినాడు.

భీష్ముడు సైన్యాధిపత్యమున పదిదినములు, ద్రోణుని సైన్యాధిపత్యమున ఐదుదినములు, కర్ణుని సైన్యాధిపత్యమున రెండుదినములు, శల్యసైన్యాధిపత్యమున ఒకదినము – మొత్తము పదునెనిమిది దినములు ఈ భారతయుద్ధము జరిగినది. వీర రౌద్ర కరుణ అద్భుత బీభత్స భయానకముల కాటపట్టగు ఈ యుద్ధమును అత్యంతమనోహరముగ వర్ణించి తనకు గల ప్రత్యక్షానుభవమును కూడ నిరూపించుకొనినాడు తిక్కన. సౌప్తికపర్వమున ప్రత్యక్షముగ కురుక్షేత్రమున యుద్ధము జరుగకపోయినను పాండవశిబిరమున అందరు సుప్తులైన సమయమున అశ్వత్థామ అందు ప్రవేశించి ఉపపాండవాదులను సంహరించుటచే ఈపర్వము యుద్ధపర్వములకు అనుబంధప్రాయమై యుద్ధపంచకములో నొకదానిగ చేరినది. ఈపర్వమునకు నాయకపాత్రధారిగ అశ్వత్థామను పేర్కొనవచ్చును. ఇది యుద్ధపంచకములలో నొక్కటైనను, వీరము కంటె నిందు బీభత్సమే ఎక్కువ చోటుచేసికొన్నదని, బీభత్సరసమున కుద్దీపన విభావముగ ప్రయుక్తమైన రాత్రి వర్ణనముతో నారంభమైన

దని చెప్పవచ్చును. ఈ పర్వమును గూర్చి నండూరి వారి అభిప్రాయ మిట్లున్నది. 'సౌప్తికపర్వమున మానవ మానస మధనము పరాకాష్ఠ చెందినది. మానవ స్వభావము ఎంతటి నైచ్యమునకు పాల్పడునో మహాభారతము లోతులు తడిపి చూపినది' [32]

స్త్రీ పర్వము నిజముగ గాంధారిది. నాయికానాయకులుగ పేర్కొనదగినవారు గాంధారీధృతరాష్ట్రులు అనియు, మానవ మానసిక ప్రవృత్తి యొక్క విశ్వరూపము సాక్షాత్కరించుననియు, ఇది హృదయ విదారకము లగు, శోక భూయిష్ఠములైన వర్ణనలతో కూడియున్నదనియు, ఈ పర్వమును గూర్చి పలువురు తమ తమ అభిప్రాయములను వెలువరించి యున్నారు. ఈ పర్వమునకు గల మరియొక విశిష్టత - ఇందలి ఛందోవైవిధ్యము. ఆశ్వాసాంత పద్యము అందు మందాక్రాంతము వాడబడినది. కురుక్షేత్రమున మడిసిన వీరుల మరణములలో అనంత వైవిధ్యము కలదు. ఆ మరణములకు సంబంధించిన దుఃఖము నందును అనంతమయిన వైవిధ్యము కలదు. 'సర్వప్రపంచ వైవిధ్యము నేకత్ర నాహరించు దృశ్యము ఃఘట్టముః మహాభారతమున మరియొకటి లేదు. ఇట్టి వైవిధ్యభావము నంతను స్ఫురింపచేయుటకు మహాకావ్యశిల్పియైన తిక్కన గమనములో, స్వరూపములో, స్థితిలో, స్వభావములో, వైవిధ్యము గల వృత్తములను పద్యములను స్త్రీపర్వమునం దుపయోగించినాడు. చిత్రకారుడు విభిన్నము లయిన యనేక వర్ణముల సమ్మేళనముతో సంగీతవేత్త విభిన్నరాగముల సంయోజనముతో విశిష్టభావము చూచువారికి, వినువారికి గల్గించునట్లు తిక్కన విభిన్నవృత్తముల సమ్మేళనముతో వివిధగమనముల సంయోజనముతోనీ మహావైవిధ్యమును సహృదయులకు స్ఫురింపచేసినాడు' [33] అని డా॥రంగారావు గారి అభిప్రాయము.

శాంతి, అనుశాసనిక, అశ్వమేధపర్వములు మూడును శాంతిత్రయ మని పిలువబడును. చివరి ఆశ్రమవాసాది నాలుగుపర్వములకు ఆశ్రమవాస చతుష్టయ మని వ్యవహారము. లేదా ఈఏడింటిని కలిపి కొందరు శాంతి సప్తక మని వ్యవహరింతురు. ఇవి నీతిశాస్త్ర సంబంధియు, ధర్మశాస్త్రసంబంధియు వేదాంతగతాధ్యాత్మిక సంబంధియు నగు పర్వములు. ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు, పుణ్యాపాపములకు నడుమ

32. తిక్కన - భారతదర్శనము, పు. 291

33. Conception & Practice of poetry of Kavitrayam & Nachana Somana

కలుగు సంఘర్షణములకు చక్కని పరిష్కారము భారతము నందుకలదు. ఏది ధర్మమో, ఏదధర్మమో, ఏది పాపమో, ఏది పుణ్యమో యిదమిత్థమని నిర్ణయించుటకు వీలులేని పరిస్థితులు నిత్యము మానవజీవితమున ఏర్పడుచుండును. అట్టి సమయమున ఎట్లు నడుచుకొనవలసి యున్నదో, భారతము నందు సూత్రప్రాయముగనే గాక సూటిగను చెప్పబడియున్నది. శాంతిపర్వము నందలి ఏ యుపాఖ్యాన మయినను, ఏ సంవాద మయినను ధర్మమునే ప్రబోధించును. ఇందు దండనీతికి గల ప్రాధాన్యము పేర్కొనబడినది. అర్థవాద రూపకపద్య కథానికము లనేకములతో నొప్పియున్న ఈపర్వము పలువిధములగు ధర్మములను ప్రబోధించుచు ధర్మశాస్త్రముగ భారతమును నిరూపించుచున్నది. కేవల అర్థవాద రూపకములైన అఖ్యానములే కాక ప్రత్యక్ష ప్రబోధనము కూడ ఈపర్వమున కాననగును. అనుశాసనికపర్వము గౌతమీలుబ్ధక సర్పమృత్యు సంవాదముతో నారంభమగును. ఇందు గరుడోపాఖ్యాన మొకటి ప్రధానముగ చెప్పతగినది. అశ్వమేధ పర్వమునను ఆధ్యాత్మిక ప్రబోధనమే ఎక్కువ చోటుచేసికొన్నది. ఈపర్వమునకు ఉపసంహారప్రాయముగనున్న సక్తుప్రస్థోపాఖ్యానము భారతము నందలి యుపాఖ్యానములలో తలమానికముగ చెప్పబడుచున్నది. వేదాంత గవేషణములో మహాభారతమున గల విశాలదృష్టికి ఈ ఉపాఖ్యానము ఒక ఉజ్జ్వల నిదర్శనమని చెప్పవచ్చును. ఈ యుపాఖ్యానము వలన హింసాత్మకమైన యజ్ఞము కంటె అహింసాత్మకమైన తపోయజ్ఞమే గొప్పదని నిరూపింప బడును.

ఆశ్రమవాస పర్వము ధర్మజుని శీలానుశీలనమునకు ఉపకరించును. మౌసలపర్వము కృష్ణావతార ప్రయోజనమును సువ్యక్తమొనర్చి, భగవంతుని ఈ అవతారమునకు ప్రత్యక్షవ్యాఖ్యానమై యున్నది. 'యాదవవంశేతివృత్తము నాలంబనముగ గొని, యనుల్లంఘ్యము, నప్రతిహతము నగు విధివిలాసము యొక్క మాహాత్మ్యమును, కాలప్రభావమును ప్రత్యక్షమగు విధమున వివరించుచు కృష్ణుని జీవితతత్త్వమునకు వ్యాఖ్య యొనర్చియున్నాడు' [34] అని శ్రీ భూపతి వారిచే చెప్పబడినది. ఇది కరుణరసప్రధానమగు నొక స్వతంత్రకావ్యముగా రచింపబడిన దని చెప్పవచ్చును. ఇది సర్వాంగసుందరమగు రీతిని రసవత్తరముగ, నుత్కృష్టముగ రచింపబడినదని పలువురి అభిప్రాయము. పరీక్షిత్తునకు రాజ్యాభిషేకము చేసి పాండవులు ద్రౌపదీసహితులై తపోవనగతు లగుటయు, భీమాదులు నిర్యాణము

34. భారతము - తిక్కనరచన, పు. 194

నందుటయు - ఇత్యాదులు మహాప్రస్థాన పర్వమునను, ధర్మజుని యలౌకిక శీలవర్తనము, అతని సశరీర స్వర్గప్రాప్తి మున్నగునవి స్వర్గారోహణమునను వర్ణింపబడినవి.

'మహాకవిత్వ దీక్షావిధినంది పదునేను పర్వముల భారతమును తెనుగు బాస జగద్ధితంబుగ వినిర్మింపబూనిన తిక్కన జీవితములో నపరసంధ్యా సమయ మిది. ఐతిహ్యము కూడ తిక్కన పూర్ణపురుషాయుషజీవి అని కన్నులు కనిపింపని వృద్ధాప్యమున గురునాథుని లేఖకునిగ స్వీకరించి భారతము చెప్పెనని కమ్మనికథలు చెప్పుచున్నవి. అప్పటికి తెలుగు భారతము రెండువందల యేండ్ల నుండి మూలబడియున్నది. పండువృద్ధు తిక్కన పదునేను పర్వములను పరిపూర్తి చేయగలడా! మ్రగ్గినపండు ఎప్పుడు రాలిపోవునో! మహాకవిత్వదీక్షావిధి నంది మహాకవి తిక్కన సల్పిన సాహిత్యతపస్సు ఫలించినది. పదునేను పర్వములను జనసంప్రార్థ్యంబులై యుండ తుదముట్టన్ రచియించి యొప్పెను.

'పరమ పదాప్తిహేతువగు భారతసంహిత శౌనకాది భూ

సురవరులింపునం గరగుచొప్పునఁజెప్పినవారు మోదసం

భరితతఁబొంది యక్కథకు నర్చితుఁజేసి రర్మిలిన్'

అని మూడుపాదములను పూర్తిచేసి, తుదిపాదముగ 'హరిహరనాథ సర్వభువనార్చితనం దయజూడు మెప్పుడున్' అని కృతార్థుడైన తిక్కన, హరిహరనాథునకు ధన్యావాదము లర్పించెను'[35] అని నండూరి వారు పేర్కొనిన అంశము లిట స్మరణీయము. ఈ రీతిగ వ్యాసకృతములగు పదునెదు పర్వములకు తిక్కన తన అసమానమగు కావ్యశిల్పప్రతిభానైపుణ్యముచే పదునేను పర్వములను సృష్టికి ప్రతిసృష్టిగ నెరపి కవిబ్రహ్మగ కీర్తిని బడసినాడు.

---

35. తిక్కన - భారతదర్శనము, పుటలు 398, 99

# 3వ ప్రకరణము

## రససిద్ధాంతము

## అ. రసస్వరూప స్వభావములు

### రససాధన సామగ్రి :

ఋగ్వేదాది సంహితలలోను, బ్రాహ్మణములలోను. ఉపనిషత్తులలోను రస ప్రసంగము కలదు. రసపదము ఋద్వేదమున కావ్యరసపరముగా గాక సోమరసము, జలము, క్షీరము, సారము అను అర్థము లందు భిన్న భిన్న మండలములలో కానవచ్చు చున్నది. కాని అధర్వవేదమున 'రుచి' అను నర్థమున సర్వసాధారణముగ కనబడును. ఉపనిషత్తులలో 'ప్రధానసారము' అను నర్థము వచ్చినది. ఛాందోగ్యోపనిషత్తు రుచి, ప్రధానసారము అను రెండర్థములను గలవు. తైత్తిరీయోపనిషత్తున 'రసోవైసః', రసగ్ హ్యేవాఽయం లబ్ధ్వానందీ భవతి' అనియును, మైత్రేయోపనిషత్తున 'తద్వైసత్త్వస్వరూపం; తత్సత్యమేవేరితం రసః ససంప్రాస్రవత్' అనియును కలదు. ఇట రస పదములకు రుచి, ప్రధానసారము అను రెండర్థములును గలవు. జగత్తున ప్రధానసారభూతమైనది, యోగులు రుచ్యమానముగ దలంచునది, సాక్షాత్కార మగుట వలన శాశ్వతానందమును కలిగించునది, పరమాత్మ అని ఆ రసపదమున కర్థము. ఇట్లు రసపదము వేదములలోనే యుండుటచే దాని ప్రాచీన సమీచీనత్వములను గూర్చి వేరుగ చెప్పనవసరములేదు. ఉపనిషన్నిష్పన్నమయిన నిర్వచనాను సారము రసము జగత్ ప్రధాన సారభూతము, మౌని మానస రుచ్యమానము నయినది.

ఆలంకారికు లిట్టి యుభయార్థము గల రసపదమును గ్రహించి కావ్యపరమున వ్యవహరించిరి. భరతుడు దీనిని నాట్యసందర్భమున నెలకొల్పగా, ఆనందవర్ధనాభినవగుప్తులు కావ్యసామాన్యమునకు విస్తరింప జేసిరి. విశ్వనాథుడు దీనిని రసాత్మక వాక్యముగ కావ్యమును పేర్కొనినాడు. నందికేశ్వరుడు రసవాదమున

కాదికర్త యని రాజశేఖరుని అభిప్రాయము. శౌద్ధోదని కావ్యసారము రసమనె నని అలంకారశేఖరవృత్తికారుడగు కేశవమిశ్రుని యభిప్రాయము. 'రసైః శృంగార కారుణ్య హాస్య వీర భయానకైః, రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేత దగాయతాం'[1] అని రామాయణమున కొన్నా రసముల ప్రసక్తి కలదు. రామాయణములో ప్రసక్తియున్నను కావ్యము గనుక దానియందు తల్లక్షణములు కనపడవు. ఉపలబ్ధలక్షణ గ్రంథములలో నాట్యశాస్త్రమే మొట్టమొదటిది గనుక, భరతుడే రససిద్ధాంత స్థాపకుడును, గురువును అనదగినవాడు అని అందరును అంగీకరింతురు.

భరతుడు నాట్యశాస్త్రమున నాట్యసంగ్రహ విషయములో మొదటిదగు రసమును గూర్చి 'నహి రసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే। విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రసవనిష్పత్తిః[2] రసహీనమై ఏయర్థమును ప్రవర్తింపదు, రసము విభావ అనుభావ వ్యభిచారుల సంయోగము వలన నిష్పన్నమగును అని వివరించి యున్నాడు.

కావ్య నాట్య జీవాతువగు ఈ రసము ఎట్టిదను జిజ్ఞాస కలుగుక మానదు. భరతమునియే 'రస ఇతికఃపదార్థః?' అన్ని ప్రశ్నించి 'ఆస్వాద్యత్వాత్' అని సమాధానమును చెప్పియున్నాడు. మరల 'కథ మాస్వాద్యతేరసః? – ఎట్లు ఆస్వాదింపబడును? అని ప్రశ్నించుకొని దానికి సమాధానముగ 'యథాహి నానావ్యంజన సంస్కృత మన్నం భుంజానా రసాన్ ఆస్వాదయంతి సుమనః పురాషాః హర్షాదాంశ్చే అధిగచ్ఛంతి– తథా నానాభావాభినయ వ్యంజితాన్ వాగంగసత్త్వోపేతాన్ స్థాయిభావా నాస్వాదయంతి సుమనసః ప్రేక్షకాః హర్షాదీంశ్చాధిగచ్ఛంతి తస్మాన్నాట్యరసాః'[3] అని చెప్పినాడు. వివిధములైన వ్యంజనములచే సంస్కరింప బడిన అన్నమును భుజించుచు సుమనస్కులు రుచుల నాస్వాదించుచు హర్షాదులను ఎట్లు పొందుచున్నారో, అట్లే, వాచికాంగిక సాత్త్వికాభినయములచే ప్రదర్శితము లగుచున్న వివిధములగు భావములచే వ్యంజితము లయిన స్థాయిభావములను సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదించుచు హర్షాదులను పొందుచున్నారు. నాట్యము వలన రస్యమానము లగుటచే నివి నాట్యరసము లనబడుచున్నవి.

ఈ విషయములను వివరించెడి శ్లోకములు రెండు కలవు.

---

1. రామాయణము–బాలకాండ, ఆ.4, శ్లో.9
2. నాట్యశాస్త్రము, 6వ అధ్యాయము
3. నాట్యశాస్త్రము, 6వ అధ్యాయము

'యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభిర్యుతమ్
ఆస్వాదయంతి భుంజానా భుక్తం భుక్త విదోజనాః
భావాభినయ సంబద్ధాన్ స్థాయిభావాం స్తథాబుధాః
ఆస్వాదయంతి మనసా తస్మాన్నాట్యరసాః స్మృతాః'[4]

ఎన్నియో ద్రవ్యములతో కూడి, ఎన్నియో వ్యంజనములతో కూడిన భోజనమును, భోజన రుచి నెరిగిన జనులు భుజించుచు రసనావ్యాపారముచే నాస్వాదించునట్లే, భావ అభినయములతో సంబద్ధములైన స్థాయిభావములను బుధులు మనోవ్యాపారముచే నాస్వాదించు చున్నారు.

రసనిష్పత్తిని గూర్చి దశరూపకమున

'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావోరసః స్మృతః'[5]

విభావములచేతను, అనుభావములచేతను, సాత్త్వికభావములచేతను, వ్యభిచారి భావములచేతను, స్వాదువుగా చేయబడిన స్థాయిభావమే రస మనబడును. భరతుని రస సూత్రమునకు ఈ శ్లోకము వ్యాఖ్యాప్రాయము.

ప్రతాపరుద్రీయమున –

'విభావానుభావ సాత్త్విక వ్యభిచారీ సామగ్రీ సముల్లసితః స్థాయిభావోరసః'[6]

'విభావానుభావ వ్యభిచారిభి రభివ్యక్తః స్థాయిభావోరసః'[7]

అని హేమచంద్రుని కావ్యానుశాసనము

విశ్వనాథుని సాహిత్యదర్పణమున –

'విభావే నానుభావేన వ్యక్తః సంచారిణాతథా
రసతామేతి రత్యాదిః స్థాయిర్భావః సచేతసామ్'[8]

వామనుడు, రుద్రుటుడు, భోజుడు, మమ్మటుడు, వాగ్భటుడు, మున్నగు నాలంకారికులందరును భరతుని అభిప్రాయముతో తమ తమ ఆలోచనలను జోడించుకొనినారు. విశ్వనాథ, హేమచంద్రులు సాత్త్వికభావములు అనుభావరూపము

---

4. పైది. శ్లో. 32, 33
5. దశరూపకము, శ్లో. 4-1
6. ప్రతాపరుద్రీయము – రసప్రకరణము, పు. 183
7. కావ్యానుశాసనము, 2వ అధికారము
8. సాహిత్యదర్పణము, శ్లో. 3-1

లగుట కారణముగ వానిని ప్రత్యేకముగ పేర్కొనలేదు. 'సాత్త్వికాశ్చానుభావరూపత్వాన్న పృథగుక్తాః' ః ః అని విశ్వనాథుడు, ధనంజయుడు, ధనికుడు, విద్యానాథుడు, మున్నగు కొందరు అర్వాచీనులు సాత్త్వికభావములను కూడ రససామగ్రియందు చేర్చియున్నారు.

మన ఆంధ్ర లాక్షణికుల మతము కూడ భరతుని మతముతో సరిపోవు చున్నది.

'ఉక్త విభావాదులచే భక్త నవస్థాయి రూప భావంబులు సువ్యక్తములై నిజగుణ సంసక్తములై రసములన రసత్వము నొందున్' ః 2-4ః అని కావ్యాలంకార చూడామణి యందు కలదు.

'పులకండంబులుగలిపిన
నలువగు సలిలము రసాయనంబగు పగిదిన్
లలిత విభావాదులచే
నలఘుతరస్థాయి భావ మమరున్ రసమై' ఃత్ర. ఆ., ప.4ః

అని కావ్యాలంకార సంగ్రహము.

రసగంగాధరమున ఈ విషయము మరింత విపులముగ కలదు. 'సుందరమును ఉచితమును అయిన రచనాది సన్నివేశము కలిగిన సుందర కావ్యముచేత బోధితములు అయిన పదార్థాలు సహృదయములో గోచరములగును. అనగా ఆయా పదార్థాకారము లయిన చిత్తవృత్తులు కలుగును అని భావము. ఈ వృత్తులు దుష్యంత రమణ్యాది రూపముగా ఉండును. అప్పుడు సహృదయుని పునఃపున రనుసంధాన విశేషమహిమ వలన ఆయా పదార్థము లందు ఉన్న దుష్యంత రమణీయాత్వాదికము పోవును. అది సామాన్యముగ సహృదయనిష్ఠ రత్యుద్బోధకు అనుకూలమయిన అలౌకిక రూపము ధరించును. అప్పుడు అలౌకికములగు విభావానుభావ వ్యభిచారి శబ్దములచే వ్యవహరింప బడును. అట్టి శకుంతలాదులు,ఆలంబన విభావములు అను పేరుతో కారణములు. అట్టి రూపము కల చంద్రికాదులు, ఉద్దీపన విభావములు అనుపేరుతో, ఉద్దీపన కారణములు అగును. అట్టి అశ్రుపాతాదులు, అనుభావములు అనుపేరుతో కార్యము లగును. అట్టి చింతాదులు వ్యభిచారి భావములు అనుపేరుతో సహకారి కారణములు అగును. ఇవి అన్నీ కలిసి ఒక అలౌకిక వ్యాపారమును పుట్టించుతవి. ఇవి తత్కాలములో ప్రమాతకు ఆనందాంశవరకముగా ఉన్న అజ్ఞానమును నివర్తింపచేయును. అప్పుడు

అజ్ఞానము నివర్తించిన తోడనే ఈ ప్రమాతలో ఉన్న ప్రమాతృత్వము మొదలయిన నిజధర్మములు నశించును. అప్పుడు ప్రమాతృత్వ ఘటిత త్రిపుటి నశించును. ఆ సమయములో ప్రమాత స్వప్రకాశ రూపు డగుట వలన, స్వప్రకాశమగు దీపము తాను ప్రకాశించుతూ సన్నికృష్టపదార్థములను భాసింపచేసినట్లు ఉన్నట్లు స్వస్వరూపానందము, తన్నికృష్టమగు వాసనారూప రతిన్నీ భాసించును. అట్టి రత్యాదికము రస మనబడుతుంది[9].

పైన పేర్కొనిన అలంకారికుల రసనిర్వచనానుసారము విభావాదిసంయోగముచే రసము నిష్పన్న మగుననియు 'భగ్నావరణ చిద్విశిష్టో రత్యాదిః స్థాయిభావో రసః[10] అజ్ఞాన రూపావరణరహిత మగు చైతన్యముతో కూడిన స్థాయిభావమే రసమనియు తెలియుచున్నది.

రససామగ్రి యైన విభావాదులను పరిశీలించినగాని రసస్వరూపము సంపూర్ణముగ అవగతము కాదు.

రససూత్రమున 'భావ' పదము పలుమారులు వినవచ్చు చున్నది. కావున మొదట భావమున నేమోచూతము. భావములకు ఆపేర్లు ఏలవచ్చినవి?

భరతమహర్షి 'వాగంగసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయంతీతి భావాః భూ ఇతికరణే ధాతుః తథాచ భావితం, వాసితం కృత బిత్యర్థాంతరమ్ లోకేఽపిచ సిద్ధమహోహ్యనేన గన్ధేన రసేన వాసర్వమేవ భావితమితి తచ్చవ్యాప్త్యర్థమ్'[11] అని పేర్కొనెను. వాచికాంగిక సాత్త్వికాభినయములచే కావ్యార్థమును భావింప చేయునది గనుక ఇవి భావము లనబడు చున్నవి. ఇది 'భూ' ధాతునిష్పన్నము. దీనికి ఉత్పాదనము వ్యాపనము అను రెండర్థములు గలవు. ఉత్పాదన మనగా వాగంగసత్త్వాభినమ సాహాయ్యమున కావ్యార్థములను అనగా రసములను ఉత్పాదించుట.

దీని యర్థమును అభినవగుప్తు డిట్లు వివరించియున్నాడు. 'కవనీయము కావ్యము. అందు పదార్థమును, వాక్యార్థమును రసములందే పర్యవసించును. అసాధారణము లగుటచేతను, ప్రధానము లగుటచేతను రసములు కావ్యార్థము లగుచున్నవి. ఇట నర్థశబ్ద మభిధేయవాచి కాదు. రసాదులు స్వశబ్ద వాచ్యములు కావని

9. నవరసగంగాధరము, ప్రథమాననము, పుటలు 64-66
10. రసగంగాధరము, ప్రథమాననము
11. నాట్యశాస్త్రము, 7వ అధ్యాయము

ధ్వనికారాదులచే దర్శితము'.[12]

కవి హృదయగతభావములను భావింపచేయునది కావునను ఆస్వాద యోగ్యముగా చేయునది కావునన భావ మనబడును. భరతుని నాట్యశాస్త్రము ననుసరించి 'భూ' అను ధాతువు కరణార్థమున వర్తించును. భావితము, వాసితము, కృతము–అను మూడును సమానార్థకములు, 'కవేరంతర్గతం భావం'–కవి అంతర్గతమగు భావమును వ్యాఖ్యానించుచు అభినవగుప్తుడు వర్ణనానిపుణుడైనవాడు కవి. కవ్యంతర్గతభావ మనగా కవికి అనాదిప్రాక్తన సంస్కార ప్రతిభానమయిన రాగాదికము. అవి లౌకికములు గావు. ఆ రాగాదులు కవిచే వర్ణితములై దేశకాలాది భేదరహితములుగా సర్వసాధారణీభావముతో నాస్వాదింపబడుటకు యోగ్యములుగా నుండును. అట్లు కవిచే వర్ణితములైన భావములు నటునిచే వాగంగసత్త్వాభినయముల వలన అభివ్యక్తము చేయబడునప్పుడు అవి విశిష్ట చిత్తవృత్తులను రసయోగ్యములుగా చేయును. అనగా కవిగతములైన రాగాదికములును సామాజికగతములుగా చేయు చిత్తవృత్తి విశేషము భావ మనబడునని సారాంశము. ఇట్లే మరికొందరు లాక్షణికులు–

'రసానుకూలో వికారో భావః'

– రసతరంగిణీ కర్త భానుదత్తుడు

'భావయన్తి స్వాత్మానం లౌకికదశాయాం అనాస్వాద్యమపి అస్వాద్యం
కుర్వన్తి యద్వా భావయన్తి వ్యాప్నువంతి సామాజికానాం మనః ఇతి భావాః'

–కావ్యానుశాసనకర్త

'బాహ్యార్థాలంబనో యస్తు వికారో మానసోభవేత్
సభావః కథ్యతే సిద్ధిః తస్యోత్కర్షో రసఃస్మృతః'

–భావప్రకాశికకర్త శారదాతనయుడు

ఇవికాక 'వికారో మానసోభావః' మనోవికారమే భావమని, 'నిర్వికారాత్మకే చిత్తేభావః ప్రథమవిక్రియా' – ఎట్టి వికారములేని చిత్తమున మొదటి వికారము భావమనియు పలువురిచే నిర్వచింప బడినది.

మొత్తము మీద తేలిన సారాంశమేమన నాట్యమును చూచుట వలన కాని, కావ్యమును చదువుట వలన కాని రామాదిగతములగు సుఖదుఃఖాదులు సహృదయునిచే

12. సాహిత్యదర్శనము, పు. 114

నునుభూతములై, నొక వికారమును జనింపచేయును. అట్టి వికారమునే సంస్కారమని, వాసన యని అందురు. సహృదయ మనోవికారమునే భావమనియు, ఒక చిత్తవృత్తి విశేషమైన అది కావ్యార్థమును సహృదయునిచే నాస్వాదింప చేయుననియు చెప్పవచ్చును.

## విభావములు :

విభావములకు భరతుడు చెప్పిన లక్షణము-

'విభావోనామ విజ్ఞానార్థః విభావః కారణం నిమిత్తం హేతు రితిపర్యాయాః, విభావ్యతేఽనేన వాగంగ సత్త్వాభినయ ఇతివిభావః యథా విభావితం విజ్ఞాత మిత్యర్థాంతరమ్' ః నా.శా., అ.7 ః- విజ్ఞాన మని అర్థము కలది విభావము. విభావమునకు నిమిత్తము, కారణము, హేతువు అనునవి పర్యాయములు.

వాచికాంగిక సాత్త్వికాభినయములు వీనిచే విభావితము లగును. అనగా విజ్ఞాతము లగును. విశిష్టముగ తెలిసికొనబడును. కావున ఇది విభావము లనబడుచున్నవి. విభావితమన్నను, విజ్ఞాతమన్నను ఒక్కటే. ఈ అర్థమునే-

'బహవోఽర్థా విభావ్యంతే వాగంగాభినయాశ్రయాః
అనేన యస్మాత్తేనాయం విభావ ఇతి సంజ్ఞితః'

-ః నా.శా., అ.7, శ్లో.4 ః

అను శ్లోకము వివరించుచున్నది. వాగంగాభినయాశ్రయములైన అనేకార్థములు దీనిచే విభావితము లగును. కావున ఇవి విభావసంజ్ఞ కలవి. 'అభినయమునకు అనేక హేతువులు ఉండవచ్చును. హాస్యమునకు హర్షాదులను, బాష్పములకు ఘర్మ ధూమ రోగాదులును కారణము లగుచున్నవి. ఈ బాష్పాదుల వలన ఏమి ప్రతీయమాన మగుచున్నది? అను విషయము విభావముల ననుసరించి వెంటనే నిర్ణయింపగలము. చిత్తవృత్తుల ఉద్భవమునకు హేతువైన విషయము విభావ మనబడునని సారాంశము'.[13] 'చిత్తవృత్త్యుద్భవహేతుః విషయః విభావ శబ్దస్యార్థః ఇతిజ్ఞాతమ్' అని అభినవ భారతి వ్యాఖ్య. వాసనారూపమున బీజప్రాయముగ నున్న రత్యాది స్థాయి భావములను అంకురరూపమున ఆస్వాద్యమానముగ నొనర్చునని విభావములు. లోకవ్యవహారమున రత్యాదుల యుత్పత్తికి హేతువులైన నాయకాదులే కావ్యములందు విభావము లనబడునని సాహిత్యదర్పణము. 'విభావః కథ్యతే తత్రరసోత్పాదన కారణం' అని

13. అభినవభారతి, 1వ సంపుటము, పు. 347; గుప్తభావప్రకాశిక, పు. 234

ప్రతాపరుద్రీయము.[14]

శ్రవ్యకావ్యమున విభావానుభావ రూపవర్ణనాత్మకమైన శబ్దార్థములు కూర్పబడి యుండును. శ్రోత తదర్థములను విశిష్టముగ ఇంద్రియ ముఖమున గ్రహించి వానిని హృదయమున భావించి, బుద్ధి యందు వానిని సాక్షాత్కరింపచేసికొని, అందు తాదాత్మ్యమును పొంది తదనుభూతిని గాంచును.[15] దృశ్యకావ్యమున వాగంగ సాత్త్వికాభినయముచే కావ్యార్థమును గమ్యమానము చేయు నాయికానాయకాదులతో సామాజికుడు సాధారణీకరణరూపమగు తాదాత్మ్యమును పొంది తద్భావ భావనము వలన భావానుభూతిని పొందును.

ఆలంబనము ఉద్దీపనము అని విభావమును ద్వివిధముగ ధనంజయాదులు పలువురు చెప్పిరి.

'జ్ఞాయమాన తయా తత్రవిభావోభావ పోషకృత్
ఆలంబనోద్దీపనత్వ ప్రభేదేన సచద్విధా' [16]

అని దశరూపకము.

'ఆలంబనోద్దీపనాత్మా సద్విధాపరికీర్త్యతేః'

అని ప్రతాపరుద్రీయముః రస.ప్ర.,శ్లో.3ః. కాని విభావము నందు అర్వాచీనాలంకారికులు చెప్పిన ఆలంబనోద్దీపన భేదములను భరతుడు చెప్పలేదనియు, అట్టి విభజనము కాల్పనికమనియు అభినవగుప్తుని అభిప్రాయము.[17]

'కాల్పనికమాలంబన విభావఉద్దీపన విభావ ఇతి, అతఏవ మునినా నాయం క్వచిద్విభాగుక్తః సూచితోవా, అని నాట్యశాస్త్రము ః అ. 6ః.

ఆలంబనము రససమవాయకారణము. ఏవి లేనిచో రసము వ్యక్తము కాదో అది ఆలంబన విభావము. ఏనాయికానాయకుల వలన రసావిర్భావము కలుగునో ఆ నాయికానాయకులు రసమున కాలంబన విభావములు. అనగా రసమునకు సమవాయకారణములు. రసమును ఉద్దీపింప చేయునవి ఉద్దీపన విభావములు. 'రససమవాయకారణ మాలంబనవిభావః, ఇతరత్కారణ జాత ముద్దీపనవిభావః'

---

14. ప్రతాపరుద్రీయము, రసప్రకరణము, శ్లో. 3
15. శబ్దోపహిత రూపాంస్తాన్ బుద్ధేర్విషయతాంగతాన్, ప్రత్యాణానివకంసాదీన్ సాధనత్వేన మన్యతే - భర్తృహరి వాక్యపదీయము, తృతీయపరిచ్ఛేదము
16. దశరూపకము, శ్లో.4-2
17. అభినవభారతి, 1వ సంపుటము, పు.304; గుప్తార్థభావప్రకాశిక, పు.202

అని ప్రతాపరుద్రీయము.

ఈ ఉద్దీపన విభావము సహజము తటస్థము అని ద్వివిధము. శృంగారమున నాయికానాయకుల యౌవన, భూషణ, చేష్టలు మూడును సహజములు. మలయానిల చంద్రాదులు తటస్థములు. శృంగారతిలకమున –

'ఆలంబన గుణశ్చైవ తచ్చేష్టా తదలంకృతిః
తటస్థశ్చేతి విజ్ఞేయ శ్చతుర్ధోద్దీపనక్రమః
ఆలంబన గుణోరూప యౌవనాది రుదాహృతః
తచ్చేష్టా యౌవనోద్భూత హావభావాదికామతాః
నూపురాంగదహారాది తదలంకరణం మతం
మలయానిల చంద్రాద్యాస్తటస్థాః పరికీర్తితాః'

ప్రతాపరుద్రీయమున నుదాహృతముః

ఆలంబనగుణములు, తచ్చేష్టలు, తదలంకృతులు, తటస్థములు అని నాల్గువిధములుగ చెప్పబడినది. కావ్యాలంకారసంగ్రహము 'ఉద్దీపనంబు ప్రాయంబును, సొమ్మును జేష్టలు మదనాదులు ననఁదగు' ః3-28ః అని చెప్పుచున్నది.

**అనుభావములు :**

'అనుభావ్యతే అనేన వాగంగసత్త్వకృతోఽభినయ ఇతి వాగంగసత్త్వకృతమయిన అభినయము దీనిచే అనుభావిత మగును.

'వాగంగాభినయ నేహ యతస్త్వర్థోఽనుభావ్యతే
శాఖాంగోపాంగ సంయుక్తస్త్వనుభావ స్తతఃస్మృతః'

–ఃనా.శా., అ.7,శ్లో.7ః

అంగోపాంగముల కూడిన అర్థము వాగంగాభినయమున అనుభావిత మగును కావున ఇవి అనుభావము లనబడు చున్నవి. సాహిత్యదర్పణమున అనుభావ లక్షణము–

'ఉద్బుద్ధం కారణైః స్వైస్వైర్బహిర్భావం ప్రకాశయన్
లోకేయః కార్యరూప స్సోఽనుభావః కావ్యనాట్యయోః' ః3-132ః

అని చెప్పబడినది. తమ తమ కారణములచే లోకమున ఉద్బుద్ధమైన రత్యాదికమైన స్థాయిభావమును వెలుపలికి తెలుపు క్రియావిశేషమే కావ్యనాట్యము లందు అనుభావ మనబడును.

అను – పశ్చాత్, భావః – ఉత్పత్తిః యేషాంతే అనుభావః అని వ్యుత్పత్త్యర్థముచే కారణములగు రత్యాదులకు అవ్యవహితముగ తటస్థించు కార్యములు అనుభావములని తెలియుచున్నది. స్థాయిభావము తరువాత నివి పుట్టుట వలన కాని, స్థాయి భావమును అనుభవింపచేయుట వలన కాని అనుభావములని చెప్పబడుచున్నవి. 'అనుభావయతి రత్యాదికం' – రత్యాదికమగు స్థాయి ననుభవింపచేయునది. 'కార్యభూతోऽనుభావస్స్యాత్ కటాణాది శ్శరీరజః' అని ప్రతాపరుద్రీయము ౹రస.ప్ర.,శ్లో.4౹. సాహిత్యదర్పణమున అంగజము లయిన భావ, హావ, హేలలు మూడును, ఆయత్నజము లయిన శోభ, కాంతి, దీప్తి, మాధుర్యము, ప్రగల్భత, ఔదార్యము, ధైర్యము అను నేడును, స్వభావజము లయిన లీల, విలాసము, విచ్ఛిత్తి, బిబ్బోకము, కిలికించితము మోట్టాయితము, కుట్టమితము, విభ్రమము, లలితము, మదము, విహృతము, తపనము, మౌగ్ధ్యము, విక్షేపము, కుతూహలము, హసితము, చకితము, కేళి, అను పదునెనిమిదియు, సాత్త్వికభావము లెనిమిదియు ఇంకను సంభావ్యమానము లయిన చేష్టలును శృంగారమున అనుభావములు అని చెప్పబడినది.[18] ఇందుఅయత్నజములని చెప్పబడిన శోభకాంత్యాదులు అనుభావములు కావనియు, నవి రత్యాదులను ప్రకాశింప జేయవనియు, సాహిత్యదర్పణ వ్యాఖ్యాత యగు రామచరణతర్క వాగీశుఁడు చెప్పియున్నాఁడు. 'శోభాకాంత్యాదీనాం రత్యాది ప్రకాశకత్వాభావాన్నానుభావరూపతా' అప్పుడు అనుభావ రూపాలంకారము లిరువది యొకటియే యగును'[19] అని సాహిత్యదర్శనమున గలదు.

అనుభావ స్వరూప లక్షణాదులను గూర్చి దశరూపకకర్త–

'అనుభావో వికారస్తు భావసంసూచ నాత్మకః,

హేతుకార్యాత్మనోః సిద్ధిస్తయోః సంవ్యవహారతః' – ౹శ్లో.4-3౹

'స్థాయిభావాన్ అనుభావయన్తః సామాజికాన్ సభ్రూవిక్షేప కటాక్షాదయో రస పోషకారిణః అనుభావాః' అని వ్యాఖ్యానమున కలదు. అంతర్భావ సూచకములైన బాహ్యచేష్టల యందలి వికృతులే అనుభావములు. అని ఈతడు వీనిని స్పష్టము కావించెను.

---

18. సాహిత్యదర్పణము, 3-79-82 శ్లో.
19. సాహిత్యదర్శనము, పు. 125

కావ్యాలంకార చూడామణి యందు వదనవికాసము, వాలికచూపులు, లేతసిగ్గుతో బొదలెడి తారకలు, బొమలపాల్పగు పోకలు, మోవికెంపుపై కదిరెడి చిన్నినవ్వు మున్నగునవి ఉదాహరణములుగ చూపబడినవి.

## సాత్త్వికభావములు :

ఇవియును అనుభావములే. అయినను సత్త్వజన్యము లగుటచే వీనికి సాత్త్వికము అనుపేరు వచ్చినది.

'పృథక్భావా భవంత్యన్యే అనుభావత్వేపి సాత్త్వికాః
సత్త్వాదేవ సముత్పత్తేః తచ్చతద్భావభావనమ్'

అని దశరూపకము ః4-4శ్లో.ః. ఇతరులయందుండు సుఖదుఃఖాదులను భావించుట వలన వానికి అనుకూలముగా అయిన అంతఃకరణప్రవృత్తి సత్త్వము. అట్టి సత్త్వముచేతను పరిపూర్ణతను పొందింపబడునవి సాత్త్వికభావములు.

భరతుని నాట్యశాస్త్రమున-

ఇవహి సత్త్వం నామ మన ః ప్రభవమ్
తచ్చసమాహిత మనస్త్వాత్ ఉత్పద్యతే
మనః సమాధానాచ్చ సత్త్వనివృత్తిర్భవతి' -నా.శా., అ.7ః

సత్త్వమన మనఃప్రభవమగు ఒక విశేషస్థితి. సమాహితమనస్కత యుండినప్పుడే సత్త్వము ప్రభవించును. మనస్సమాధి యందు సత్త్వము జనించును.

సాహిత్యదర్పణమున 'రజస్తమోభ్యా మస్పృష్టం మనస్సత్త్వ-మిహోచ్యతే' ః3-1శ్లో.ః - రజోగుణ తమోగుణములచేత స్పృష్టముకాని మనస్సు సత్త్వమన బడును. పై నిర్వచనానుసారము సాత్త్వికభావములు జనించునపుడు మనస్సు రజోగుణ, తమోగుణముల నతిక్రమించి సత్త్వనిష్ఠమై యుండునని చెప్పవచ్చును. 'వికారాః సత్త్వసంభూతాః సాత్త్వికాః పరికీర్తితాః' ః3-134ః - 'సత్త్వం నామ స్వాత్మవిశ్రామ ప్రకాశకారీ కశ్చనాంతరోధర్మః' అనియు సాహిత్యదర్పణమున గలదు.

పరగత సుఖాదిభావనయా భావితాంతఃకరణత్వం సత్త్వం, తతో భవాస్సాత్త్వికాః' అని ప్రతాపరుద్రీయము ఃరస.ప్ర.,శ్లో.4ః. పరగతసుఖాది భావనచే భావిత మగు నంతఃకరణధర్మమే సత్త్వము. అట్టి సత్త్వభవములే సాత్త్వికములు.

రసతరంగిణిలో 'సత్త్వం జీవశరీరం, తస్యధర్మాః సాత్త్వికాః ఇత్థంచ శారీరభావాః స్తంభాదయః సాత్త్వికభావా ఇత్యభిధీయంతె' - సత్త్వమన జీవశరీరము. దాని

ధర్మములు సాత్త్వికములు. ఇట్లు శారీరభావములైన స్తంభాదులు సాత్త్వికములు అని కలదు. ఇవికాక ఇంకను 'అభినయాది ముఖేన అన్యగత సుఖదుఃఖాది భావనాయామంతః కరణస్యఅనుకూలత్వం సత్త్వం' - అభినయాదుల మూలమున అన్యగత సుఖదుఃఖాది భావన యెడ అంతఃకరణము అనుకూలముగ నుండుట సత్త్వమనియు, 'భావాంతర నైరపేక్ష్యేణ రసాపరోక్షీకరణత్వలక్షణో బలవిశేషస్సత్త్వం' - భావాంతరములతో పనిలేక రసమున ప్రత్యక్షమొనర్చు బలవిశేషము సత్త్వము అనియును లక్షణములు కనబడుచున్నవి.[20] ఆ సత్త్వము నుండి పుట్టిన వగుటచే సాత్త్వికభావములని వ్యవహారము. లేదా ఆ సత్త్వదశ యందు కలిగిన కార్యములే సాత్త్వికము లనియు చెప్పవచ్చును. ఇవియు కార్యరూపము లగుటచే ననుభావములే అగును. అయినను 'సత్త్వైకమూలత్వాత్ సాత్త్వికప్రథా' - కేవలము సత్త్వము నుండియే పుట్టినవి కాన సాత్త్వికము లనబడుచున్నవి. శరీరజములు బుద్ధిపూర్వకముగా నుత్పాద్యమానము లగును. సత్త్వజములు స్వతః ప్రవర్తమానము లగుననియు కొందరు లాక్షణికులు చెప్పిరి.

సీదత్యస్మిన్మనః - ఇతివ్యుత్పత్తేః' - అని వ్యుత్పత్తి. విభావాది సాహాయ్యమున సహృదయుని హృదయమున వాసనా రూపమున నున్న రత్యాదులగు స్థాయులు ఉద్బుద్ధము లగును. భావనాబలముచే విభావాదులతోడి అతనికి కలుగు తన్మయత్వమే సత్త్వము. తజ్జన్యములే సాత్త్వికములు. వ్యభిచారులచే పరిపుష్టమైన యీస్థితియొక అవాంతర స్థితి. బాహ్యకారణమున జనించునవి వ్యభిచారులును, అంతరకారణమున జనించునవి సాత్త్వికములును అగును. వ్యభిచారులు సాధారణములు, సాత్త్వికములు ప్రతిరస భిన్నములు.

ఈ సాత్త్వికభావము లెనిమిది.

స్తంభస్వేదోఽథరోమాంచః స్వరభంగోథ వేపథుః

వైవర్ణ్యమశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః' (3-135శ్లో.) అని సాహిత్యదర్పణము.

స్తంభశ్చేష్టా ప్రతీఘాతో భయహర్షా మయాదిభిః - భయము వలన, హర్షము వలన శరీరమున కలిగిన చేష్టాప్రతీఘాతము స్తంభము. ఆదిపదముచే రోగాదులు గ్రాహ్యములు.

---

20. కావ్యాలంకారసంగ్రహము - సన్నిధానం వారి వ్యాఖ్య, పు. 335

'హర్షాద్భుత భయాదిభ్యో రోమాంచో రోమవిక్రియా' - హర్షము, అద్భుతము, భయము, మొదలగువాని వలన కలుగు రోమవికారము రోమాంచము. 'మదసమ్మద పీడాద్యైర్వైస్వర్యం గద్గదం విదుః' - మదముచే, సంతోషముచే, పీడాదులచే కలుగు గాద్గద్యము వైస్వర్యము. ఆది పదముచే జాగరణము, ఉచ్చారణాధిక్యము మున్నగునవి గ్రాహ్యములు.

'రాగద్వేష శ్రమాదిభ్యః కంపోగాత్రస్య వేపథుః' - రాగము, ద్వేషము, శ్రమము, మున్నగువానిచే కలుగు గాత్రవేపథువే కంపము. ఆదిపదముచే ఘోరదర్శనాదులు గ్రాహ్యములు.

'విషాద మద రోషాద్యైర్వర్ణాన్యత్వం వివర్ణతా' - విషాదము, మదము, రోషము, మున్నగువానిచే కలుగు అన్యవర్ణత వైవర్ణ్యము. వివర్ణత అనగా పాండురుచి అని కావ్యాలంకార సంగ్రహకర్త చెప్పిన విషయము పొరపాటు అని సన్నిధానము వారు వ్యాఖ్యానించిరి.[21] ఆదిపదముచే శోక మోహాదులు కూడ గ్రాహ్యములు.

'అశ్రునేత్రోద్భవం వారిక్రోధదుఃఖ ప్రహర్షజమ్' - క్రోధము, దుఃఖము, హర్షము అనువాని వలన పుట్టిన నీరు అశ్రువు.

'ప్రలయః సుఖదుఃఖాభ్యాం చేష్టాజ్ఞాన నిరాకృతిః' - అత్యధికములైన సుఖదుఃఖములచే కలుగు నచేతనత్వము ప్రలయము. చేష్టాజ్ఞాన నిరాకృతి.

ఇవన్నియు సాహిత్యదర్పణ మాధారముగ నిరూపింపబడినవి. సంస్కృత లాక్షణికు లందరును భరతుని వలె ఎనిమిది సాత్త్వికభావములనే పేర్కొనిరి. కాని భానుదత్తుడు రసతరంగిణిలో 'జృంభాచ నవమః సాత్త్వికోభావ ఇతి ప్రతిభాతి' - జృంభ అనునది తొమ్మిదవ సాత్త్వికభావము అని తొమ్మిది సాత్త్వికభావములను పేర్కొనెను. కాని దీనిని తర్వాత లాక్షణికులు స్వీకరించినట్లు కానరాదు.

## వ్యభిచారి భావములు :

వి+అభి+చర = అనుదాని యందు 'చర' గత్యర్థకమగు ధాతువు. వి, అభి అనునవి రెండును ఉపసర్గలు. 'వ్యభిచారిణ ఇతి కస్మాదుచ్యతే? వి అభి ఇత్యేతావుపసర్గౌ చర గతౌ ధాతుః। ధాత్వర్థ వాగంగ సత్త్వోపేతాన్ వివిధ మాభిముఖేన రసేషు చరంతీతి వ్యభిచారిణః। అని నాట్యశాస్త్రము ‹అ.7›.

---

21. కావ్యాలంకార సంగ్రహము ÷ సన్నిధానము వారి వ్యాఖ్య, పు. 340

వివిధముగ అభిముఖ్యమున చరించునవి, రసముల విషయమున అభిముఖ్యముతో వివిధముగ చరించునవి కావున ఇవి వ్యభిచారు లనబడు చున్నవి. ఇవి వాచికాంగిక సాత్త్వికాభినయోపేతములై ప్రయోగము నందు రసములను తీసికొని పోవును. అనగా ఆస్వాద యోగ్యములుగ జేయును.

'విశేషాదాభిముఖ్యేన చరంతో వ్యభిచారిణః

స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాః కల్లోలా ఇవవారిధౌ'

అని దశరూపకము: 4–7 శ్లో.:.

'విశేసాదాభిముఖ్యేన చరణాద్వ్యభిచారిణః

స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాస్త్ర యస్త్రింశచ్చతద్భిదాః'

అని సాహిత్యదర్పణము :తృ.పరి.,శ్లో. 140:.

విభావానుభావ సాత్వికభావములను మించి రసాభిముఖముగ చరించునవి వ్యభిచారులని వీరి ఆశయము.

రసార్ణవసుధాకరకర్త

'ఉన్మజ్జనో నిమజ్జన్తః స్థాయిన్యంబు నిధానివ

ఊర్మివద్వర్థ యన్త్యేనం యాన్తి తద్రూపతాంచతే'

–:2 ఆ,శ్లో.3:

ఈ శ్లోకములలో ఈ తాత్పర్యము గలదు. సముద్రమున అలలు పుట్టుచు, తిరిగి విరిగి యందే పడుచు సముద్రమునకు కడలి అను నామమును సార్థక మొనర్చును. అట్లే వ్యభిచారులు స్థాయి సముద్రమున పుట్టి ఉత్తుంగ తరంగములై పొలిచి, విరిగి, తిరిగి స్థాయి యందే కలిసిపోవుచు, తరగలు ఫేనమును దరిచేర్చినట్లు వ్యభిచారులు రసాభిముఖ్యముగ స్థాయిని కొనిపోవును.

ఈ వ్యభిచారులకే సంచారులని నామాంతరము. 'సమ్యక్ చారయంతి సంచారిణః' – లెస్సగా రసరూపమున స్థాయిని చరింపచేయునవి సంచారులు. ఇవి ముప్పదిమూడు గలవు. ఇవి వరుసగా –

## 1.నిర్వేదము :

నిర్వేదో నామ దారిద్ర్యయోపగ మధిక్షేపాకృష్ట క్రోధతాడనే ష్టజన వియోగత్వ జ్ఞానాదిభిః విభావైః ఉత్పద్యతే'

'దారిద్రేష్ట వియోగైశ్చ నిర్వేదో నామజాయతే

సం(ప్రధారణ నిశ్వాసైః తస్య త్వభినయోభవేత్'

– ఃఅ.7, శ్లో.28ః

అని నాట్యశాస్త్రము.

దారిద్ర్యము, వ్యాధి, అవమానము, ధిక్కరించుట, ఆక్రోశము, క్రోధముతో కొట్టుట, మున్నగువాని వలన క్రోధము కలుగును. ఈ విషయమున అనువంశ్యలైన ఆర్యలు కలవు.

'ఇష్టజనస్య వియోగాత్ దారిద్ర్యాత్ వ్యాధితస్తథాదుఃఖాత్
పరవృద్ధింవా దృష్ట్వా నిర్వేదో నామసంభవతి'

–ఃనా.శా. 7 –29ః

ఇష్టజన వియోగము, దారిద్ర్యము, వ్యాధి, దుఃఖము, పరుల అభివృద్ధిని చూచుట అనువాని వలన నిర్వేదము జనించును.

## 2.గ్లాని :

'గ్లానిర్నామ వాంత విరిక్తవ్యాధి తపోనియమోప వాసమనస్తాపాతి పాన మద్యసే వాతివ్యాయామాధ్వగమనక్షుత్పిపాసా నిద్రాశ్చే దాదిభిః విభావైః సముత్పద్యతే'

'వాన్త విరిక్త వ్యాధిషు తపసా జరసాచ జాయతే గ్లానిః
కార్శ్వేన సాభినేయా మందభ్రమణానుకంపేన'

–ఃనా.శా., 7 –3 । శ్లో.ః

వాంతులు, విరేచనములు, వ్యాధి, తపోనియమము, ఉపవాసము, మనస్తాపము, అధికముగా సంభోగించుట, అధికముగా త్రాగుట, అతివ్యాయామము, నడచి వచ్చుట, ఆకలిదప్పులు, నిద్రాభంగము, మొదలగువాని వలన గ్లాని జనించును.

## 3. శంక :

'శంకానామ చౌర్యాద్యాభి గ్రహణానుపాపరాధ పాపకర్మణాదిభిః విభావైః సముత్పద్యతే'

'చౌర్యాది జనితాశంకా ప్రాయః కార్యాభయానకే
ప్రియవ్యలీకజనితా తథా శృంగారిణీమతా'

– ః7 –33 శ్లో.ః

ఇది సందేహాత్మకము. స్త్రీ నీచప్రభవము. దొంగతనము, పట్టుబడుట, రాజున కపకారము చేసియుండుట, పాపకార్య మొనర్చి యుండుట, మున్నగు విభావముల వలన జనించును. భయానక రసమందు చౌర్యాది జన్యమయిన శంక ప్రయోగింప

వలెను. ప్రియుడొనర్చిన యపరాధమున గలుగు శంక శృంగారయుక్త మగును.

ఇది మరల ఆత్మసముత్థ, పరసముత్థ భేదముచే ద్వివిధము. తన దోషముల వలన తనయందు శంక జనించిన అది ఆత్మస్థము. ఇతరుల వలన తనకు సంక్రమించిన శంక పరసముత్థము.

## 4. అసూయ :

'అసూయానామ నానాపరాధ ద్వేషపరైశ్వర్యసౌభాగ్య లీలా విద్యాదిభిః విభావై రుత్పద్యతే'

'పరసౌభాగ్యైశ్వర తామేధాలీలా సముచ్ఛ్రయాన్ దృష్ట్వా
ఉత్పద్యతే హ్యసూయ కృతాపరాధో భవేద్యశ్చ'

– ॥నా.శా. 7–36॥

వివిధములగు అపరాధముల వలనను, ద్వేషము వలనను, పరైశ్వర్య సౌభాగ్యమేధా విద్యాలీలాది విభావముల వలన నిది కలుగును.

## 5. మదము :

'మదోనామ మద్యోపయోగాదుత్పద్యతే నచత్రివిధః' మద్యము నుపయోగించుట వలన మదము జనించును

ఇది ఉత్తమ, మధ్యమ, అధమ మదములని త్రివిధములు. అవి తరుణ, మధ్య, అవకృష్ట మదములు. మత్తులలో నొకడు పాడును, ఒకడు ఏడ్చును, ఒకడు నవ్వును, ఒకడు పరుషముగ మాట్లాడును, ఒకడు నిద్రించును ఉత్తమ ప్రకృతియగు మానవుడు మద్యము త్రాగి మత్తుడయిన శయనించును. మధ్యమ ప్రకృతి యగువాడు నవ్వును. అధమ ప్రకృతికుడు దుర్భాష లాడును.

## 6. శ్రమము :

'శ్రమోనామ అధ్వగతి వ్యాయామసేవాదిభిః విభావైః ఉత్పద్యతే'

'అధ్వగతి వ్యాయామైర్నరస్య సంజాయతే శ్రమోనామ'

– ॥7–47 శ్లో.॥

అధ్వగతి వలన, వ్యాయామము వలన మానవునకు శ్రమ కలుగును. అది పదముచే నృత్తాదులు మరికొన్ని గ్రాహ్యములు..

## 7. ఆలస్యము :

'ఆలస్యంనామ స్వభావ ఖేదవ్యాధి సాహిత్య గర్భాభిః విభావైఃసముత్పద్యతే'

'ఆలస్యం త్వభినేయం ఖేద వ్యాదధి స్వభావజం వాపి
ఆహారవర్జితా నామారంభాణా మనారంభాత్'

– ః అ.6, శ్లో. 48ః

వ్యాధి, గర్భము, స్వభావము, శ్రమము, సాహిత్యము, మున్నగువాని వలన ఆలస్యము కలుగును. ఇది స్త్రీనీచప్రకృతు లందు జనించును.

ఇది ఖేదజము, స్వభావజము అని రెండు విధములు.

## 8. దైన్యము :

'దైన్యంనామ దౌర్గత్యమనః సంతాపాదిభిః విభావైః ఉత్పద్యతే'

'చింతౌత్సుక్యసముత్థాత్ దుఃఖాద్యాభవతి దీనతాపుంసామ్' అని నాట్యశాస్త్రము. ఃఅ.7, శ్లో. 49ః

దుర్గతి, సంతాపము, చింత ఔత్సుక్యము, దుఃఖము, మున్నగువాని వలన నిది జనించును.

## 9. చింత :

'చింతానామ ఐశ్వర్యభ్రష్టేష్ట ద్రవ్యాపహార దారిద్ర్యాదిభిః విభావైః ఉత్పద్యతే'

'ఐశ్వర్యేష్ట ద్రవ్యాపహార జనితా బహుప్రకారాతు
హృదయౌత్సుక్యోపగతా చింతాతున్నృణాం సముద్భవతి'

– ః7 –50ః

ఐశ్వర్యభ్రంశము, ఇష్టద్రవ్యనాశము, దారిద్ర్యము, హృదయౌత్సుక్యము అనువాని వలన నిది జనించును.

## 10. మోహము :

'మోహోనామ దైవోపఘాత వ్యసన వ్యాధి భయా వేగపూర్వవైర స్మరణాదిభిః విభావైః ఉత్పద్యతే'

'అస్థానేతస్కరాన్ దృష్ట్వా త్రాసనైర్వా ప్రథగ్విధైః

తత్ర్పతీకార శూన్యస్య మోహః సముపజాయతే'

- : 7-52 శ్లో.:

దైవికముగా గాని, వ్యసనము వలన కాని దెబ్బతగులుట, వ్యాధి, భయము, ఆవేగము, పూర్వవైరస్మరణము, ఇత్యాదుల వలన జనించును. తస్కరులను చూచినపుడును, వివిధములైన త్రాసములు కలిగినప్పుడును ప్రతీకారము చేయలేకపోవుట వలనను ఇది జనించును.

## 11. స్మృతి :

'స్మృతిర్నామ సుఖదుఃఖ కృతానాం భావానామనుస్మరణం స్వాస్థ్య
జఘన్యరాత్రి నిద్రాశ్చేత్ అసమాన దర్శనోదాహరణ చింతాభ్యాసాదిభిః
విభావైః ఉత్పద్యతే'

'సుఖదుఃఖ మతిక్రాంతం తథామతి విభావితం యథావృత్తం
చిరవిస్మృతం స్మరతి యఃస్మృతి మానితి వేదితవ్యోఽసౌ'

- : 7-54 :

పూర్వ మనుభవించిన సుఖదుఃఖములను, జరిగినవానిని జరిగినట్లుగను భావించుట స్మృతి అనబడును.

## 12. ధృతి :

'ధృతిర్నామ శౌర్యవిజ్ఞాన శ్రుతి విభావ శౌచాచార గురు భక్త్యధికార్థలాభ వివిధక్రీడా దిభిః విభావైః ఉత్పద్యతే'

'విజ్ఞాన శౌచ విభవ శ్రుతి శక్తి సముద్భవా ధృతిః సద్భిః
భయశోక విషాదాద్యైః రహితాతు సదాప్రయోక్తవ్యా'

- : 7-56 :

'ప్రాప్తానాముపభోగః శబ్ద స్పర్శ రూప రస గంధానాం
అప్రాప్తైశ్చ నశోకః యస్యాంహి భవేత్ ధృతిస్సాతు'

- : 7-57 :

విజ్ఞానము, శౌచము, విభవము, శ్రుతి, శక్తి అనువాని వలన నిది జనించును. భయ శోక విషాదరహితముగ దీనిని ప్రయోగింప వలెను. ప్రాప్తములైన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను అనుభవించుట, అప్రాప్తములైన వానికై శోకింప కుండుట ధృతి అనబడును.

## 13. వ్రీడ :

'వ్రీడానామ అకార్య కరణాత్మికా గుర్వ్యతిక్రమణావజ్ఞాన ప్రతిజ్ఞానా నిర్వహణ కృతప్రత్యాదిష్ట పశ్చాత్తాపాదిభిః విభావైః ఉత్పద్యతే'

'కించిదకార్యం కుర్వన్ ఏవం యోదృశ్యతే శుచిభిరన్యైః
పశ్చాత్తాపేన యుతో వ్రీడిత ఇతి వేదితవ్యోఽసౌ'

– : 7– 58 :

ఇది అకార్యకరణాత్మకము. అకార్యమొనరించుచుండగా తనను పెద్దలైనవారు చూచుట వలన పశ్చాత్తాపమును పొందువాడు వ్రీడావంతు డనబడును.

## 14. చపలత :

'చపలతానామ రాగద్వేష మాత్సర్యా మర్షేర్ష్యా ప్రతికూలాది భిః విభావైః ఉత్పద్యతే'

'అవిమృశ్యతు యఃకార్యం పురుషో వధబంధనాది కం సమారభతే
అవినిశ్చిత కారిత్వాత్ సతు ఖలు చపలో విచోద్ధవ్యః'

– : 7– 60 :

విమర్శింపకయే వధ, బంధనాది అకార్యములను ఆరంభించినవాడు, అనాలోచితముగ పనులు చేయువాడు చపలు డనబడును. రాగ, ద్వేష, మాత్సర్య, అమర్ష, ఈర్ష్యాదులచే నిది జనించును.

## 15. హర్షము :

'హర్షోనామ మనోరథ లాభేప్సితాప్తిష్టజన సమాగమ మనః పరితోష దేవగురు రాజభర్తృ ప్రసాదన భోజనాశ్ఛాదన ధన లాభోపభోగాదిభిః విభావైః ఉత్పద్యతే'

'అప్రాప్యే ప్రాప్యేవాలబ్ధే ర్థే ప్రియసమాగమే వాపి
హృదయ మనోరథలాభే హర్షః సంజాయతే పుంసామ్'

– : 7– 6 :

అప్రాప్యములగు వస్తువులు ప్రాప్తించుట, అర్థలాభము, ప్రియసమాగమము హృదయమనోరథ లాభము అనువాని వలన హర్షము జనించును.

## 16. ఆవేగము :

'ఆవేగోనామ ఉత్పాతవాతవర్షాగ్ని కుంజరోద్భ్రమణ ప్రియాప్రియ

(శ్రవణవ్యసనాభి ఘాతాదిభిః విభావైః ఉత్పద్యతే'
'అప్రియ నివేదనాద్వా సహసా హ్యభిధారితారి వచనేన
శస్త్రాక్షేపాత్ త్రాసాదావేగోనామ సంభవతి'

– : 7–64:

ఉత్పాతము, వాతము, వర్షము, అగ్ని, కుంజరోద్భ్రమణము, ప్రియవార్తాశ్రవణము, అప్రియవార్తాశ్రవణము, వ్యసనాభిఘాతము, మున్నగు విభావముల వలన జనించును. అప్రియనివేదనము వలనను, సహసా శత్రువచన నిశ్చయమునను, శస్త్రాక్షేపము వలనను, త్రాసము వలనను ఆవేగము కలుగును.

## 17. జడత :

'జడతోనామ సర్వకార్యాప్రతిపత్తిః ఇష్టానిష్టశ్రవణ దర్శనావ్యాధ్యా దిభిః విభావైః ఉత్పద్యతే'

'ఇష్టంవా నిష్టంవా సుఖదుఃఖేవా నవేత్తియో మోహాత్
తూష్ణీకః పరవశగః సభవతి జడసంజ్ఞకః పురుషః'

– : 7–66 శ్లో. :

సర్వకార్యాప్రతిపత్తి అనగా ఏకార్యమును చేయకుండుట జడత అనబడును. ఇష్టములైనవానిని కాని, అనిష్టములైనవానిని కాని చూచుట వలన, వినుట వలన, వ్యాధి వలనను ఇది జనించును. ఇష్టానిష్టములను, సుఖదుఃఖములను గుర్తింపక తూష్ణీభావముతో నుండు పురుషుడు జడుడు అనబడును.

## 18. గర్వము :

'గర్వోనామ ఐశ్వర్యకులరూప యౌవన విద్యాబల ధన లాభాదిభిః విభావైః ఉత్పద్యతే'

'విద్యావ్యాప్తేః రూపాద్దైశ్వర్యాత్ అథవా ధనాగముద్వాపి
గర్వః ఖలు నీచానాం దృష్ట్యంగ విచాలనైః కార్యః'

– : 7– 67 :

ఐశ్వర్యము, కులము, రూపము యౌవనము, విద్య, బలము, ధన లాభము, మున్నగువాని వలన ఇది జనించును.

## 19. విషాదము :

'విషాదోనామ కార్యారంభానిస్తరణాద్దైవ వ్యాపత్తి సముత్థః

'కార్యనిస్తరణద్వా చౌర్యాభిగ్రహణ రాజదోషాద్వా
దైవాదర్థ విపత్తేర్భవతి విషాదః సదా పుంసామ్'

- : 7-68 :

కార్యారంభ నిస్తరణ, దైవికమగు ఆపద, మున్నగువాని వలన ఇది జనించును. దొంగతనము పట్టుబడుట, రాజదోషము అనువాని వలన ఇది జనించును.

## 20. ఔత్సుక్యము :

'ఔత్సుక్యంనామ ఇష్టజన వియోగానుస్మరణోద్యాన దర్శనాదిభిః విభావైః ఉత్పద్యతే'

'ఇష్టజనస్యవి యోగాత్ ఔత్సుక్యం జాయతే హ్యనుస్మృత్యా'

- : 7-70 :

ఇష్టజనవియోగము స్మరించుట, ఉద్యానవన దర్శనము, మున్నగు విభావముల వలన ఇది జనించును.

## 21. నిద్ర :

'నిద్రానామ దౌర్బల్యశ్రమ మదాలస్య చింతాత్యాహార స్వభావాదిభిః విభావైః ఉత్పద్యతే'

'అలస్యాత్ దౌర్బల్యాత్ క్లమాత్ శ్రమాత్ చింతనాత్ స్వభావాచ్చ
రాత్రౌజాగరణాదపి నిద్రా పురుషస్య సంభవతి'

- : 7- 71 శ్లో. :

దౌర్బల్యము, శ్రమము, క్లేశము, మదము,ఆలస్యము, చింత, అధికముగ భుజించుట, స్వభావము, మున్నగువాని వలన జనించును. రాత్రి మేల్కొనియుండుట వలనను ఇది జనించును.

## 22. అపస్మారము :

'అపస్మారోనామ దేవనాగ యక్ష రాక్షస పిశాచాదీనాం గ్రహణాదనుస్మరణాత్. ఉచ్ఛిష్ట శూన్యాగార సేవనాశుచి కాంతారాతిపాతధాతు వైషమ్యాదిభిః విభావైః ఉత్పద్యతే'

'భూత పిశాచ గ్రహణాను స్మరణోచ్ఛిష్ట శూన్యగృహ గమనాత్
కాలాంత రాతి పాతాత్ అశుచేతశ్చ భవత్యపస్మారః'

- : 7- 73 :

దేవ నాగ యక్ష రాక్షస భూత పిశాచములు ఆవేశించుట, వానిని స్మరించుట, ఎంగిలి తినుట, శూన్యాగారమున నివసించుట, కాలనియమమును పాటింపకుండుట, అశుచిత్వము, ధాతువైషమ్యము, వ్యాధి, మున్నగువాని వలన అపస్మారము కలుగును.

## 23. సుప్తము :

'సుప్తంనామ నిద్రాసముత్థమ్'

'నిద్రాది భవేంద్రియోపరమణ మోహనైర్భవేత్సుప్తమ్'

నిద్రకు లోనగుట, ఇంద్రియసంతృప్తి, మోహము అనువాని వలన సుప్తము కలుగును

## 24. విబోధము :

/ ప్రబోధము / 'విబోధోనామ నిద్రాశ్ఛేదాహార విపరిణామదుః స్వప్నతీవ్ర శబ్ద రూపాదిభిః విభావైః ఉత్పద్యతే'

'ఆహార విపరిణామాత్ శబ్దస్పర్శాదిభిశ్చ సంభూతః'

- 7 - 76 ః

ఆహార విపరిణామము, శబ్దస్పర్శములు, మున్నగువాని వలన విబోధము కలుగును. నిద్రాభంగము, తీవ్రశబ్ద శ్రవణము అనువాని వలనను ఇది కలుగును.

## 25. అమర్షము :

'అమర్షోనామ విద్యైశ్వర్య ధనబలాధికైః అధిక్షిప్తస్యావ మానితస్యావా సముపద్యతే'

'అక్షిప్తానాం సభామధ్యే విద్యాశౌర్య బలాధికైః

నృణాం ఉత్సాహ సంయోగాదమర్షోనామజాయతే'

- ః 7 - 77 ః

అధిక విద్యా బల ఐశ్వర్యయుతులైన వారిచే సభయందు అధిక్షేపింప బడుట వలన అమర్షము జనించును.

## 26. అవహిత్థము :

'అవహిత్థం నామ ఆకారప్రచ్ఛాదనాత్మకమ్ తచ్చలజ్జా భయాపజయ గౌరవ జైహ్మ్యాదిభిః విభావైః ఉత్పద్యతే'

'ధార్ష్ట్య జైహ్మ్యాది సంభూత మవహిత్థం భయానకమ్'

- ః 7 - 79 ః

ఆకార ప్రచ్ఛాదనాత్మకము అవహిత్థము. లజ్జ, భయము, అపజయము, గౌరవము, కుటిలత్వము, మున్నగు విభావముల వలన జనించును. ధార్ష్ట్యము, కౌటిల్యము అనువాని వలన భయాత్మకమగు అవహిత్థము కలుగును.

## 27. ఉగ్రత :

'అథోగ్రతానామ చౌర్యాభి గ్రహణా నృపాపరాధా సత్ప్రల్లాపాదిభిః విభావైః ఉత్పద్యతే'

'చౌర్యగ్రహణ నిరోధాన్నృపాపరాధాత్తతోగ్రతా భవతి'

– ౹ 7 – 80 ౹

చౌర్యాభిగ్రహణము, నృపాపరాధము, అసత్ప్రలాపము, మున్నగు విభావముల వలన ఉగ్రత జనించును.

## 28. మతి :

'మతిర్నామ నానాశాస్త్రార్థ చింతనోహాపోహాదిభిః విభావైః ఉత్పద్యతే'

'నానాశాస్త్ర వినిష్పన్నామతిః సంజాయతే నృణాం'

– ౹ 7 – 81 ౹

నానాశాస్త్రార్థ చింతనము, ఊహా–అపోహములు, మున్నగువాని వలన 'మతి' జనించును.

## 29. వ్యాధి :

'వ్యాధిర్నామ వాత పిత్త కఫ సన్నిపాత ప్రభవః । తస్య జ్వరాదయోవిశేషః జ్వరస్తు ఖలుద్వివిధః సశీతః సదాహశ్చ'

'సామాన్యతస్తు వ్యాధీనాం.....'

– ౹ 7 – 82 ౹

వాత పిత్త కఫ సన్నిపాతముల వలన నిది జనించును. ఇందలి విశేషములు జ్వరాదులు. ఇది సశీతము. సదాహము అని రెండు విధములు.

## 30. ఉన్మాదము :

'ఉన్మాదోనామ ఇష్ట జన వియోగ విభవనాశ వ్యసనాభి ఘాత వాత పిత్త శ్లేష్మ ప్రకోపాదిభిః విభావైః ఉత్పద్యతే'

'ఇష్టజన విభవనాశా దభిఘాతాద్వాత పిత్త కఫో కోపాత్

వివిధాంచిన వికారాదున్మాదో నామసంభవతి'

- ।7 - 83।

ఇష్టజన వియోగము, విభవ నాశము, వ్యసనము, అభిఘాతము, వాత పిత్త శ్లేష్మ ప్రకోపము, వివిధ చిత్త వికారములు అనువాని వలన ఇది జనించును.

## 31. మరణం :

మరణంనామ వ్యాధి జమభిఘాత జంచ । తత్ర యదాంత్ర్యకృచ్ఛూల దోషవైషమ్య గండపిండకాజ్వర విషూచికాదిభిః విభావైః ఉత్పద్యతే'

'వ్యాధీనామేక భావోహి మరణాభినయః స్మృతః' - ।7-85 ।

మరణము వ్యాధిజము, అభిఘాతము అని రెండు విధములు. ఆంత్రము, అకృత్తు, శూల, వాత పిత్త కఫములు అనువాని వైషమ్యము వలనను, గండము, పిండకము॰ పుండు ॰, జ్వరము, విషూచి, మొదలగువాని వలనను సంభవించును. ఇది వ్యాధిజము.

శస్త్రము, పాముకాటు, విషము, క్రూరమృగములు, మున్నగువాని వలనను, గుఱ్ఱములు, ఏనుగులు, రథములు, మున్నగు వాహనముల నుండి పడుట వలనను కలుగు మరణము అభిఘాతము.

వ్యాధిజములైన మరణము లన్నింటి యందు అభినయము ఒకేవిధముగ నుండును.

భరతుని మతమున మరణమన సాక్షాన్మరణమే అని కొందరి అభిప్రాయము. కాని ఆచార్య నరసింహంగారు దీనిని సోపపత్తికముగ ఖండించినారు.[22]

దశవిధ కామావస్థలలో నున్న మరణము ప్రత్యుజ్జీవనాశాశూన్యము, జాతప్రాయము, ఆకాంక్షితము, సమీపవర్తి పునరుజ్జీవనము అని చతుర్విధము.

## 32. త్రాసము :

'త్రాసోనామ విద్యుదుల్కాశనిపాతానిర్ఘాతాంబుద రవసత్త్వ దర్శన పశవారవాదిభిః విభావైః ఉత్పద్యతే'

'మహాభైరవ నాదాద్యైః త్రాపః సముపజాయతే' - ।7-90।

విద్యుత్తు, ఉల్కలు, అశనిపాతము, భూకంపము, మేఘములు, పెద్ద జంతువులు, పశువుల అరుపులు, భయంకరనాదము, మున్నగువాని వలన ఇది జనించును.

22. సాహిత్యదర్శనము, పుటలు 139, 140

33. వితర్కము :

'వితర్కోనామ సందేహ విమర్శప్రత్యయాదిభిః విభావైః ఉత్పద్యతే'
'విచారణాది సంభూతః సందేహ జననాత్మకః'

-:7-91:

సందేహము, విమర్శ, విప్రతిపత్తి మున్నగువాని వలన జనించును. విచారణాదుల వలన సంభూతమగు సందేహజనాత్మకము వితర్కము.

ఈ ముప్పదిమూడు వ్యభిచారి భావములను దేశ కాలావస్థాను రూపముగ ఆత్మగత పరగతాది విభాగమున, మధ్యస్థమయినరీతిచే ఉత్తమ, మధ్యమ, అధము లయిన స్త్రీ పురుషులు ప్రయోగానుసారముగ అభినయింపవలెను.

స్థాయిభావములు :

'విరుద్ధై రవిరుద్ధై ర్వాభావై ర్విచ్ఛిద్యతే నయః
ఆత్మభావం నయత్యన్యాన్ స్థాయీవ లవణాకరః'

అని దశరూపకము : 4-34 శ్లో.:

విరుద్ధములగు భావములచే గాని, అవిరుద్ధములగు భావములచే గాని విచ్ఛేదమును పొందక, తన లవణత్వమునే తనను జేరిన ఇతర జలము లన్నింటికిని కలిగించు సముద్రము వంటిది స్థాయి.

'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయిభావ ఉదాహృతః'

అని దశరూపకమున గలదు.

సజాతీయములచే గాని, విజాతీయములచే గాని తిరస్కృతము కాక రసనిష్పత్తిపర్యంతము హృదయముల నిల్రదొక్కొని యుండునది స్థాయి.

రసతరంగిణీ కర్త 'చరమసమయ పర్యంత స్థాయిత్వా దస్యస్థాయిత్వవ్యపదేశః' అని చెప్పియున్నాడు. చరమసమయ పర్యంతము, అనగా రసస్ఫూర్తి పర్యంతము, నిలుచు భావము స్థాయి.

'అవిరుద్ధా విరుద్ధావా యం తిరోధాతుమక్షమః
ఆస్వాదాంకురకందోఽ సౌ భావః స్థాయీతి సమ్మతః'

అని సాహిత్యదర్పణము :తృ.పరి., శ్లో. 174:.

విరుద్ధములు, అవిరుద్ధములు అగువానిచే తిరోగమింపనిదియు,

ఆస్వాదాంకురకంద మయినదియు నగు భావము స్థాయి అనబడును.

నాట్యశాస్త్రమున –

'యథా నరాణాం నృపతిః శిష్యాణాంచ యథాగురుః

ఏవంహి సర్వభావానం భావః స్థాయి మహానిహో'

ః అ.7, శ్లో.8ః

అని కలదు. నరులలో నృపతి వలె, శిష్యులలో గురువు వలె సర్వభావ సముదాయములో స్థాయి మహనీయమై యొప్పును. ఈ అభిప్రాయములే భరతుడు మరల ఈక్రింది విధముగ వ్యక్తీకరించి యున్నాడు.

'యథాహి సమానలక్షణాః తుల్యపాణి పాదోదర శరీరాః.......

... .... .... స్థాయిభావో రసనామ లభతే'

– ః నా.శా., అ. 7ః

పాణిపాదోదర శరీరములగు సంగ ప్రత్యంగముల విషయమున సర్వమానవులకు లక్షణములు సమానములుగనే ఉండును. అయినను కుల శీల విద్యాకర్మ శిల్ప విచక్షణుడు రాజగుచున్నాడు. అల్పబుద్ధులగు ఇతరులు ఆతనికి అనుచరు లగుచున్నారు. ఇట్లే విభావానుభావ వ్యభిచారులు స్థాయిభావము నాశ్రయించి కొనియే యుండును. అనేకభావముల కాశ్రయమై యుండుటచే స్థాయి ప్రధానమై స్వామిరూపమున నుండ ఇతరములు గుణరూపమున ఆశ్రయించి యుండును. వ్యభిచారి భావములు పరిజనముల వలె నుండును. బహుజనపరివృతుడైనవాడే నరేంద్రుడగును. ఎంత గొప్పవాడైనను ఇతరుడు అట్లు కాలేడు. అట్లే విభావానుభావ వ్యభిచారి పరివృతమగు స్థాయిభావమే రసనామమును పొందును. 'మాలాంతర్గతమగు సూత్రము వలె స్థాయిభావ ముండును. ఇతరములగు భావములు దీని ననుసరించియే యుండును'[23] అని సాహిత్య దర్పణమున గలదు. ఇతర భావములచే స్థాయి తిరోధానము నొందదని, మరియు పరిపుష్టి నందుననియు తెలియు చున్నది. మాలాంతర్గత మగు సూత్రమేరీతిగ తిరస్కరింపబడక భూషింపబడునో అట్లే అన్యభావములచే స్థాయియు తిరస్కృతము కాక భూషింప బడును. అనగా పరిపుష్టి నొందును. దీని ననుసరించి రసము మాలాస్థానీయము, స్థాయి సూత్రస్థానీయము నని చెప్పవచ్చును.

---

23. 'సక్సూత్రవృత్త్యాభావ నామన్యేషా మనుగామకః
నతిరోధీయతే స్థాయీ, తైరసా పుష్యతేపరమ్' – సాహిత్యదర్పణము

'చిరం చిత్తేవతిష్ఠంతే సంబధ్యంతేఽనుబంధిభిః
రసత్వం యే ప్రపద్యంతే ప్రసిద్ధాంః స్థాయినోఽత్రతే'

అను దశరూపక శ్లోకము వలన చిరకాలము వరకు సహృదయుల చిత్తమున నిలుచునవియు, విభావాదుల సంబంధము గలవియు, అనగా వానివలన వ్యక్తము చేయబడునవియు, రసత్వమును పొందునవియు అగు భావములు స్థాయి భావములని తెలియుచున్నది.

ఇవి వరుసగా -

'రతి, హాస, శోక, క్రోధోత్సాహ భయ
జుగుప్సా విస్మయాశమాః స్థాయినోవాః' - ః కావ్యానుశాసనముః రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము.

### 1. రతి :

'తత్ర రతిర్నామ ఆమోదాత్మకోభావః ఋతుమాల్యాను లేపనాభరణ ప్రియజనవర భవనానుభవనా ప్రతికూల్యాదిభిః విభావైః ఉత్పద్యతే' అని నాట్యశాస్త్రము.

'ఇష్టార్థ విషయప్రాప్త్యా రతిః సముపజాయతే
సౌమ్యత్వాదభినేయా సావాఙ్మాధుర్యాంగ చేష్టితైః'

- ః అ.7, శ్లో. 9ః

ప్రమోదాత్మకము రతి. ఋతువులు, పుష్పమాలలు, మైపూతలు, ఆభరణములు, ప్రియజనములు, శ్రేష్ఠమగు భవనము, వీని అనుభవము, అప్రతికూల్యత మొదలగు విభావముల వలన జనించును. ఇష్టార్థ విషయప్రాప్తి వలన రతి జనించును.

రసగంగాధరమున - 'స్త్రీపుంసయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్య చిత్తవృత్తి విశేషో రతిః' - స్త్రీపురుషుల అన్యోన్య ఆలంబనము కల ప్రేమ అనబడు చిత్తవృత్తి విశేషము రతి అని గలదు.

సాహిత్యదర్పణమున - 'రతిర్మనోఽనుకూలేఽర్థే మనసః ప్రవణాయితమ్'-ః3-176ః

'మనోనుకూలమైన యర్థమున మనసు ఆసక్తి చెందుట రతి' అని చెప్పబడినది.

'తత్రసంభోగ విషయ ఇచ్ఛావిశేషో రతిః' అని ప్రతాపరుద్రీయము. సంభోగవిషయక మగు ఇచ్ఛయే రతి.

కావ్యానుశాసనమున - 'తత్రపరస్పరాస్థా బంధాత్మికా రతిః' అని గలదు ఆస్థ

అనగా ఆపేక్ష, ఆదరము. పరస్పరము స్త్రీపురుషులు ఆపేక్షచే బంధింపబడిన అది రతి అనబడును.

భరతుడు ఆమోదాత్మకమగు భావము రతి అనెను. సాహిత్యదర్పణ కారుడు దీనినే అనుకరించెను. కాని రసగంగాధరకారాదులు తదితర లక్షణ సామస్త్యమును మనమున నిడికొని స్త్రీపురుష సంబంధము గల ఆసక్తినే రతి అని స్పష్టీకరించిరి.

## 2. హాసము :

'అథ హాసోనామ పరచేష్టానుకరణా సంబద్ధప్రలాప పౌరోభాగ్య సాఖ్యాదిభిః విభావైః ఉత్పద్యతే'

'పరచేష్టానుకరణాద్ధాసః సముపజాయతే' - : 7-10 శ్లో.:
పరచేష్టానుకరణా సంబద్ధ ప్రలాపములు, పరుల దోషముల నెన్నుట అను పౌరోభాగ్యము, మున్నగువాని వలన హాసము జనించును.

'వాగంగాది వికార దర్శనా జన్మా వికాసాఖ్యో హాసః' అని రసగంగాధరము. వాగంగాది వికార దర్శనము వలన జనించు వికాసాఖ్యము హాసము.

'వాగాది వైకృతైశ్చేతో వికాసో హాసిష్యతే'
అని సాహిత్యదర్పణము : 3-176:.

వాగాది వికృతి వలన కలుగు చేతోవికాసమే హాసము.

## 3. శోకము :

'శోకోనామ ఇష్టజనవియోగ విభవనాశ వధ బంధన దుఃఖానుభవనాదిభిః విభావైః ఉత్పద్యతే'

ఇష్టజనుల వియోగము, విభవనాశము, వధ, బంధనము, దుఃఖము సంభవించుట మున్నగు విభావముల వలన నిది జనించును.

రసగంగాధరమున - 'పుత్రాది వియోగమరణాది జన్మావైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తి విశేషః శోకః' - పుత్రాదుల వియోగము, మరణము, మున్నగువాని వలన కలిగి వైక్లబ్యమను పేరుగల చిత్తవృత్తి విశేషము శోకము.

ఈ అభిప్రాయమునే సాహిత్యదర్పణకారుడు

'ఇష్టనాశాదిభిశ్చేతో వైక్లబ్యం శోకశబ్దభాక్' - : తృ.పరి., 177:
'ఇష్టనాశాదుల వలన కలుగు చిత్తవైక్లబ్యము శోక మనబడును' అని చెప్పియున్నాడు.

## 4. క్రోధము :

'క్రోధోనామ ఆధర్షణాకృష్ట కలహ వివాద ప్రతికూలాదిభిః విభావైః ఉత్పద్యతే' : నాట్యశాస్త్రముః

'రిపుజో గురుజశ్చైవ ప్రణయ ప్రభవస్తథా
భృత్యజః కృతకశ్చేతి క్రోధః పంచవిధః స్మృతః'
అని నాట్యవేదమున గలదు. [24]

శత్రువు వలనను, గురువు వలనను, ప్రణయము వలనను, భృత్యుల వలనను, కృతకముగను ఇది జనించును. ఈరీతిగ నిది ఐదువిధములు.

ప్రతాపరుద్రీయమున- 'శత్రుకృతాపచారేణ మనః ప్రజ్జ్వలనం క్రోధః - శత్రుకృతాపచారము వలన కలుగు మనః ప్రజ్జ్వలనము క్రోధము అని చెప్పబడినది.

రసగంగాదరమున – 'గురు బంధు వధాది పరమాపరాధ జన్మా ప్రజ్జ్వలనాఖ్యా శ్చిత్తవృత్తి విశేషః క్రోధః' – గురు బంధు వధాది పరమాపరాధము వలన జనించు ప్రజ్జ్వలనాఖ్యమగు చిత్తవృత్తి విశేషము క్రోధము అని కలదు.

సాహిత్యదర్పణమున, – 'ప్రతికూలేషు తైక్ష్ణస్యావబోధః క్రోధ ఇష్యతే' – ప్రతికూలమగు కార్యము లందలి తీక్ష్ణమగు అవబోధమే క్రోధ మనబడును' అని కలదు.

## 5. ఉత్సాహము :

'ఉత్సాహోనామ ఉత్తమప్రకృతిః । సచావిషాదశక్తి ధైర్యశౌర్య త్యాగాదిభిః విభావైః ఉత్పద్యతే' :నా.శా., అ. 7:

ఇది ఉత్తమ ప్రకృతికము. అవిషాదము, శక్తి, ధైర్యము, శౌర్యము, త్యాగము, మున్నగు విభావముల వలన ఇది జనించును.

'పరపరాక్రమ దానాదిస్మృతి జన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః' అని రసగంగాధరము.

పరపరాక్రమ దానాది స్మృతి జన్మమగు ఔన్నత్యమను పేరు గల చిత్తవృత్తి విశేషము ఉత్సాహము.

ఈ జగన్నాథుని లక్షణము కంటె సుబోధమగు రీతిని సాహిత్యదర్పణ లక్షణము కలదు.

'కార్యారంభేషు సంరంభః స్థేయానుత్సాహ ఉచ్యతే' – తృ.పరి. 178 :

---

24. భావచక్రము, శ్లో. 301, పు. 254

సన్నికృష్టములగు కార్యము లందు స్థిరతరమగు ఉత్కంటావేశము ఉత్సాహ మనబడును.

ప్రతాపరుద్రీయమున – 'లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ప్రయత్న ఉత్సాహః' – 'లోకోత్తరములగు కార్యము లందలి స్థిరమగు ప్రయత్నమే ఉత్సాహము' అని చెప్పబడినది.

'ఉత్సాహ స్సర్వకృత్యేషు సత్వరా మానసీక్రియా'

అని శారదాతనయుడు.

సర్వకార్యము లందును సత్వరమైన మానసికచర్యయే ఉత్సాహము.

'పరిపూర్ణఉత్సాహః సర్వేంద్రియాణాం ప్రహర్షోవా వీరః' అని రసతరంగిణీకారుడు.

సర్వేంద్రియముల యొక్క ప్రహర్షము పరిపూర్ణోత్సాహము.

## 6. భయము :

'భయంనామ స్త్రీ నీచప్రకృతికం గురు రాజాపరాధ శూన్యాగారాటవీ పర్యటన పర్వతదర్శన నిర్భత్సన దుర్దిన నిశాంధకారో లూకనక్తం చరారావ శ్రవణాదిభిః విభావైః ఉత్పద్యతే'

'గురు రాజాపరాధేన రౌద్రాణాచ్చాపి దర్శనాత్

శ్రవణాదపి ఘోరాణాం భయం మోహేన జాయతే'

– ః 7 – 22 ః

ఇది స్త్రీ నీచప్రకృతికము. గురు రాజాపరాధము, శూన్యాగారము, అటవీపర్యటనము, పర్వతదర్శనము, బెదిరింపులు, దుర్దినము, చీకటిరాత్రి, గుడ్లగూబలు, రాత్రించరారావములు వినుట, మొదలగు విభావముల వలన జనించును.

రసగంగాధరమున – 'వ్యాఘ్ర దర్శనాది జన్మాపరమానర్థో విషయకో వైక్లబ్యాఖ్యః స్సభయమ్' – వ్యాఘ్రదర్శనాది జన్యముగాని, పరమానర్థ విషయమున గాని అగు వైక్లబ్యాఖ్య చిత్తవృత్తి విశేషము భయము.

## 7. జుగుప్స :

'జుగుప్సానామ స్త్రీనీచ ప్రకృతికాః యాచాహృద్య శ్రవణ దర్శనాదిభిః విభావైః ఉత్పద్యతే'

ఇదియు స్త్రీనీచ ప్రకృతికము. హృద్యములు కానివానిని వినుట, కనుట

మున్నగువాని వలన ఇది జనించును.

'కదర్యవస్తు విలోకన జన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా'

అని రసగంగాధరము.

కదర్యవస్తువు లనగా కుత్సితవస్తువులు. శ్మశానాదులు కదర్యములు. ఇట్టి కదర్యవస్తువులను చూచుట వలన వలుగు విచికిత్స అను పేరు గల చిత్తవృత్తి విశేషము జుగుప్స.

'అర్థానాం దోష సందర్శనాది భిః గర్హణాజుగుప్సా'

అని ప్రతాపరుద్రీయము.

ఆయా పదార్థము లందలి దోషములను చూచుట వలన కలుగు రోత జుగుప్స.

## 8. విస్మయము :

'విస్మయోనామ మాయేంద్రజాల మానుషకర్మాతిశయ విచిత్ర వపుస్తశ్శిల్పాతి శయాద్యైః విభావైః ఉత్పద్యతే'

'కర్మాతిశయనిర్వృత్తో విస్మయో హర్షసంభవః' – 7-27

మాయ, ఇంద్రజాలము, మానవాతీతకృత్యములు, చిత్ర, పుస్త, శిల్ప, అతిశయాది విభావముల వలన విస్మయము జనించును. ఇది కర్మాతిశయమున కలుగును. హర్షసంభవము.

'అలౌకికవస్తు దర్శనాది జన్మాఖ్యో వికాసాఖ్యోవిస్మయః'

అని రసగంగాధరము.

అలౌకిక వస్తుదర్శనాదుల వలన కలిగిన చిత్తవికాసము విస్మయము.

ప్రతాపరుద్రీయమున – 'అపూర్వ వస్తుదర్శనా చ్చిత్తవిస్తారో విస్మయోమతః' అపూర్వ వస్తుదర్శనము వలన కలుగు చిత్తవిస్తారము విస్మయమని చెప్పబడినది.

## 9. శమము :

రసగంగాధరమున

'నిత్యానిత్య వస్తువిచార జన్మా విషయ విరాగాఖ్యో నిర్వేదః'

నిత్యానిత్య వస్తువిచారము వలన జనించిన విషయ వికారమను పేరు గల నిర్వేదమునే శమ మని అందురు.

'శమః అయమేవ నిర్వేద శబ్దే సాపి వ్యజ్యతే'

అని రసచంద్రిక చెప్పుచున్నది.

ప్రతాపరుద్రీయమున - వైరాగ్యాదినా నిర్వికార చిత్తత్వం శమః'
వైరాగ్యాదులచే నిర్వికారమై యుండు చిత్తము శమము అని చెప్పబడినది. శాంతమునకు శమమే స్థాయి కాని నిర్వేదము కాదని హేమచంద్రుని అభిప్రాయము.

పైని చెప్పబడినదంతయు రససాధన సామగ్రి.

## రసనిష్పత్తి :

ఈ రసము ఎట్లు నిష్పన్న మగును? అను విషయమై పలువాదములు కలవు. భరతుడు చెప్పిన రససూత్రము నందలి సంయోగనిష్పత్తి పదముల కర్థభేదమును కల్పించి పలువిధములుగ వ్యాఖ్యానించిరి. ఈవిషయమై పదునొకండు వాదములు బయలుదేరినవి. అందు ఎనిమిదిమాత్రమే రస సూత్రమున కనుగుణములు. ఆ ఎనిమిదింటను ముఖ్యమైనవి నాలుగు మాత్రమే. వానిని చాలమంది. వివరించి తక్కినవానిని విడిచిరి. రసగంగాధరమున మాత్రము అన్నిమతముల తత్త్వము వివరింప బడినది.

రసము కిన్నిష్ఠము అను విషయమై ప్రధానముగ ప్రవర్తిల్లిన నాలుగు మతములు వరుసగా -

1. భట్టలోల్లటుని ఉత్పత్తివాదము
2. శ్రీశంకుని అనుమతివాదము
3. భట్టనాయకుని భుక్తివాదము
4. అభినవగుప్తుని అభివ్యక్తివాదము

వీనియందలి అభినవగుప్తుని అభివ్యక్తవాదమునకు సర్వాలంకారిక ప్రామాణికుడగు ఆనందవర్ధనుని ధ్వనివాదము మూలము. సహృదయ హృదయావర్జకమును, యుక్తియుక్తమును అగు అభినవగుప్తుని వాదమే అందరిచే ఆమోదింప బడినది. కనుక నిట నీవాదమే వివరింపబడుచున్నది.

ఈతని సిద్ధాంత మిది. లోకములో రత్యాదులకు కారణములగు శకుంతలాదుష్యంతాదులు కావ్యమున ఆలంబన విభావములు. ఇట్లే మలయానిల చంద్రికాదులు ఉద్దీపన విభావములు. అశ్రుపాతాదులు అనుభావములు. చింతాదులు వ్యభిచారులు. లోకము నందు కార్యసహకారినామములో నున్నవి, కావ్యపరిభాషలో విభావాది నామమును సంతరించుకొన్నవి. ఈ విభావాదులను కనినంతనే సహృదయుని

సత్త్వగుణ ముద్రిక్తమగును. దాని ఉద్రేకము వలన వాని హృదయము నందు వాసనారూపమున నున్న రత్యాదులుద్బుద్ధము లగును. అనగా విభావానుభావ వ్యభిచారి భావములచే సహృదయుని హృదయమున వాసనారూపమున నున్న రత్యాదులు అభివ్యక్తము లగును. పునః పునః రనుసంధానము వలన ఈ విభావాదులు సాధారణము లగును. అనగా అచ్చటనున్న శకుంతలాదులు సాధారణకాంతలుగ గోచరింతురు. అప్పుడు సహృదయుని పరిమితత్వ మడగును. అనగా స్వపరావబోధము నశించును. చుట్టునున్న ప్రపంచమును మాత్రమే గాక తనను తానే మరచును. దానివలన అనిర్వచనీయమగు నానంద మాతనికి కలుగును. ఇట్టి స్థితి విభావాదుల భావనాబలముననే కలుగును. ఈ భావననే సాధారణీకరణ మందురు. ఈ సాధారణీకరణము వలన సామాజికునకు నాయకాభేదము కలిగి రసానుభవము కలుగును. 'తాఏవ పరిహృత విశేషా రసహేతవః' అను భరతుని వాక్యమునకు గల భావ మిదియే.

ఈతని మతము ననుసరించి రసము సహృదయ సామాజిక నిష్ఠము. ఇదియే సర్వులకు నంగీకార్యము. భరతుని రససూత్రము నందలి సంయోగ పదమునకు వ్యంగ్య వ్యంజక భావము, నిష్పత్తి పదమునకు అభివ్యక్తి అని అర్థము. ఈతని మతమున 'వాసన' ప్రధానమైనది. రత్యాది వాసనలు అనాది సిద్ధము లగుటచేతనే రసప్రతీతి సిద్ధించునని ఈతని అభిప్రాయము. రత్యాది వాసనలు లేనిచో రసాస్వాదము కలుగదని సాహిత్యదర్పణకారుడు 'నజాయతే తదాస్వాదో వినా రత్యాది వాసనామ్' అని చెప్పినాడు. ఈ విషయమునే ప్రమాణీకరించు ధర్మదత్తుని శ్లోకము కూడ సాహిత్యదర్పణమున ఉదాహరింపబడి యున్నది.

'సవాసనానాం సభ్యానాం రసాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠకుడ్యాశ్మ సన్నిభాః'

వాసనా సహితులకు సభ్యులకు రసాస్వాదనము కలుగును. వాసనారహితులగువారు రంగాంత మందలి కాష్ఠ, కుడ్య, అశ్మములతో :కొయ్యలు, గోడలు, రాళ్లు : సమానముగ నుందురు. అని ఈ శ్లోక భావము. కావున వాసనాసహితుడగు సహృదయునకే రసాస్వాదము కలుగును. సహృదయునిచేత రసము సత్యముగ, అలౌకికముగ తెలియదగినది.

ఇంతదనుక రసప్రతీతి ఎట్లు కలుగునో వివరింప బడినది. ఇక దీనికి గల

విఘ్నములను కూడ పరికింపవలసి యున్నది.

## రసప్రతీతి విఘ్నములు :

రసప్రతీతికి రససామగ్రీ సమగ్రత ఆవశ్యకము. విభావాదులు యత్కించిన్న్యూనములైనను రసప్రతీతి ఆమేరకు బాసింపదు. రస ప్రతీతికి కలుగు ఆటంకములనే రసప్రతీతి విఘ్నము లందురు. అవి ఏడు కలవు. వరుసగా–

1. సంభావన సరిగా లేకపోవుట. ఈ సంభావనా విరహము ప్రతిపత్తిలో యోగ్యత నాపాదింపదు.
2. స్వగత మని పరగత మని నియమమున దేశకాల విశేషావేశమును పొందుట.
3. స్వకీయము లయిన సుఖదుఃఖాదులకు పరవశ యగుట.
4. ప్రతీతికి సముచితము లయిన యోగ్యోపాయముల వైకల్యము.
5. సరిగా స్ఫుటత్వము లేకపోవుట.
6. అప్రధానతాదృష్టి.
7. సంశయయోగము [25]

రసప్రతీతి విఘ్న నిరాసనముచే రసప్రతీతి ఏర్పడును. రసము 'వీతవిఘ్నప్రతీతి' అని అభినవగుప్తుడు చెప్పినాడు. వీతవిఘ్న ప్రతీత్యాస్పదమగు సత్త్వోద్రిక్తమగు అంతఃకరణము నందు రసము ఆనందఘనముగ భాసించును.

రసము సుఖాత్మకమా! దుఃఖాత్మకమా! : ఇక కావ్యరసము సుఖాత్మకమా! దుఃఖాత్మకమా! అను మరియొక ప్రశ్న యుదయించును. రసము అన్నియు నానందజనకములే యని అభినవగుప్తుని మతము. రసము లన్నింటి వలనను ఆనందమే కలుగునను అభినవగుప్తుని అభిప్రాయముతో విశ్వనాథుడును ఏకీభవించినాడు.

'హేతుత్వం శోకహర్షాదేర్గతేభ్యో లోకసంశ్రయాత్।
శోకహర్షాదయో లోకే జాయాంతాం నామలౌకికః।
అలౌకికి విభావత్వం ప్రాప్తేభ్యః కావ్యసంశ్రయాత్॥
సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతికాక్షతిః। [26]

లౌకికములైన హర్షాది కారణముల వలన లోకము నందు శోకహర్షాదులే

---

25. ఇవి నాట్యవేద మాధారముగ నీయబడినవి. వీనికి సంబంధించిన విపులమగు చర్చ అందు గలదు – పుటలు 172–79
26. సాహిత్యదర్పణము, తృ.పరి., 6–9 శ్లో.

కలుగును. కాని లోకము నందలి ఆకారణములే కావ్యమున అలౌకికములై విభావాదుల పేర వ్యవహరింపబడి హర్షమును మాత్రమే కలిగించును. రసము సుఖదుఃఖాత్మకమును అని నాట్యదర్పణకారుని అభిప్రాయము. ఈతడు శారదాతనయుని-

'యస్తుష్టౌ తుష్టి మాప్నోతి శోకే శోక ముపైతిచ
క్రోధేక్రుద్ధో భయే భీరు స్సశ్రేష్ఠః ప్రేక్షకఃస్మృతః'

అను సహృదయుని లక్షణమును సమర్థించుచు 'సుఖదుఃఖాత్మకో రసః' అని ప్రపంచించినాడు. ఈభావమునే భోజుడు, రుద్రభట్టుడు, మున్నగువారు స్వీకరించి యున్నారు. ఈభావమునే శ్రీ రాకేష్‌గుప్త గారు సీతాపరిత్యాగాది ఘట్టములలో మనము కేవల దుఃఖమునే పొందుచుంటి మనియు, అప్పుడు కలుగు బాష్పముల నానందబాష్పము లనుకొనుట భ్రమ అనియు నభిప్రాయ పడిరి. [27] వీరి అభిప్రాయము ననుసరించి కరుణరస ఘట్టములను మనము చదువుకొనుటకు కారణము ఆనందము కాదు. దుఃఖము మాత్రమే. మనల నట్టి ఘట్టములవైపు ఆకర్షించునదేమి? అను ప్రశ్నకు వీరి సమాధానము మనకు దానియందు గల యిష్టమే : interest అనుట (it consists in our interest to perceive it - Ibid - p. 80). కరుణరస ఘట్టములలో మనకు కలిగెడి అనుభూతి కేవల దుఃఖాత్మకము అనుటకు ఉదాహరణములుగ రెండు దుఃఖదాయకము లగు సంఘటనములను వీరు పేర్కొనియున్నారు. వీరు ఈవిషయమై అత్యంతము కృసి సల్పి తీవ్రముగ విమర్శ చేసియున్నారు. కాని వీరు ఒక విషయమునకు సరిగా సమాధానము నొసగియుండలేదు. కావ్యమున గాని, నాటకమున గాని హరిశ్చంద్రాది కథలను మరల మరల చదువవలె నని ఇచ్ఛగింతుము. కాని లోకమున అట్టి సంఘటనములు జరుగవలెనని కాని, వానిని మనము చూడవలెనని గానిభావింపము, ఇచ్ఛగింపము. మరి రాకేష్‌గుప్తా గారు చెప్పినట్లు కావ్యపఠనాదుల వలన కల్గునది ఆనందము కాక, కేవల దుఃఖమే అయినచో నీ భేదమెట్లు సంభవించును? దీనికి గల కారణమేమి? దీనికి రాకేష్ గుప్తా గారు సమాధానమును చెప్పియుండలేదు.

ఈవిషయమై డా॥నండూరి రాధాకృష్ణగారు కొంత చర్చ చేసియున్నారు.

---

27. 'All the scholars of Hindi & Sanskrit peotics who have dealt with Rasavada without any exception and a majority of the Western critics seem to have been labouring under the illusion that the end of all poetry is to please....'

- Psychological Studies in Rasa, p. 37

'భోజనము చేయునపుడు మన మనుభవించు రుచి వలన మన కానందమెట్లు గలుగునో, అట్లే నాట్యదర్శనాదు అందును మన మనుభవించు రుచి వలన మన కానందము కలుగును. భోజన మందలి రుచులలో తీపి, వగరు, కారము, మొదలగునవి తినుచున్నపుడు భిన్న భిన్నానుభూతుల నిచ్చుచున్నను చిట్టచివర కానందమునేయిచ్చును. కారమును తినుచున్నప్పుడు కన్నులవెంట నీరు వచ్చినను మనము తినుచు ఆనందించుచునే యున్నాము. కన్నులు చెమర్చినవి. కదా యని దానివలన ఆనందము కాక దుఃఖము కల్గిన దనరాదు. అట్లే కావ్యరసములలో శృంగారము, వీరము, కరుణము, మొదలగువాని వలన భిన్నానుభూతులు కలిగినను, తుదకు కలుగునది యానందమే. కరుణ రసాస్వాదనమున కన్నుల వెంట నీరు వచ్చినంతమాత్రమున నది దుఃఖమునే కలుగచేయుచున్న దనుకొనుట పొరపాటు. దీనివలన కూడ మన కానందమే కలుగు చున్నది. భరతు డిచ్చిన యుపమానములో నింతటి యర్థ మిమిడి యున్నది'.[28]

కావున రసము లన్నియు నానందదాయకములే.

ఇక రససంబంధ మగు మరికొన్ని విషయములు - అనగా కావ్యమున రసమునకు గల స్థానము, రససంఖ్య - రసానుగుణములగు వృత్తులు, రీతులు, రసాధిదేవతలు - వర్ణములు, రసాభాసము రసదోషములు - ఇత్యాదులు ఆయా ప్రకరణములలో స్థూలముగ వివరింప బడినవి. ఈ రసములు తొమ్మిది యని రససంఖ్యా ప్రకరణమున నిరూపింప బడినది. కావున ఆ నవరసములకు ఏవి పోషకములు, ఏవి విరోధములు అనునవి ఆయా ప్రకరణములలో సంగ్రహముగ చెప్పబడినవి.[29]

నవరసముల వలన కలుగు ఆనందము విగళవేద్యాంతరము. బ్రహ్మాస్వాద సహోదరము. అఖండ స్వప్రకాశానంద చిన్మయము. సాహిత్యదర్పణకారుడు ఈయర్థమునే -

'సత్త్వోద్రేకా దఖండ స్వప్రకాశానంద చిన్మయః

---

28. కరుణరసము -ఆంధ్రవాఙ్మయము

29. ఇది కేవల రససిద్ధాంతమునకు సంబంధించిన సిద్ధాంతవ్యాసము కాదు కావున రససంబంధమగు సర్వవిషయములకు విపులీకరణము అనావశ్యకమని భావించి విషయము సంగ్రహముగ మాత్రమే వ్రాయబడినది.

'సత్త్వోద్రేకా దఖండ స్వప్రకాశానంద చిన్మయః
వేద్యాంతర స్పర్శశూన్యో బ్రహ్మాస్వాద సహోదరః
లోకోత్తర చమత్కారప్రాణః కైశ్చిత్ప్రమాతృభిః
స్వాకార వదభిన్నత్వే నాయమాస్వాద్యతే రసః'

– ః తృ. పరి., శ్లో. 2, 3ః

అని చెప్పియున్నాడు.

దైవతాధివాసమై బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసానందమునందించు నిట్టి రసావతారము నుపాసించుట వలన కలుగు ఫలితములను అల్లరాజు.

'దానేముఖ్యం ఫలం పుణ్యం కీర్తి స్తత్రానుషంగికే

యథాయథా రసేపుణ్యం ముఖ్యం ప్రాసంగికం సుఖమ్'[30] అని పేర్కొని యున్నాడు.

30. రసరత్నప్రదీపిక, ప్ర. పరి.,శ్లో.23

# 3 ఆ. కావ్యమున రసమునకు గల స్థానము

కావ్యమున రసమునకు గల స్థానమును గూర్చి చర్చించుటకు పూర్వము కావ్యమన నేమో కొంతవరకు పరిశీలించుట యుచితము. మనసులోని మాటను సూటిగాను, అర్థమగునట్లును చెప్పుట ఒక విశేషము. దానినే రమణీయముగను, ఇంపుగొలుపురీతిని, కనులకు గట్టునట్లుగను వ్యంగ్యగౌరవముతో చెప్పినఅది 'కళ' యగును. రమ్యములగు శబ్దార్థములను కూర్చి ఒక భావమును కళాత్మకముగ చెప్పగలవాడు సాధారణముగ నూటికి ఒక్కడుండును. అట్టివ్యక్తి యొక్క పలుకులు అమృతసేచనము వలెనుండి అన్యుల మనస్సులను రంజింప జేయును ఆపలుకులలోని అవ్యక్తమైన ఆనందము నాస్వాదించి లోకులు అతనిని గౌరవించుచుందురు. ఇట్లు గౌరవమును పొందువాడే కవి. ఆతని సృష్టియే–కర్మ–కావ్యమనబడును.

ఈ కావ్యమును పలువురు పలువిధములుగా నిర్వచించియున్నారు. 'కవనీయం కావ్యం' – వర్ణింపతగినది కావ్యమని లోచనకారుడును 'కవయతీతి కవిః తస్యకర్మకావ్యం' –వర్ణించువాడు కవి. ఆతని కర్మకావ్యమని విద్యాధరుడును, 'కౌతిశబ్దాయతే విమృశతి రసభావాన్ ఇతికవిః తస్యకర్మకావ్యం' రసభావములను విమర్శించువాడు కవి, వానికర్మకావ్యమని భట్టగోపాలుడును, 'లోకోత్తర వర్ణనానిపుణ కవి కర్మ కావ్యం' – లోకోత్తర వర్ణనానిపుణుడగు కవియొక్క కర్మ కావ్యమని మమ్మటుడును నిర్వచించి యున్నారు. ఇవికాక మరికొన్ని నిర్వచనములు కలవు.

1. ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ – కావ్యాదర్శము, దండిః
2. కావ్యం రసాదిమద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్ – ఃఅలంకారశేఖరము, శౌద్ధోదనిః
3. నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్, రసాత్మకమ్ కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి – ఃసరస్వతీ కంఠాభరణము, భోజుడుః

4. నిర్దోషా లక్షణవతి సరీతిర్గుణ గుంఫితా సాలంకార రసానేక వృత్తిర్వాక్ కావ్యనామభాక్ ః చంద్రాలోకము, జయదేవుడుః

5. రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్ – ః రసగంగాధరము, జగన్నాథుడుః

6. శబ్దార్థౌ సహితౌ కావ్యమ్ – ః భామహాలంకారము, భామహుడుః

7. ననుశబ్దార్థౌ కావ్యమ్ – ః రుద్రటుడుః

8. కావ్యశబ్దోఽయం గుణాలంకార సంస్కృతయోః శబ్దార్థయోర్వర్తతే – ః కావ్యాలంకారము, వామనుడుః

9. సాధుశబ్దార్థ సందర్భం గుణాలంకార భూషితమ్; స్ఫుటరీతి రసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే – ః వాగ్భటుడుః

10. గుణాలంకార సహితౌ, శబ్దార్థౌ దోషవర్జితౌ...కావ్యం కావ్యవిదో విదుః – ప్రతాపరుద్రీయము, విద్యానాథుడుః

11. తత్ర నిర్దోషశబ్దార్థ గుణవత్త్వే సతిస్ఫుటమ్, గద్యాది బంధరూపత్వమ్, కావ్యసామాన్యలక్షణమ్ – ః సాహిత్యసారము, అచ్యుతరాయలుః

12. గుణాలంకార సంయుక్తౌ, శబ్దార్థౌ రసభావగౌ, నిత్యదోష వినిర్ముక్తౌకావ్యమిత్యభిధీయతే– ః అలంకార చంద్రిక, న్యాయవాగీశుడుః

13. తదదోషౌ శబ్దార్థౌసగుణావనలంకృతీ పునఃక్వాపి – ః కావ్యప్రకాశము, మమ్మటుడుః

14. వాక్యం రసాత్మకం కావ్యమ్ – ః సాహిత్యదర్పణము, విశ్వనాథుడుః

కావ్యశబ్దమును నిర్వచించుటలో అది 'కవికర్మ' మనుట వలన నాతని కొక ప్రత్యేకత ఆపాదింపబడుచున్నది. ఉజ్జ్వల గుణసంపత్తి కలవాడు కవి అగుటచే అతని కవితారూపగుణసంపత్తి అతని కావ్యమున ప్రతిబింబించుచుండును. కవిపురాజన్మసుకృత ఫలముగ ప్రతిభను కలిగియుండి, లోకశాస్త్ర కావ్యద్యవేక్షణము వలన వ్యుత్పత్తిని గడించి, నిరంతరాభ్యాసముచే వానిని రసవత్తర మగు రీతిని తన కావ్యమున ప్రదర్శించును. మమ్మటుని నిర్వచనానుసారము లోకోత్తర వర్ణనానిపుణుడే కవి. మిగిలినవారు చెప్పినదాని సారాంశమును ఇదియే. అయినను ఈతని వాక్యము మరింత స్పష్టతా సంపాదకము. లోకోత్తర వర్ణనానైపుణ్యము ఋషులకే సాధ్యమగును, నానృషిః కురుతే కావ్యమ్ అని గదా ఆర్యోక్తి. ఋషులు క్రాంతదర్శనులు. వారికి క్రాంతదర్శిత్వము తపోబలమున దేవతాప్రీణమున లభించినది. ఇట్టివారే మహాకవులు ప్రాచీనులు 'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః' అని కవిని ఈశ్వరునిగనే కీర్తించిరి 'ఋషిశ్చ

మంత్రద్రష్టే అనుట వలన ఋషి లౌకికాలౌకిక వస్తువులను స్వయముగా దర్శించువాడగుచున్నాడు. కవి ఋషి అనుటచే అతడు తొలుతత ద్రష్టయై, పిమ్మట స్రష్ట యగుచున్నాడు. కావున అతని కావ్యము లోకాతీతమును, అనితర సాధ్యమును అగు వస్తుసంపత్తికి ప్రతిబింబమై యలరారు చుండును. 'నానృషిః కవిరిత్యుక్తమ్' అని భట్టతౌతుడును ఋషి కానివాడు కవి కాలేడని పూర్వులు నుడివినట్లు చెప్పుచున్నాడు.

పై నిర్వచనముల వలన తేలిన సారాంశము – లోకోత్తర వర్ణనానిపుణుడగు కవికర్మ కావ్యమని, ఈ కావ్యమునకు దోషరహితములు గుణసహితములు, అలంకార యుక్తములు నగు శబ్దార్థములు కావ్యశరీరమని.

ఆలంకారిక నిర్వచనానుసారము విభావములచేతను, అనుభావములచేతను, సాత్త్వికభావములచేతన, వ్యభిచారిభావములచేతను స్వాదువుగా చేయబడిన స్థాయి భావమే రసము.[1]

ఇక కావ్యమున రసమునకు గల స్థానమును చూడవలసి యున్నది. వాఙ్మయము నందలి ప్రతి కావ్యమునకు పరమ ప్రయోజనము రసము. ఆంధ్రకవుల రసదృష్టి ప్రకరణాంతభాగమున వివరింప బడును. రసవిలసితము కాని కావ్యమునకు వేద పురాణ వైలక్షణ్యమును, కాంతా సమ్మితత్వమును కుదురవు. ఆంధ్రవాఙ్మయమున రసతత్త్వము నరయుటకు ముందు తన్మూలమగు సంస్కృతము నందలి దీని తత్త్వమును పరిశీలింపవలసి యున్నది. నవీనులగు సంస్కృతాలంకారికులు కావ్యమున రసమే ప్రధానమని చెప్పి యున్నను సాహిత్యసిద్ధాంత చర్చలు కావించిన ప్రాచీనులలో మతభేదములు ఎన్నియో గలవు. ఆయా తీరులను పరిశీలించి రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచిత్యసంప్రదాయములుగ సాహిత్యవిమర్శకులు విశ్లేషించుచున్నారు. ఇందేవియును పరస్పర నిరపేక్షములు కావు. ప్రాధాన్యవివక్ష వలన ఆయా వాదములు బయలు వెడలినవే కాని ఇతరములను కేవలము కాదన్నవి కావు. పంచాయతన పూజా సంప్రదాయము వలె ఇవన్నియును శిరోధార్యములే. అయినను 'తథాపి తరుణేందు శేఖరే' అన్నట్లు రసము ఈ సిద్ధాంతవ్యాసమునకు విషయము.

---

1. రసమును గూర్చి ఒకింత విపులముగానే పూర్వ ప్రకరణములో చర్చింపబడుట వలన నిట వాని చర్చ విడువ బడినది.

రససిద్ధాంతమున కాద్యుడు నందికేశ్వరుడుని రాజశేఖరుడు చెప్పియున్నను భరతుడే దీనికి ప్రవక్త అని చెప్పదగును. భరతుడు తన నాట్యశాస్త్రమున 'ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికీర్తితమ్' – 'నాట్యమునకు ఇతివృత్తము శరీరము అని చెప్పియున్నారు' అనినాడు. ఆతడు రూపకాత్మ విచారమును చేయకున్నను రసము శిరోధార్యమని అభిప్రాయ డినాడు. 'నహిరసాదృతే కశ్చి దప్యర్థః ప్రవర్తతే' – రసాదృతము గానిదేదియు ꞉నాట్యమున꞉ లేదనినాడు. దీనిని బట్టి ఆతని మతమున నాట్యమున ꞉దృశ్యకావ్యమున꞉ రసమునకు గల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది.

తరువాత దీనికి పట్టము గట్టిన అలంకారిక ప్రకాండుడు ఆనందవర్ధనుడు.'రసమే కావ్యమున కాత్మ, అన్యము కాదు' అని ముక్తకంఠమున చెప్పిన మహనీయుడు అభినవగుప్తుడు. 'రసేనైవ సర్వం జీవతికావ్యమ్ నహిరసశూన్యం కించిదస్తి, రసేవ వస్తుతః ఆత్మావస్త్వలంకార ధ్వనీతు సర్వథారసం ప్రతిపర్యవస్యేతే' – వాస్తవమునకు రసమే కావ్యమున కాత్మ. వస్త్వలంకార ధ్వనులు సర్వథా రసపర్యవసాయులే అగును. ఆనందవర్ధనుడు 'కావ్యాత్మాధ్వని꞉' అన్నను అతడు రసవాదియే. భరతుని రససిద్ధాంతములోని లోపములను అతడు ఈ క్రిందివిధముగా కొలదిగా సవరించెను. అతివ్యాప్త్యవ్యాప్తి దోషపరిహారము గావించి నిష్కృష్టము చేయుటయే అతని ఆశయము. రసము వాచ్యరూపముగా గాక వ్యంగ్యరూపకముగా నుండవలయును. దీనిచే రసధ్వని ఏర్పడుచున్నది. కనుక నీతని ధ్వని సంప్రదాయము రససంప్రదాయమునకు పెంపుదల మాత్రమే. రూపకమునకు మాత్రమే గాక శ్రవ్యకావ్యమునకును రససిద్ధాంతమును వర్తింప చేయవలెనని ఈతని దృష్టి. ఆనందవర్ధనుని వలె ప్రాచీనులగు నాలంకారికులెవ్వరును కావ్యాత్మవిషయమై ఇంతగా వివేచింపలేదు. ఈ సిద్ధాంతమునే అభినవగుప్త మమ్మట విశ్వనాథ జగన్నాథులగు సర్వాలంకారికులును గ్రహించిరి.

ఆలంకారికులు ప్రాధాన్య వివక్షవలన వేరు వేరు సంప్రదాయ ప్రవర్తకులైనను, రసమును తమ తమ ప్రధాన విషయము లందే అంతర్భవింప చేసిరి. నాట్యమును ప్రధాన విషయముగా నెంచిన భరతుని మతమును రసము నాట్యస్వరూపము. 'నాట్యంచరసఏవేత్యుక్తప్రాయమ్'. భామహదండ్యాచార్యుల మతములందలంకారములే ప్రధానము లయినను రసము వానియందు అంతర్భవింప బడినది. 'రసవద్దర్శిత

స్పష్ట శృంగారాది రసం యథా' ।కా.లం., 3–6। 'రసవద్రసపేశలమ్' అని దండి కావ్యాదర్శము. వామనుడు రసమును కాంతి గుణము నందు అంతర్భవింపజేసెను. 'సమగ్రరసత్వం కాన్తిః' ఆనందవర్ధనుడు ధ్వని కావ్యాత్మ అని చెప్పి రసమే ధ్వని యగునని చెప్పెను. రుద్రటుడు 'తస్మాత్ కర్తవ్యయత్నేన మహీ యసా రసైర్యుక్తమ్' అని చెప్పినాడు. 'ఔచిత్యం రసవిద్ధస్య స్థిరం కావ్యస్య జీవనమ్' అని క్షేమేంద్రుడు లనెను. ఇక మహిమభట్టు తన వ్యక్తి వివేకమున ధ్వని సిద్ధాంతమును ఖండించెను. అనుమేయము వస్త్వలంకార రసాశ్రయమని ముప్విధముగ విశ్లేషించుటచే మహిమభట్టునకు రసముపై గల అభిమానము వ్యక్త మగుచున్నది. ఇట్లు ప్రాచీనాలంకారికులలో స్థూలముగ కొందరును, సూక్ష్మవివేచనమున కొందరును రసమును అంగీకరించియే యున్నారు. కుంతకుడు మాత్రము రసమును గూర్చి ప్రస్తావించినట్లు కానరాదు.

సంస్కృతాలంకారికుల మతములనుసరించి కావ్యమున రసమున కెట్టి స్థానము కలదో పైని చెప్పిన వానిని బట్టి విదిత మయినది. ఆధునిక విమర్శకు లందరును రసమునే ప్రధానముగ నిర్ణయించి రనుటకు ఎట్టి విప్రతిపత్తియు నుండదు.

ఇక ఆంధ్ర కవి లాక్షణికుల రసదృష్టిని పరికింతుము. ఆంధ్రవాఙ్మయమున రసమునకు గల గౌరవము మొదటినుండియు నిలుపబడి యున్నది. ప్రథమాంధ్ర కవియు, ప్రథమ లాక్షణికుడును[2] అగు వాగనుశాసనుడు ఆంధ్రశబ్ద చింతామణిలో 'విశ్వశ్రేయః కావ్యమ్ తదదోషౌ పరిష్కృతౌ చవాగర్థౌ, సావాగ్యా రసవృత్తిః సాధ్యోహి రసో యథాతథం కవిభిః' అని వివరించుటలో అతని కావ్యరసదృష్టి స్పష్టమగుచున్నది. నవీనులగు సంస్కృతాలంకారికులు రసప్రాధాన్యవాదులగుటచే వారినే యాదర్శముగ గ్రహించిన మనవారి మతము చెప్పకయే సువిజ్ఞేయ మగును.

తాము రసవత్కావ్యములను నిర్మించుచుంటిమని కంఠోక్తిగా చెప్పు కవులు కొందరు కలరు. పాల్కురికి సోమనాథుడు.

---

2. ప్రథమ లాక్షణికుడన్నది వివాదస్పద విషయము

'నానేర్చు కొలది వర్ణన సేయువాడ
నవరస రసికత భువినిఁ బేర్కొన్న
శివకవి ప్రవరులు చిత్తంబు లలర'
అని తన బసవపురాణమున చెప్పినాడు.

తిక్కన తన భారతమున 'హృదయాహ్లాది...నానారసాభ్యుదయోల్లాసి...'అని నుడివి యున్నాడు. గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణమున -

'పదము లర్థంబులు భావముల్గతులు పదశయ్య లర్థసౌభాగ్యముల్యతులు
రసముల కల్పనల్ప్రాస సంగతులు అసమానరీతులు నన్నియుఁగలుగ

శ్రీనాథుడు కాశీఖండమున-

'వాక్రుత్తుతిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు' ప్ర.ఆ., ప. 13ః అని నుడివి యున్నారు.

రామరాజభూషణుడు వసుచరిత్రమున-

'ఒక్కొక్క కావ్యంబు రసోచిత చమత్క్రియా కల్ప భవ్యంబుగా నొనరింప'
అనియు, హరిశ్చంద్ర నలోపాఖ్యానమున-

'హరిశ్చంద్ర నల కథాయుగ యుగపదనుసంధాన బంధుర
రసానుబంధంబగు చిత్రప్రబంధంబు నిర్మింపఁబూని'
అనియు, నరసభూపాలీయమున ప్రతాపరుద్రీయము ననుసరించి -

'అసదృశ రసప్రధాన శబ్దార్థములును,
రీతులును, వృత్తులును, నలంకృతులు, గుణము
లాదియగు లక్షణంబులనలరు కావ్య
సరణియందు రలంకార సారవిదులు' -ః1-20ః
అనియు చెప్పియున్నాడు.

కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమున -

'మృదు వచోధారార్థ సందర్భ నిర్భర తత్త్రదసముల్ రహింప రచియింప బూనితిన్ వేడుకన్....' -పీఠిక 3ః అని కలదు. రాజశేఖర శతావధాని గారు రాణాప్రతాపసింహ చరిత్రమున -

'అలరు తేనెల మఱపించు పలుకుఁబొందు, పలుకుఁబొందున కుచితమౌ భావపుష్టి.

భావపుష్టికిఁ దగు రసవైభవంబు గూర్చుధన్యుండెపో కవికుంజరుండు'
అని చెప్పిరి.

కుమార ధూర్జటిని గాంచి ఆర్వీటి చినవెంకటాద్రి గారు –

'చిత్రముగాఁగఁ జిన్నపుడె చేసితివౌ రసముల్ చెలంగ సా

విత్రి చరిత్రమున్..... ..... .....'

అని అనుటచే నీతడు రసవత్తరమగు కావ్యమును నిర్మించినాడని విదితమగుచున్నది. 'కృష్ణరాయ విజయమునః

దేవతలు కృతిభర్తలుగా నున్న కొన్ని సందర్భము లందు కలలో సాక్షాత్కరించి రసోదంచిత కావ్యరచన చేయుమని కవులను ఉత్సాహపరచినట్లును వాఙ్మయమున గాథలు కలవు. ఉదాహరణమునకు – తిక్కనార్యుని కృతిభర్త యగు హరిహర నాథుడు తిక్కనను గాంచి 'వైదికమార్గ...కావ్యరసముంగొనియాడుచు నుండెదెప్పుడున్' అని అనుటలో తిక్కనార్యుని రసపోషణ దృష్టి విదితమగు చున్నది.

కొందరు కవులు తమ ఆశ్వాసాంత గద్యము లందు తమకు గల బిరుదములను చెప్పికొనుట వలనను వారి వారి కావ్యలక్షణములు కొంతవరకు తెలియుచుండును. ఉదాహరణములు –నాచనసోమన తన ఉత్తర హరివంశమున 'శ్రీమత్సకలభాషా భూషణ సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి' అని చెప్పికొనుట. రామరాజ భూషణుడు వసుచరిత్రమున 'సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ' అని చెప్పికొనుట. 'రసవత్కావ్య నిర్మాణచాతురీధురీణ' అని రాణాప్రతాపసింహచరిత్రమున ఉండుట.

మరికొందరు కుకవులు నాక్షేపించు సందర్భము లందును తమ రసపోషణమును, తదితర కావ్యలక్షణములను వ్యంగ్యముగ చెప్పికొనిరి. ఉత్తరరామాయణము నందలి 'పలుకుల పొందులేక రసభంగము చేయుచు....' అను తిక్కన గారి పద్యమును, 'నవ శబ్దార్థ రసానుబంధ పదవిన్యాస క్రియాభావ గౌరవ పాకధ్వనిరీతి శయ్యల.......'అను జక్కన విక్రమార్క చరిత్రము నందలి పద్యమును ఉదాహరణములుగ చెప్పవచ్చును.

తమ తమ కావ్యలక్షణములను పాత్రముఖమున వ్యంగ్యములుగ చెప్పుచుండుటయు ఆంధ్రవాఙ్మయమున కాననగు చుండును. పింగళి సూరనార్యుడు. కళాపూర్ణోదయమున కలభాషిణీముఖముగ 'పాసగు ముత్తెపుసరుల్ పోహళించెడు లీల....రసభావములకు నర్థంబులగు వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ నమర్చి....' అని చెప్పుట చక్కని యుదాహరణము.

చూడామణి పీఠిక యందలి 'భావరస ప్రసంగముల పర్వు నలంకృతి లక్షణము' (1-11) అను ప్రతిజ్ఞావచనము ననుసరించి పెద్దిరాజు మతమున కూడ రసమే ప్రధాన మనుటలో నెట్టి దోషమును లేదు. అన్నకవి -

'తగరసాశ్రయ వాక్యసంతతులఁ గూర్చి
కావ్యము లొనర్చు వారపో కవులనంగ
నట్లు గావున నేభాష నైనఁ గవిత
పలుకు వారికి సాధింపవలయు రసము' -(ఆ.1, ప.36)

అని రసమును గూర్చి వివరించి యుండుటచే రసవిషయమున ఈతని దృష్టి ఎట్లున్నదో తెలియుచున్నది. ఇవన్నియు నొకెత్తు. విశ్వనాథ వారిది మరియొక యెత్తు. వీరు తమ రామాయణ కల్పవృక్షమున -

'కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశముల యందుఁ దొంబదియైన పాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి'

అని చెప్పియున్నారు. ఆలంకారికులుగ ప్రసిద్ధి లేకపోయినను కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ గారి అభిప్రాయము మనవారి దృష్టికి నిదర్శనము.

తెలుగు కవుల, లాక్షణికుల రసదృష్టిని పైవిధముగ చూచితిమి కాన కావ్యమున రసస్థితి మరికొంత తెలియనగుచున్నది. కావ్యప్రయోజనము అందు కూడ ప్రధానముగ రసానందమే పేర్కొనబడుటచే రసప్రాధాన్యము తెలియుచున్నది.

'యథా బీజాద్భవేద్వృక్షం వృక్షాత్పుష్పం ఫలం యథా
తథామూలం రసాస్సర్వే తేభ్యో భావావ్యవస్థితాః'[3]

అని నాట్యశాస్త్రము.

బీజము నుండి వృక్షము, వృక్షము నుండి పుష్పఫలాదులు ఎట్లు కలుగుచున్నవో అట్లే సర్వభావములకును రసములే మూలము. భావములు వానియందే వ్యవస్థితములయి యున్నవి. కవిగతమగు రసము కావ్యగత మగును. కావుననే ఆనందవర్ధనుడు 'శృంగారీచేత్ కవిః'[4] అని పేర్కొనినాడు. అది నటవ్యాపారము వలన అభివ్యక్తమయి

3. నాట్యశాస్త్రము, అ.6, శ్లో.38
4. ధ్వన్యాలోకము, 3వ ఉద్యోతము, శ్లో.42

సామాజికునిచే ఆస్వాదింపబడుచున్నది. కవిగతమైనదే సామాజికగతమును అగుచున్నది. కనుకనే 'కవిర్హిసామాజిక తుల్యఏవ' అని భట్టతౌతునిచే చెప్పబడినది. దీని ననుసరించి కావ్యము వృక్షస్థానీయము. అభినయాది నటవ్యాపారము పుష్పస్థానీయము. సామాజిక రసాస్వాదనము ఫలస్థానీయము అని చెప్పవచ్చును.

ఒక్కొక్క కవి ఒక్కొక్క రసమును అభిమానముతో పోషించినప్పటికి కవి సర్వరససిద్ధుడే. ఆయా సమయముల కనుగుణముగ శబ్దార్థరీత్యలంకారాదులను ఆయా రసములకు పోషకములుగ నొనర్చుట కవికి సహజము. కవి వ్యక్తిగత నైపుణ్యము ననుసరించి ఆ కావ్యగత లక్షణములలో వైవిధ్యము గోచరించు చుండును. వైవిధ్యము లెన్నియున్నను ఆస్వాదితమగు రసము అఖండరూపమే. అట్టి రసోదయ క్రమమును సారభూతమగురీతని భట్టుమూర్తి –

'సరళవిరాజ దుచ్చరణ శస్తము వర్ణము, వర్ణపంక్తి వి
స్తరము పదంబు; తత్పదవితానము వాక్యము; వాక్యభేద సుం
దరతరమర్థ; ఘనతత్త్వ విబుద్ధము భావ; మట్టి భా
వ రుచిరు సుప్రసన్న విభవంబు రసంబొడఁగూర్ప నేర్చినన్'

అని పేర్కొనినాడు.

ఈ విధముగ కావ్యమునరసమునకు పరమపదము, ఆత్మస్థానము నీయబడి 'రసేనైవ సర్వం జీవతి కావ్యమ్' అని అనబడుటయే కాక రసహీనమైనది కావ్యము కాజాలదు. అను స్థితికి కూడ వచ్చినది. రసానందమే కావ్య పరమప్రయోజనమని, ఇది బ్రహ్మానంద సహోదరమని, బ్రహ్మానంద సహోదరమగు రసానందమును కలిగించు కావ్యమును వ్రాయగలవాడే మహాకవి అని, అతడే ఋషితుల్యుడని పూర్వుల ఆశయము.

# 3. ఇ. రససంఖ్య – రసానుగుణ వృత్త్యాదులు

## రససంఖ్య :

అనంతావై వేదాః అని యున్నను వేదములు నాల్గనియే ప్రసిద్ధి. అట్లే అనంతావై రసాః అని యున్ననునవరసము లనెడి వ్యవహారమే లోకమున ప్రసిద్ధము.

రసముల సంఖ్యను సూచించును నాట్యశాస్త్రమున భరతముని చెప్పిన శ్లోకమునకు పాఠాంతర మేర్పడుటచే రసము లెనిమిదియో! తొమ్మిదియా! అనువిషయము వివాదాస్పదమైనది. ప్రాచీనాలంకారికులలో కొందరు ఎనిమిదియను పక్షమును, మరికొందరు తొమ్మిదియను పక్షమును అవలంబించి వాదించుచుండిరి. శృంగారాది రసములలో శాంతమును చేర్చుటయా! చేర్చకపోవుటయా! అనునదియే ఈ అభిప్రాయభేదమునకు కారణము. ఈ భేదమట్లుండగా అర్వాచీనులైన అలంకారికులు కొందరు శాంతరసముతో కూడిన నవరసములకు మరికొన్ని క్రొత్తరసములను చేర్చి రససంఖ్యను పదమూడింటివరకు పెంచి యుండిరి. ఇట్లు వివిధ రసభావములకు గల సూక్ష్మాతి సూక్ష్మభేదములను గుర్తించి రససంఖ్యను పెంప యత్నించుచున్న వీరికి ప్రతియోగముగ ప్రకృతిరసము ఒక్కటే యనియు, మిగిలినవన్నియు దానికి వికృతులనియు చెప్పి రసములకైక్యమును ఘటించినవారును కలరు. ఇట్టి ప్రకృతి వికృతులను చెప్పినవారిలోను ఐక్యము లేదు. వీరందరు ఒకే రసమునకు ప్రకృతిత్వము నాపాదించినవారు కారు. ఈరీతిగ శాంతము రసమే కాదని కొందరనిన, అదియే ప్రకృతిరసము మిగిలినవి వికృతులని కొందరును, శృంగార మొక్కటియే రసమని కొందరును, కరుణమే రసమని కొందరును, అద్భుతమే రసమని యొకరును – ఇట్లు వాదములు చెలరేగినవి. అట్లే రసములు తొమ్మిదియే కాదు. భక్తి కూడ రసమే యని ఒకరును, వత్సల మను రసమున్నదని కొందరును, ప్రేయోరసమును గ్రాహ్యమని కొందరును, మాయారస మనునది కలదని కొందరును అనిరి. వాస్తవమునకు వ్యభిచారిభావము లన్నియు రసములే యగునని కొందరును, ఇన్నిరసములు లేనేలేవు. ఒక్కటియే రసము అని కొందరును వాదములు చేసిరి. ఇట్లు రసములను గూర్చి ఏకాభిప్రాయములేక వాదములు పెచ్చరిల్లినవి.

భరతుని నాట్యశాస్త్రమున -

'శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః'-।అ.6,శ్లో.15।

అని ఎనిమిది రసములు పేర్కొనబడి, వానికి స్థాయిభావములు వరుసగా -

'రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయంతథా
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః-।అ.6,శ్లో.17।

అని పేర్కొనబడి యున్నది. వీనిలో శాంతరస ప్రస్తావనము లేనందున రసము లెనిమిదియే యని కొందరు భావించిరి. చాలకాలమువరకు కవులు కూడ యిట్లే భావించిరి. కాళిదాసు అభిప్రాయమున భరతప్రోక్తములగు రసములు ఎనిమిదియే యున్నట్లు అతని విక్రమోర్వశీయము నందలి 'మునినా భరతేనయః' అను వాక్యముల ననుసరించి నిర్ణయింప నగును. దండి తన కావ్యాదర్శము నందును ఎనిమిది రసములనే లక్ష్య లక్షణ పూర్వకముగ వివరించి యున్నాడు.

## శాంతము రసమగునా?

ఈరీతిగా భరతుడు ఎనిమిది రసములను మాత్రమే చెప్పెనని కొందరు భావించు చుండ, మరికొందరు ప్రకృతము మన కుపలభ్యమానమగు నాట్యశాస్త్రగ్రంథములలో శాంతరస ప్రస్తావన ముండుటను ఆధారముగ గొని నవరసవాదము చేయదొడంగిరి. శాంతరసాభిమాను లగు కొందరు తమ అభిప్రాయములను భరతుని నాట్యశాస్త్రమున తదుపరికాలమున చేర్చియుండవచ్చును. శాంతరసమును స్థాపించిన వారిలో ప్రథముడుగ వాసుకి పేర్కొనబడుచున్నాడు. మరికొందరి దృష్టిననుసరించి కోహలుడనువాడు శాంతరస సిద్ధాంతమును బలపరచినట్లు తెలియుచున్నది. కాని వీరిరువురి యొక్క ప్రమాణవాక్యములు లభ్యములు కాలేదు. తదుపరి ఈశాంతరసమును గూర్చి విచారణ జరిపి, నిర్ధారించినవాడు భట్టోద్భటుడు. నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలలో కూడ ఈతడు ప్రథముడుగ కన్పట్టుచున్నాడు. ఈతడు తన కావ్యాలంకార సారసంగ్రహమున నవరసములను ఉదాహరించినాడు. కావునే ఈతడే భరతుని తరువాత స్వమతానుసారముగ కొన్ని మార్పులు చేసియుండునని కొందరు ఊహించుచున్నారు. ఈవిధముగ నవరసవాదము బయలుదేరినది.

ఈతని పాఠ మిట్లున్నది -

'శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః

బీభత్సాద్భుత శాంతాశ్చ నవనాట్యే రసాః స్మృతాః'
'రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శమాఃస్థాయిభావా ప్రకీర్తితాః'

శాంతమను రసమును, శమమను స్థాయియు - ఈరెండును ఈశ్లోకము నందు పేర్కొనబడినవి. ఉద్భటుని తరువాత ఆనందవర్ధనాభినవగుప్తులు మున్నగువారు శాంతము నంగీకరించి, ఒక రసముగ ప్రతిపాదించిరి. మమ్మటుడు కూడ 'శాంతోఽపి నవమో రసః' అని దీని నంగీకరించి యున్నాడు. తరువాతి ఆలంకారికులలో ధనంజయుడుతప్ప మిగిలిన వారందరును శాంతమును తొమ్మిదవ రసముగ నంగీకరించిరి. దశరూపక వ్యాఖ్యాత యగు ధనికుడు దృశ్యకావ్యము లందు మాత్రము శాంతము పనికిరాదనియు, శ్రవ్యకావ్యమున ఇది గ్రాహ్యమే యనియు చెప్పినాడు. విశ్వనాథుడు, పండితరాయలు మున్నగువారందరును దృశ్య శ్రవ్యో భయములందు శాంతమును అంగీకరించిరి. నవరసవాదులలో అగ్రగణ్యుడుగ పేర్కొనదగినవాడు అభినవగుప్తుడు.

అష్టరసవాదుల వాద మీతీరున గలదు. భరతుడు తన నాట్యశాస్త్రములో 'అష్టౌ రసాః' అని చెప్పకొనుటయే కాక, ఈతడు ఎనిమిది రసములకు మాత్రము స్వర, లయ, గుణ, అలంకార, వృత్తి వృత్తములను నిరూపించి యున్నాడు. శాంతమునకు వీనిని నిరూపింపకపోవుటచే రసములు ఎనిమిది మాత్రమే అని వీరి అభిప్రాయము. భరతుడు శాంతరసము నంగీకరించి యున్నచో, ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున తన శాంతరస వాదమున కవష్టంభకముగ భరతుని వాక్యములను ఏల పేర్కొనలేదు. అని వీరి ప్రశ్నము. కావున వీరి వాదము ననుసరించి భరతుడు అష్టరసవాదియా! అనిపించును.

కాని నవరసవాదులు తమ వాదము నిట్లు సమర్థించుకొందురు - భరతుడు శాంతరసమును ఋజుమార్గమున కాక వక్రమార్గమున తెలిపెనని వీరి అభిప్రాయము. దీనికి ఆధారముగ వీరు -

'క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః
.... ... ..... .... ' -।నా.శా., 1-104।
'దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం
విశ్రాంతి జననం కాలే నాట్యమే తద్భవిష్యతి.....' - ।నా.శా., 111-112।

అను భరతుని శ్లోకములను చూపిరి. నాట్యము దుఃఖార్తులకు ధర్మమును ఉపదేశించును. శ్రమార్తులకు వినోదమును కలిగించును. శోకార్తులకు అర్థోపదేశమును చేయును. తపస్వులకు శాంతిని సమకూర్చును. ఈరీతిగ ఆయా కాలములందు ఆయా వారలకు నాట్యము విశ్రాంతి కారణమగును.

ఈ శ్లోకమున 'క్వచిచ్ఛమః' అని ఉండుటచే, అభినవగుప్తుడు శాంతరస స్థాపన సందర్భమున 'మునినాఽప్యంగీక్రియతే క్వచిచ్ఛమః ఇతివదతా' అని చెప్పియున్నాడు. అంతయ గాక భరతుడు –

'తుష్యంతి తరుణాః కామేవిదగ్ధాస్సమయాశ్రితే
అర్థేష్వర్థ పరాశ్చైవ మోక్షేష్వథ విరాగిణః

విదగ్ధులగు తరుణులు కామమునందును, అర్థపరులు అర్థమునందును విరాగులు మోక్షమునందును సంతుష్టినొందుదురు అనియు నుడివెను. ఈ శ్లోకము ననుసరించి విరాగులు శాంతరసాస్వాదకులని తెలియుచున్నది. కావున భరతుని దృష్టిలో 'శాంతము' కలదు. భరతడు శాంతము నంగీకరింపనిచో నాట్యమును

'త్రైలోక్య స్యాస్య సర్వస్యనాట్యం భావానుకీర్తనమ్' – (నా.శా., 1–104)

అని త్రైలోక్యానుకరణముగ ఏల పేర్కొనును? ఇంకను భరతుడు నాట్యాంగము కానిదేదియు లేదని–

'నతత్ జ్ఞానం నతత్ శిల్పం నసావిద్యా నసాకలా
నసయోగో నతత్కర్మ నాట్యేస్మిన్ యన్నదృశ్యతే'(నా.శా., 1–113,114)

అని తెలిపి యున్నాడు. వీనినన్నింటి నాధారముగ చేసికొని చూచిన భరతుడు శాంతరసము నంగీకరించెనని, కాని దానిని ఋజుమార్గమున గాక వక్రమార్గమున నంగీకరించెనని తెలియుచున్నది. ఇట్లు ఋజుమార్గమున కాక వక్రమార్గమున ఎందులకు చెప్పెనను ప్రశ్నమునకు అభినవగుప్తుడు తదుపరి సమాధానము నిచ్చి యున్నాడు.

శాంతరసమును అంగీకరింపనివారిలో ముఖ్యుడు ధనంజయుడు. ఈతడు 'శమమితి కేచిత్ప్రాహుః పుష్టిర్నాట్యేషు నైతస్య' – (4–36 శ్లో.) – కొందరు శమమును పేర్కొనిరి. కాని దానికి నాట్యమున పుష్టిలేదు అని చెప్పియున్నాడు. దశరూపక వ్యాఖ్యాత యగు ధనికుడు – 'అన్యేతు వస్తుతత్త్వస్య అభావం వర్ణయంతి. అనాదికాల ప్రవాహాయాతరాగద్వేషయో రుచ్ఛేత్తుమశక్యత్వాత్, నచ తథాభూతస్య

శాంతరసస్య సహృదయాః స్వాదయితాః రసంతి' – వాస్తవముగ శాంతమను రసమే లేదని అన్యులు అనుచున్నారు. దీనికి కారణము అనాది కాలప్రవాహయాతములగు రాగద్వేషములను– ఛేదింపలేకపోవుట. రాగద్వేషనాశన రూపమయిన శాంతమును సహృదయు లాస్వాదింపజాలరని చెప్పినాడు. దీనికి సమాధానముగ ఆనందవర్ధనుడు – 'యదినామ సర్వజనానుభవ గోచరతా తస్య నాస్తి నైతావతా అసౌ అలోక సామాన్య చిత్తవృత్తివత్ ప్రతిక్షేప్తుం శక్యః' అని చెప్పియున్నాడు. సర్వజనులకు ఇది అనుభవగోచరము కాదు. అంతమాత్రమున దీనిని త్రోసివేయరాదని భావము. ధనికుడు శాంతమునకు రసత్వమును అంగీకరించెను. దృశ్యకావ్యము లందు దీనికి స్థానములేదని చెప్పియున్నను శ్రవ్యకావ్యము లందు దీనిని అంగీకరించెను. శాంతమును నాట్యమున అభినయించుటకు వీలుండదు కావున దీనికి దృశ్య కావ్యమున ప్రవేశము లేకపోవచ్చును. అతిసూక్ష్మములగు వస్తువులను గూర్చియైనను శబ్దముచే చెప్పవచ్చును అని 'నను శాంతస్య అనభినేయత్వాత్ యద్యపి నాట్యేఽను ప్రవేశోనాస్తి. . .'అని చెప్పియున్నాడు. ఈతని ఈ వాక్యము ననుసరించియే ఈతడు శాంతమును శ్రవ్యమున అంగీకరించినట్లు విదితమగుచున్నది. మరియు శాంతరసస్వ రూపమును గూర్చి–

'నయత్రదుఃఖం నసుఖం నచింతా నద్వేషరాగౌనచకాచి దిచ్ఛా

రసస్తు శాంతః కథితో మునీంద్రై స్సర్వేషు భావేషు శమప్రధానః'

అనియు చెప్పినాడు. ఎచ్చట దుఃఖము, సుఖము, చింత, ద్వేషము, రాగము, ఇచ్ఛ ఉండవో అచ్చట శాంతము ఉండును. సర్వభావములందును శమమే ప్రధానము. మరియు శాంతము మోక్షావస్థయందే లభించుననియు, దీనికి సంచార్యాదులు లేవనియు, దీనిని సూటిగ చెప్పజాలమనియు, నిత్యసంతుష్టి, మైత్రి, దయ, ఉపేక్ష మున్నగువానిచే నిది అనుభవింపబడుననియు, ఆ ఆస్వాదము కూడ ఇతర రసాస్వాదమున కలుగు చిత్తద్రుతి, వికాస, విస్తారరూపమే అనియు చెప్పియున్నాడు. విశ్వనాథుడు 'యుక్త వియుక్తదశాయా మవస్థితో యశ్శమస్యఏవయతః ........' – మోక్షావస్థ యందున్న శమముమాత్రమే గక యుక్త వియుక్తదశ యందు, అనగా ఆత్మసాక్షాత్కారదశయందుండు శమమును రసత్వమును పొందుననియు, దీనికి సంచార్యాదు లుండుననియు చెప్పినాడు. ఈతడు దృశ్య శ్రవ్యముల రెండింటను శాంతము నంగీకరించినవాడు. రసమనుకర్తృనిష్ఠమని భావించిన కొందరు –

'శాంతస్య శమసాధ్యత్వాత్ నటేచ తదసంభవాత్
అష్టావేవ రసానాట్యే నశాంత స్తత్రయుజ్యతే'

శాంతము శమసాధ్య మగుటచే నటునియం దది అసంభవము. కావున నాట్యమున రసములు ఎనిమిది మాత్రమే. అందు శాంతమునకు తావులేదు అని చెప్పిరి. కాని రసము నటనిష్ఠము కాక సామాజికనిష్ఠము కావున శాంతము రసముగా నుండ వచ్చును. సహృదయులు, శాంతులు, తత్త్వవిచక్షణులు నగు సామాజికులకు రసాస్వాదనము కలుగు ననుటలో నెట్టి విప్రతిపత్తియు నుండబోదు. కావున కావ్యమునందు వలె నాట్యము నందును రసములు తొమ్మిదియే. ఈ అభిప్రాయానుసారముగ 'శాంతోఽపి నవమోరసః' అని చెప్పబడినది.

సంగీతరత్నాకరమున 'నాట్యమున రసములు ఎనిమిది మాత్రమే ఉండునని కొందరు చెప్పిరి. కాని ఇది సరికాదు. నటుడు రసాస్వాదనపరుడు కాకపోవుటచే రసము నటనిష్ఠము కాదు' అని చెప్పబడినది.

ధ్వన్యాలోక వ్యాఖ్యాత యగు చంద్రికాకారుడు ప్రాసంగికేతివృత్తమున శాంతము అంగముగ మాత్రమే యుండవచ్చుననియు, అధికారికేతివృత్తమున అంగిగ నుండరాదనియు నిర్దేశించినాడు. ఈ అభిప్రాయమును అభినవగుప్తుడు ఖండించినాడు. ఆతని ఖండనవిధాన మీతీరుగ నున్నది. బౌద్ధ జైన కవులు 5వ శతాబ్ది యందె శాంతమును అంగిరసముగ నంగీకరించిరనియు, జైనుల అనుయోగాద్వార సూత్రము దీనిని ప్రశాంతరస మనుపేర ఆంగిగ గ్రహించినదనియు చెప్పినాడు. శాంతమును కొందరు దయావీరమున అంతర్భవింప చేసిరి. కాని అది సరికాదు. ఏలన శాంతమునకు నిర్వేదము స్థాయి. వీరమునకు ఉత్సాహము స్థాయి. శాంతము అహంకార ప్రశమము. ఉత్సాహము అహంకారరూపము. కావుననే విశ్వనాథునిచే 'నిరహంకారరూపత్వా ద్దయావీరాది రేషనో' – నిరహంకారరూప మగుట వలన శాంతము దయావీరము కాదు అని చెప్పియున్నాడు. మరియు సాహిత్యదర్పణకారుడు దయావీరాదులు అహంకారరహితము లయిన శాంతమున అంతర్భవించును కాని శాంతము దానిలో నంతర్భవింపదనియు చెప్పినాడు. అభినవగుప్తుడు శాంతము రసము కాదనివారి వాదములను సహేతుకముగ ఖండించి శాంతమును నవరసముగ స్థాపించినాడు. చిత్తవృత్తి విశేషములగు రత్యాదులు కవి నట వ్యాపారముచే ఎట్లు శృంగారాది రసములుగ నాస్వాద్యము లగుచున్నవో, అట్లే మోక్షాభిధాన పురుషార్థమునకు

ఉచితమైన చిత్తవృత్తి విశేషము రసస్వరూపము నొంది ఏల ఆస్వాద్యము కారాదు? అని వాదించినాడు. కావున ఈతని మతము ననుసరించి అనాది కాలప్రవాహ యాతములగు రాగద్వేషములను ఛేదింపగల వీతరాగు లుందురనియు, వారే మోక్షమున కధికారులనియు, శాంతము నాస్వాదింపగలవారనియు తెలియుచున్నది.

హరిపాలుడు సంగీతసుధాకరమున శాంతరసమును శాంతరసమని, బ్రహ్మరస మని రెండువిధములుగ విభజించెను. బ్రహ్మరసము నిత్యము, స్థిరము, శాంతము అనిత్యము, అస్థిరము ననియు తెలిపినాడు. నిర్వేదస్థాయికమగు శాంతము మోక్షమునకు గొనిపోవదనియు, ఆనందస్థాయికమగు బ్రహ్మరసమే మోక్షమునకు గొనిపోవుననియు ఈతని సిద్ధాంతము.

పై చర్చల వలన తేలిన సారాంశము – భరతుడు శాంతమును నిర్దేశింపలేదు కావున శాంతము రసము కాదని కొందరును, కావ్యము నందది అధికారికముగ కాక ప్రాసంగికముగనుండవచ్చునని కొందరును, శ్రవ్యమున మాత్రమే అది యుండవచ్చునని కొందరును, దృశ్య శ్రవ్యముల రెండింటి యందు అంగరసముగా మాత్రమే కొంద రంగీకరింపగా, అంగిరసముగ నుండవచ్చునని మరికొందరును వాదములు చేసిరి. తుదకు శాంతము తొమ్మిదియవ రసమని పలువురు ఆలంకారిక ప్రకాండులచే స్థాపింప బడినది.

## శాంతమునకు స్థాయి యేది?

శాంతరసము స్థాపింపబడిన పిమ్మట దీనికి స్థాయి ఏది? అను ప్రశ్నము బయలుదేరినది. ఈస్థాయి విషయముననుు మతభేదములు కలవు.

శమము శాంతమునకు స్థాయి యందురు. కాని కొందరు శమము స్థాయికాదని చెప్పిరి. వీరి అభిప్రాయము ననుసరించి భరతుడు నలుబదితొమ్మిది భావములనే చెప్పినాడు. శమమును చేర్చినచో ఏబదిభావములగును. అంతియగాక శమ శాంతపదములు పర్యాయములు. శమ స్థాయికము శాంతమన్న శాంతస్థాయికము శాంతము కావలసి వచ్చును. ఇది సరికాదు. కావున శాంతమునకు శమము స్థాయి కాజాలదని వీరి వాదము. కాని వీరి వాదము నిట్లు పరాస్తము చేయవచ్చును. శమ శాంతములు పర్యాయములు కావు. భయభయానకములు, హాస హాస్యములు, విస్మయాద్భుతములు ఎట్లు భిన్నములో ఈ శమ శాంతములును అట్లే భిన్నములు కావున శమస్థాయికము శాంతమనుటలో దోషము లేదు.

కాని ఏబది భావములగుట నాట్యశాస్త్ర విరుద్ధము. ఇది ఒక యాక్షేపమే. దీని నాధారముగ చేసికొని మమ్మటాదులు నిర్వేదము శాంతమునకు స్థాయి అనిరి. 'నిర్వేద స్థాయిభావాఖ్యః శాంతోఽపి నవమోరసః' అని కావ్యప్రకాశమున గలదు. తమ వాదమున కుపబలకముగ నిర్వేదము అమంగళప్రాయ మయినను, మాంగళికుడగు భరతుడు దీనిని వ్యభిచారులలో ప్రథమమున పేర్కొనుటకు గల కారణము నిట్లు చెప్పిరి. ఇది స్థాయిగను, వ్యభిచారిగను ఉండుటచే స్థాయులలో చివరిదానిగను, వ్యభిచారులలో మొదటిదానిగను అన్వయించుకొనుటకు వీలుగా మధ్యమణి న్యాయమున దీనిని చెప్పియుండవచ్చు ననిరి. ఈ అభిప్రాయమునే మమ్మటుడు

'నిర్వేదస్య అమంగళప్రాయస్య ప్రథమ మనుపాదే యత్వేఽపి,
ఉపాదానం, వ్యభిచారిత్వేఽపి స్థాయిత్వాభిధానార్థమ్'

అని కావ్యప్రకాశమున చెప్పినాడు.

నిర్వేదము దారిద్ర్యము, వ్యాధి, అవమానము, అధిక్షేపము, క్రోధము, తాడనము, ఇష్టజనవియోగము, తత్త్వజ్ఞానము, మొదలగు విభావముల వలన జనించును. దారిద్ర్యాదుల వలన కలుగు నిర్వేదము శాంతమునకు స్థాయి. ఈ అంశము సంగీతరత్నాకరమున 'తత్త్వజ్ఞానజో నిర్వేదోఽస్యస్థాయి' అని చెప్పబడినది. ఈతని అభిప్రాయము ననుసరించి తత్త్వజ్ఞానమగు నిర్వేదము శాంతరస స్థాయి. దారిద్ర్యజ మగు నిర్వేదము కేవలము వ్యభిచారి భావము. ఇట్టి తత్త్వజ్ఞానజ మగు నిర్వేదము అమంగళము కాదని, మంగళప్రాయమే యని భట్టగోపాలుని మతము కూడ. 'తత్త్వజ్ఞానశ్చ స్థాయ్యంతరోపమర్దకః' – తత్త్వజ్ఞానజమగు నిర్వేదము స్థాయ్యంత రోపమర్దక మని అభినవగుప్తుడు. రుద్రటుడు సమ్యగ్జానము శాంతరసస్థాయిగ పేర్కొనెను. సమ్యగ్జ్ఞాన మనగా శమమే. ఆనందవర్ధనుడు 'శాంతశ్చ తృష్ణాక్షయ సుఖస్యయఃపరిపోషః....' అని తృష్ణాక్షయమును స్థాయిగ పేర్కొనెను. ఆనందవర్ధనుని అనుసరించిన హేమచంద్రుడు తృష్ణాక్షయ సుఖమనగా శమమే యని 'తృష్ణాక్షయరూపః శమఃస్థాయి భావః చర్వణాం ప్రాప్తః శాంతోరసః' అని తన కావ్యానుశాసనమున చెప్పినాడు.

భోజుడు సరస్వతీకంఠాభరణమున ధృతి స్థాయి అని చెప్పి, ఇది శమరూపమే యని, ధృతి విశేషమే యగుచున్నదని చెప్పినాడు. శృంగార ప్రకాశమున మాత్రము

శాంతము శమస్థాయికమని చెప్పెను. కావున ఈతని అభిప్రాయానుసారము ధృతి అన్నను, శమమన్నను నొక్కటియే.

కొందరు ఉత్సాహమును స్థాయి అని తెలిపిరి. కాని ఇది వీరమునకు స్థాయి కావున ఆనందవర్ధనాదులచే నిది ఖండింప బడినది. కొందరిమతము ననుసరించి 'జుగుప్స' స్థాయి. శుద్ధ, క్షోభజ, ఉద్వేగములను ముివ్విధములగు బీభత్సములలో శుద్ధబీభత్సము మోక్షసాధనము. కావున జుగుప్స శాంతమునకు స్థాయి అని వీరి అభిప్రాయము. కాని అభినవగుప్తుడు శుద్ధజుగుప్సను శాంతరస వ్యభిచారిగ నంగీకరించినాడు. కాని స్థాయి కాజాలదని స్పష్టము చేసినాడు. కొందరు 'ఆత్మరతి' స్థాయి అని చెప్పగా, అభినవగుప్తుడు దీనిని కూడ శాంతమునకు వ్యభిచారిగనే పరిగణించెను. కొందరు రత్యాదులు ఎనిమిదింటిలో ఏదైన ఒకటి శాంతమునకు స్థాయి కావచ్చుననిరి. అభినవగుప్తుడు దీనిని కూడ ఖండించి, తత్త్వజ్ఞానమే స్థాయి అని ,చెప్పినాడు. జ్ఞానానందాది విశుద్ధ ధర్మయుతమై, విషయోపభోగ రహితమై యుండు ఆత్మస్థాయి అని సారాంశము. ఈ 'స్థాయి' ఇతర స్థాయుల వంటిది కాక స్థాయితమ మయినది. మిగిలిన స్థాయిభావముల కన్నింటికి మూలభూత మయినది. దీనికి గల కారణము శాంతము ప్రకృతి. మిగిలినవి వికృతులు. ప్రకృతి వలన పుట్టినవి మరల ప్రకృతిలోనే లీనమగును. ఆయా నిమిత్తముల ననుసరించి రత్యాదిభావములు శాంతము నుండి ప్రవర్తిల్లి, ఆ నిమిత్తములు తొలగగనే మరల నవి శాంతములో లీనమగును. కావున శాంతము భిత్తి వంటిది. మిగిలినవి వానిపై వ్రాయబడు చిత్తరువుల వంటివి. భిత్తి స్థిరమైనది. చిత్తరువులు అస్థిరములు. కావున శాంతమే ప్రధానము.

మరియు శాస్త్రముల నన్నింటిని పండితులు శమము కొఱకే సృజించిరని, ఎవని మనస్సు శాంతముగ నుండునో వాడు సర్వశాస్త్రజ్ఞు డని ,

'శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః

తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్యశాంతం మనస్సదా'

అను శ్లోకము వలన తెలియుచున్నది. కావున దీని ననుసరించియు శాంతము ప్రధానమని తేలుచున్నది.

భరతుడు శాంతరసము నేల ప్రస్తావింపలేదు? అను ప్రశ్నమునకు అభినవగుప్తుడిచ్చిన సమాధానము – భరతుడు వికృతిరసములనే పేర్కొన దలచెను.

శాంతరసము ఇతరముల కంటె ఉత్కృష్టమగుటచేతను, మిగిలినవానికి మూలభూత మగుటచేతను,ప్రకృతిరస మగుటచేతను దీనిని ఉక్తప్రాయముగ బుజామార్గమున పేర్కొనలేదు. అభినవగుప్తుని కాలము నందలి నాట్యశాస్త్ర గ్రంథములలోను శాంతరస ప్రసంగము లేదు. కాని ఈతని కంటె పూర్వమందున్న నాట్యశాస్త్ర గ్రంథములలో శాంతరస ప్రస్తావము కలదని 'తథాచ చిరంతన పుస్తకేషు స్థాయిభావాన్.....' అను వ్రాతవలన తెలియుచున్నది.

భరతుని నాట్యశాస్త్రమున శాంతరస ప్రస్తావము లేదనువారు భరతుడు ప్రకృతిరసమును గక వికృతిరసములనే పేర్కొనదలచెనని సమాధాన మిత్తురు. శాంతరస ప్రస్తావము నాట్యశాస్త్రమున గలదనువారి మతమున వివాదమే లేదు.

మరి ఏబది భావము లగుట అను ఆక్షేపమునకును సమాధానమును చెప్పవలసి యున్నది. శమము, నిర్వేదము అనునవి ఆత్మధర్మములు. కావున శమమన్నను, నిర్వేదమన్నను ఆత్మయొక్క ప్రకృతి ధర్మమే వివక్షిత మగుచున్నది. కాని వికృతి కాకపోవుటచే శమస్థాయిక మనుటలో నెట్టి దోషమును లేదు.

శాంతరస ప్రధానములగు కావ్యము లున్నవా! అను ప్రశ్నమునకు సమాధానముగ మహాభారతము, సౌందరనందము, బుద్ధచరిత్రము, మొదలగు శ్రవ్యకావ్యములను, ప్రబోధచంద్రోదయము, భర్తృహరి నిర్వేదము, మొదలగు దృశ్యకావ్యములను ఉదాహరణములుగ చూపిరి.

ఆనందాభినవగుప్తుల మతమున శాంతమే ప్రధానరసమని కొందరి వ్రాతల వలన స్పష్టమగుచున్నది. అభినవగుప్తుని గురువగు భట్టతౌతుడు కూడ ఈ అభిప్రాయమునే తెలిపినట్లు కాణే పండితుడు తన 'Introduction to Sahitya darpana' లో వ్రాసినాడు[1].

## ప్రేయస్సు :

రుద్రటుడు, తన కావ్యాలంకారమున 'దశమో రసః ప్రేయాన్' అని ప్రేయస్సును పదియవ రసముగ పేర్కొని, దానికి స్నేహమును స్థాయిగ పేర్కొనినాడు. 'స్నేహ

---

1. We know that Bhottatauta was the Guru of Abhinavagupta that he wrote a work called 'Kavya Koutuka' on which Abhinavagupta wrote a vivarana. One of his doctrines was that santa was at the head of all Rasas as it led to Moksha.

-Introduction to Sahityadarpana
-P.V.Kane

ప్రకృతిః ప్రేయాన్' అని చెప్పి 'అన్యోన్యం ప్రతిసుహృద్యోర్వ్యవహారోఽయం మతస్త్రత' స్నేహితుల పరస్పర వ్యవహారము ప్రేయము అనియు చెప్పినాడు. ఇంతటితో నూరుకొనక నిర్వేదాది వ్యభిచారిభావములయందు రస్యమానత్వము కలదు. కావున ఇవియు రసములే అని చెప్పినాడు. ఈ వాదమును ప్రప్రథమమున లేవదీసినవాడు భట్టలోల్లటుడు. ఈతడు రసములనంతములని, లోకప్రసిద్ధిననుసరించి భరతుడు కొన్నింటినే యుదాహరించెనని అభిప్రాయ పడెను. రుద్రటుడు కూడ ఈ సిద్ధాంతమునే బలపరచెను. నిర్వేదాది వ్యభిచారిభావములు కూడ సముచిత విభావాది సామాగ్రిసముల్లసితములయిన రసము లగునను వీరి అభిప్రాయమును అభినవగుప్తుడు అంగీకరింపలేదు.

దండి భామహాదులు కూడ ప్రేయస్సును గూర్చి చెప్పియున్నారు. వీరి అభిప్రాయానుసారము ఇది ప్రియతరాఖ్యానము మాత్రమే. 'ప్రేయం ప్రియతరాఖ్యానమ్'. ఉద్భటుడు ప్రేయస్సును అలంకారమాత్రముగానే చెప్పినాడు. దండి అభిప్రాయానుసారము రతిమూలకము శృంగారము, ప్రీతిమూలకము ప్రేయస్సు. ఈరెండును అత్యంత సన్నిహితము లయినట్లు కన్పించినను ఇవి భిన్నములే.

## వాత్సల్యము :

భరతుడు ఆయా రసము లందలి వర్ణముల నెట్లు ఉచ్చరింపవలయునో చెప్పుచు 'హాస్య శృంగారయో స్స్వరితోదాత్తైః, వీరరౌద్రాద్భుతేషు ఉదాత్త కంపితైః కరుణ వాత్సల్య భయానకేషు అను దాత్తస్వరిత కంపైః.....' అని వాత్సల్యమును పేర్కొనెను. దీనినాధారముగ చేసికొని విశ్వనాథుడు 'అథ మునీంద్రసమ్మతో వత్సలోరసః అని ప్రారంభించి 'స్ఫుటం చమత్కారితయా వత్సలంచ రసం విదుః....' అని చెప్పినాడు. స్ఫుట చమత్కారిత్వము ననుసరించి వత్సలమును కూడ రసమని తలంతురు. దీనికి వత్సలతాస్నేహము స్థాయి అని విభావాదులను కూడ నిరూపించిది.

భోజహరిపాలదేవులును ఈ వాత్సల్యరసమును అంగీకరించిరి. జగన్నాథుడు ఈ వత్సలమును అంగీకరింపలేదు.

## భక్తి :

ఉజ్జ్వలనీలమణి కర్త రూపగోస్వామి భక్తిని రసముగ అంగీకరించెను. మధుసూదన సరస్వతి దీనిని ఆమోదించెను. రూపగోస్వామికి పూర్వము నందు బోపదేవుడు,

హేమాద్రి–ఇరువురు తమ భాగవతముక్తాఫల మందు, దానికి వ్యాఖ్య యగు కైవల్యదీపిక యందు భక్తిరసమును గూర్చి వివరించి యున్నారు. 'స్పష్టం ముక్తిఫలే చైతద్బోపదేవేన వర్ణితమ్' అని రూపగోస్వామి తన ఉజ్జ్వలనీలమణి యందు బోపదేవుని స్మరించెను. మధుసూదన సరస్వతి భక్తిరస విభావాదులను వివరించినాడు. భగవదాకారతాచిత్తవృత్తి స్థాయిభావమని పేర్కొనెను. భగవదాకారతాచిత్తవృత్తికిని, భగవద్రతికిని అంత భేదములేదనియు, ఈ చిత్తవృత్తిఫలమే భగవద్రతి అనియు చెప్పినాడు. 'భగవద్విషయక ప్రేమ ప్రకర్షో భక్తిఫలమ్'. శ్రవణ కీర్తనాది సాధనములు కూడ భక్తి శబ్దవాచ్యములే అనియు చెప్పినాడు. పరమానందరూపు డగు భగవంతుడు మనస్సున ప్రతిబింబించి స్థాయి భావత్వమును పొంది రసత్వము నాపాదించును. ఈరీతిగ భక్తిరసము పరమానందరూప మగుట నిర్వివాదాంశము. బింబప్రతిబింబభావము వ్యవహారసిద్ధ మగుటవలన ఇట ఆలంబనవిధావ స్థాయిభావముల కైక్యములేదు.

భక్తిరసము శాంతములో నంతర్భవంచు నని కొందరి తలంపు. కాని భక్తి శాంతములు భిన్నములు.మధుసూదనసరస్వతి అభిప్రాయము ననుసరించి ఈరెండును ఒకదానితో నొకటి కలియనే కలియవు.

మధుసూదనసరస్వతి భక్తిని రసముగ స్థాపించుచు–
'కాంతాది విషయావాయే రసాద్యాస్తత్ర నేదృశం
రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శిత్వ కారణాత్
పరిపూర్ణ రసాక్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా'

అని చెప్పియున్నాడు. కాంతాది విషయకములగు ఏరసము లందైనను భగవద్రతి యందు వలె పరిపూర్ణమగు సుఖములేక, పరమానందము కలుగదు. కావున వీనికి రసపుష్టి లేదు. అవి క్షుద్రరసములు. భగవద్రతి పూర్ణరసము. ఇది మిణుగురుపురుగుల కాంతికంటె సూర్యప్రభ బలవత్తరమయినట్లు, మిగిలిన రసములకంటె బలవత్తరము; శ్రేష్ఠతరము.

జగన్నాథుడు రసత్వమునకు గల లక్షణము లన్నియు దీనికి వర్తింపచేయుచునే, భరతుడు పేర్కొనలేదు కనుక దీనిని రసముగా పరిగణింపరాదనెను.

కాని అభినవగుప్త, హేమచంద్ర, ధనంజయాదులు భక్తిని రసముగా నంగీకరింప లేదు.

భక్తితోపాటు శ్రద్ధను కూడ కొందరు రసముగ నంగీకరించిరి.

వాఙ్మయమున మాత్రము భక్తి స్నేహ వాత్సల్యాదులు బహుధా పోషింపబడుటయే గాక, వానివలన రసానందమును కలుగుచున్నది. ఇందులకు సహృదయులే ప్రమాణము అని 'ఆర్ద్రతా స్థాయికః స్నేహోరస ఇతిత్వసత్.....' అని అభినవభారతిలో అభినవగుప్తుడు చెప్పినాడు. ఈ అభిప్రాయములను డా॥ రాఘవన్ గారు విమర్శించియున్నారు.[2] వీరి విమర్శ యుక్తియుక్తముగనే యున్నదని, స్నేహ వాత్సల్యాదులను రసములుగ ఆనంగీకరింపవచ్చునని, అందుదోష మిసుమంతయును లేదు అని సాహిత్యదర్శనమున గలదు.[3]

## మాయ :

రసతరంగిణీకర్త భానుదత్తుడు మాయారసమును గూర్చి చెప్పియుండెను. ప్రవృత్తి నివృత్తి భేదమున చిత్తవృత్తి రెండు విధములని, నివృత్తి యందు శాంతము గ్రహింపబడినట్లుగ, ప్రవృత్తి యందు మాయారసము నంగీకరింపవలె నని ఈతని అభిప్రాయము. 'చిత్తవృత్తిః ద్విధా – ప్రవృత్తిర్నివృత్తిశ్చ, నివృత్తౌ యథా శాంతరసః, తథాప్రవృత్తౌ మాయారస ఇతి ప్రతిభాతి' అని చెప్పబడినది. మిథ్యాజ్ఞానము దీనికి స్థాయి. తదితర విభావాదులను కూడ ఇతడు నిరూపించియుండెను. ఈ మతమును మందారమరందచంపువు కూడ బలపరిచెను.[4] రసచంద్రికాకర్త యగు విశ్వేశ్వరుడును, కావ్యవిలాసకర్తయగు చిరంజీవి భట్టాచార్యుడును ఈవాదమును ఖండించినారు.[5]

## ఇతరములు :

భానుదత్తుడు స్పృహాస్థాయికమగు కార్పణ్యమును రసముగా చెప్పి యుండెను. కొందరు మృగయా, అక్షక్రీడ, ప్రీతి, శ్రద్ధలును, ఆర్ద్రతాస్థాయికమయిన స్నేహమును, గర్ధ స్థాయిక మగు లౌల్యమును, ఆసక్తి స్థాయిక మగు సుఖమును, మతి స్థాయిక మగు ఉదాత్తమును, గర్వస్థాయిక మగు నుద్ధతమును రసములుగ గణించియున్నారు. కొందరు క్రీడనకమును కూడ రసముగ చెప్పియుండిరి. అభినవగుప్తుడు వీని

---

2. The number of Rasas, pp. 123 -24
3. సాహిత్యదర్శనము, పు. 196
4. కావ్యాలంకార సంగ్రహము, సన్నిధానం వారి వ్యాఖ్య, పు. 309
5. సాహిత్యదర్శనము, పుటలు, 196-97

నన్నింటిని భావమాత్రములుగనే పరిగణించెనుకాని రసములుగ నంగీకరింపలేదు.

అభినవగుప్తుడు రస, భావములకు గల భేదములను కూడ నిరూపించి యున్నాడు. రసములు సహృదయ హృదయావర్జకము లనియు, పురుషార్థోపయోగులనియు, రంజనాధిక్యము గలవిఅనియు చెప్పి భావము లట్లుకావు అనినాడు. అభినవగుప్తుడు రత్యాదులగు స్థాయి భావములు విభావాది భావసామగ్రిచే పురిపుష్టములై శృంగారాది రసస్వరూపమును పొందగలవు కాని నిర్వేదాది వ్యభిచారిభావము లట్లు రసత్వము నొందజాలవు అని చెప్పెను. కావున రసలక్షణమైన ఆస్వాద్యత్వము శృంగారాదలుకు వలె నిర్వేదాదులకు లేదని, దాని ననుసరించి నిర్వేదాదులు పురుషార్థోపయోగులు కాజాలవని, కావున ఇవి రసములు కావని, భావములే యని ఈతని సిద్ధాంతము.

రససమీకరణ వాదములు :

ఇవికాక రససమీకరణ వాదములు కొన్ని కలవు. భోజుడు శృంగారమొక్కటియే రసమని 'శృంగార ఏవ ఏకోరసః' అని చెప్పినాడు. ఈతని మతము ననుసరించి శృఃగారమునకు అహంకార, అభిమాన రసములను నామాంతరములు కలవు. శాంతము అహంకారప్రశమము. తక్కినవి అహంకార రూపములే.

ఈతడు శృఃగారమును మాత్రమే అంగీకరించుటచే అది అహంకారరస మని చెప్పియుండెను. అహంకార మనిన ఇట గర్వమని అర్థము కాక 'నేను' అను నొక అభిమానవిశేషమని, అది కలవాడు రసికుడని, అది లేనియెడల నీరసుడని,ఈతని అభిప్రాయము. ఈతని మతము ననుసరించి శృంగార మొక్కటియే రసము. మిగిలినవన్నియు భావములు.

ఇట్లే అద్భుత రసవాదము కలదు. ఈవాదమును స్థాపించినవాడు నారాయణుడు. సత్త్వగుణాధిక్యతచే బాహ్యప్రపంచమును మరపింపగల ఆనందము సామాజికునకు కలుగును. ఈ ఆనందము బ్రహ్మానందసదృశము. లోకోత్తర చమత్కారమును ప్రాణముగా గలది. ఈ చమత్కారమే మనోవిస్తార మనియు, మనోవిస్తారమే విస్మయమనియు చెప్పవచ్చును. కావున విస్మయ మెల్ల రసములకు కారణమయినది. అందుచే అద్భుతము నందు ఇతర రసము లన్నియు నిమిడియున్నవి. ఈతని సిద్ధాంతమీతీరున నున్నది.

ఇక కరుణరస వాదము – 'ఏకోరసః కరుణఏవ నిమిత్తభేదాద్భిన్నః పృథ

కృథగివాశ్రయతే వివర్తాన్। ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారాన్। అంభోయథా సలిలమేవహి తత్సమస్తం॥- కరుణము ఒక్కటియే రసము. జలము ఏరీతిగ తరంగములు, బుద్బుదములు ఇత్యాది రూపములతో కనబడునో అట్లే కరుణము కూడ భిన్నభిన్నమగురీతిని కనబడును అని భవభూతి చెప్పినాడు. దీని ననుసరించి లోకమంతయు శోకమయము. అదియే నిమిత్తభేదముచే భిన్నభిన్నములగు శృంగారాది రూపములుగ గోచరించును. శృంగారాదులు తాత్కాలికములై తుదకు శోకముగనే పరిణమించునని భావము. తరంగ, బుద్బుదాదులు ఎట్లు జలరూపములో, అట్లే శృంగారాదులు కరుణరూపములని భవభూతి అభిప్రాయము. రసానుభూతి వలన చిత్తద్రుతి కలుగుననియు, ఇది ప్రధానముగ కరుణమున కలుగుననియు, కావున కరుణమే ప్రధానమనియు సారాంశము.

శాంతమొక్కటియే రసమనియు, అది ప్రకృతిరసమనియు మిగిలినవన్నియు వికృతిరసములనియు, అదియే అభినవగుప్తుని ఆశయమనియు ముందే చర్చింప బడినది.

**ఇన్నిరసములు లేనేలేవని, ఒక్కటే రసమని,** దానికి ఆనందము స్థాయి అని కవికర్ణపూరగోస్వామి వాదము. ఈతడు తన అలంకారకౌస్తుభమున రజస్తమోగుణములచే స్పృశింపబడని శుద్ధసత్త్వస్వరూపమగు మనస్సునకు ఆనందమను ధర్మము గలదనియు, అదియే స్థాయి అనియు సిద్ధాంతము చేసియున్నాడు. భిన్నభిన్నములగు రసములు లేవా? అనియు, ఉన్నచో వానికి స్థాయి ఒక్కటే ఎట్లగుననియు ప్రశ్నలు ఉత్పన్నమగును. దీనికీతడిట్లు సమాధానమును చెప్పియున్నాడు. జపాకుసుమాది వివిధపదార్థముల సంయోగముచే స్ఫటికము ఒకసారి ఎఱ్ఱగా, మరియొకసారి పచ్చగా, ఇంకొకసారి నల్లగా ఎట్లు కనబడునో, అట్లే ఒక్కటే స్థాయి అయినను అది ఉత్సాహాది పోషకమగు అనేక విభావాదుల సంయోగముచే వీరాది రూపమును దాల్చును. మరియు ఘటశరావాది నానావిధములగు పాత్రలలో బింబానేకము ప్రతిఫలించినను సూర్యబింబము ఎట్లు ఒక్కటియో, అట్లే ఉపాధి భేదమున రత్యాదులలో భేదము కానవచ్చినను, స్థాయి అయిన ఆనందమున భేదములేదు. కావున ఈతని మతము ననుసరించి ఒక్కటియే రసము.

ఏరసము వలననైనను కలుగునది ఆనందమే కావున ఈ సిద్ధాంతము దోష జుష్టము కాదు. శృంగారము వలన గాని, కరుణము వలన గాని, మరి ఏ ఇతర రసము

వలన గాని కలుగు ఆనందము ఒక్కటియే. విభావాదులలో భేదము గలదు కాని ఆనందములో భేదము లేదు. విభావాది భేదము ననుసరించియే శృంగారాది రసభేదము లేర్పడినవి. సరస్వతీకంఠాభరణ వ్యాఖ్యాత అయిన భట్ట నరసింహాచార్యులు కూడ రసాస్వాదమొక్కటియే అని నిరూపించినాడు. అభినవగుప్తుడు మాత్రము ఈమతమును తెలుపలేదు. అయినను ఇది ఆతని సిద్ధాంతమునకు విరుద్ధముగా కానరాదు.

ఇట్లు రసతత్త్వమును చర్చించుచు పలువురు పండితులు ఒక్కొక్క రసము నభిమానించి అది ఒక్కటియే రసము అని పేర్కొనిరి. వీరి చర్చల నుండి వెలువడినవియే శృంగార, కరుణ, అద్భుత, శాంతరస సమీకరణములు.

ఈవిధముగ ఎన్నియో వాదములు లేవదీయబడినను అవి వారి వారి ప్రతిభా ప్రకటనార్థములే కాని సహృదయ హృదయంగమములు కావు. భట్టలోల్లటుడు 'అనంతావై రసాః' - రసములు అనంతములు అని వాదములు లేవదీసినను, అభినవగుప్తుడు వీని నన్నింటిని అంగీకరింపక తొమ్మిదింటిని మాత్రమే రసములుగా నంగీకరించినాడు. ఇతరముల నన్నింటిని భావములే యని చెప్పినాడు అనగా రసములు తొమ్మిదియే యనియు, అవి వరుసగా శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతము లనియు, వాని స్థాయి భావములు వరుసగా రతి, హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్స, విస్మయ, శమము లనియు సిద్ధాంతీకరించెను. అతివ్యాప్తిని అరికట్టుటకు ఇట్టి పద్ధతి స్వీకార్యము.[6]

## రసానుగుణ వృత్త్యాదులు:

ఈ నవరసములలో శృంగార కరుణములు సుకుమారములు. హాస్య, శాంత, అద్భుతములు అలతి సుకుమారములు. వీర భయానకములు అలతి ప్రౌఢములు.

ప్రతాపరుద్రీయమున -

'అత్యంత సుకుమారౌ ద్వౌ శృంగార కరుణౌ మతౌ
అత్యుద్ధతరసౌ రౌద్ర బీభత్సౌ పరికీర్తితౌ
హాస్యశాంతాద్భుతాః కించిత్సుకుమారాః ప్రకీర్తితాః
ఈషత్ప్రౌఢౌ సమాఖ్యాతౌ రసౌ వీరభయానకౌ'[7]

అని చెప్పి, మరియు - 'యత్ర శృంగార కరుణావతి కోమలేన సందర్భేణ వర్ణ్యే

---

6. ఈ సిద్ధాంత వ్యాసమున నవరసములకే లక్ష్యలక్షణ ప్రదర్శనము జరుగును.

7 ప్రతాపరుద్రీయము - కావ్యప్రకరణము, శ్లో. 17, 18.

తేతత్రకైశికీ, యత్ర రౌద్ర బీభత్సావతి ప్రౌఢేన సందర్భేణ ప్రతిపాద్యేతే తత్రార భటీయత్ర నాతి సుకుమారా హాస్యశాంతాద్భుతా నాతి సుకుమారేణ సందర్భేణ సంగ్రథ్యంతే తత్ర భారతీ. యత్ర నాతిప్రౌఢౌ వీర భయానకౌ నాతి ప్రౌఢేన సందర్భేణ నిర్వాహ్యేతే తత్రసాత్వతీ' అని చెప్పినాడు.

కోమలము లగు శృంగారకరుణము లందు కైశికీవృత్తిని, ప్రౌఢములగు రౌద్ర, బీభత్సము లందు అరభటీవృత్తిని, నాతిసుకుమారములగు హాస్య, శాంత, అద్భుతము లందు భారతీవృత్తిని, నాతిప్రౌఢములగు వీర, భయానకములందు సాత్వతీవృత్తిని నిర్వహింపవలెను అని భావము.

ఇవే అభిప్రాయములను కావ్యాలంకారసంగ్రహ కర్తయు చెప్పియున్నాడు. కావ్యాలంకారసంగ్రహమున -

'కైశికి చెలంగు శృంగార కరుణలందు
నారభటి రౌద్ర బీభత్స హారిణి యగు
నలరు భారతి హాస్య శాంతాద్భుతముల
నమరు సాత్త్వతి వీరభయానకముల'[8]

॥కరుణము లందు అనవలెను. కరుణ పదము దుష్టము॥

వృత్తులు సాక్షాద్రసోపస్కారములు. రీతులు పరంపరగా రసోపస్కారము లని చెప్పుదురు. రీతులు వృత్తుల నాశ్రయించియే యుండును. కైశికి వైదర్భిరీతిని, మాధుర్యగుణమును, ద్రాక్షాపాకమును ఆశ్రయించుకొని యుండును. ఆరభటి గౌడీరీతిని, ఓజోగుణమును, నారికేళపాకమును ఆశ్రయించుకొని యుండును. సాత్త్వతి పాంచాలీరీతిని ప్రసాదగుణమును, కదళీపాకమును ఆశ్రయించుకొని యుండును. భారతీవృత్తి శబ్దవృత్తి. దానినుండియే రీతులు మూడును జనించినవి. మిగిలినవి అర్థవృత్తులు అని సన్నిధానం వారి అభిప్రాయము.

ఇక గుణములు రసధర్మములు. 'రస మెచ్చట ఉండునో గుణమును అచ్చట ఉండును. గుణ మెచ్చట ఉండునో రసము అచ్చట ఉండును' అను సిద్ధాంతము ఆనందవర్ధనాదులగు నాలంకారిక సార్వభౌము లందరిచేతను అంగీకరింప బడినది. మాధుర్యమును సంభోగశృంగార, కరుణ, విప్రలంభ, శాంతము లందు తరతమాధిక్యముతో ప్రయోగింప వలయును. ఈ రసము లందు సమాస రచనయు తగనిది. అర్థము

---

8. కావ్యాలంకార సంగ్రహము, ఆ.2, ప., 74,పు.171

స్పష్టముగ తెలిసిన గాని రసానుభూతి కలుగదు. కావున కవి ఈ రసములందు మాధుర్యగుణమునే ఉపయోగింప వలయును. మాధుర్యము చిత్తద్రుతికి కారణము.

ఓజము వీర, బీభత్స, రౌద్రము లందు క్రమముగ అధికముగనుండవలయును. ఇది చిత్తదీప్తికి 'హేతువు'. వీనియందు దీర్ఘసమాస రచన యుక్తమే. ఒకానొకచో అసమాస రచన గాని, అల్పసమాస రచన గాని యుండవచ్చును. 'రౌద్రాదౌ మధ్యమసమాసా సంఘటనా, కదాచిద్దీరోద్ధత నాయకసంబంధ వ్యాపారాశ్రయేణ దీర్ఘసమాసాపివా' అని ధ్వన్యాలోక కర్త తెలిపియున్నాడు. ప్రసాదగుణము సర్వరస సాధారణమని చెప్పబడినది.

వర్ణములు గుణవ్యంజకములై, వీని వలన రీతు లేర్పడును. గుణములు రసధర్మము లగుటచే వీనివలన ఏర్పడిన రీతులును రసధర్మములే అగును. మాధుర్యము వైదర్భీరీతి యందు, ఓజస్సు గౌడీరీతి యందు, ప్రసాదము పాంచాలీరీతి యందు ఉండును.

భరతుడు – 'తేషా ముత్పత్తి హేతవశ్చత్వారో రసాః తద్యథా – శృంగారో రౌద్రో, వీరో, బీభత్స ఇతి – అత్ర శృంగారాద్ధి భవేద్ధాస్యో రౌద్రాచ్చ కరుణోరసః వీరాచ్చైవాద్భుతోత్పత్తి ర్బీభత్సాచ్చ భయానకః' ॥నా.శా., అ. 6॥అని ఈ రసములలో నాలుగే ప్రధానములని, అవి శృంగార, రౌద్ర, వీర, బీభత్సము లని, వీనినుండి తక్కినవి జనించిన వని చెప్పినాడు. మరియు –

'శృంగారానుకృతిర్యస్త సహాస్యస్తు ప్రకీర్తితః
రౌద్రస్యైవచ యత్కర్మ సజ్ఞేయః కరుణోరసః
వీరస్యాపిచ యత్కర్మసో ద్భుతః పరికీర్తితః
బీభత్స దర్శనం యత్రజ్ఞేయః సతు భయానకః' – ॥నా.శా; 6–6, 40,41 శ్లో॥

అని చెప్పినాడు. శృంగారానుకృతి హాస్యము, రౌద్రకర్మఫలమే కరుణము, వీరము యొక్క కర్మ అద్భుతము, బీభత్సదర్శనము నందు భయానకము అని చెప్పబడినది.

ఈప్రకరణమున రసముల నిష్కర్ష, వాని జన్యజనకత్వనిరూపణముఆయా రసముల గుణవృత్తిరీతుల నిర్ణయము స్థూలముగ జరిగినది.

## 3. ఈ. రసాధిదేవతలు – రసవర్ణములు

నాట్యశాస్త్రమున రసముల కధిదేవతలును, రసములకు గల వర్ణములును పేర్కొన బడినవి.

'శ్యామోభవేత్ శృంగారః సితో హాస్యః ప్రకీర్తితః
కపోతః కరుణశ్చైవ రక్తో రౌద్రః ప్రకీర్తితః
గౌరో వీరస్తు విజ్ఞేయః కృష్ణశ్చాపి భయానకః
నీలవర్ణస్తు బీభత్సః పీతశ్చైవాద్భుతః స్మృతః
శృంగారో విష్ణుదైవత్యో హాస్యః ప్రమథదైవతః
రౌద్రో రుద్రాధిదేవశ్చ కరుణో యమదైవతః
బీభత్సస్య మహాకాలః కాలదేవో భయానః
వీరో మహేంద్రదేవః స్యాదద్భుతో బ్రహ్మదూవతః' [1]

అని నాట్యశాస్త్రము. ఇట్లే సాహిత్యదర్పణకారాదులును పేర్కొనిరి.

వీనిని ఈ క్రిందివిధముగ పట్టికరూపమున చూపవచ్చును

| రసము | వర్ణము | దైవతము |
|---|---|---|
| 1.శృంగారము | శ్యామవర్ణము | విష్ణువు |
| 2.హాస్యము | సితవర్ణము | ప్రమథులు |
| 3.కరుణము | కపోతవర్ణము | యముడు |
| 4.రౌద్రము | రక్తవర్ణము | రుద్రుడు |
| 5.వీరము | గౌరవర్ణము | మహేంద్రుడు |
| 6.భయానకము | కృష్ణవర్ణము | కాలుడు |
| 7.బీభత్సము | నీలవర్ణము | మహాకాలుడు |
| 8. అద్భుతము | పీతవర్ణము | బ్రహ్మ |
| 9. శాంతము | ధవళవర్ణము | శ్రీ నారాయణుడు |

సాహిత్యదర్పణకారుడు చాలవరకు భరతునితో నేకీభవించిననుఒండు రెండు అంశములను మాత్రము భిన్నముగ చెప్పియున్నాడు. వీరమునకు హేమ వర్ణమును, అద్భుతమునకు గంధర్వ అధిదైవతమును చెప్పియున్నాడు.

---

1. నా.శా., అధ్యా.6, శ్లో. 42-45

సరసభూపాలీయమున :కావ్యాలంకార సంగ్రహము :-

'హరికి శృంగార లీలాధిపత్య మొసర్చు
గణనాథు హాస్యసంగతునిఁజేయు
నలిక విలోచనునిపై నధిక రౌద్రము నిల్పు
శక్రుపై వీరరసంబు నెఱవు
యమునిపైని దయామయత్వంబు ఘటియించు
జగతి మహాకాలు సభయుఁజేయు
శర్వరీంద్రుని జుగుప్సారసాన్వితుఁజేయు
శతధృతి నద్భుతాన్వితు నొనర్చు
శాంతి బ్రహ్మంబుఁజేర్చు నిచ్చలు నృసింహు
భువనభరణంబు, వరవిఘ్న నివహహరణ,
మీశతయు, భోగము ననేకనృపతి/హృతియు,
ననియు యశమును, మదియు బోధాతిశయము' [2]

సాహిత్యదర్పణకారునకు వీనికిని ఈవిషయమున కొంత భేదము కాననగు చున్నది.[3]

ఇట్లే కావ్యాలంకార సంగ్రహమున వర్ణములను గూర్చి-

'మరకతానీకదంభమున శృంగారంబు,
హాస్యంబు ముక్తాఫలౌ ఘురుచులఁ
గరుణవిద్రుమ వర్ణగౌరవచ్ఛలమున
రౌద్రంబు కురువిందరత్నకలన
వీరంబు గోమేధికారోపిత స్ఫూర్తి
భయము వైడూర్య శోభామిషమున
బీభత్స మింద్రనీలాభాగుణంబున
శాంతినిర్మల హీర కాంతిగతుల
నద్భుతము పుష్యరాగ రాగాపదేశ
విలసితంబున సాకారవృత్తిఁ గాంచి
నవరసంబులు వాల్చు......'[4]

---

2. కా.సం.-సన్నిధానం వారి వ్యాఖ్య, 3-149 ప., పుటలు 427-28
3. ఆయా భేదములు ఆయారస ప్రకరణము లందు చెప్పబడినవి.
4. కా.సం. -సన్నిధానం వారి వ్యాఖ్య, 3-150 ప., పుటలు 428-29

ఈ విషయమున కూడ సాహిత్యదర్పణకారునకును, ఈతనికిని కొంత భేదము కలదు.

'శృంగార ముత్పలాంచితము విష్ణుడు కర్త
తెలుపు హాస్యము గణాధిపుడు ఱేడు
కరుణ కాషాయంబు కాలుడు పతి
రౌద్రమవ్యక్త రక్తంబు హరుడు విభుడు
వీరంబు గౌరంబు వృత్రారిపతి
భయానకము ధూమ్రము మహాకాలుడీశు
డసితంబు బీభత్స మధిపతి నంది
యద్భుతము హేమాభమంబుజ భవుండు
భర్త; శాంతము నిర్మల స్ఫటికనిభము
పరగు నధిదైవతము పరబ్రహ్మమంద్రు
... ... ... ... ...'[5]

అని పేర్కొన బడినది.

ఈ విధముగ కొన్ని అలంకారిక గ్రంథములలో రసములకు వర్ణములును, అధిదైవతములును చెప్పబడియున్నవి. కాని తద్రసమునకును, ఆ దేవతలకును గల సంబంధమెట్టిదో ఎచ్చటను చూపబడలేదు. దీనిలోని ఆంతర్యమును మనమే గ్రహింపవలయునని వారి ఆశయము కాబోలు. కొందరాధునిక విమర్శకులును అలంకార గ్రంథములందు వీని నిర్ణయమును గూర్చిన అంశములు తెలుపబడకపోవుట వలన వీని కెక్కువ ప్రాధాన్యము నిచ్చియుండక పోవచ్చును. మనస్తత్వ శాస్త్ర దృక్కోణము నుండి రసములను పరిశీలించి విమర్శించిన శ్రీ రాకేశ్ గుప్తా వీనిని గూర్చి భరతుడు అష్టరసములకును నాక్కొక్క దేవతను వర్ణమును కూర్చుటను బట్టి యిది ఆలంకారికు లందరిచేతను అనుసరింపబడినను, వీనికి మనస్తత్వశాస్త్ర దృష్టితో చూచినచో నేమాత్రము ప్రాముఖ్యము లేదనిపించునని చెప్పినారు.[6]

---

5. కావ్యాలంకార చూడామణి, ఉల్లా.2, ప. 135

6. 'Bharatha has assigned a colour and a God to each of the eight Rasas, out of which according to him, only four are fundamental, the other four being derived from them, one from each. All this though copied by most of the later writers, can hardly be said to have any real psychological significance......'

-Psychological Studies in Rasa, p.2

కావున మనము వీనికి నిజముగ ప్రాముఖ్యమున్నదా! లేక యనావశ్యక కల్పనయా అను విషయమును, పరిశీలింపవలసి యున్నది.

డా॥ రాధాకృష్ణ గారు తమ సిద్ధాంతవ్యాసమున నిట్లు చెప్పియున్నారు- "ఏవైనా రెండు వస్తువు లొక్కచో సమకూర్చబడిన వన్నచో వానిలో రూపమునందో, గుణమునందో సారూప్య ముండుట సహజము. అనగా నారెంటిలో నొకదాని యొక్క స్వరూపము నవగాహన మొనర్చుకొనుటకు రెండవదాని తత్త్వమును గ్రహించుటచే సహాయపడవలె ననుట. ఏదియైన నొకరూపంమును గూర్చి సామాన్యజనులకు బోధపరుపవలె నన్నచో కొంత సులభముగ చెప్పవచ్చును. అట్లుగాక ఒక గుణమును గూర్చి రూపములేనట్టి దానిని గూర్చి బోధపరుపవలె నన్నచో నది కష్టతరము. అట్టి సమయములలో శ్రోతకు బాగుగా పరిచయము గల యొక రూపమును, మనము చెప్పబోవు గుణమున కాలంబనమగు దానిని చెప్పినచో దానిద్వారమున వానికీ గుణమును గూర్చి బోదపరచుట సులభమగును. అహింసను, శాంతిని గూర్చి చెప్పదలచిన బుద్ధభగవానుని రూపమును గుర్తునకు తెచ్చి తన్మూలమున బోధించిన శ్రోత మనస్సులో చక్కని ముద్రపడును. అట్లే చుప్పనాతితనమును చెప్పుటకు శూర్పణఖను సూచించిన చాలును. ఆ భావ మంతయు శ్రోత మనస్సునకు బొడగట్టును. ఇట్టి యుద్దేశ్యమున మనమునందిడుకొనయే మన ఆనల్యశాస్త్రాచారీ రూపకల్పనము గావించిరనిపించును.[7]

నాట్యవేదమున 'చిత్తభావస్పదము అయిన రసములక్కు వర్ణదేవతములు నిరూపించుట సాభిప్రాయము. వర్ణాభిధానము పూజాదులలో ధ్యానములో నుపయోగించును. వేషధారణ మొనరించు నటులకు ముఖరాగయోజనమున నుపయోగించుననియు నందురు. ఆయా రససిద్ధిలో ఆయా దేవతల పూజించుట సముచిత సంప్రదాయమని సూచించుట దేవతానిరూపణ భావము. విష్ణువు కామదేవుడు. ప్రమథులు భగవన్మహాదేవుని గణములవారు. క్రీడాపరాయణులు. రుద్రుడు త్రైలోక్యసంహారకర్త. మహాకాలనాథుడు బీభత్సదేవతము. అతడు తద్విభావ మగు కంకాలము ధరించును. శ్మశానము సేవించును. మహేంద్రుడు త్రైలోక్యరాజా. దేవేంద్రుడు. బ్రహ్మ యంచిత్యాద్భుత స్రష్ట. ఈ వర్ణదేవతాత్మక విధాన మంతయు

7. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము

నాగమసిద్ధముగా నున్నది'[8] అని వివరింపబడి యున్నది.

సాహిత్యదర్శనమున ఆచార్య నరసింహంగారు – 'వీనిని చెప్పుటలో సందర్భశుద్ధి లేదనియు, నివి యుక్తిసహములు కావనియు, నేటివారి యభిప్రాయము. కాని యా యభిప్రాయము సరికాదు. అలంకారికులీ వర్ణాదులను సహేతుకముగనే నిర్ణయించిరి[9] అని వానిని కొంతవరకు వివరించి యున్నారు.

శృంగారాది రసములకు ఆయా వర్ణదేవతముల నిర్ణయము ఎంతవరకు సమంజసమో వరుసగా పరికింతము.

శృంగారము శ్యామవర్ణము. విష్ణుదేవతము. శృంగారము నాయికా నాయకులకు అనంతసుఖావహము. ఈ విషయమై నెట్టి అభిప్రాయ భేదములును లేవు. ధ్వన్యాలోకము శృంగార ఏవ పరప్రహ్లాదనో రసః' అని చెప్పుచున్నది. సుఖము సత్త్వము నుండి జనించును. సత్త్వగుణమున కధినాయకుడు విష్ణువు. కావున శృంగారము విష్ణుదేవత మనబడినది. ఇట్లే వర్ణవిషయమునను సామంజస్యము కలదు. విష్ణుదేవతము కావున శ్యామ వర్ణము చెప్పబడినది.

హాస్యము శ్వేతవర్ణము. ప్రమథదైవతము. 'ధవలతావర్ణ్యతేహాసకీర్త్యోః' అని కవిసమయ ప్రసిద్ధము. కావున కవిసమయము ననుసరించి హాస్యమునకు శ్వేతవర్ణము చెప్పబడినది. ప్రమథులు హాస్యప్రియులగుటచే ప్రమథదైవత మనబడినది. కొందరి మతము ననుసరించి హాస్యమునకు గణపతి అధిదేవత. 'గజముఖము, గుజ్జురూపము, చేటచెవులు, మొద్దలైనవానితో నున్న ఈ దేవుని యాకృతిని చూచుటతోడనే నవ్వు ఉదయించును'[10] అని శ్రీమతి మాణిక్యం వేదవల్లితాయారు గారు గణపతి అధిదైవత మగుటలో గల సామంజస్యమును చెప్పియున్నారు.

కరుణము కపోతవర్ణము. యమదైవతము. కపోతవర్ణమన మలిన వర్ణము. శోకస్థాయికము కరుణము. ఈశోకము పాపము వలన కలుగును. 'మాలిన్యం వ్యోమ్నిపాపే' అని కవిసమయము. ఇట కూడ కవి సమయానుసారముగ దీనికి కపోతవర్ణము చెప్పబడినది. యముడు శోకాకారుడగుటచే నిది యమదైవత మనుట సమంజసమే.

---

8. నాట్యవేదము, పు.202
9. సాహిత్యదర్శనము, పు.242
10. 'తెనుగు సాహిత్యంలో హాస్యరసము'

డా॥రాధాకృష్ణగారు ఈ కరుణ విషయమైన రసాధిదేవతా వర్ణములను గూర్చి విపులచర్చ చేసి యమకపోత వర్ణముల సామంజస్యమును నిరూపించిరి.[11]

రౌద్రము రక్తవర్ణము. రుద్రాధిదైవతము. రక్తవర్ణమన లోహిత వర్ణము. క్రోధము రజోగుణము నుండి పుట్టును. 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణామ్' అని శ్రుతి. 'కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః' అని భగవద్గీతలో గలదు. కనుక క్రోధము లోహితవర్ణముగుట శ్రుతిసిద్ధమగు విషయము. మరియు నిది సంహారకారకము. అందుచే త్రిభువనసంహార కారుడగు రుద్రుడు అధిదైవత మనుటలోను, రక్తవర్ణమని చెప్పుటలోను సామంజస్యము గలదు.

వీరము గౌరవర్ణము ః హేమవర్ణ మని కొందరుః మహేంద్రదైవతము. మహేంద్రుడు సర్వవీరాధిపతి యగుటచేతను, ఆతని వర్ణము గౌర ః హేమః వర్ణ మగుటచేతను ఇట కూడ వర్ణదైవత విషయములు సమంజసముగానే యున్నవి.

భయానకము కృష్ణవర్ణము. కాలుడు దైవతము. కాళరాత్రి వలె భయమును కలుగ జేయునది ఇది. మృత్యువును మించిన భయము సర్వ సాధారణముగ నుండదు. మృత్యువును భృత్యువుగ జేసికొన్న పరేతరాట్టును మించిన భయానకమూర్తి ఎవరుందురు? ఇట్లు దీని సామంజస్యము నూహింపవలెను.

బీభత్సము నీలవర్ణము. మహాకాలుడు దైవతము. ఇదియును మానసికోద్వేగజనక మగునదియే. నీలకృష్ణములు స్థూలదృష్టి నభేదములు. సూక్ష్మదృష్టిని కించిద్భేదములు. నీల మిట భయమును కలుగజేయక రోతను గలిగించును. శ్మశానవాసి యైన మహాకాలుడు శ్మశానమును తలపింపజేసి రోత కలుగజేయును. కాష్ఠపిష్టకముల భస్మమువలన శ్మశానమున నీలవర్ణమే తోచును. శ్మశానమున కంటె జుగుప్సావహమైనట్టిది వేరొకటి కానరాదు. కనుక నిట నివి సమంజసములే యనవచ్చును.

అద్భుతము పీతవర్ణము. బ్రహ్మాధిదైవతము. సృష్టి అద్భుతావహమైనట్టిది. దానికర్త ఈ అద్భుతమునకు కారకుడు. అతడు పద్మరాగసంస్పృష్టుడైనచో పీతవర్ణుడై భాసించును. ఇట్లు దీనిని సమర్థింప వచ్చును.

శాంతము శ్వేత వర్ణము. నారాయణాధిదైవతము. ప్రశాంతమై, క్షీరపాథోధి యందు శ్వేతుడైన శేషుని పాన్పుగా గలిగిన నారాయణుని మూర్తి కన్నులకు

---

11. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము

గట్టినట్లుండును. త్రిగుణాతీతుడై యోగవిద్రనున్న ఆ మూర్తియు శ్వేతమే. పరిసరములును శ్వేతములే. కనుక ఇది ఎంతయు సమంజసము.

అమూర్తమగు రసమునకు వర్ణము సంగతమా? అను ప్రశ్న యుదయించును. భరతుడు ఋషి. ఆతని కట్లు భాసించినది. 'ఆప్తవాక్యంహి ప్రమాణమ్' అనుట ప్రాచీన పద్ధతి. విషయావబోధకు సాదృశ్యములు చెప్పుట లోకప్రసిద్ధము; హేతువాద పురస్సరము. అట్లే దైవితవిషయమును గ్రహించుట సమంజసము.

## 3. ఉ. రసాభాసము

రసాభాస మననేమి? రసము వలె ప్రకాశించుట రసాభాసము. విభావాది సామాగ్రి సంపూర్ణముగ లేనిదయ్యు ఆరోపణంబున రసము వలె కన్పడుట రసాభాస మనియు, ఆరోపితంబగు రత్యాది భావము రసాభాస మనియు చెప్పవచ్చును. ఈ రసాభాసమును పలువురు ఆలంకారికులు పలువిధములుగ నిర్వచించియున్నారు.

సాహిత్యదర్పణమున – 'అనౌచిత్య ప్రవృత్తత్వే అభాసరస భావయోః' ః తృ.పరి. –262ః అని కలదు. రసభావములనౌచిత్యమున ప్రవర్తిల్లినచో క్రమముగ రసాభాసము, భావాభాసము అగునని యర్థము. లోకమర్యాదాతిక్రమణము; అనౌచిత్యము. లోకమర్యాదను అతిక్రమించి ప్రవర్తిల్లిన నాయికానాయకాదుల రసము అనౌచిత్యము అని చెప్పనగును.

'తథాభాసా అనౌచిత్య ప్రవర్తితాః' అని కావ్యప్రకాశము

'అనుచిత విభావలంబనత్వం రసాభాసత్వమ్' అని రసగంగాధరము

అనుచిత విభావాలంబనత్వము రసాభాస మనియు, ఏ విభావము వలన అనుచిత రత్యాదులు కలుగునో అది రసాభాస మనియు రసగంగాధరకారుడు దీనిని పరిష్కరించి సిద్ధాంతీకరించెను.

గురు ముని రాజపత్నులు అనుచితాలంబనము లనుటకంటె వారియందు రతి అనుచితము అనుట తగునని రసగంగాధరకారుని ఆశయము. వారు అనుచిత ఆలంబనములు అనుట శిష్యాదుల విషయమున మాత్రమే. గుర్వాదులకు వారు అగమ్యులు కారు. కనుక గుర్వాది శబ్దములచేత శిష్యాదులను అనుసంధించుకొని వారి విషయమున అనుచిత ఆలంబనము అని అర్థము చేసికొనవలెను. తుదకు రసగంగాధరకారుని ఆశయమును, ఇతరుల ఆశయములును సంవదించుచున్న వనియే చెప్పదగును.

'ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా
యోషితో బహుసక్తిశ్చేద్రసా భాసస్త్రిథామతః'

అని ప్రతాపరుద్రీయము. నాయికానాయకులలో నొక్కరికి మాత్రమే అనురాగ ముండి రెండవవారికి లేకున్నను, అనురాగము తిర్యగ్గతమైనను, మ్లేచ్ఛగత మైనను, లేదా, నాయికకు పలువురి యందు అనురాగమున్నను రసాభాసమగును. విభావాది

సామగ్రీ సామగ్ర్యాభావముచే రసాభానము ఏర్పడును. విద్యావివేకాది సంస్కారపూర్ణులగువారి యందే అట్టి విభావాది సామగ్రీసమగ్రత యుండును. అట్లుగాక విద్యాసంస్కార విహీనులైన మ్లేచ్ఛాదుల రత్యాదులు పాశవికములే యగును గనుక, అవి అనుపచీయములై రసభావము నందవు. ఇక పశు పక్ష్యాదుల విషయమున విభావాదులు అసమగ్రము గనుక రసప్రతీతి పూర్తిగ ఏర్పడదు. శృంగార ముత్తమ యువప్రకృతిక మయినపుడే లోకకళ్యాణహేతు వగును. కనుక దానినే మన పెద్దలు సమాదరించిరి. అదియును ధర్మబద్ధము కావలెనని నిర్ణయించిరి. కనుకనే బహుపురుషుల యెడ ఆసక్తి గల స్త్రీ పరమగు నదియు అనుచితమనియే వారి ఆశయము. కనుక నదియు రసాభాస మగును.

సాహిత్యదర్పణమున రసాభాసమును గూర్చిన వివరణము ఇట్లు గలదు -

'ఉపనాయక సంస్థాయాం మునిగురుపత్ని గతా
యాంచ బహునాయక విషయాయం రతౌ తథాను
భయనిష్ఠాయాం ప్రతినాయక నిష్ఠత్వే తద్వద
ధమపాత్ర తిర్యగాదిగతే శృంగారేఽనౌచిత్యమ్' -।తృ.పరి., శ్లో.263-64।

ఉపనాయక విషయకమును, ముని గురుపత్నిగతమును, బహునాయక విషయమును, అనుభయనిష్ఠమును, ప్రతినాయకనిష్ఠమును, అధమపాత్రగతమును, తిర్యగాదిగతమును అగు రతి అనుచిత మగుచున్నది. కనుక రసాభాసము. ప్రతాపరుద్రీయ లక్షణమున ఉపపతి విషయకమగు రతియు, ప్రతినాయకగతమగు రతియు చెప్పబడకపోవుటచే, ఈ లక్షణమే సమగ్ర మనవచ్చును.

కావ్యాలంకార సంగ్రహకర్త -

'పలువుర కొక భామినిపైఁ
దలఁపును నొకవారసతికిఁ గదగ బలువురపై
వలఁపును, మృగ విహగాదుల
కెలవు రసాభాసమయ్యె క్షితి నెట్లున్నన్'[1]

పైని పేర్కొనబడిన పలువిధములగు రసాభాసములలో ఏకత్రైవానురాగ విషయకమగు రసాభాసము ఎట్టి వాదమునకును గురికాలేదు; అది నిర్వివాదాంశము. కాని తిర్యగ్గతమగు రతి విషయమున మాత్రము కొన్ని అభిప్రాయభేదములు కలవు.

---

1. కావ్యాలంకార సంగ్రహము, సిన్నధానం వారి వ్యాఖ్య, ఆ.3, ప.142,పు.413

విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగము వలన రసము నిష్పన్న మగునని యాలంకారిక సిద్ధాంతము. ఒక దృశ్యము గోచరమైనంతనే ఒక భావముప్పతిల్లును. ఆ భావము తీవ్రత్వము నొందినచో దాని ననుసరించి అనుభావాదులు జనించును. భావములకును, అనుభావములకును కార్యకారణ సంబంధము గలదు. వీనికి వ్యభిచారులు తోడ్పడిన ఆ భావము స్థాయి నొందును. సహృదయుడు దీనిని పలుమారులు భావించుట వలన ఆనందము కలుగును. అట్టి ఆనందమునే రస మందురు. అవిదగ్ధులగు తిర్యఙ్మ్లేచ్ఛుల యెడ గల రతి తాత్కాలిక హృదయరంజకము కావచ్చును. కాని సహృదయ హృదయము లందది ప్రవేశించి, వారిచే భావ్యమానము కాజాలదు. కనుక అది రసాభాసమయిన దని చెప్పిరి. కాని తిర్యగాదుల రతి అనుచితము కాదని, ఉపాదేయమే అగునని ఆలంకారికులు కొందరు దీనికి కావ్యమున కొంతవరకు స్థానము నిచ్చి యున్నారు.

రతి తిర్యగ్గతమైనను రసాభాసము కాదనియు, రసమే యగుననియు ఏకావళీకారుడగు విద్యాధరుని అభిప్రాయము. 'విభావాది సంభవోఽపి రసం ప్రతిప్రయోజకః। నవిభావాది జ్ఞానం। తతశ్చతిరశ్చామప్యేవ రసః'[2] – విభావాదులుండుట అవశ్యకమే కాని, తజ్ఞానము ఆవశ్యకము కాకపోవుటచే తిర్యక్కులు విభావములైనను రసాభాసము గాక రసమే అని ఆతని ఆశయము.

ఉపనాయక సంస్థమయినది ధర్మశాస్త్ర నిషిద్ధము. అది నింద్యము. అట్లే గురు ముని పత్నీగత మగునది మాతృస్థానము నందు అపచరించుట వంటిది. ఈశ్లి వావితలపరాదు, అను నానుడిని బట్టి తలచుటచే పాపమగు ఇది తగనిది. ప్రతినాయకగత మగునది ఏల నింద్యము? –దీనికి సమాధానము ఊహ్యము. 'రామాదివతు వర్తితవ్యమ్ నరావణాది వతు'. కనుక కావ్యమున వర్ణ్యము రామాదిగత శృంగారమే కాని రావణాది గతము కారాదు. స్పృహణీయమగు దానిని కావ్యమున విస్తరించి, అనుకరణయోగ్యము కాని దానిని కావ్యమున సంక్షేపించుట మన పద్ధతి. కనుక ప్రతినాయకగతమైనదానిని సంక్షేపింపవలసి యుండును. కనుకనచ్చట విభావాది సామగ్ర్యాభావముచే రసాభాసము ఏర్పడుచున్నది.

బహునాయికాగత మగు రతి బహునాయకగత మగు రతివలె దోష మగునా? అను ప్రశ్నకు కావ్యమున అది దోషజుష్టము కాదు అనవలెను. ఏలన బహునాయికల

2. కావ్యాలంకార సంగ్రహము, పు. 418

యందు అనురక్తుడగు నాయకుడు దక్షిణనాయకుడు అని ఆలంకారిక మతము.

పతి పంచకము గల ద్రౌపది అనుచితాలంబన మగునా? అను ప్రశ్న ఆధునికులకు ఉదయించును. దీనిని శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వారు 'ద్రౌపదీ విషయమున నట్టి దోషములేదు. ఏమనగా నామె తన సహజ వివేకౌదార్యములతో దన పతుల నయిదుగురను గూడ మిక్కిలి ప్రేమించినది. కావున వారియెడ నామె చూపించు భావ చేష్టాదికము లందు ప్రేమ ఆస్వాద్యమగు చుండును'[3] అనిరి. ఇంతేగాక ద్రౌపది వివాహము విచిత్రపరిస్థితులలో జరిగినది. ఆమె తన పతులయం దనురక్త యగుట నారదకృత సమయపాలనా విశిష్టము. కనుక అది అనుచితము కాదనుట సమంజసము.

తిర్యగాది అను శబ్దముచే పూజ్యపాదుల రతి వర్ణ్యము కాదని నిర్ణయింప నగును. 'అత్యుత్తమ దేవతావిషయకత్వేన వర్ణ్యమానా రతిరనుచితా। తద్వర్ణనం హి మాతా పిత్రా రతి వర్ణన మివ అత్యంత మనుచితం'[4] అని మమ్మటాచార్యుడు వచించెను. ఉత్తములైన దేవతల రతిని వర్ణించుట అనుచితము. అది తలిదండ్రుల రతివర్ణనము వలెనే అత్యంత మనుచితము.

## ఇక ఇతర రసాభాసములు:

### 1. హాస్యము:

'గుర్వాద్యాలంబనే హాస్యే' అని సాహిత్యదర్పణము. గుర్వాద్యాలంబనమగు హాస్యము హాస్యాభాసము. ఆదిపదముచే తలిదండ్రులు మున్నగు పూజ్యులను గ్రహింప దగును. వీరి నాలంబనముగా కలిగి హాస్యము ప్రవృత్తమయినచో హాస్యాభాసము.

### 2. కరుణము :

'హత పాత్రగతే కరుణే' – సాహిత్యదర్పణము. కృష్ణమోహనకృత లక్ష్మీవ్యాఖ్య. ధీరోద్ధతుడగు నాయకుడు తనచే చంపబడిన శత్రువును గూర్చి తానే రోదనము చేసినచో అది కరుణాభాస మగును.

### 3. రౌద్రము :

'రౌద్రే గుర్వాదిగత కోపే' అని సాహిత్యదర్పణము. గుర్వాదిగత మగు

---

3. ఆంధ్ర ధ్వన్యాలోకము

4. కావ్యప్రకాశము

కోపము రౌద్రాభాసము. ఆదిపదముచే తలిదండ్రులు,మునులు, సురలు, మొదలగువారు గ్రాహ్యములు. వీరిపై చూపు కోపము అనౌచిత్యదోషదూషిత మగుట వలన నిది రౌద్రాభాస మగును. 'క్రోధాత్మకో భవే ద్రౌద్రః ప్రతిశూరై రమర్షితః, రూక్షప్రాయో భవేదత్రనాయకోఽత్యుగ్ర విగ్రహః' అనుటనుబట్టి ఇది క్రోధస్థాయిక మనియు, ప్రతిశూరుని ఎడ క్రోధము గలవాడును, రూక్షప్రాయుడును, అత్యుగ్రవిగ్రహుడును నాయకుడనియు విదిత మగుచున్నది. దీని ననుసరించి ప్రతిశూరజనితమగు క్రోధమే రౌద్రమునకు స్థాయి అగును కాని గుర్వాది జనితమగు క్రోధము స్థాయి కాదని తేలుచున్నది.

## 4. వీరము :

'బ్రహ్మవధాద్యుత్సాహేఽధమపాత్రగతే తథావీరే' అని సాహిత్య దర్పణము. బ్రహ్మవధాదులను చేయుట యందలిది, అధమపాత్రగత మగునది అగు ఉత్సాహము వీరాభాస మగును. ఆది శబ్దముచే పితృవధాదులును గ్రాహ్యములు. అపాత్రదాన మిచ్చుట, వానిపట్ల దయచూపుట, మొదలుగా గల కృత్రిమధర్మము అందు ఉత్సాహమును చూపిన అదియు వీరాభాసమే అగును. ఇట ఆలంబనము అయోగ్యమగుట వలనను, ఇది ధర్మశాస్త్రనిషిద్ధ మగుట వలనను ఈ ఉత్సాహము అనౌచిత్యదోషజుష్ట మగుచున్నది. 'వీరో భయానకావిష్టో వీరాభాస ఉదీరితః - భావప్రకాశిక; హీనేపాత్రేషు తిర్యక్షు తదాభాసం విజానతె - సరస్వతీ కంఠాభరణము'.

## 5. భయానకము :

'ఉత్తమ పాత్రగతత్వే భయానకే' అని సాహిత్యదర్పణము. ఉత్తమ పాత్రగత మగు భయానకము భయానకాభాస మగును. భయానకము స్త్రీ, నీచ, బాలప్రకృతికము. అట్లుగాక ఉత్తమ పాత్రగతముగ చెప్పబడిన అది భయానకాభాస మగును.

## 6. బీభత్సము :

'బ్రహ్మజ్ఞానిగత జుగుప్సే బీభత్సే' - సాహిత్యదర్పణము, లక్ష్మీవ్యాఖ్య. బ్రహ్మజ్ఞానిగత మగు జుగుప్స బీభత్సాభాస మగును. కదర్యాది వస్తువులను చూచునపుడే జుగుప్స కలుగును. సుందరవస్తువులను చూచునపుడు జుగుప్స కలిగినట్లు చెప్పినను జుగుప్సాభావమే అందురు.

## 7. అద్భుతము :

'విశేష దర్శిత పాత్రగతే అద్భుతే'- లక్ష్మీవ్యాఖ్య; 'అలోకోత్తర వస్తువులను చూచియు విస్మయపడుట అద్భుతాభాసము' అని నరసభూపాలీయ వ్యాఖ్య సన్నిధానం వారిది. లోకోత్తరవస్తువే దీని కాలంబన మగును గాని లోకోత్తరములు కానివి ఆలంబనములు కావు.

## 8. శాంతము :

'శాంతేచ హీన నిష్ఠే' అని సాహిత్యదర్పణము. శాంతము హీననిష్ఠ మయిన శాంతాభాస మగును. హీనులు శమ తత్త్వజ్ఞానా సమర్థులగుటచే, వారి నాశ్రయించుకొనిన శమము శాంతాభాస మగుచున్నది.

ఇక రసాభాసము ఆస్వాదయోగ్య మగునా! కాదా! అను ప్రశ్న ఉదయించును. రసము వలె రసాభాసము సంపూర్ణముగ లేకపోవుటచే ఆనందజనకత్వమున కించిన్న్యూనతను పొందియున్నది. అంతమాత్రమున అది ఉపాదేయమే కాదని గాని, ఆస్వాదయోగ్యమే కాదని గాని అనుట అసమంజసము. రసాభాసమును కూడ వర్ణించిన మహాకవులు కలరు గనుక సహృదయులు దీని నంగీకరింతురు.[5]

మరియొక చిన్న సందేహము. రసాభాసము, రసభంగము ఒక్కటియేనా! లేక ఏమైనా భేద మున్నదా! 'అనౌచిత్యాదృతే నాఽన్యద్రసభంగస్యకారణమ్' అనుదాని ననుసరించి రసభంగమునకు అనౌచిత్య మొక్కటియే కారణము. మరొక్కటి కాదు. రసాభాసమునకు, రసభంగమునకు అనౌచిత్య మొక్కటియే కారణముగా చూపబడినది. అట్టియెడ రసభంగ రసాభాసములకు భేదమేమియును లేదా? అను ప్రశ్న యుదయించును. రసభంగ రసాభాసములకు ఈ షద్భేదము గలదు. 'స్థాయ్యాది చర్వణావసరముననే కాలుష్యము, తత్తత్కారణముల వలన గోచరమగుచో నచట రసభంగమే. ఆ కాలుష్య మప్పటికి కాక పాశ్చాత్యస్ఫురణ మగుచో రసాభాసాది ప్రసంగ మనియు స్పష్ట పడగలదు' అని ఈవిషయమై శ్రీ వేదా లవారు ఆంధ్ర ధ్వన్యాలోకమున విపుల చర్చ కావించిరి. ఆభాసమున సహృదయులకు ఆస్వాద ముండును. రసభంగమున రసప్రతీతియే లేనపుడు ఆస్వాద ముండుట కవకాశమే లేదు. 'గ్రామో నాస్తి కుతస్సీమా' అని గదా!

ఇంతకరకు రసాభాస మన నేమి? రసాభాసము రసమా? కాదా? అను విషయమును, రసాభాస రసభంగములకు గల భేదమును, రసాభాస వైవిధ్యమును పరికించితిమి.

---

5. ఈ విషయమును ధరణికోట వెంకట సుబ్బయ్య గారు రసగంగాధరమున విపులముగ చర్చించి యున్నారు, పుటలు 463-64

# 3. ఈ. రసదోషములు

'రసాపకర్షకా దోషాః' - రసమును తగ్గించునవి దోషములు అని సాహిత్య దర్పణమున దోషలక్షణముకలదు. కావ్యాలంకార సంగ్రహమున అర్థదోషములు, వాక్యదోషములతోపాటు రసదోషములు కూడ వివరింపబడి యున్నవి. కావ్యాలంకార సంగ్రహకర్త-

'రసములు వాచ్యములైనను
వెస నదియును దోషమయ్యె; విపులోగ్ర రణం
బసదృశ బీభత్స రసో
ల్లసితము; శృంగార సహిత లలన యనంగన్'[1]

అని చెప్పియున్నాడు.

రసగంగాధరమున - 'యత్రవిభావాదిభి రభివ్యక్తస్య రసస్య స్వశబ్దేనాభిధానం తత్రకోదోష ఇతిచేత్, వ్యంగ్యస్య వాచ్యీకరణే సామాన్యతో వమనాఖ్యదోషస్య వక్ష్యమాణత్వాత్, ఆస్వాద్యతావచ్ఛేదకరూపేణ ప్రత్యయా జనకతయా రసస్థలే వాచ్యవృత్తేః కాపేయ కల్పత్వేన విశేష దోషత్వాచ్చ' - విభావాదులచే అభివ్యక్తము కాదగిన రసమును ఆ రసశబ్దముచే పేర్కొనుట వలన వమనము అనుపేరు గల దోషము కలుగును. అది కపిచేష్టా పదృశము. దానివలన నియతాస్వాదకత్వ ధర్మవిశిష్టముగ ఆది ప్రత్యయజనకము గాదు. కనుక విభావాది సామగ్రీ పరిపుష్టమైనను రసమును స్వశబ్దవాచ్యము చేయరాదు.

మమ్మట విశ్వనాథాదులు కూడ రసదోషములలో స్వశబ్దవాచ్యతాదోషమును చెప్పియున్నారు.

'వ్యభిచారి రసస్థాయి భావానాం శబ్దవాచ్యతా' - కావ్యప్రకాశము

'రసస్యోక్తిః స్వశబ్దేన స్థాయి సంచారిణోఽపి' - సాహిత్యదర్పణము

వీని సారాంశమేమన రసములు గాని, స్థాయి వ్యభిచారి భావములు గాని స్వశబ్దవాచ్యములు కారాదు. అనగా రసాది సాధారణ పదములచేతను, శృంగారాది విశేషవాచకములచేతను వాచ్యము చేయరాదని భావము. ఇవి వ్యంగ్యరూపములుగ

---

1. కావ్యాలంకార సంగ్రహము, ఆ.4, ప.55, పు.507

అభివ్యక్తము లయినపుడే ఆస్వాద్యము లగును.

రసము వాచ్యమగుటకు ఉదాహరణము –

'తాముద్వీక్ష్య కురంగాక్షీం రసోనః కోఽప్యజాయత
చంద్రమండల ముద్వీక్ష్య శృంగారే మగ్నమాంతరమ్'[2]

శృంగారాది శబ్దము వాగ్యమగుటకు ఉదాహరణము –

'శృంగారీ గిరిజాననే, సకరుణో రత్యాం, ప్రవీరః స్మరే
బీభత్సోఽస్థి భీ రుత్ఫణీ చ భయకృ న్మూర్త్యాఽద్భుత స్తంగయా
రౌద్రో దవిమర్దనే, చ హసకృన్మగ్నః ప్రశాంతశ్చిరా
దిత్థం సర్వ రసాత్మకః పశుపతి ర్భూయాత్సతాం భూతయే'[3]

స్థాయిభావ వాచ్యతకు ఉదాహరణము –

'శివే శృంగారార్ద్రా, తదితర జనేకుత్సన పరా
సరోషా గంగాయాం, గిరిశనయనే విస్మితవతీ,
హరావిభ్యే భీతా, సరసిరుహ సౌభాగ్యజయినీ
సఖీ ఘుస్మేరాతేమయి జనని దృష్టి స్సకరుణా'[4]

వ్యభిచారి భావముల వాచ్యత్వమునకు ఉదాహరణము –

'సవ్రీడాదయితాననే, సకరుణా మాతంగ చర్మాంబరే,
సత్రాసాభుజగే, సవిస్మయరసా చంద్రేఽమృతస్యందిని,
సేర్ష్యా జహ్నుసుతావలోకన విధౌ దీనాకపాలోదరే,
పార్వత్యా నవసంగమ ప్రణయినీ దృష్టిః శివాయాస్తువః

ఈ భావములనే వ్యంజితము చేసినచో ఆ రసదోషము పరిహార్య మగును. అందులకు ఉదాహరణము –

'వ్యానమ్రాదయితాననే, ముకుళితా మాతంగచర్మాంబరే,
సోత్కంపా భుజగే, నిమేషరహితా చంద్రేఽమృతస్యందిని,
మీలద్భ్రూః సురసింధు దర్శనవిధౌ, మ్లానా కపాలోదరే,
పార్వత్యా నవసంగమ ప్రణయినీ దృష్టిః, శివాయాస్తువః'[5]

---

2. సాహిత్యదర్పణము, పు.278
3. కావ్యాలంకార సంగ్రహము, పు. 511 (సన్నిధానం వారి వ్యాఖ్య)
4. సాహిత్యదర్పణము, పు. 279
5. కావ్యాలంకార సంగ్రహము (సన్నిధానం వారి వ్యాఖ్య), పుటలు 508-9

ఇట వ్రీడ, కరుణ, త్రాస ఇత్యాది వ్యభిచారులు స్వశబ్దముచే గ్రహింపబడక, వాని వాని అనుభావములగు వ్యాస్రమత, ముకుళనము ఇత్యాదులు చెప్పబడుట వలన రసదోషము లేదు.

వమన దోషమునకు కవులేల పాల్పడిరి? అనేకులు రసనిర్భరము గావలసిన తావులందు విభావాదులను గూర్పక, రసనామమునే ప్రయోగించుట జరిగినది. అది చమత్కారజనకము కాదు. మరికొందరు విభావాది సామగ్రి వలన రసము వ్యక్తమగు స్థలమున శృంగారాది పదము లున్నచో పునరుద్దీపమగు ననుకొనిరి. విభావాది సామగ్రి వశమున రసము పరిపుష్టమైన తరువాత తదుద్దీపనము దోష మగును. కావున రసనామధేయగ్రహణము దోషమని భావించిరి.

నవరసగంగాధరమున ఈ వమనాఖ్యదోషమును ప్రతిపాదించు సందర్భమున 'స్వశబ్దోక్తి ఉంటే రసము అస్వాద్యము కాదు. ప్రకట మయినప్పుడు దాని అభిరుచి తగ్గుతుంది[6]. సాహిత్యదర్పణకారుని మతము ననుసరించి 'ఎచ్చట విభావనుభావకృత పరిపుష్టి లేమియే అనుగుణమో, అచ్చట వ్యభిచారిని తన శబ్దముచేత చెప్పుట దోషము కాదు' అనియు ఎచట విభావాది పరిపోషము ప్రకృతరస ప్రతికూలప్రాయమగునో అచట స్వశబ్దముచేత చెప్పుటయే న్యాయమనియు చెప్పబడినది.[7]

వమనదోషకల్పనము కేవలము నిర్మూలమని శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వారు సిద్ధాంతీకరించి ఈ విషయమై విపులమగు చర్చ చేసి, మరియు నిట్లు చెప్పియున్నారు. 'ఇంతటికి తత్వమేమన, స్వశబ్దముచే వ్యంగ్యము లుపాత్తము లయినచోట దోషము లేకపోవుటమే కాదు; కొన్ని చోటుల సంశయము పోయి, వైశద్యాధిక్యమే కల్గినది. ఉదా॥ 'ఔత్సుక్యేన కృతత్వరా' – మున్నగు స్థలము లందు – ఇట 'కృతత్వరా' – దోషభయాదులచేతను త్వర కల్గును. ఉత్కంఠచేతను కల్గును. ఇట దేనిచేత? అను సంశయము కల్గగా 'ఔత్సుక్యేన' అని వ్యభిచారి భావము వాచ్యమగుటచేత సంశయ మపనయించినది. వ్యభిచారిభావము లందే, స్రక్సూత్రకల్పముగా, రసానుభవము కల్గును. వ్యభిచారి భావములపట్ల స్వపద

6. నవరస గంగాధరము, పు. 141

7. ఆంధ్రసాహిత్యదర్పణము, పుటలు 258-59

గ్రహణము దోషము కాకపోవుటేల? రసవిషయమున దోషమగుటేల? ఇట నిజమునకు వ్యభిచారిభావముల విషయమున దోషము కాకపోవుట న్యాయము. అట్లే రసవిషయమునను. ఇట్లు సర్వత్ర వ్యంగ్యములకు స్వపదగ్రహణము దోషముకాదని సిద్ధాంతము.

ఈ విషయమున నిదియు పర్యాలోచనీయము. రసాస్వాద విషయము భరతముని ఉదాహరణము నొసంగెను. పానకము నాస్వాదించిన రసజ్ఞునకు అది పానక మని, దాని రసము మధురమని మాటల నవగతమైనంతనే పూర్వము స్ఫురించిన రసము భంగమగుట అనుభవసిద్ధమా? అట్లే ప్రకృతము నందును కావ్యరసాది పట్లను అవగంతవ్యము'.[8]

రసదోషములు తిక్కన భారతమున కలవా? అను విషయమై విపులచర్చ గావించిన ఆచార్య రామకోటిశాస్త్రి గారి అభిప్రాయ మిట ఉపాదేయము. 'స్వశబ్దవాచ్యత అనుదోషము రసమునకు లేదు - ఉన్నదనుకొన్నను భారతము వంటి ఇతిహాస గ్రంథమున అది గుణమే కాని దోషము కాదు. దోషము కాని రసదోషము'[9] అని చెప్పిరి.

కేవల స్వశబ్దవాచ్యదోష మొక్కటిమాత్రమే కాక మరికొన్ని రసదోషములు పేర్కొనబడినవి.

'వ్యభిచారి రస, స్థాయిభావానాం, శబ్దవాచ్యతా;
కష్ట కల్పనయా వవికత రనుభావ విభావయోః
ప్రతికూల విభావాది గ్రాహ్యా; దీప్తిం పునః పునః;
అకాండే ప్రథనచ్ఛేదౌ; వంగస్యాప్యతివిస్తృతిః
అంగినోఽననుసంధానం ప్రకృతీనాం విపర్యయః
అనంగస్యాభిదానం చరస్థే దోషాస్స్యురీదృశాః'[10]

ఇందు రసాది శబ్దములను వాచ్యముచేయుట దోషముకాదని నిరూపింప బడినది.

---

8. ఆంధ్రధ్వన్యాలోకము, పుటలు 547-68

9. తిక్కన కావ్యశిల్పము, పు. 467

10. కావ్యాలంకార సంగ్రహము ః సన్నిధానం వారి వ్యాఖ్యా, పు. 508

మిగిలినవి దోషములే. అవి అనుభావ విభావములు కష్టముగ గుర్తింపబడుట, ప్రకృతరస విరుద్ధము లయిన విభావాదులను గ్రహించుట, తిరిగి తిరిగి రసమునకు దీప్తి కలిగించుట, అసమయమున రసవిచ్ఛేదనము చేయుట, అసమయమున ప్రకాశము చేయుట అంగభూతముగా నున్న రసమును మిక్కిలి విస్తరించుట, అంగిరసమును పోషింపకుండుట, స్వభావమును సముచితముగా వర్ణింపకుండుట, రసానుపకారకమైన దానిని వర్ణించుట, మొదలగునవి.

ఈ దోషములలో వమనాఖ్యదోసము దోషము కాకపోవుటచే కావ్యమున అది పరిహార్యము కాదు. కాని మిగిలినవానిని పరిహరించి దోషజుష్టము కాకుండ కావ్యమును తీర్చిదిద్ద వలెను.

# 4వ ప్రకరణము

## పర్వాంతర్గత రసపోషణము – స్థూలవివేచనము

'వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచిత బంధముగ నాకొక్కక్క మాటు' (కా.ఖం., పీఠిక.13) అని రసధుని యగు శ్రీనాథుని గూర్చి వేమారెడ్డి డపలుకు. తిక్కన గారి వైశిష్ట్యమీ యొక్క పలుకులో వ్యక్తమగుచున్నది. తిక్కనార్యుని కవిత్వము సర్వజనాకర్షణీయ మగుటకు కారణభూతములగు వానిలో రసపోషణము ప్రధానము.

కావ్యేందిరకు కథౌచిత్య పాత్రౌచిత్యములు శరీర ఆరోగ్యములు కాగా, రసౌచిత్యము జీవ మగును. ఈ మూడును సమప్రాధాన్యము గల అంశములే యైనను, ముఖ్యములే యైనను, జీవప్రధానమగు రసము మరింత ముఖ్యమగును. తిక్కనామాత్యకృత మగు భారతము నవరస సుధాబ్ధి. నవరసములకు నిది పట్టుకొమ్మ. ఈ రసక్షేత్రమున అన్ని రసములును ప్రోదిసేయబడి యున్నవి. మహాభారతములో లేని రసములేదనియు అన్ని రసతరంగిణులును ఈ క్షీరాబ్ధిలో సంగమించిన వనియును చెప్పవచ్చును.

తిక్కన కృత భారతము నందలి పదునేను పర్వములలో ఏయే పర్వములలో ఏయే రసములు పోషింపబడినవో స్థూలముగ పరికింతము.

తిక్కన కవిత్వతత్త్వ నిరతిశయాను భవానంద భరితాంతఃకరణుడై తాను/ రచింప బూనిన యీ భారతభాగమును గూర్చి-

'హృదయాహ్లాది చతుర్థమూర్జిత కథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ
బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం

దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్'[1]

అని చెప్పికొనినాడు. భారతామృతమును కర్ణపుటముల నారగ్రోలి, ఆంధ్రావళి మోదమును బొరయునట్లుగ రచింపబూనినాడు. సాత్యవతేయ సంస్కృతిని శ్రీవిభవాస్పదమయిన చిత్తముతో మహాకవిత్వ దీక్షావిధి నొంది, ధర్మాద్వైతస్థితిని భారతసంహితను తెనుంగుబాసలో వినిర్మింపబూనిన వాడైనను, ఇందలి ఏఘట్టమున కాఘట్టమునే యొక ప్రబంధముగ చేయదలచినాడు. ఈతడుపయోగించిన ఈమూడు విశేషణములు కేవల విరాటపర్వమునకు సంబంధించినావా! లేక యావత్ భారత భాగమునకు సంబంధించినవా! అను విషయ మిట కొంత విచారింప వలసి యున్నది. కొందరి దృష్టి ననుసరించి ఈ మూడు విశేషణములును చతుర్థమగు విరాటపర్వమునకు మాత్రమే సంబంధించినవి. అయిన ఉద్యోగాది పర్వముల మాటేమి? అని 'హృదయాహ్లాది' మొదలగు వైశిష్ట్యము కలవి కావా! అవికూడ నట్టివియే యైన వీనిని ఒక్క విరాటపర్వమునకే సంబంధించిన విశేషములుగ తలంచుట సరికాదు. పదునైదు పర్వములను తుదిముట్ట వ్రాయదలంచిన తిక్కన ఈ విశిష్టలక్షణముల నన్నిటిని యొక్క విరాటమునకే పరిమితము చేయుట యందు తాత్పర్యము కలిగియుండు ననుట అంత సముచితమగు విషయము కాదు.

ఈమూడు విశేషణములును కేవల విరాటపర్వమునకు గాక మొత్తము భారతమునకు సంబంధించినవే అనుట సముచితము. పైపద్యమునకు ముందు 'ఆదరణీయ సార....' అను పద్యము కలదు. 'అదియును' అను వచనము దానికి ముందు కలదు. ఈ పద్యమున 'అష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై ......' అనియు, అందు అదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు....' అనియు చెప్పబడినది. మరియు 'విరాటపర్వమట యుద్యోగాదులుం గూడఁగా .....తుదిముట్ట రచించుటొప్పు' (విరా., 1-5-7) అనియును గలదు.

ఈ విధముగ వీని నన్నింటిని సమన్వయించి చూచిన ఈ విశేషణము లన్నియు పదునేనుపర్వముల భారత భాగమునకు సంబంధించినవియే యగును.

'రచనాకౌతుకమున మన మలరగ' అని చెప్పికొనుటచే, ఆ కౌతుకము పదునైదు పర్వములను తెనుగున వ్రాయవలెనను రచనాకౌతుక మగును కాని, ఒక్క విరాటపర్వమునే హృదయాహ్లాదిగ, ఊర్జిత కథోపేతముగ, నానారసాభ్యుదయోల్లాసిగ,

---

1. భారతము, విరా., ఆ.1-7

వ్రాయవలెనను కౌతుకము కాజాలదు. కావున ఈ విశేషణములు తిక్కన కృతములగు పదునైదు పర్వములకు సంబంధించినవియే యగును. 'నానా రసాభ్యుదయోల్లాసి' అను విశేషణము విరాటమునకు మాత్రమే అన్వయించునవి ఒకరిద్దరు చెప్పియుండ, శతాబ్దము క్రిందట మరియొకరు 'ఇది ఉద్యోగపర్వమునకు సంబంధించినదిగా' వ్రాసిరి. 'పాదలంజేయు ముదంబు....ఎల్లెడన్'[2] ఈయన శ్రీ కరాలపాటి రంగయ్యగారు. ఇట్లు ఎవరికి తోచినట్లు వారు ఏదో ఒక పర్వమునకు మాత్రము ఈ విశేషణములు ఉపయోగించుట కాక, భారతము పదునైదు పర్వములకును ఈ విశేషణములు ఉపయోగించుట సముచితము. ఊర్జితకథోపేతము, హృదయాహ్లాది, విశేషణముల మాట ఎట్లున్నను 'నానా రసాభ్యుదయోల్లాసి' విషయమున మాత్రము భారతము మొత్తము నానా రసాభ్యుదయోల్లాసి అని చెప్పకతప్పదు. ఈవిధమగు విమర్శనమును శ్రీ కేతవరపు వారు తమ సిద్ధాంతవ్యాసమున చేసియున్నారు.[3]

నానారసాభ్యుదయోల్లాసి అనగా అన్నిరసముల యొక్క పుట్టుకచే ప్రకాశమునకు వచ్చినది అని అర్థము. భారతమున అన్ని రసములును పుట్టి, అంగిరసమునకు ప్రకాశమును చేకూర్చినవి. భారతమున అంగిరసము శాంతము. ఇది ఇతర అంగరసములచే అభ్యుదయమును పొంది స్ఫుటముగ ప్రకాశించినది.

పదునెనిమిది పర్వముల భారత భాగమున చతుర్థమును, పదునైదు పర్వముల భారత భాగమున ప్రథమమును అగు విరాటపర్వమున ఏయే రసములు గలవో స్థూలముగ చూతము. ఆస్వాదింపబడునది రసమని, విభావాదుల సంయోగముచే రసనిష్పత్తి కలుగునని, రసస్వరూప వివరణాదులు తృతీయ ప్రకరణమున గావింప బడినవి. రసస్వరూపమును పూర్తిగ అవగతము చేసికొనిన గాని తిక్కన గారి భారత భాగము నందలి రసములను గూర్చి నిర్ధారించి చెప్పలేము.

మహాభారత వాహినీతీరమున తీర్థభూతమగు ఈ విరాటపర్వమును గూర్చి 'సభారంజనము, సర్వమనోజ్ఞము నాల్గవ పర్వము నొదగి విరాటపర్వము వెలయన్' ៖భార.ఆది.1-41៖ అని నన్నయ గారి మన్నన అయిన, హృదయాహ్లాది, ఊర్జిత కథోపేతము, నానారసాభ్యుదయోల్లాసి అని తిక్కన గారి స్పష్టోక్తి. భారతము మొత్తము భాగమునకైన నేమి, కేవల ఈ విరాటపర్వమునకైన నేమి ఇట ప్రయోగింపబడిన

---

2. తెనుగుకవుల చరిత్ర, పు. 156 ៖ శ్రీ నిడుదవోలు వారిది៖

3. తిక్కన కావ్యశిల్పము, పుటలు 186-88

ఈ మూడు విశేషణములును మూడు రత్నముల వంటివి. ఇందలి యితివృత్తము మానవజీవితమునకు అత్యంత సన్నిహితమును, వీరశృంగారాది రసముల కాశ్రయమును అగుటచే నిది హృదయాహ్లాది యగుచున్నది. సాధారణముగ లోకమున సంభవించు వివిధ సన్నివేశములతోపాటు, ఆయా సందర్భములలో వ్యక్తుల వర్తనముల వలన వ్యక్తములగు వారివారి నైజ శీల స్వభావాదులకును ఇందు ఎక్కువ అవకాశ ముండుటచే లౌకికజీవిత మిట సంపూర్ణముగ ప్రతిబింబించిన దనవచ్చును. ఈ పర్వము నందు పేర్కొనదగిన ప్రధాన ఘట్టములు కీచకవృత్తాంతము, ఉత్తరగోగ్రహణము, అభిమన్యుని వివాహము. 'కీచకవృత్తమున వీరరస మంగియు, రౌద్ర మంగమును కాగా, నుత్తరగోగ్రహణ కథ యందు వీర మంగియు, హాస్యము తదంగము నైనవి. ఉత్తరాభిమన్యు వివాహఘట్టము లలితశృంగార ప్రధానమై మనోహరమైనది'[4] అని శ్రీ భూపతి వారు విరాటపర్వ రస సంబంధమగు విషయములను కొన్నింటిని చెప్పియున్నారు. భీమకీచకులు నాయకప్రతినాయకులుగ, వీరము ప్రధానముగ, ధర్మార్థములు ఫలముగ గలిగిన ఈ కీచకవృత్తాంత ఘట్టముననే తన ప్రతినను సార్థక మొనరించుకొనిన అసదృశప్రజ్ఞాధురీణుడు తిక్కన. లోకజీవితము నందు సాధారణముగ ప్రాధాన్యము వహించు ఇంద్రియవ్యాపారములైన కామక్రోధాదులు ఈ కీచకవృత్తమున ముఖ్యవిషయము లగుటచే తిక్కన రచనయు వాని కనుగుణముగ ప్రబంధమార్గమున నడచినది. ఉద్యానవన సూర్యోదయ, సూర్యాస్తమయాది వర్ణనములు తరువాతి కాలమున పెంపొందిన ప్రబంధరీతి కాదర్శములైనవి. విరాటపర్వమున సూచింపబడిన ఈవిధానమే ఎఱ్ఱన, సోమనాథాదులచే గ్రహింపబడినదై, శ్రీనాథాదులచే పోషింపబడి, రాయలకాలమున పరిణతిని గాంచిన దనవచ్చును. ఆస్థానపతితమగు ప్రతినాయకగత మగు ఈ ప్రణయము ఏకత్రైవానుగత మగుటచే నాభాసమై వీరరస విజృంభణమునకు తావొసగుటయే కాక, రసాంతరముల కటనట నిలువ తావొసంగినది. అందుచేతనే ఇందంగి వీరమని, అంగములు రౌద్రాదులని చెప్పబడుచున్నది. కావ్యము నందలి ప్రధానరసమునకు ప్రోద్బలకములై రసాంతరములు వర్ణింపబడిన నాడే రసము సుస్థిరమై సహృదయ హృదయాహ్లాద మగుచుండును. ఈ ఘట్టమున వీరము ప్రధానమై క్రమ పరిపుష్టము కాగా, రౌద్ర, కరుణ, బీభత్స, హాస్యాద్భుతములు పరిపోషకము లయినవి. శృంగార మాభాస మయినది. ఈరీతిగ

4. భారతము-తిక్కన రచన, పు.23

ఒండురెండు రసములుదక్క, తక్కిన రసములు స్ఫుటముగ వర్ణితము లగుటచే నీఘట్ట మొక్కటియే నానారసభ్యుదయోల్లాసి అయినది. కీచకగత మగు శృంగారమీ ఘట్టమున అత్యధికముగ వర్ణింపబడినది. ఇందలి ప్రకృతిగత మగు వర్ణనాచాతుర్య మంతయు శృంగారమయము. ఇట్లు ఎంత విస్తారముగ వర్ణింపబడినను ఇది ప్రతినాయకగత మగుటచేతను, ఏకత్రైవానురాగమునకు తార్కాణ మగుటచేతను ఇది ఆభాస మయినది. కీచకివిషయమున వర్ణితములైన మోహవికారాదులును, విరహమును, శృంగారాభాసము నకే పోషకములైనవి. పరసతిని కామించిన నీచకాముక చిత్తప్రవృత్తి వర్ణనము శృంగారరసపోషకము కాజాలదు. రతి అనుస్థాయి ఉభయనిష్ఠ మయినపుడే, అనుభావాదులచే పోసితమై, శృంగారరసముగ పరిణమించును. ఇట రతి అనుభయనిష్ఠము. కీచకునికి ద్రౌపదిపై వ్యామోహము కలదు. కాని ద్రౌపదికి కీచకునిపై నట్టి భావము లేదు. కావున అది అభాసపరిణత మయినది. అట్లయ్యు నాయకుడగు భీమసేనుని వ్యవసాయమునకు సహకరించి ఆతని ఆగ్రహవృక్షమునకు బీజప్రాయ మయినది.

రౌద్రరస స్ఫూర్తి భీముని యందే మనకు తరచుగ గోచర మగుచుండును. కీచకునిచే కచాకృష్టయైన ద్రౌపదిని సభలో నుండి చూచిన భీమసేనుని నిప్పులురాలు కన్నులందును, సాంద్రఘర్మసలిలము క్రమ్ము అంగము లందును, నితాంతపీడన రటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్త నర్తనఘటనాప్రకార భయదస్ఫురణా పరిణద్ధ మూర్తి యందును రౌద్రరసము మూర్తీభవించి యున్నది. భీముని ఈ కోపాటోపమును గాంచిన ధర్మజుడు ఆతని కోపరసము పేర్మిచెరచి శమింపచేయుటకై నిగూఢభాషణము లాడినాడు. ఇట శాంతరసము సూచనామాత్ర నిబద్ధము. ఈ ఆభాస శృంగారముచే జనించి, పత్నీపరాభవ దర్శనజనిత క్రోధమున ప్రవృద్ధమయి, కష్టపరంపరాశ్రవణమున పరిపుష్టమై కీచకవధోత్సాహమున ఉన్న సందర్భము చివరకు భీమునితో స్థిరపడి వీరరసముగ పరిణమించినది. కీచకవధోత్సాహమున ఉన్న సందర్భమున భీమసేనుడు పలుభావములకు లోనయినాడు. సజాతీయ విజాతీయ భావములచే భీముని యుత్సాహము సందిగ్ధదశ నందక సుస్థిరత్వము నొంది వీరముగ పరిణమించెను. ఇట వీరరసపోషణము కలదు. నిగూఢరూపమున ఉన్న భీమసేనుడు కీచకునితో 'ఇట్టివాడవు గాన....' (విరా. 2-338) అని పలుకు సందర్భమున హాస్యరసము, పంచాణంబేణమును పొదువునట్లు ఆక్రమించి కోపాటోపదీప్తాంగుడై,

బెడిదములగు పిడికిటి పోటులతో, ఆతని చంపు సందర్భమున, రౌద్రమును, కోపము చల్లారక వికృతపు చావు చంప మది వేడుకపుట్టి, వాని మస్తకమును పీనదీర్ఘభుజ శాఖలును, పాదయుగళంబును, మేనిలోని చొరునట్లు నుగ్గుగా తురిమి, నించిన క్రంతల తిత్తియైన యాతని దేహమును నేలపై జిదిపి, చక్కని ముద్దగా చేసిన సందర్భమున బీభత్సమును, కడు నక్కజమగు చందమున నున్న ఆపీనుగును విస్మయానంద నిర్మగ్నయయి, ముక్కుపై నంగుళము కదియించుకొనిన ద్రౌపదిని వర్ణించు సందర్భమున అద్భుతరసమును పోసింపబడినవి. ద్రౌపది సింహబలునిచే భంగపాటు పొందిన సందర్భమున ఆమె పరిదేవనారూపమున కరుణము చోటుచేసికొన్నది. ఇట్లు రసముల నన్నింటిని ఏకత్ర పరిపుష్టము లొనరించి వీరరసము నుజ్జ్వలతరము గావించుటచే నిది అంగి అయి, తదితరములు అంగములయి, ఈ ఘట్ట మొక్కటియే నానారసాభ్యుదయోల్లాసి అయినది. ఇట్లు ఏ సన్నివేశము లందు ఏయే పాత్రములకు, ఏయే రసభావములకు ఎంతవరకు ప్రాధాన్యము కలదో, ఎంతవరకు అవసరము కలదో, అంతవరకు మాత్రమే గ్రహించి ఔచిత్యభరితముగ రసపోషణమును గావించుట తిక్కన గారి కావ్య శిల్పము. ఇందు ధర్మజుని శాంతము, భీమగతమగు రౌద్రవీరములు, ద్రౌపదీనిష్ఠమగు కరుణము, కీచకాలంబన శృంగారాభాసము, వధవేళ యందలి రౌద్రబీభత్సములు, బహువిచిత్రముగ సంధానితములై ఈతని రసపోషణ సామర్థ్యమును వేనోళ్ల చాటుచున్నవి.

ఉపకీచకవధ సందర్భముననను ఎడనెడ కొన్నిరసములకు తావు కలిగినది. ఉపకీచకులకు పట్టుపడిన సందర్భమున ద్రౌపదీపరిదేవన రూపమున కరుణమును భీముడు ఉపకీచకులను చంపు సందర్భమున వికటభ్రూకుటి ఘోరఫాలకలిత స్వేదోద్భటుడును, చలద్వికృతోష్ఠద్వయుండును, సమగ్ర క్రోధవేగుండును అయి భీమసేనుడు ఒక ఉన్నతావనీజమును పెఱికి రౌద్రాతిరేకమడర, భుజశిఖరమందమర్చి విజృంభించినపట్ల రౌద్రమును, తెలివొంది పురంబు సొచ్చి రాచవీథి నరుగుచున్న ద్రౌపదిని చూచి 'యమ్మరో రక్కసి యంచు నుల్లములుకు' పురజనుల భయచేష్టావర్ణనా సందర్భమున హాస్యరసమును పోషించినాడు.

దక్షిణగోగ్రహణ సందర్భముననను, అంతకంటె ఉత్తరగోగ్రహణ సందర్భముననను వీరరసమయాత్మకుడగు అర్జునుని వర్ణించుపట్ల తిక్కన వీరరసపోషణ చాతుర్యమును వెల్లడించెను. ఉత్తరగోగ్రహణమున ఉత్తరుడు 'తెప్పించి తొడుగు మీవని యొప్పించిన....'

॥విరా.4-39॥ అని తనుత్రాణమును తెప్పించి ధరింపుమను సందర్భమున ఆతడు దాని నిట్టునట్టుగ ధరించినవాడై అచటి అబలాజనమును నవ్వించినాడట. ఈసందర్భమున హాస్యరసమును పోషించెను. భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలం బయిన దుర్యోధన గ్రీష్మాదిత్య పటు ప్రతాప విసరాక్రీర్ణం బయిన కౌరవసైన్యమును చూచి భీతి యడరిన మనస్సుతో, వెలవెలబారుచు వెగడొందిన పెదవుల తడియారుచుండ, చల్లన నంగముల నిండ చెమర్చుచుండ, పదములు కరములు గుదియ వడకుచుండ, గద్గదికమగు వెలుగుతో నున్న ఉత్తరకుమారుని వర్ణించు సందర్భమున భయానకరసమునకు అనుగుణములగు అనుభావాది వర్ణనము జరుపబడినను, అంగనాజను లెదుట బీరములు పలికి ప్రతిజ్ఞలు సల్పిన ఈ ఉత్తరుడిట్టు భయపడుటలో హాస్యరస స్ఫూర్తినే కలిగించినాడు తిక్కన. విన్వచ్చుని యుద్ధమంతయు ఉత్సాహస్థాయిక మగు వీరమునకు తావొసగినట్టిదే. వరదాన మహానుభావంబున అర్జునుని శిరస్సుపై కిరీటము వొలిచిన సందర్భమున అద్భుతమును కలదు.

ఈ పర్వమున తుదిఘట్టముగా పేర్కొనదగినది ఉత్తరాభిమన్యుల వివాహ వర్ణనము. ఇది పవిత్రమగు లలితశృంగారమున కాదర్శము, సరసమును అయి యున్నది. నూతన వధూవరుల చేష్టల నత్యంత రమ్యముగా కవి వర్ణించినాడు. ఈసందర్భమున నూతన వధూవరుల పరస్పరావలోకనములు, హోమసమయ కృత్య సంస్పర్శభంగులు మొదలగువాని వర్ణనమున లలితశృంగార రసపోషణము కలదు. ఇట్లు విరాటపర్వము పలురసములకు ఆలవాలమై తిక్కనామాత్యుని రసపోషణ సామర్థ్యమును పలువిధముల వెల్లడి చేయుచున్నది. ఈ విరాటపర్వము నానారసాభ్యుదయోల్లాసి ఎట్లయినదో శ్రీ రాంభట్ల వారు తమ వ్యాసమున చక్కగా నిరూపించి యున్నారు.[5]

'ఉద్యోగపర్వము రాజకీయవిషయ ప్రధానమైనది. లోకశాంతి, లోకానర్థములకు హేతువులగు సంధివిగ్రహముల వినిశ్చయము ప్రయోజనముగ పాండవు లొనర్చిన ప్రయత్న మిందలి విషయము. పాండవుల భావికర్తవ్యమును నిశ్చయించుటయే కాక, ఈపర్వము సత్యధర్మన్యాయములకు లోకమున గల స్థితి ఎట్టిదో కూడ వ్యక్తము చేయుచున్నది. లోకహితమును, బంధుహితమును కోరిన ధర్మజుని

5. భారతి- 1957 జనవరి, సంపుటము 34, సంచిక 1, పుటలు 6-8

ఆశయమును నెరవేర్చువాడై కృష్ణుడు సామదాన ద్వైధీభావముల నతి చతురతతో ప్రయోగించుట ఇందలి ప్రధానేతివృత్తము' అని చెప్పుటయే గాక, రాజకీయసంబంధములగు రాయబారములీ ఘట్టమున ప్రధాన సన్నివేశము లగుటచే సంభాషణాశైలి ప్రాధాన్యము వహించినదనియు, ఇందలి యితివృత్తమును పోషించుటలో తిక్కన తన అఖండమగు లోకజ్ఞానమును, మనస్తత్వపరిజ్ఞానమును, మంత్ర తంత్ర నిష్ణాతృత్వమును ప్రదర్శించినాడనియు శ్రీ భూపతి వారు చెప్పియున్నారు.[6]

ఉత్తరాభిమన్యుల వివాహమునకు వచ్చిన బంధువర్గము, వారి వివాహానంతరము ఒకచోట సమావేశమయి పాండవుల భావికర్తవ్యమును గూర్చి చర్చించుటతో నీపర్వము ప్రారంభమగును. ద్రుపదుని పురోహితుడు రాయబారిగా వెడలుట ఇందలి ప్రథమఘట్టము కాగా, సంజయుడు రాయబారనిమిత్తమై వచ్చుట రెండవఘట్టము. కృష్ణుడు తుదిప్రయత్నము గావించుట మూడవఘట్టము. ఇట్లు ఈ పర్వమున మొదటి మూడాశ్వాసము లందును ఈమూడు ఘట్టములు ప్రాధాన్యము వహించి యున్నవి. చతుర్థాశ్వాసమున కృష్ణుడు కుంతి యింటికి జని ఆమెతో మాటలాడుట, కృష్ణునితో రహస్యోక్తులు పలుకుట ఇత్యాది అంశములు కలవు. ఈ ఘట్టము ప్రధానముగ మంత్రతంత్ర నిష్ణాతృత్వము, మనస్తత్వ పరిజ్ఞానము కలది కావున రసపోషణమునకు ఇందంతగా తావులేదని కొందరి అభిప్రాయము. డా॥రంగారావు గారు తమ సిద్ధాంత వ్యాసమున ఈ ఉద్యోగపర్వమును కూడ నానారసాభ్యుదయోల్లాసిగా నిరూపించి యున్నారు. ఇట్లు ఈ పర్వమును గూర్చి భిన్నాభిప్రాయములు కలవు. ఇది నానా రసాభ్యుదయోల్లాసి అయినను, కాకున్నను రసపోషణ సమర్థుడగు తిక్కన, కావ్యరచనతత్పరతాదృష్టి కలవాడగుటచే ఈ పర్వమునను అవకాశమున్నంతవరకు రసపోషణమును కావించియే యున్నాడు.

సంజయుడు ఉపప్లావ్యము నుండి హస్తినాపురికి చేరి ధృతరాష్ట్రునితో తెలుపుమని అర్జునుడు పుత్తెంచిన పలుకులు వీరరసావలంబనములు. ఈ పర్వమున కౌంతేయుల నాశ్రయించి యున్నది యత్నవీరము అని డాక్టర్ సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయము. సామదానాది నీత్యుపాయముల ననుసరించి పాండవులు కౌరవులతో సంధి యొనర్చి తమ భాగమును తాము పొందవలెనని యత్నించుటయు,

---

6. భారతము – తిక్కన రచన, పుటలు 41, 42

దుర్యోధనాదులు రణమునకై బద్ధకంకణులై యుత్సహించుటయు నిందలి ప్రధానకథాభాగములు. ఇట లోకశాంతికై ఈ సంధియత్నము జరుపబడినది. 'సంధి కుదరనిచో రణమున కాయత్తులై యుండి యుండుటచే నిది ఉపాయ సాధనాత్మకమగు యత్నవిశేషమే యగుచున్నది. అనగా వారు పరిస్థితులనుకూలించినచో శాంతివీరులు లేదా రణవీరులు"[7] అని డాక్టర్ సుబ్రహ్మణ్యముగారు తమ అభిప్రాయమును వెల్లడిచేసిరి. ధృతరాష్ట్రుడు సంజయుని వలన పాండవుల పక్షమున గల వీరవరుల బలపరాక్రమములను విని, స్వపక్షవినాశము తప్పదని భావించినవాడై 'సంజయా! నేనేమి సేయుదు నెందుజొత్తు, నెద్ది దెరువెవ్వరు శరణంబు.....' ఉద్యో.2 -184-200 అనురీతిగ పలవించిన సందర్భము కరుణాభాసమని శ్రీ నండూరి రాధాకృష్ణగారి అభిప్రాయము.[8] ద్రౌపది తన భంగపాటును కృష్ణునితో చెప్పికొని దుఃఖించిన సందర్భమునను, కుంతి దుఃఖవర్ణనా సందర్భమునను కరుణము చోటుచేసికొన్నది. డా॥ రంగారావు గారి అభిప్రాయము ననుసరించి 'ఈఘట్టము శాంతాభాసముతో నారంభమై, వీర రసముతో సాగి చివరకు కరుణము నందు పర్యవసించు చున్నది మిత్రరసముల సమ్మేళనము ఇచ్చట మిత్రరస వ్యవధానముతో నొనర్పబడినది. తత్కాలపాత్ర కథాస్వభావముల ననుసరించి చిత్రచిత్రముగా వివిధరసముల తదంశముల సమ్మేళన మొనర్చుట మహాకవి ప్రతిభాధీన మయిన విషయమే కాని కేవల శాస్త్రగతనియమ నిబద్ధము కాదు. తిక్కన అటువంటి ప్రతిభాశాలి'.[9]

ఇట కావ్యరస సంబంధి ప్రయోజనము సాధింపబడిన దని, అంగిభూతమగు శాంతమున కిటనే బీజము వేయబడినది. ధర్మజుని చిత్తము నందు యుద్ధమునకు పూర్వమే శ్రీకృష్ణుని మాటల వలన పుట్టిన వ్యథలోని భాగముగా బంధువుల పట్ల మమకారము నిక్షేపింపబడినదని, ఇది క్రమముగా పుంజుకొని యుద్ధాంతమునకు పుష్టమై నిర్వేదరూపమున పరిణమించి అంగిరసపోషణ కుపకరించెనని, దానికి తగినట్లు అంగభూతమగు వీరము యొక్క తీవ్రత అరికట్టబడినదని, ఇది ప్రధానరసమును

---

7. వీరరసము, పు.171
8. కరుణరసము -ఆంధ్రవాఙ్మయము
9. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana

దృష్టియందిడుకొని చేయబడిన కావ్యశిల్పమని కేతవరపు వారుచెప్పి యున్నారు.[10] సమరోత్సాహము ధర్మజుని యందు, కేంద్రీకరింపబడకుండ 'బంధువర్గమున్ ఘోరముగ్ వధించుటకుఁ గోల్కొనకున్నది బుద్ధి మీరు నిర్ధారణ సేయుడాహితము / ధర్మము నయ్యెడు వృత్తమెట్టిదో' (ఉద్యో.4-90) అని తమ్ములనుచూచి అనినట్లు రచింపబడినది. నాయకుడగు ధర్మజుని యుత్సాహము భంగించుట వలన అంగ భూతమగు వీరరస విజృంభణము అరికట్టబడును. వీరమున కననుకూలమగు శోకముతోడి యనుత్సాహము. కాని యుద్ధము జరుగవలెను కావున మరల నుత్సాహము కల్పింపబడవలయును కావున 'లోక సంగ్రహార్థమై అట్టి కర్మ ఆచరింపవలెనని' అర్జున విషాద ఘట్టమున నిరూపింప బడును. శాంతరసమునకు అనుకూలముగ, అంగభూతములగు రసములు పోషింపబడినవి. 'ఏయే రసములు అంగరసములుగా' కథ యందు ప్రవేశించినను అంగిరస మగు దానికి న్యూనత రాకూడదు. ద్రౌపదీ సంభాషణవేళ ప్రధానరసమగు శాంతేతరములు విజృంభజించినట్లు భాసించినను తరువాతి యర్జున శ్రీకృష్ణుల మాటలలో నాతీవ్రత తగ్గి మరల శాంత రసమునకే ప్రాధాన్యము స్థాపింప బడిన' దనినారు డా॥ రంగారావు గారు.[11] ధృతరాష్ట్రుని సభయందు శ్రీకృష్ణుడు విశ్వరూపమును చూపు సందర్భమున అద్భుతరసము తళుక్కుమన్నది. ఈ పర్వమున 'ఎత్తిన వేడ్క....' అని తిర్యగ్గతమగు రతియు వర్ణింప బడినది. పిన్న నవ్వు, కలకల నవ్వు ఇత్యాదులు కూడా వర్ణింపబడి యున్నవి. ఇట్లు ఈపర్వమునను అవకాశమున్నంతవరకు ఆయా రసములకు తావు కల్పించినాడు. రససిద్ధుడగు తిక్కన.

తరువాత పేర్కొనదగినవి భీష్మ, ద్రోణ,కర్ణ, శల్య, సౌప్తిక పర్వములు. ఈ ఐదుపర్వములను కలిపి యుద్ధపంచక మని వ్యవహరింతురు. యుద్ధ పంచకమును గూర్చి శ్రీ భూపతి వారి అభిప్రాయము లిట్లున్నవి- "వేదవ్యాస మునీశ్వరు పాదంబులు దలచి మ్రొక్కు భక్తి రసైకాస్వాదన సుకరానందోత్పాదన దివ్యమతి నగుచు దగ నెఱిగింతున్' అను యుద్ధప్రవర్తనమును ధృతరాష్ట్రునకు తెలుపబూనిన సంజయుని పల్కులు యుద్ధపర్వ రచనకు కడంగిన తిక్కన యెడ ముఖ్యముగా సమన్వయించు చున్నవి. అష్టాదశాక్షోహిణీ సైన్యప్రవర్తితమును, అష్టాదశ దివస

10. తిక్కన కావ్యశిల్పము, పుటలు 258-59

11. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana

పరివ్యాప్తమును అగు యుద్ధమును రసవంత మగు కావ్యరూపమున పోషించుట యెంతటి దుష్కరకార్యమో, ఎంతటి యసాధారణకార్యమో తిక్కన ఎఱుంగును. కావున వ్యాసమహర్షి యందలి భక్తి రసైకాస్వాదనముచే నానందము సుకరముగ సిద్ధించిన దనియు, నాయానందసిద్ధిచే దివ్యమతినై యీ యుద్ధపర్వములను రచింతు ననియు తిక్కన పలికియున్నాడు"[12]

ఈ యుద్ధపంచకమున ప్రధానరసము యుద్ధవీరమే. అయినను సందర్భానుసారముగ రౌద్ర, బీభత్స, అద్భుత,కరుణాదులు పోసింపబడియున్నవి. ఈ రసము లన్నియు సంగభూతములై భారతమున అంగి భూతమగు శాంత రసమునకు పోషకములే అగుచున్నది. ధర్మమార్గానుయాయులై పాండవులు తమను ఒడ్డున చేర్చు నావికునిగా కృష్ణు నెన్నుకొని కురుక్షేత్రయుద్ధ మను మహాసాగరమును దాటగల్గిరి. ఇది దాటుటలో కొన్ని ఇక్కట్టులపాలయినను, కృష్ణసాహాయ్యమున నవలీలగా వాని నెదుర్కొని తమ లక్ష్యము నందుకొనిరి. కవిబ్రహ్మ యగు తిక్కన ఈపర్వపంచకము ననన్యసామాన్యమగు ప్రతిభతో నిర్వహించి రసపోషణ చక్రవర్తియై, యొరులకు చేతకాని కావ్యశిల్పమును సంతరించినాడు.

ఈ యుద్ధపంచకము ఒక విచిత్ర కథాకథన విశేషమును తెల్పునట్టిదై, పాండవవీరుల యుద్ధపాటవమును పలువిధముల చాటుచున్నది. పాండవులకు ధృష్టద్యుమ్నుడు సర్వసేనానియై, సౌప్తికపర్వాంతము వరకు సజీవియై యుండెను, కౌరవులకు నలుగురు సేనానులు మారిరి. వారి నొక్కొక్కరిని సంహరించుట యందు పాండవుల యత్నమును నిరూపించుటయే యొక్కొక్కపర్వము యొక్క ప్రయోజనము. భీష్మ, ద్రోణ, ఇత్యాది పర్వనామములే ఈ అంశమును విదితపరచు చున్నవి. క్రమముగా క్షీణించు కౌరవవీర నివహము నొక వంకను, కొంత తరగినను మూలబలము చెదరని పాండవబలమును నొక వంకను గాంచి తారతమ్యదృష్టితో పరిశీలించిన పాండవుల యుద్ధసాధన సామర్థ్యము సువిజ్ఞేయ మగును.

డాక్టర్॥జి.వి.సుబ్రహ్మణ్యం గారు 'ఈ యుద్ధపంచకమున కనపడు వీరులలో ప్రతియొక్కడును ఉత్తముని వలె భాసించి కారణజన్ముడైనట్లును, ఏదో యొక వైయక్తిక ధర్మము నాశ్రయించి యుద్ధము చేసినట్లును గోచరించెదరు. ప్రతినాయకుడగు దుర్యోధనుడు సైతము తాను యుద్ధము చేయుట దైవికమగు నాత్మధర్మ మని

12. భారతము - తిక్కన రచన, పు.70

పూర్వమే నిరూపించి మన కాశ్చర్యమును కల్గించినాడు. 'మునులార! నన్ను విధి యేమని మున్ను బుట్టించె నట్టులయ్యెడుగాక్కీ, వినజవిగాని పలుకులకు బనిగలదే! యడుగుడింక బహుభాషణముల్' :ఉద్యో.3-325: క్రాంతదర్శనులు, ఋషిపుంగవులు నయిన నారదాదులం గాంచి రారాజన్న మాటలివి. నాజన్మరహస్యమును త్రికాలజ్ఞు లయిన మీరు గుర్తింపలేదా! అని ఎగతాళి' అని చెప్పిరి.[13]

అంగిరసపోషణకు విరుద్ధముగ అంగమగు వీరము అధికముగ పోసింపబడ కూడదు. కావున భీష్మపర్వమున అర్జునవిషాద ఘట్టముననే దానికి తగిన రీతిని పాదుగొల్పినాడు తిక్కన. 'శాంతము కేవల జ్ఞానరూపము. అది నిష్క్రియము. యుద్ధము కావలయును కనుక జ్ఞానముతోపాటు కర్మ చెప్పబడినది. ఫలాభిసంధి రహితమైన కర్మయే కర్మ యనియు, అది జ్ఞానము కంటె భిన్నము కాదనియు, లోకసంగ్రహముకొరకట్టి కర్మ ఆచరింపబడనేవలయుననియు సమన్వయము చేసి శాంతానుకూలమైన సామగ్రి ప్రవేశపెట్టబడినది. దానివలన అర్జునుడు ఉత్సాహియైనాడు. కాని అది యుద్ధరంగమునకు రాకపూర్వమున్న, కౌరవులకు నాశనము చేయవలయునన్న, ద్వేషముతోడి యుత్సాహము కాదు. నేను నిమిత్తమాత్రుడను, అంతయును కర్మ పరిపాకమును బట్టి జరిగిపోవును. లోకసంగ్రహము కొరకు నిమిత్తమాత్రముగా నిలుచుట ధర్మము. ధర్మము గనుక నిలువ వలయును - అను ఈవిధమైన ఉత్సాహ మది. దాని వలన యుద్ధమునకు యుద్ధమును జరిగినది. అది వీరలక్షణము కలది కాకుండను బోయినది'[14] ఆచార్య కేతవరపు వారు చెప్పియున్నారు. ఈప్రయోజనము నాశించియే భారతకర్త భీష్మపర్వమున ప్రథమాశ్వాసమున ఈ అర్జునవిషాద ఘట్టమును వర్ణించినాడు. ప్రధానరసమును దృష్టియందియడుకొని దాని స్ఫూర్తికి అంగరసము అడ్డురాకుండ ఇట్లు చేసినాడు.

యుద్ధపంచకమున విరివిగ <u>యుద్ధవీరము</u> పోసింపబడినది. ప్రతిద్వంద్వుల ప్రతియొక్కరి యుద్ధమునను మనకు వీరరసపోషణము కానగును. దుశ్శాసనుని వధ సందర్భమున తనప్రతిజ్ఞ పూర్తిచేయుటకు తగిన అవకాశము లభించినది కదా అని యుత్సాహముండుటచే <u>వీరమును</u> పూర్వవిషయస్మరణ వలన కలిగిన క్రోధముచే

---

13. వీరరసము, పు. 176
12. భారతము - తిక్కన రచన, పు.70
14. తిక్కన కావ్యశిల్పము, పు.269

రౌద్రమును, చేసిన జుగుప్సాకరమగు క్రియచే బీభత్సమును పోసింపబడినవి. 'లీలం గేలనమర్చి....', 'నరసింహు డసురేంద్రు వ్రచ్చుకరణి....' కర్ణపర్వ., ఆ. 3-214-217। అనురీతిని భీముని మాటల వలనను, క్రియల వలనను బీభత్సభయానక రసపోషణము గావించినాడు తిక్కన. ఒక్కసారిగ చంపబడుట చంపబడువానికి ఒకవిధమగు సుఖము. పీడింపబడి పీడింపబడి చంపబడుటకంటె వేరు నరకము ఉండదు. దుశ్శాసనుని కట్టి ఘోర నరకావస్థను కల్పించినాడు భీముడు. ముఖమున కత్తి ఝుళిపించుట, మాటలతో, చేతలతో బాధించుట – మొదలగునవి ఆనారకీయతను మరింత తీవ్రతర మొనర్చినవి. ఇట్లు భీమపరముగ రౌద్రము వర్ణింపబడినది. సైంధవవధ నాటి యుద్ధమున అర్జునుడు గావించిన వీర విహారమును వర్ణించుచు తిక్కన యద్భుత రసమును పోషించెను. కౌరవసైన్యము విరుథుడైన యర్జునునాక్రమించినపుడు అతడు ప్రదర్శించిన యస్త్రకౌశలము అసాధారణములగు నాత్మవిశ్వాస గాంభీర్య శౌర్యములు అద్భుతావహములు, దివ్యములు. సైంధవుని శిరమును త్రుంచియు, దానిని క్రిందబడనీయక అంతరిక్షముననె త్రిప్పుచు అర్జునుడు యుద్ధమును సాగించిన విధానమును అట్లే అద్భుతరసోత్పాదకముగ వర్ణితమైనది. భీష్ముని అపజయవార్త విని వెంటనే ధృతరాష్ట్రుడు శోకార్ణవమున మునుగుట, ద్రోణుని వధను వినగనే ధృతరాష్ట్రుడు వదనంబు వెల్లనయి హృదయము జల్లనునట్లు చింతించుట, అభిమన్యునికై అర్జునాదులు దుఃఖించుట – ఇత్యాదులన్నియు కరుణరస పరిపోషకములు. ఇక యుద్ధరంగ వర్ణనము బీభత్సావహమే. రక్తసిక్తమగు యుద్ధరంగమున తుండెములగు అవయవములడు యుద్ధ రంగము బీభత్సమునకు తావు కల్పించెను. కొన్ని సందర్భములలో తిక్కనార్యుడు జుగుప్సావహ మగు వానిని కూడ రమ్యములగు నుపమానములతో మనోహరముగ వర్ణించు నేర్పు కలవాడు. 'ధరణి నెత్తుటదోగి యాభరణనికాయ శస్త్రఖండ జాలముల చాలనొప్పె...తెలువవోలె' ।భీష్మ.3-162। అను పద్యము దీనికి తార్కాణము. ఇట్టివియే మరికొన్ని గలవు.

ఇట్లు ఈ యుద్ధపంచకమున వీరము విస్తృతముగ వర్ణింపబడినను, శాంత రసానుకూలముగనే చేయబడినది. ఈ పర్వపంచకమున ప్రధానమయినది వీరమె అయినను, రౌద్ర, బీభత్స, భయానక, అద్భుత, కరుణములు కూడ ఔచిత్యానుసారము పోషింపబడి యున్నవి.ఇవన్నియు అంగభూతములగు రసములై, అంగియగు శాంతమున కుపస్కారము లైనవి. ఇట్లు హాస్యము తప్ప తక్కిన రసము లన్నియు నిందు కలవు కావున యుద్ధపంచకము గూడ నానారసాభ్యుదయోల్లాసియే. ఈ రీతిగ పరిశీలించిన

విరాటోద్యోగముల వలె నిది రసవంతము కాదను అభిప్రాయము తొలగి, తిక్కన అసమానమగు కౌశలముతో దీనిని కూడ రసప్లావితము చేసెననియు, నానారసోల్లాసము గావించెననియు రసజ్ఞులు గుర్తింపగలరు.

యుద్ధపంచకము తరువాత వచ్చు పర్వము స్త్రీ పర్వము. భారత రచనలో నీ స్త్రీపర్వ మొక విలక్షణమగు సృష్టిగ కనిపించును. ఇది ప్రధానముగ భావాత్మకము. కరుణరసాత్మకము. ఒక విధముగ కథయే లేనిదని చెప్పవచ్చును. డా॥రంగారావు గారు 'ఈ స్త్రీపర్వమును గూర్చి నన్నయ 'పర్వచు స్త్రీపర్వాదిక పర్వంబుల నేనిటం గృపాయిత స్త్రీపర్వంబు పదనొకండగు పర్వము....నావెలయు సుకవి పండితసభలన్' ఃఆదిపర్వ. 1-55ః అని వ్రాసినాడు. ఇది కృపాయితమై వెలయునని చెప్పబడినది. అనగా కృపయేయై యనితర భావసాంకర్యమై యుండునని బావము. కృప యనగా కరుణము అని యర్థము. మరి ఏయితర పర్వములను గూర్చి వ్రాసిన పద్యము లందును నన్నయ యిట్లు రసభావములను సూచింపలేదు. ఈ యొక్కచోటనే యీవిషయమును సూచించుటచే నీపర్వమనితర విశిష్టమని చెప్పినట్లయినది. ఈపర్వము 'సుకవి పండితసభలన్' వెలయునని చెప్పబడినది. మరి ఏయితర పర్వము లందును పండితులు పేర్కొనబడిరి కాని సుకవులు పేర్కొనబడలేదు. ఈ విధముగ నిచ్చట ఒక్కచోటనే సుకవి ప్రస్తావన యుండుటచేత ఈపర్వము యొక్క నిర్వహణము సుకవులకు మాత్రమే సాధ్యమన్న భావము సూచిత మయినది'[15] అని చెప్పియున్నారు. ఈపర్వము తర్వాత శాంతిపర్వము నుండియు శాంతము రాజ్యమేలు చున్నది. సామ్యస్థితి శాంతమునకు ఆయువుపట్టు. పరస్పర విజిగీషావ్యగ్రులై పోరు సలిపినచో ఆవేశకావేశములకు తావెక్కువ కలుగును. అటనుండి సామ్యస్థితికి చేరుటకు, అనగా తౌల్యమును సాధించుటకు మరొక్క ఆధారము కావలసియుండును. కరుణము దానిని సమకూర్చినది. తత్పూర్వ పంచకమునకును, శాంతిసప్తకమునకును వ్యాసుడు నిర్మించిన సేతువు కరుణ ప్రధానమైన స్త్రీపర్వము. దానిని గ్రహించిన నన్నయ్యగారు దీని ప్రాశస్త్యమును ప్రత్యేకభంగిని ప్రసంగించిరి అని కూడ డా॥రంగారావు గారు అభిప్రాయపడిరి.

ఈపర్వమున మొట్టమొదట చూడగానే కనిపించు లక్షణము అందలి విస్మృతమైన వృత్తవైవిధ్యము. ఇతర పర్వము లందు విఖ్యాతవృత్తము అయిన

15. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana

చంపకోత్పల శార్దూల మత్తేభాదులు, దేశీయములైన సీసగీతాదులు భారతము నందంతట ప్రయోగింపబడినవి. స్త్రీపర్వమును పరిశీలించిన ఈస్థితి వ్యత్యస్త మయినట్లు స్పష్టముగా కన్పించు చున్నది. ఇందు విశేషవృత్త ప్రయోగబాహుళ్యము కాననగును. ఇట్లు విపులమగు వృత్తవైవిధ్యము, గమన వైవిధ్యములతో స్త్రీపర్వము వైలక్షణ్యమును సంపాదించుకొన్నది.

ఈవృత్త వైవిధ్యమును గూర్చి పలువురు పలురీతుల అభిప్రాయములను వెలువరించి యున్నారు. ఆంధ్రకవుల చరిత్రము నందు వీరేశలింగం గారి అభిప్రాయము ఇట్లు గలదు. 'తిక్కన మొదట రచించిన పద్యములను చూచి వానియందు విశేషవృత్తములు లేకపోగా పండితులతడు సామాన్యవృత్తములతో కాలముగడుపుచున్ననాడే కాని యపూర్వ వృత్తరచనాకుశలుడు కాడని యాక్షేపించిన మీదట నతడు స్త్రీపర్వము నందు బహువిధ వృత్తములను రచించెనను వాడుక గలదు. ఈవాడుక తిక్కనసోమయాజులు తాను రచించుచు వచ్చిన భారతమును పండితులకు చూపుచు వచ్చెనని స్థాపించు చున్నది' చాగంటి శేషయ్య గారు ఈ అభిప్రాయము అసమంజసమని అభిప్రాయపడిరి. వారు ఇట్లు వ్రాసిరి. 'స్త్రీపర్వము దుఃఖకరమైనది. అందు స్త్రీపాత్రలు ఎక్కువగా పాల్గొని శోకరస పూరితములగు వాక్యముల పల్కుచుండుట కాననగును. ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతడు రచించియుండు'[16] నని అభిప్రాయపడినారు. ఈ అభిప్రాయములు సత్యములు గావని డా॥ రంగారావు గారు తమ సిద్ధాంత వ్యాసమున సతార్కికముగా ఖండించినారు. ఆచార్య రామకోటిశాస్త్రిగారు 'పూర్వము ప్రవర్తించిన గ్రంథము నందలి రసభావములకును తత్పరమున ప్రవర్తింప నున్న రసభావములకును విరోధమును పరిహరింపను, విశేషమైన రసము, దాని వైశిష్ట్యమును స్ఫురించునట్లును తిక్కన గారు విశేషవృత్తములను వాడియున్నారు'.[17] అని చెప్పిరి. కరుణరసాత్మకమగు నీపర్వాంతమున మందాక్రాంతమును వాడుటలో తిక్కన గారి వృత్తౌచిత్యము మనకు విదితము కాగలదు. ఇట్లే ప్రారంభమున వక్తవ్యాంశమును తరళముతో ప్రారంభించుట యందును కొంత ఔచిత్యము కలదందురు. 'ఛందస్సు వలన తిక్కన సాధించిన రసప్రతీతి అనిర్వచనీయము, సహృదయైకవేద్యము' అని నండూరి వారు.[18]

---

16. ఆంధ్రకవితరంగిణి, పు.194
17. తిక్కన కావ్యశిల్పము, పుటలు 515-16
18. తిక్కన భారతదర్శనము, పు.299

స్త్రీపర్వము రెండాశ్వాసముల పర్వము. ఇందలి విషయము కూడ స్థూలముగ రెండు వర్గములుగ విభజింప బడినది. విషాద విహ్వలుడైన ధృతరాష్ట్రునకు విదురుడు కృష్ణద్వైపాయనుడు సల్పిన ఆధ్యాత్మప్రబోధము. అట్లే గాంధారిని కృపాచార్యుడు, వ్యాసుడును ఊరార్చుట, ధృతరాష్ట్రగాంధారులు పొలికలనుకు పోవుట మొదటి ఆశ్వాసము. పొలికలను నందలి స్త్రీల విలాపము రెండవ ఆశ్వాసము. ఇందు స్త్రీపాత్ర లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను పలుకుచుండుట కాననగును. ధృతరాష్ట్రుడు సపరివారముగ పొలికలను సందర్శించుట హృదయవిదారక మగు ఘట్టము. ఇందలి కథ మిక్కిలి దుఃఖకరము. 'తిక్కన విరాటోద్యోగములను, యుద్ధపంచకమును వ్రాసిన పిమ్మట తన కవితాగానమునకు మధ్య 'తానం రాగం పల్లవి'గ ఛందో వైవిధ్యమును ప్రదర్శించె నను వారు కలరు. ఇట ఏడుపర్వములు అటు ఏడుపర్వములు అని లెక్క సరిపోవుట కేవలము యాదృచ్ఛికము. తిక్కన స్త్రీపర్వమున నాయకమణిగ నెంచె ననుట కేయాధారములును లేవు'[19] అని నండూరి వారు. స్త్రీపర్వమున కనిపించు ఛందోవైవిధ్యమును గూర్చి పలువురు పలురీతులు వ్యాఖ్యానములు చేసియున్నను, ఇంతవరకు తృప్తికరమగు వ్యాఖ్యానము రాలేదనియే చెప్పవచ్చును.

స్త్రీపర్వమున మూర్తీభవించిన శోకదేవత గాంధారి. స్త్రీజనాలంబనముగ కరుణరస మిట ఉత్కటముగ పోసింపబడినది. గాంధారి ఈపర్వమున తనదుఃఖమును మాత్రమే కాకకౌరవపాండవ వనితాజనముల హృదయగత దుఃఖమును కూడ తానే వెలువరించినది. రణరంగమున తమ ఆత్మీయుల కళేబరములను చూచి, పలువిధములుగ హృదయవిదారకముగ దుఃఖించుచున్న కురుకాంతలను ఒక్కొక్కరిని కృష్ణునకు చూపుచు తన హృదయగతావేదనను వెలిబుచ్చినది. 'తన కత్యంతము ప్రీతిపాత్రమగు బొమ్మ క్రిందపడి భగ్నము కాగా, ఆ శకలములను గూర్చి హృదయమునకు చేర్చికొనుచు, కన్నీరు కురియుచు, మాటిమాటికి తల్లి దుఃఖమును చూచుచున్న బాలిక వలె ఉత్తర తన జీవితేశ్వరుని మృతదేహమును హృదయమున జేర్చుచు కన్నీరు గార్చుచు మాటిమాటికి కృష్ణుని చూచుచున్నద'ని శ్రీ భూపతి వారు. ఈ సందర్భమున భగ్నజీవిత యగు ఉత్తర ముగ్ధస్వరూపము స్వాభివికముగ వర్ణిత మయినది. గడచిపోయిన ఉత్తర లలితశృంగారమును ఉత్కట శోకభావముతో

19. తిక్కన భారతదర్శనము, పు.300

మేళవించి కరుణరస పోషణము గావించినాడు కవి. ఇట్లే భూరిశ్రవసుని భార్య దుఃఖించిన సందర్భముననుకరుణముతో శృంగారమును మేళవించినాడు. ఈ స్త్రీపర్వమున కరుణరసమునకు తప్ప తదితరములకు అంతగా తావులేకపోయినది. 'ప్రేవులు గండలు పెరికి వేటాడి.....' అనురీతిని యుద్ధరంగమును వర్ణించు సందర్భమున మాత్రము కొంతవరకు బీభత్సము చోటుచేసికొన్నది. ఇట్లు ఇందు ఇతర రసము లంతగా చోటుచేసికొనలేదు కావున ఈపర్వము నానారసాభ్యుదయోల్లాసి కాకపోయినది. అయినను ఈ భారత భాగము నానారసాభ్యుదయోల్లాసి అగుటకును, అంగి యగు శాంతరస పోషణమునకును ఎక్కుడు ఉపకరించినది. భారతభాగము నందలి ప్రధాన అంగరసములలో ఈ కరుణ మొకటిగా మన్నన కెక్కి యున్నది.

కౌరవపాండవాంగనా జనముల యాక్రందనము లాధారముగ స్త్రీపర్వమున పోషింపబడిన నిర్వేదము తదనంతర కథాభాగమున శాంతముగ పరిణమించినది. శాంతరసము శమస్థాయికము. శోకాధిష్ఠిత మగు స్త్రీపర్వ రచనానంతరము ఈపర్వములను రచించుట ఎంతయు నుచితము. భారతేతివృత్త పరిణామము ననుసరించియు, స్త్రీపర్వానంతరభాగము ఈరీతిని శాంత్యధిష్ఠిత మగుట సముచిత మగు విషయము. నెత్తుటి కూటిని రోసిన. ధర్మజునికి ధర్మోపదేశము గావించుట శాంతిపర్వమున ముఖ్యాంశము. ధర్మజుని మనమున గలిగిన నిర్వేదమును తొలగించుటకై శ్రీకృష్ణుని అనుగ్రహమున భీష్ముడు చేసిన ప్రయత్నము శాంత్యానుశాసనిక పర్వముల బహుధా విస్తృతము. శాంత్యానుశాసనిక పర్వములు పురుషార్థముల నన్నింటిని సమగ్రముగా పరామర్శించినవి. భగవద్గీత యందు సూత్రప్రాయముగా ప్రస్తుతింప బడిన వన్నియును, ఇట ఆఖ్యానాది పురస్సరముగా ప్రపంచింపబడి ధర్మజునికి సామ్యస్థితిని ప్రసాదించినవి. భీష్ముడు చేసిన జ్ఞానోపదేశమున సామ్యస్థితి నందిన ధర్మజుడు, స్వధర్మోన్ముఖుడై రాజ్యభారము వహించి, వ్యాసచోదితుడై లోకహితార్థము అశ్వమేధమును వేదోక్త విధమున నిర్వహించి, దేశము నందలి రాజుల నెల్లర, నైకైక ధర్మశాసనబద్ధులను గావించినాడు. అంతియుగాక నిరాసక్తుడై వేదోక్తములగు కర్మల నాచరించుట వలనను, స్వధర్మమును శ్రద్ధతో నిర్వహించుట వలనను, గృహస్థుడు భవబంధ విమోచనమును బడయగలడను విషయము ధర్మజుని అశ్వమేధ వృత్తాంతము మూలమున వ్యక్తీకరింప బడినది. భీష్మనిర్యాణానంతరము శ్రీకృష్ణుడు, వ్యాసుడు అశ్వమేధమున చిత్తమున ప్రవర్తింప చేసి పిదప 'మీ కారుణ్యంబున నా శోకంబంతయు

బాసె, సుమనస్కృత కలిగె' ఃభార.అశ్వ-1-173ః అని ధర్మజుడు తానుగా చెప్పినాడు. 'శాంతిపర్వము మనశ్శాంతి ప్రదము. ఆనుశాసనిక పర్వము విధినిషేధములతో కర్మను ప్రతిపాదించినది. అశ్వమేధము కర్మను యజ్ఞముగా, అనగా నదియు నొక తపముగా నిరూపింపబడినది'[20] అని శ్రీ కేతవరపు వారి అభిప్రాయము.

ఈరీతిగా నీపర్వములు ఆధ్యాత్మిక తత్త్వ ప్రకృతి రహస్యాదులతోనిండి యున్నవి. నాయకుడును, ఫలాధికారియు నగు ధర్మజుని సశరీర స్వర్గప్రాప్తికి పూర్వము అతని చిత్తము శాంతిని పొందవలసి యున్నది. పూర్వజన్మ సంచితమగు సంస్కారముచే సత్యనిష్ఠ, ధర్మపరత్వము దైవభక్తి మున్నగువానిని కలిగియుండి వాని సహాయ్యమున ఇంద్రియాదులను వశపరచుకొని, రాగ ద్వేషాదులను అడచి అతడు తన ధర్మమును నిర్వహించినాడు. ధర్మజుడు మోహవిలసితుడై తొలుత ద్యూతమున ప్రవర్తించినను, తదుపరి అరణ్యవాస తపోనియమములచే పూర్వసంస్కార స్మృతిని గాంచినాడు. ఈతడు ఇంద్రియ నిగ్రహముచే శ్రీకృష్ణ నాలంబనముగ గొని, భీమార్జునాదుల సహాయ్యసంపత్తి వలన, దుర్యోధనాది శత్రువర్గమును జయించినాడు. పిమ్మట భీష్మ గురూపదేశముచే జ్ఞానియై, ఆత్మసాక్షాత్కారమును గాంచి, తుదకు సశరీర స్వర్గమును పొందినాడు. 'ఈ విశిష్టమగు నాధ్యాత్మిక తత్త్వమును ప్రతిపాదించుటలో వ్యాసుడవలంబించిన విధానము విశిష్టముగ నున్నది. దివ్యాంశ సంభూతుడును, ఇంద్రియవిజయముచే మనోవాక్కర్మలందు సంయమియు, జ్ఞానియునై జీవితమును గడపి, వీరోచితమగు ధర్మయుద్ధమున ఫలాపేక్ష లేక వర్తించి, తుదిః ప్రశాంతుడై, యుత్తరాయణము నెదురు సూచుచు, నంపశయ్యపై నిష్ఠయందున్న భీష్మ డుపదేష్ట. ప్రాపంచిక కష్టసుఖాద్యనుభవము కలవాడు, ధర్మపరుడు, నాత్మవిమర్శ జాతపశ్చాత్తాపఖిన్నుడు, వీతరాగుడు, జిజ్ఞాసువు నగు ధర్మజుడు శ్రోత. బోధ్యమగునది శాంతిప్రదాయక మగు నాధ్యాత్మికము ఇట్టి విశిష్ట పరిస్థితి కనుగుణముగ తిక్కన రచన యందును ప్రశాంతతాగాంభీర్యములు నెలకొన్నవి. భావోద్వేగ వర్ణనాదుల విసర్జించి, తిక్కన కూడ సంయమియై రచనకు గడంగినాడు'.[21] అని ఆచార్య భూపతి వారు చెప్పియున్నారు. నీతిశాస్త్ర ధర్మశాస్త్ర సంబంధి అయిన పర్వము లివి. జితేంద్రియత్వము, యోగనిష్ఠ ఇత్యాదుల వలన ఆత్మ సాక్షాత్కారమును

20. తిక్కన కావ్యశిల్పము, పు.312
21. భారతము -తిక్కన రచన, పు. 163

గాంచి, బ్రహ్మానందమును పొందిన గురువు, ఇహలోకవిముఖుడు, పరిణతమనస్కుడు, ముముక్షువు అగు శిష్యున కుపదేశించురీతిని ఈపర్వములు రచింపబడి యున్నవనియు వీరు భావించిరి. భావోద్వేగముల కిందు ప్రసక్తి లేకపోవుటయే గాక, కావ్యసంబంధములగు నర్థవైచిత్ర్యాదులు, ధ్వన్యలంకార వక్రోక్త్యాదులు - ఇట్టివానికి ఇందు ప్రవేశము లభింపలేదు. దురవగాహము లగు అంశములను సుబోధ్యముగురీతిని, సులభశైలిలో, లోకసాధారణములగు దృష్టాంతముల సాహాయ్యమున కవి వివరించినాడు. నిర్విణ్ణమానసుండగు ధర్మజునికి శాంతి ప్రసాదించి కర్మమార్గావలంబిగా చేయుటకై ఈ పర్వము లందు ధర్మప్రబోధము గావింపబడినది.

శాంతిపర్వమున ప్రథమాశ్వాసమున ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము జరిగిన తరువాత ద్వితీయాశ్వాసము నుండి ధర్మప్రబోధమే యితివృత్తముగా కలదు. ఇందు దండనీతికి గల ప్రాధాన్యము పేర్కొనదగినది. భీష్ముడు దండనీతిని బహుప్రకారముల స్తుతించి, మకుటాయమానముగ 'దండంబు సాక్షాద్దేవుండ, అట్లగుట దెలిపెడు నది యొక్క యితిహాసంబు కలదని' దండోత్పత్తి కథనమును గావించును. ఈపర్వమున వ్యాఘ్రగోమాయు సంవాదము, కుర్కురకథ, దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల కథ, మూషిక మార్జాలముల సంవాదము, గృధ్రజంబుకోపాఖ్యానము, కపోతోపాఖ్యానము, మున్నగు అర్థవాద రూపక పద్య కథానిక లనేకములు కలవు. ఇవన్నియు భీష్ముడు ధర్మజునకు ధర్మసూక్ష్మత నెఱింగించుటలోని అంతర్భాగములు. శ్రీకృష్ణుడు చెప్పినట్లుగ తాత్పర్యములో నిర్మలులై కొనియాడెడు వారికి ఈ కథలు ఉభయ జగదుత్తాత్తతను కూర్పగలవు. ధర్మరాజు మాటలలో చెప్పవలె ననిన 'ఎవ్వని యెడ విశ్వసింపకున్నం జిత్తంబునకు విశ్రామంబు కల్గదు. విశ్వసించిన దురితంబులు దొడరు' - అట్లగుటంజేసి పరమకర్తవ్యం బెయ్యదియో నిశ్చయించుటకే ఈ అర్థవాదరూపకములగు కథలు. ఇవి కేవల కట్టుకథలు కాక, లోకవృత్తాంత దర్శకములై, మానవస్వభావమునకు దర్పణప్రాయము లగుచున్నవని చెప్పవచ్చును. వీనితోపాటు ప్రత్యక్షప్రబోధమును ఈ శాంతి పర్వమున విస్పష్టముగ గోచరించును. ఆధ్యాత్మికతత్త్వమునకు మూలకంద మనదగు నిది నిజముగ ధర్మాద్వైతమూర్తియే. నీతి ధర్మోపదేశములతోపాటు, పురుషార్థములలో ప్రధానమగు మోక్షమార్గము కూడ ఇట వివరింప బడినది. శమప్రధాన మగు నీపర్వము శాంతము నంగిగా కలిగి యున్నది. అంగిగా శాంతము నిబద్ధింపబడినను, కొన్ని ఉపాఖ్యానములలో తదితర

రసములు చోటుచేసికొన్నవి. అందు ప్రధానముగ చెప్పతగినది కపోతోపాఖ్యానము. ఇది కరుణరసాత్మకము. ఇది తిర్యగ్గతాలంబన మగుటచే రసమగునా! రసాభాస మగునా! అను సమస్య గలదని చెప్పుచు శ్రీ నండూరి రాధాకృష్ణగారు ఈ యుపాఖ్యానము వలన గల్గు స్థితి రసస్థితియే కాని రసాభాసము కాదని నిరూపించిరి.[22] ఆంధ్ర ధ్వన్యాలోకము నందు గల విపులచర్చను ఆధారముగ చేసికొని ః పుటలు 138-144ః ఇందు రసమే కాని రసాభాసము లేదని చెప్పవచ్చును. 'హతపాత్రగతే కరుణే' అనునది కరుణా భాస లక్షణముగ చెప్పబడుటచేతను, అలక్షణము దీనికి వర్తింపకుండుటచేతను ఇది కరుణాభాస మనుట కెట్టి అవకాశమును లేదు.

ఆనుశాసనిక పర్వమున కావ్యశిల్పమునకు, రసపోషణమునకు తావుగల ఘట్టములలో గరుడకథయు, భీష్మనిర్యాణమును ముఖ్యములు. ఈరెండును తిక్కనగారిచే ప్రత్యేకమగురీతిని తీర్చిదిద్దబడినవి. గరుడోపాఖ్యానము ప్రత్యేక రసవత్కావ్యము. దీనిని ఏకదేశముగ తీసి చదివిన ఇది యొక్కటియే స్వయం సంపూర్ణముగ నొక కావ్యముగ కనిపించును. ఈఉపాఖ్యానము రసవత్కావ్య మని పేరువడసి యున్నను, రసపర్యంత వర్ణనము లేదు. అందుచే రసపోషణ విషయమును గూర్చి చెప్పవలసిన ఇందలి ప్రధానరస మిదియని కాని, ఈ రసము లిందు కానవచ్చుచున్న వని కాని చెప్పుట కంతగా నవకాశము కానరాదు. శాపమును పొందిన వినతను 'వెలవెలబారుచు....' ఃఅను.1-174 ః అని వర్ణించిన సందర్భమున సాత్త్వికాభివర్ణనము మాత్రము కలదు. ఇందు ప్రధానముగ పేర్కొనదగు రెండవ ఘట్టము భీష్మనిర్యాణఘట్టము. భీష్ముడు సిద్ధిపొందు ఈ ఘట్టము రససంపూర్ణము. గంగాదేవి కృష్ణాదులను కనుగొని దుఃఖించు సందర్భము చదువరులకు కన్నీటిని తెప్పించు కరుణరసాత్మక సన్నివేశము. గంగాదేవి శోకమూలమున నిందు కరుణమునకు తావు కొంతవరకు కలిగినది. ఈ ఘట్టముననే భీష్ముడు శరీరమును విడిచి నాకలోకగతుండగుటలో కొంత <u>అద్భుతరస</u>చ్ఛాయ గలదు. ఉల్కాకారమున ఆకసమున కెగయుట అనునది కృష్ణునంతటి వానినే ఆశ్చర్యమున ముంపగా నిక మన మెంతటివారము. ఇట్లు విస్మయమున కిట తావు గలిగి అద్భుత మీఘట్టమున చేటోచేసికొన్నది. ఈపర్వము నందే శృంగారరస ప్రధానమగు మరియొక ఉపాఖ్యానము కలదు. అది సుదర్శనోపాఖ్యానము. ఈ ఉపాఖ్యానమున అగ్నిదేవుడు సుదర్శనాకరమును

---

22. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము.

కోరు సందర్భమున తిక్కన నూతన సన్నివేశమును కల్పించి రసవంత మొనర్చెను. సంగ్రహముగా నున్న కథను విపులీకరించి శృంగారరసమునకు వలయు విభావాది సామగ్రిని సమకూర్చినాడు తిక్కన. ఈ సందర్భమున ఒకటి రెండు పద్యములు మూలమున మృగ్యము లందురు. మూలమున అంత రసవంతముగా లేని ఘట్టమున తిక్కన తన రసపోషణ సామర్థ్యముచేత రసవంత మొనర్చినాడనుటలో నెట్టి దోషమును ఉండబోదు. ఇక ఇందలి గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము వలన 'ఎవరి మరణమునకు వారి కర్మ కారణమగును. వ్యర్థమగు శోకము నీకేల' అని ధర్మరాజు మనశ్శాంతికై, యీ యుపదేశము చేయబడినది. తుదకు 'గౌతమీ లుబ్ధక భుజంగ మృత్యుకాల సంవాదము' అను ఈ యితిహాసము యొక్క తాత్పర్యమును మనస్సునందు నిల్పికొని, నీమనస్సు నందలి శోకమును విడిచి శమంబున సుఖివి కావలసినది' ꞉ అను. 1-42꞉ అని చెప్పినాడు. కావున దీనిని శమప్రధానమైన శాంతరస ఘట్టముగ చెప్పవచ్చును. ఇట్లే సర్వవర్ణ సామాన్య ధర్మ నిరూపణము, అహింసా స్వరూప నిరూపణము, హర సనత్కుమార సంవాదము మొదలగు ఉపదేశప్రాయములైన వన్నియు, అంగిరసమగు శాంతరస పోషణకు దోహదములే. ఇట్లు ఈ ఆనుశాసనికపర్వము శాంత, కరుణ శృంగారద్భుతములను కలిగి యున్నది. శాంతము అంగి కాగా తదితరములు అంగములై అంగిరసోన్ముఖముగ నడచినవి.

అశ్వమేధపర్వము నందలి యితివృత్తమును అధికముగ ఆధ్యాత్మిక ప్రబోధమే. ఇందు ధర్మజుని దయావీరమునకు అర్జునని యుద్ధవీరము అంగముగా నిలిచినది. అని కొందరి అభిప్రాయము. మహాభారత యుద్ధానంతరము అర్జునుడు మరల గాండీవమును ధరింపవలసి వచ్చినది. 'భూపతతి ఎల్లను తెగియే భారత యుద్ధమందు బాలురం దివిరి వధింప గాదు. కృప దిన్నదనం బెసగం జరింపుమా' అని అజాతశత్రు నాజ్ఞ. ꞉అశ్వ.4 - 6꞉. నవనాశ్వము ననుసరించిన అర్జునుడు తనకు ఎదురుపడిన ప్రతిరాజునకును ధర్మరాజు తనతో పల్కిన పల్కులనే తెల్పి 'దయ'ను ప్రదర్శించినాడు. 'అహింసాప్రధాన మయిన ధర్మయజ్ఞము నాయకుని హృదయశాలలో నారంభమయి యుండుటచే నీ పుణ్యవాసనలు విరివిగా వ్యాపించినవి. వానిని గంధవాహుని వలె ఇంద్రతనూజుడు దిగంతములవఱకు ప్రసరింపజేసినాడు'[23] అని డా॥సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయము. త్రిగర్తదేశాధిపతులు పరాక్రమవంతులై తన నెదిరించినను ధర్మ

23. వీరరసము, పు. 184

ప్రబోధముచే దయను తాల్చిన అర్జునుడు సమయోచిత మగు రణపాండిత్యమును ప్రదర్శింప జాలకపోవుటయే గాక తన చేతి గాండీవమును జారవిడుచుకొనినాడు. అప్పుడు అచ్చటనున్న కొందరు వీరులు 'ఇంద్రధనువు చందమున నెసకమెసగు గాండివము పాటు గంటిరే....' ః అశ్వ. 4-14ః అని యుద్ధమునకు దిగి యౌద్ధత్యమును ప్రకటించిరి. గాండీవ పతనావమాన కారణముగ అర్జునునకు క్రోధము కలిగెది. ఇట క్రోధము అనుభావాదులచే వర్ణింపబడుట వలన క్రోధము స్థాయిగా గల రౌద్రము కాననగును. కాని ఈ రౌద్రము రసపర్యంతము లేదు. ఇట అర్జునునకు కలిగిన కోపము తాత్కాలికము. తన అన్నగారి మాటలను నిరాదరించిరని కల్గిన మానసోద్రేకమే కాని వేరొకటి కాదు. పోయినవారు పోగా, మిగిలినవారి బంధువులు శరణువేడ ఆతని ఆవేశము అప్రయత్నముగనే చల్లారినది. ఇట శరణు వేడిన వారిని దయతో కాపాడుటచే దయావీరము కొంత చోటుచేసికొన్నది. దీనికి ధర్మజుని యుపదేశమే కారణము. 'ధర్మరాజు అఖిలపృథ్వి స్వీయాయత్తమై నట్లుగా నశ్వమేధయాగమును సలక్షణముగా నిర్వహించి, తత్సామ్రాజ్య మంతయు ఋత్విగర్పనముగ ధారవోసి, నిష్కామమును, నిర్వ్యామోహమును ప్రకటించి ధర్మబద్ధమగు దానవీరమును ప్రదర్శించెను'[24] అని డా॥సుబ్రహ్మణ్యం గారు చెప్పిరి. దాన, ధర్మ, యుద్ధవీరము లిట గలవు. అర్జునుడు సింధుదేశాధీశులతో యుద్ధముచేయు సందర్భమున యుద్ధవీరము గలదు. అర్జునుని రాక వినగనే, సైంధవుని కుమారుడు హృదయము మాగి మరణింపగా, సోదరియైన దుస్సల నెవ్వగతో తన మనుమని వెంటనిడుకొని వచ్చి అర్జునుని కెదురేగి, పౌత్ర ప్రాణభిక్ష నర్థించును ఈ సందర్భమున అర్జునుడు శోకాక్రాంతుడై చిత్తమడరగా తన రాచకాలమును నిందించుకొని, ఆమె నూరార్చి, వీడ్కొలుపును. ఈ ఘట్టము కరుణరసోత్పాదకము.

ఈపర్వమునకు ఉపసంహార ప్రాయకముగా నున్నది సక్తుప్రస్థోపాఖ్యానము. మహాభారతోపాఖ్యానములలో నిది మకుటాయమానమైనది. ఈ ఉపాఖ్యాన మూలకముగ పవిత్రహృదయమే ధర్మమునకు విలువ కల్గించుననియు ఆత్మత్యాగమే ప్రధానమనియు, హింసాత్మకంబైన యజ్ఞముకంటె అహింసాత్మకమైన తపోయజ్ఞము గొప్పదనియు చెప్పబడును. ఇట్లు ఈపర్వము కూడ ఆధ్యాత్మిక ప్రబోధమును కలిగియుండి మోక్షపురుషార్థమునకు ప్రాధాన్య మీయబడి శమప్రధానమగు శాంతము నంగిగాను,

24. వీరరసము, పు.186

కరుణ వీరముల నంగములుగాను కలిగి యున్నది.

ఈ శాంతిత్రయమున గల అనేకోపాఖ్యానములు ధర్మాధర్మముల ప్రాశస్త్యాప్రాశస్త్యములను తెలుపుచు కర్మయోగమునకు పురికొల్పుచున్నవి. ఈశాంతిత్రయ విశిష్టత కిది యొక కారణము. ఈ పర్వత్రయ ప్రాశస్త్యము నుగ్గడించుటకు మరియొక దృష్టాంతము కలదు. అశ్వమేధమునకు పోవు సమయమున అర్జునుడు తాను యుద్ధాత్పూర్వము వినిన తత్త్వోపదేశమును మరచితి నని, మరల దాని నుపదేశింపు మని కృష్ణుని వేడును. భీష్ముడు ధర్మజునకు చేసిన యుపదేశమును, కృష్ణుడు అర్జునునకు చేసి పునరుపదేశమును ఇందుండుటచే ఈ భారత భాగము విశిష్టమై, మోక్షధర్మోపదేశమును కలిగి, శమ ప్రాధాన్యముచే శాంతరస ప్రాధాన్యమును చాటుచున్నది. భారతభాగము నందలి అంగిరస మగు శాంతరస స్థాపనకీ పర్వత్రయ మెంతయు నుపకరించినది. తిక్కన విరాటోద్యోగములను శ్రద్ధతో అనువదించి మిగిలినవాని యందంత శ్రద్ధ వహింపలేదను నొక జనసామాన్య శ్రుతి పండితలోకమున కలదు. భారత గ్రంథము యావత్తును పరిశీలించిన శ్రద్ధాళువుల కిది అసత్యమనిపించక మానదు. రసవంతము లగు విరాటోద్యోగముల నెంత రసవంతములుగ తీర్చిదిద్దినాడో అంత శ్రద్ధగా ఈ శాంత్యానుశాసనికములను తీర్చిదిద్దినా డనియే చెప్పవచ్చును.

ఆశ్రమవాస చతుష్టయము వస్త్వైక్యమును కలిగి ఒక కావ్యముగాను లేదా నాటకము గాను భాసించుచుండును. ఇందు యుధిష్ఠిరుడు నాయకుడు. ధృతరాష్ట్రుని వనప్రయాణము వలన ఈతనియందు ప్రక్షిప్తమయిన నిర్వేదబీజము వృద్ధమరణ, మౌసలావహముల ప్రతీయమాన మగుచున్న కరుణముచే పోషింపబడి, మహాప్రస్థానోద్యమ రూపమగు విస్తృతిని పొందినదియై, మోక్షలక్షణ పురుషార్థమును సిద్ధింప చేసినది. ఇందలి ప్రధాన రసము శాంతము. అద్భుత ప్రధానమైన పుత్రదర్శన ఘట్టము నిర్వహణసంధిలో నున్నదని, 'కుర్యాన్నిర్వహణేఽద్భుతమ్' అను లక్షణమునకు ఉదాహరణప్రాయము కాజాలు నని ఈ పర్వ చతుష్టయమును, పరిశీలించిన విశదమగును. ఉపవాసక్లేశమున కాలు కదల్పజాలని కుంతీ, గాంధారీ, ధృతరాష్ట్రులు మహానలము చుట్టుకొనగా, ఉక్కిరిబిక్కిరియై దిక్కుగానక, యోగనిష్ఠామాత్ర శరణ్యులై దేహములను విడచిన ఘట్టము కావ్యమర్యాదలతో విలసిల్లు కరుణరసఘట్టము. అంగి యగు శాంతమున కిది దోహదము. దీనికి తోడైనవి యాదవ కృష్ణ నిర్యాణములు. కరుణ ప్రధానములైన యీఘట్టముల వలన పీతరాగుడైన యుధిష్ఠిరుని యందలి

నిర్వేద స్థాయి పరిపక్వదశకు వచ్చి శాంతరస ప్రతీతిని కలిగించినది. పాత్రములను స్థిరముగ నొక్కొక్క రసమున కాలంబనము లగునట్లు మొదటనుండి చివరివరకు పోషించినాడు తిక్కన. ఈతడు కతిచిత్పద ప్రయోగముచే ఆయా పాత్రల స్వభావోన్మీలనమును సాధించునట్లుగ, ఆయా సందర్భము లందలి పాత్రల మనఃప్రవృత్తులను, వారి సహజచేష్టలను అత్యల్పముగ వర్ణించుటచేతనే ఆ సన్నివేశమును మనకు గోచరింపచేసి యా రసస్ఫురణమును కలిగించు చుండును. ఈతని భారతభాగము నందలి విరాటపర్వాదిగ నెన్నియో సన్నివేశములు నాటకతత్వమును కలిగి రసభావ స్ఫురణమున కుపకరించినవి. ఈ పర్వచతుష్టయమున ప్రతీయ మానమగుచున్న శాంతము గ్రంథమునందంతయు ప్రదీప్త మగుటచే నీభాగము గూడ రసవిషయమున తక్కిన భారతభాగములకు ఉపకరించుచు, మహాభారత గ్రంథ తాత్పర్యమునకు దోహదమగుచున్నది.

ఆశ్రమవాస పర్వము రెండాశ్వాసముల పర్వము కాగా, మిగిలిన మూడును ఏకాశ్వాన పర్వములే. మూలమున కూడ నివి చిన్నవియే. ధర్మజుని రాజ్యపరిపాలనక్రమము ఆశ్రమవాస ప్రథమభాగమున వర్ణింపబడి యున్నది. పెద్దల యుపదేశములతో నిప్పటికి ఆతని మనస్సు వినిర్మలము, శుద్ధజ్ఞానసంపన్నము నైనది. పర్వోత్తరభాగము నందలి కుంతీధృతరాష్ట్రాదుల యాశ్రమ గమనముతోను పిదప వారి నిర్యాణముతోను, ఆతని దృష్టి ఐహికవిముఖయై ఆముష్మికాభిముఖము కాజొచ్చెను. యుద్ధపర్వములలోని బంధువినాశముతో నత్యంతము ఉద్విగ్నమైన యాతని హృదయము, స్త్రీపర్వములోని అబలాజనాక్రందనముతో కరుణరస ప్లావిత మయినది. ధృతరాష్ట్రాదుల మరణముతో ఆతని నిర్వేదము రూఢమై, ఆతడు శమప్రధానుడయ్యెను. ఈ అంశములను తిక్కన అంగిరసమగు శాంతిరసానుకూలముగ వర్ణించిన రీతి కడు హృద్యము.

ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడై వనమునకు ప్రయాణమయిన సందర్భమున ధర్మజుని స్థితి, పలుకులు, కృత్యములు-అన్నియు కరుణ <u>రసో</u>త్పాదకములు. ఆతడు ఏమియు చేయలేక, ఏడ్చి ఏడ్చి తుదకు ఒడలు కంపింప చదికిలబడినా డనుట స్వాభావికమగు వర్ణనయై రసోద్బోధక మగుచున్నది. ఆతనిస్థితి 'వాక్రువ్వంగన్ తెలియగురాదు.....' (ఆశ్ర. 1-14) అనుటలో <u>కరుణము</u>ను పరాకోటి నధిష్ఠింప చేసినాడు. పిదప కుంతియు, అరణ్యమునకు పోవ సమకట్టుట, ధర్మజాదులు

వారించుట – ఈ సందర్భము నందలి సంభాషణములును చేష్టలును, ఏడ్పులును, ఓదార్పులును – ఇత్యాదిగ అన్నియు కరుణరసోత్పాదకములే అయి ఎంతటివానికైనను కన్నీళ్లు తెప్పింప కలిగియున్నవి. ఇట్లు కరుణరస పోషణము కాననగును.

వ్యాసుడు ధృతరాష్ట్రాదులకు భారతరణ మృతులను రావించి చూపు ఘట్టమున అద్భుతరసము కలదు. 'అవ్విధము అద్భుతరసమున మునుగజేసె' ౹ఆ.2, 126౹ అని వర్ణించినాడు. ఇట్లే విదురుడు యోగమార్గమున ధర్మజుని కలియు ఘట్టము అద్భుతరసోత్పాదకమే. ధృతరాష్ట్రప్రభృతులు మృతులయిన సందర్భమున ధర్మజుడు శోకించిన ఘట్టము కరుణరసోత్పాదకము. 'అవ్వేళ కరుణముత్కటమయ్యెన్' ౹2-158౹ అని వర్ణించినాడు తిక్కన.

మౌసలమున యాదవవంశనాశము వర్ణితము. ఈ పర్వమును కరుణరస ప్రధానమగు ప్రబంధముగ రూపుగొన్న దనవచ్చును. ఇందు ప్రధానములగు కావ్యలక్షణము లన్నియు సమకూరి కరుణరస పోషణము సమగ్రముగ నిర్వహింపబడినది. ప్రసిద్ధమగు యాదవుల చరిత్ర ఇతివృత్తముగా గల పర్వము. ఇది విషాదాంతమగు నొక కావ్యముగ భాసించిన దను పలువురి అభిప్రాయము సహేతుకమే. ఇందు సర్వ యాదవ వినాశమును, బలరామకృష్ణుల నిర్యాణమును, యాదవాంగనల విలాపములను, అర్జునుడు దుఃఖోపహతుడై వర్ణింపగా విని ధర్మసుతాదులు అంతులేని నిర్వేదమును పొందిరి. విధినిర్ణయము ఎట్టివారికైన అనుల్లంఘనీయ మనియు, భవబంధము దుఃఖహేతు వనియు, ఈ బంధవిచ్ఛిత్తికై జీవుడు ఐహికములం దాసక్తి లేనివాడై, అముష్మికోన్ముఖుడు కావలె ననియు, పరమ తత్త్వమును గ్రహించినవారై ధర్మరాజాదులు మహాప్రస్థానాభిముఖులైరి. ఈరీతిగ పాండవులు పరమశాంతులై సంసారబంధములను సర్వథా పరిత్యజించి, స్వర్గారోహణమున కుపక్రమించుటతో మహాభారతము నందు ప్రతిపాద్య మగుచున్న శాంతము పరిపక్వమై రససిద్ధి నందినది. యుద్ధ పర్వము లందు ఎడనెడ సూచితమై, స్త్రీపర్వ, ఆశ్రమవాస పర్వములలో పోషిత మయిన కరుణమునకు ఈ పర్వమున పరిణతి సిద్ధించిన దనవచ్చును. కృష్ణుడు నాయకుడుగ, అర్జునుడు ఉపనాయకుడుగ, కరుణము అంగిగ, వీరము తదంగముగా గల పర్వమిది. యాదవనాశ, బలరామకృష్ణుల నిర్యాణములచే నుత్పన్నమయిన కరుణరసము, అర్జునుని యుత్క్రాంత యందు, యాదవాంగనల యాక్రందనము లందు నుద్వేగమును గాంచినది. శ్రీకృష్ణుడు

లేకపోవుటచే కాంతివిహీనమై, దీనముగా కన్పట్టు ద్వారకలో ప్రవేశించినప్పటి యర్జునుని స్థితియు కరుణరసోత్పాదకమే.

ఈ పర్వము నందలి యితివృత్తము కణ్వాదుల శాపముతో నుపక్రమింప బడినదియై, ద్వారక యందు కలిగిన మహోత్పాతములు, సాంఘిక కల్లోలములు, ఇత్యాదులచే కథాబీజమునకు అంకురార్పణము జరుపబడినది. సముద్రోత్సవ సందర్భము నందలి యాదవుల ఉన్మార్గప్రకర్తనముచే ఇతివృత్తము పోషింపబడి యాదవనాశముచే రసోన్ముఖమైనది. చివరకు బలరామకృష్ణుల నిర్యాణముచే రసోత్పత్తిని గాంచినది. సత్యభామాదుల తపోవనగమనాది ఘట్టములు ఇతివృత్తోప సంహారమునకు సహాయకములై శాంతరసోన్ముఖముగ కథను నడపించినవి. కరుణరస ప్రధానమగు యాదవవంశేతి వృత్తము ఈ రీతిగ శాంతరస పోషణమునకు ఉపకరించినది. 'స్త్రీపర్వమున శోకోద్వేగమును, శాంత్యనుశాసనికములలో నిర్వేదమును, మౌసలమున కరుణయు ప్రధానములైనను ధ్యేయమగు శాంతమీ మూడు ఘట్టము లందును నంతర్వాహినిగనే స్రవించినది' [25] అనినారు భూపతి వారు.

మహాప్రస్థానమునకు ఉపోద్ఘాతప్రాయముగా నున్న, ధర్మజార్జున సంవాదము ఉదాత్తమయినది. కర్మపరిత్యాగవాదము ధర్మజుని నోట శాంతి పర్వము నుండి వినుచున్నదే. ఆనాడు అది ధర్మజుని మదిలో మెదలినది కాగా, నేడది అతని నిశ్చయ మయినది. అతని పాత్రలో నేర్పడిన క్రమపరిణామవికాసము. ఇది. ధర్మరాజ దేవేంద్రుల సంభాషణలో నీత డొక సంకటపరిస్థితిలో నిరుకుకొనినాడు. విప్రలంభశృంగారముచే సంభోగశృంగార మెట్లు నిగ్గుదేలునో, అట్లే ధర్మోత్సాహము ధర్మసంకట పరిస్థితులలో నాయకుడు ప్రదర్శించు ధృతిని ఆశ్రయించి, పుష్టిని వికాస విస్తరములను గాంచి సారవంత మగును. ధర్మరాజు జీవితములో నిట్టి ఘట్టములు ఎన్నియో గలవు. ధర్మనిష్ఠను ఆజన్మ వ్రతముగ నాచరించి, తదానుషంగిక ఫలమగు కీర్తిని, శాశ్వతఫలమగు స్వర్గమును పొంది, ఐహిక ఆముష్మిక సుఖములను పొందినట్టి ధర్మపరుడు ఈ ధర్మరాజు. ఇట్టి ఫలమాతనికి ధర్మప్రవర్తనము వలననే కలిగినది. ఇట <u>ధర్మవీరము</u> ప్రధానమని చెప్పవచ్చును. ఇదియు శాంతరసాభిముఖముగనే నడచినది.

---

25. భారతము - తిక్కన రచన, పు. 20।

ఇక స్వర్గారోహణము చిట్టచివరి పర్వము. తొంబదియెనిమిది పద్యములు గల చిరుపర్వమిది. ఆకాశగంగావగాహనము తదుపరి మర్త్యభావ సంకలితమయి యున్న ధర్మజుని హృదయము దివ్యత్వమును సంతరించుకొనినది. ఇందు శాంతము గాక ప్రత్యేకముగా చెప్పనగు రసవిశేషము లేమియును లేవు. ఈ పర్వచతుష్టయ మీరీతిగా శాంతము నంగిగా కలిగియుండి, కరుణ, అద్భుత, వీరములను అంగములుగ కలిగియున్నట్లు విదిత మగుచున్నది.

తిక్కనామాత్యునిచే నిట్లు రసవత్తరముగ తీర్చబడిన దగుటచే ఈ భారతభాగము అనువాద గ్రంథమను స్ఫురణయే రాక, అచ్చముగా నాంధ్రముననే తొలుత రచింపబడినదేమో యను దృఢవిశ్వాసమును పాఠకులకు కలిగించు చుండును. ఇట్లు రచించిన తిక్కన మహాప్రతిభకు నమస్కరింపని యాంధ్రుడుండడు. ఆజన్మ మములోదాత్తమనీషి అయిన తిక్కన గారి వ్యక్తిత్వాంశలలో ముఖ్యాతిముఖ్యమగు రసికత కారణముగ సర్వ రసాభిముఖ్యము గల సామనస్యము, వివిధ రసములకు ప్రసక్తి ఏర్పడిన సందర్భములు ఈ భారతభాగమున అనేకములు గోచరించును. ఈతడు 'ఏరసము నెత్తికొన్న యారసమునే వలచినట్లు వాసింపచేయగల వలంతి' అని అనిపించుకొనినాడు. శాంతము అంగిగా, తదితరములు అంగములుగ చోటుచేసికొనిన ఈ భారతభాగము నానారసాభ్యుదయోల్లాసి అని అనిపించుకొనుటయే గాక, తిక్కనార్యుని 'నానారస భావనా నాడీనిదాన విదగ్ధుడ'నియు అనిపించినది. ఏయే పర్వములలో ఏయే రసములకు తావు గలదో స్థూలముగ మాత్రమే ఈ ప్రకరణమున వివేచింప బడినది. ఒక్కొక్క రసమునకు సంబంధించిన చర్చ, ఆరసమునకు భారతమున గల స్థానము - ఇత్యాది అంశములు ఆయా రసప్రకరణము లందు వివరింప బడును. అనితర సాధారణమగు రసపోషణ సామర్థ్యముచేత నానారసముల అభ్యుదయమునకు ఉల్లాసమును కలిగించి, 'తను కావించిన సృష్టి తక్కొరులచేతం గాదునాన్' అని అనిపించుకొనిన రసపోషణ చక్రవర్తి, తిక్కన.

# 5వ ప్రకరణము

## శృంగార రసము – తిక్కన భారతము

### శృంగార రసము :

కావ్యజగమున కల రసచర్వణలో మిక్కిలి వైశిష్ట్యమును సంపాదించిన శృంగారము రతిస్థాయికము. శ్యామ వర్ణము. విష్ణుదేవతము. ఇది ఉజ్జ్వలవేషమును కలిగి యుండును. 'యత్కించిల్లోకే శుచి మేధ్యం దర్శనీయం వా తచ్ఛృంగారే ణానుమీయతే'[1] అని భరతుని నాట్యశాస్త్రము. లోకములో నేదేని శుచిగా, మేధ్యముగా ౹పవిత్రముగా౹, నుజ్జ్వలముగా, దర్శనీయముగా నున్నచో దానిని 'శృంగారి', 'శృంగారవాన్' అని అందురు. అనగా ఉజ్జ్వలవేషయుతుడు శృంగారవంతు డనబడుచున్నాడని అర్థము. వేష ముజ్జ్వలముగా లేనప్పుడు శృంగారవంతు డనబడుచున్నాడని అర్థము. వేష ముజ్జ్వలముగా లేనప్పుడు శృంగార పద ప్రయోగమున్న అది ఉపచరితము. ముఖ్యము రత్యాస్వాద మున్నపుడే శృంగారశబ్దము ప్రవర్తించును. ఆచారముగా ననుసరించియు, పెద్దలమాటల ననుసరించియు, రసములు, భావములు మున్నగు నాట్యాశ్రితము లగు అర్థములకు నామధేయము లేర్పడు చున్నవి. 'శృంగారరసము' అనునామము ఆచారసిద్ధమైన నామము. శృంగారము నిండు యౌవనములో నున్న ఉత్తమ స్త్రీపురుష ప్రకృతులకు సంబంధించి యుండును. స్త్రీపురుష హేతుకము. ఉత్తమ యువప్రకృతికము అను విషయము నాట్యవేదమున కొంత వివరింపబడి యున్నది.[2]

---

1. నాట్యశాస్త్రము, అ.6
2. నాట్యవేదము, పుటలు 204-6

శృంగారరసమునకు సంబంధించిన ఆర్యలు భరతుని నాట్యశాస్త్రమున క్రిందివిధముగా కలవు –

'సుఖప్రాయేష్ట సంపన్న ఋతుమాల్యాది సేవక ।
పురుష ప్రమదాయుక్తః శృంగార ఇతి సంజ్ఞితః'
'ఋతు మాల్యాలంకారైః ప్రియజన గాంధర్వ కావ్యసేవాభిః
ఉపవన గమన విహారైః శృంగార రసః సముద్భవతి'
'నయన వదన ప్రసాదైః స్మితమధుర వచో ధృతి ప్రమోదైశ్చ
మధురైశ్చాంగ విహారైః తస్యాభినయః ప్రయోక్తవ్యః'[3]

సుఖప్రాయములగు నిష్టములతో కూడిన వాడును, ఋతుమాల్యాదులను అనుభవించువాడును, ప్రమదాయుక్తడును అగు పురుషుడు శృంగార పద వాచ్యుడగును. ఋతుమాల్య అలంకారములు, విదూషకాది ప్రియజనులు, గీతాది హృద్యవిషయములు, కావ్యశ్రవణ పఠనములు, ఉద్యానవన విహారములు, అనునవి శృంగార సముద్భవమునకు హేతువులు. నయన, వదన ప్రసన్నతలు, స్మితము, మధురవాక్కులు, ధృతి, ప్రమోదము, మధురములైన అంగహారములు అనువానిచే శృంగారమును అభినయింప వలెను.

ఈ అంశములే శ్రీ అప్పారావు గారి అనువాదము నను గలవు. శృంగారము, సంభోగము, విప్రలంభము అను భేదముచే రెండు అవస్థలను గలిగి యుండును. సంభోగశృంగారము వసంతాది ఋతువులు, పుష్పహారములు, కామోద్దీపములైన గంధము మొదలగువాని పూతలు, నగలు, విదూషకుడు మొదలగు ఇష్టజనుల సహవాసము, గీతాదులు, శ్రేష్టములైన భవనములు, వాని యందలి నివాసము, ఉద్యానవన విహారములు లేదా దానిని గూర్చిన ప్రశంసలు, కామోద్దీపకములైన చిత్రాదులు, ఉత్తమజనుల అనుకరణము జలక్రీడలు మున్నగు విభావముల వలన ఉత్పన్న మగును. అని అప్పారావు గారి అనువాదము.[4] విభావము నందు ఆలంబన విభావము, ఉద్దీపన విభావమును భరతుడెచ్చటను చెప్పలేదని, సూచింపలేదని, ఇది కాల్పనికము అర్వాచీనము అని అభినవభారతి.[5] ఈ చెప్పనవే కాక స్త్రీపురుషులకు

---

3. నాట్యశాస్త్రము, అ.6, 46–48
4. నాట్యశాస్త్రము – గుప్తభావ ప్రకాశిక, పు. 202
5. అభినవభారతి, సంపుటము 1, పు. 304 ।గుప్తభావ ప్రకాశిక, పు.202।

హృద్యము లగునవి శృంగార విభావములే అగును. హృద్యతమ మగు ఈ విషయ సంభారమంతయు సంపూర్ణముగా నున్ననాడు ఉత్తమునకు రతి కలుగును. కావుననే రత్నావల్యాదు లందు హర్మ్యవర్ణనము ఉద్యానవన గమనము – ఇత్యాదు లన్నియు సంగృహీతము లయినవి. కవి వీనిని తన కావ్యమున నిబంధింపగా, నటుడు అభినయమున సాక్షాత్కారకల్పముగ చేయును. అప్పుడు సామాజికునకు వీతవిఘ్నభోగాత్మకముగ రసము ఉదయించును.

కనులను, కనుబొమలను చతురతతో త్రిప్పుట, కడగంటిచూపులను ప్రసరింప చేయుట, లలితములైన అంగహారములను ప్రదర్శించుట, మధురములైన వాక్యములను పలుకుట మున్నగునవి అనుభావములు. ముఖరాగ, పులకాది సాత్త్వికమును పరిగ్రాహ్యము. ఆలస్యము, ఉగ్రత, జుగుప్స అను మూడును తప్ప ఇతరము లన్నియు ఇందు వ్యభిచారులే అగును. ఇక విప్రలంభశృంగారమును నిర్వేదము, గ్లాని, శంక, అసూయా, శ్రమ, చింత, ఔత్సుక్యము, నిద్ర, స్వప్నము, ప్రబోధము, వ్యాధి, ఉన్మాదము, అపస్మారము, జాడ్యము, మోహము, మరణము, మున్నగు అనుభావములచే అభినయింప వలెను.

'శృంగారము రతి ప్రభవమైనది కదా! అందు కరుణాశ్రయములగు నిర్వేదాది భావము లెట్లుండును? విప్రలంభశృంగారము అభిలాషాది దశావస్థలను కలిగి ఉండునని వైశిక శాస్త్రకారులు (వైశికశాస్త్ర మనగా కామసూత్ర మని అర్థము[6]) చెప్పియున్నారు. శాపము వలని క్లేశము, ఇష్టజననాశము, వధ, బంధనము అనువాని వలన సముత్పన్నమై అపేక్షారహితముగా నుండునది కరుణమని, ఔత్సుక్యచింతల వలన ఉత్పన్నమై అపేక్షతో కూడినది విప్రలంభ మని వివరింపబడి యున్నది. నిరపేక్షత్వ సాపేక్షత్వములే భేదకములగును కాని నిర్వేదాది భావాభినయమున భేదము ఉండదు. కావున శృంగారము నందు నిర్వేదాది సర్వభావములును సంభవించును. అందుచే కరుణ విప్రలంభము లభిన్నము లని తెలియవలెను'[7] అని అప్పారావు గారి అనువాదము. ఈ కరుణ విప్రలంభావస్థలను రెండింటిని కలిపి విశ్వనాథాది అర్వాచీనాలంకారికులు కరుణ విప్రలంభ మనెడి శృంగార భేదమును నిర్వచించిరి.

రసగంగాధరమున శృంగారరసమునకు స్త్రీపురుషులు ఆలంబన విభావము

---

6. అభినవభారతి, సం.1, పు. 309 (గుప్తభావ ప్రకాశిక, పు. 203)
7. నాట్యశాస్త్రము – గుప్తభావప్రకాశిక, పు. 203

లనియు, చంద్రిక, వసంతఋతువు, నానావిధోద్యానములు, పవనాంకురములు, రహస్థానము, మున్నగునవి ఉద్దీపన విభావము లనియు, ప్రియముఖావలోకనము, ప్రియాగుణ శ్రవణము, కీర్తనము, మున్నగునవియును, కంపాదులును అనుభావము లనియు, స్మృతిచింతాదులు వ్యభిచారు లనియు చెప్పబడినది.[8] రసగంగాధరకర్త భరతుడు చెప్పినవానిని కొన్నింటిని విడిచిపుచ్చినను, రహస్థానమును అదనముగా చెప్పెను.

ధనంజయుని దశరూపకమున అందమైన ప్రదేశము, కళలు, సన్నివేశములు, దుస్తులు, భోగములు ఇత్యాదులపట్ల చూపు ప్రీతిమూలక మగురతి, ఇరువురు యువతీయువకులు ఒండొరులపట్ల చూపు సంతోషము, మధురమయిన చూపులు, చేష్టలు, మున్నగువాని వలన ప్రకటితమయిన శృంగార మగును అని చెప్పబడినది.[9] ధనంజయుడు 'కళలు' అను విషయమును అధికముగా జోడించెను.

ధనంజయుడు 'అయోగో విప్రయోగశ్చ సంభోగశ్చేతిస త్రిధా' ।4-51। అని త్రివిధములుగా తెలిపి-

'తత్ర అయోగోఽనురాగేపి నవయో రేక చిత్తయోః

పారతంత్ర్యేణ దైవాద్వావిప్రకర్షాద సంగమః' - ।4-51-52।

అని దాని అవస్థలను కూడ తెలిపియున్నాడు. యువతీయువలకుల మధ్య ప్రణయ మున్నను, స్వాతంత్ర్యము లేకపోవుటవలననో, దైవము అనుకూలింపక పోవుట వలననో,కలయిక లేకపోవుటయే అయోగ శృంగారము. ఇందు అభిలాషాది దశావస్థలుండునని చెప్పబడినది.

విప్రయోగము ద్వివిధములుగా నుండునని -

'విప్రయోగస్తు విశ్లేషో రూఢ విస్రంభ యోర్ద్విధా।

మానప్రవాస భేదేన మానోఽపి ప్రణయేర్ష్యయోః' -।4-58।

ప్రియుల ఎడబాటే విప్రయోగ మని, కారణము అభిమానమో, సాన్నిధ్యము లేకపోవుటయో యని - ఇట్లు దశరూపకమున విప్రయోగ భేదములు వివరింప బడియున్నవి.

---

8. రసగంగాధరము, ప్రథమాననము

9. దశరూపకము, 4-48-50 శ్లోకములు ।సరిసెల్ల విశ్వనాథ వారి వ్యాఖ్యానము, పు. 78।

సంభోగశృంగారము : ఇక సంయోగము లేదా సంభోగశృంగారమును గూర్చి

'అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ
దర్శన స్పర్శనాదీని సంభోగో ముదాన్వితః' -।4-70।

మనసు లేకపోయిన ప్రియు లిరువురును ఒండొరుల దర్శన స్పర్శనాదుల వలన ఆనందమును పొందుట సంభోగ శృంగారము. ఇందు ప్రేమానురూప మయిన లీలాది దశవిధచేష్ట లుండునని చెప్పబడినది.

సాహిత్యదర్పణమున 'శృంగంహి మన్మథోద్భేద....' అని చెప్పబడినది. శృంగమన మన్మథోద్భేదము. అనగా మన్మథోద్భేదమున కిది నామాంతరము. తదాగమన హేతుకము శృంగారము. ఇది ఉత్తమ ప్రకృతిప్రాయము. పరోఢయు, అననురాగిణియు, వేశ్యయు నాయికలుగ నుండతగరు. మిగిలిన నాయికలును, దక్షిణనాయకాదులును, ఆలంబనము లగుదురు. చంద్ర, చందన, రోలంబరుతాదులు ఉద్దీపనములు. భ్రూవిక్షేప కటాక్షాదికము అనుభావములు. ఔగ్ర్యము, మరణము, ఆలస్యము, జుగుప్స, అనునవి కాక మిగిలిన వన్నియు వ్యభిచారులు. ఇందు రతి స్థాయి. శ్యామ వర్ణము. విష్ణుదైవతము[10] అని ఈశ్లోకముల భావము. 'ఒక్కొక్క ఎడ అథమాలంబనము నందును శృంగారము ఉండవచ్చును. కాని అది శృంగారాభాస వ్యపదేశ్యము'[11] అని సాహిత్యదర్శనము.

'విప్రలంభో అథ సంభోగో ఇత్యేష ద్వివిధోమతః' అని శృంగారమును సంభోగ విప్రలంభములుగ చెప్పి –

'యత్రతు రతిః ప్రకృష్టానాభీష్టముపైతి విప్రలంభోऽసౌ
సచపూర్వరాగ మాన ప్రవాస కరుణాత్మక చతుర్థాస్యాత్' -।3-187।

అని వీనిని గూర్చి సాహిత్యదర్పణకారుడు వివరించి యున్నాడు. ఇందలి అవాంతర భేదములను గూర్చి తదుపరి పరిశీలింతము. ఈతడు సంభోగ శృంగారమును గూర్చి-

'దర్శన స్పర్శనాదీని నిషేవేతే విలాసినౌ
యత్రానురక్తావన్యోన్యం సంభోగో అయ ముదాహృతః' -।3-210।

---

10. సాహిత్యదర్పణము, 3-183-185 శ్లో.
11. సాహిత్యదర్శనము, పు. 222

అనుకూలురైన ఇరువురు యువతీయువకులు పరస్పర దర్శన స్పర్శనాదికము ననుభవించునప్పుడు కలిగెడి సుఖాన్విత మగు అనుభూతి సంయోగము.

హేమచంద్రుని కావ్యానుశాసనమున –

'స్త్రీపుంస మాల్యాది విభావా జుగుప్సా లస్యౌగ్ర్యవర్జ్య
వ్యభిచారికా రతిః సంభోగ విప్రలంభాత్మా శృంగారః'

అనియు 'సుఖమయ ధృత్యాది వ్యభిచారీ రోమాంచాద్యనుభావః సంభోగః' అనియు, 'శంకాది వ్యభిచారీ సంతాపాద్యనుభావో అభిలాష, మాన, ప్రవాసరూపో విప్రలంభః' అనియు చెప్పబడి యున్నది.[12]

రామచంద్ర గుణచంద్రుల నాట్యదర్పణమున –

'సంభోగ విప్రలంభాత్మా శృంగార ప్రథమోబహుః
మానప్రవాస శాపాశ్చ విరహై పంచధాపరః'
'స్త్రీపుంసకావ్యగీత ఋతుమాల్య వేషేషు కేళిజః
అభినేయః సచోత్సాహ చాధు తాపసుమన్యుభిః'[13]

అని ఈ రసవిషయమై చెప్పబడినది.

రసార్ణవ సుధాకరమున –

'సర్వజనాహ్లాదకర మగుటచేతను, చాల విపులమై యుండునది అగుటచేతను శృంగారమును గూర్చి తొలుత వివరింప బడినది. విభావాదులచే సామాజికుల కాస్వాదమును కల్గించు రతియే శృంగారము. విప్రలంభ సంభోగ భేదముచే ద్వివిధము. పరస్పరము కలయికలేని యువతీయువకుల అనురాగము, అభీష్టములగు నాలింగనాదులు లభింపమిచే ప్రకర్షను పొందినయెడల నది విప్రలంభము. ఈ విప్రలంభము 'పూర్వానురాగ మానేచ ప్రవాస కరుణాదితి' అని నాలుగు భేదములుగ చెప్పబడినది.[14] సంభోగశృంగారమును గూర్చి–

'స్పర్శనాలింగనాదీనా మానుకూల్యాన్నిషేవణమ్
ఘటతేయత్ర యూనోర్యత్ ససంభోగశ్చతుర్విధః'
–రసికోల్లాపము, శ్లో. 219, పు. 592

అనియును

---

12. కావ్యానుశాసనము, 2-28-30, పు.106
13. నాట్యదర్పణము, తృ.పి.,శ్లోకములు 10,11
14. రసార్ణవ సుధాకరణము, రసికోల్లాసము, శ్లో॥లు 168-170, పు.536

'సంక్షిప్తః, సంకీర్ణః, సంపన్నతరః, సమృద్ధిమానితితే।
పూర్వానురాగమాన ప్రవాస కరుణాసంభవాః క్రమతః'
-రసికోల్లాసము, శ్లో.220, పు.594

అనియును చతుర్విధములుగ చెప్పబడినది.

శ్రీ పింగళి వారు 'జీవునకు తాత్త్వికములైన పురుషస్త్రీత్వములు లేకపోయినను, పురుషశరీరధారియైన ఆత్మ స్త్రీశరీరధారియైన ఆత్మతోడి సంయోగమును అభిలషించుటయు; స్త్రీశరీరి, పురుషశరీరిని వాంఛించుటయు; జీవునకు పాంచభౌతికమయిన ప్రకృతితోడి సంసర్గము వలన కలిగిన లక్షణము. అట్టి ఆత్మలు రెండును కలిసి ఏకముగా భాసించుట పేరే అర్ధనారీశ్వరత్వము. శృంగారరససిద్ధి'[15] అని ఈరసవిషయమై చెప్పియున్నారు.

ఈరీతిగ పలువురి ఆలంకారికులు ఈ శృంగారరసమును నిర్వచించి యున్నారు. ఆలంకారికు లందరి నిర్వచనములను పరిశీలించిన శృంగారరస ఆలంబన, ఉద్దీపన, అనుభావాది విషయమునను, సంభోగ విప్రలంభ భేద విషయమునను వారి కెవ్వరికిని భేదాభిప్రాయములు లేవని విదిత మగుచున్నది. విప్రలంభ శృంగార, సంభోగ, శృంగార - అవాంతర భేదముల విషయమున మాత్రము కొంత అభిప్రాయభేదము కాననగు చున్నది. ఆంధ్రలాక్షణికు డగు భట్టుమూర్తియు తన కావ్యాలంకారసంగ్రహమున విప్రలంభమును చతుర్విధములుగ పేర్కొనియున్నాడు.

## విప్రలంభ శృంగారము :

శృంగారమును పలువురు సంభోగ విప్రలంభ శృంగారము లని ద్వివిధములుగా చెప్పగా, ధనంజయుని వంటివారు అయోగ, సంయోగ, విప్రలంభము లని త్రివిధములుగ పేర్కొనిరి. మరల ఇందలి విప్రలంభమును మాన ప్రవాసాదిభేదముచే కొందరు చతుర్విధములుగా చెప్ప, మరికొందరు పంచవిధములుగ పేర్కొనియున్నారు. ప్రతాపరుద్రీయకారుడు అభిలాష, ఈర్ష్య, విరహ ప్రవాస భేదముచే చతుర్విధములుగా చెప్పగా,సాహిత్యదర్పణ కారుడు పూర్వరాగ (అభిలాష), మాన (ప్రణయ, ఈర్ష్య), ప్రవాస, కరుణ విప్రలంభములని నాలుగువిధములుగ చెప్పెను. విరహము నీతడు ప్రత్యేకముగ పేర్కొనక ప్రవాసము నందే చేర్చి వేసెను. మమ్మటాదుల అభిప్రాయము

---

15. సాహిత్యశిల్పసమీక్ష పు.167

ననుసరించి అభిలాష, విరహ, ఈర్ష్య, ప్రవాస, శాప, విప్రలంభములని ఐదువిధములు.

పరస్పర సంబంధము కలుగని నాయికానాయకులు ఒండొరుల సమాగమమును అభిలషించిన అది అభిలాష విప్రలంభమగును. దీనినే పూర్వరాగ మందురు. 'నీలీకుసుంభ మాంజిష్ఠా పూర్వరాగోఽపిచత్రిధా' -।3-195। నీలీరాగము, కుసుంభరాగము, మాంజిష్ఠారాగము అని ఈ పూర్వరాగము సాహిత్యదర్పణకారునిచే త్రివిధములుగ చెప్పబడినది. మిక్కిలిగా వ్యక్తము కాకున్నను మనోగతమై ఎన్నటికి చెదరని ప్రేమ నీలీరాగము. ఉదాహరణమునకు సీతారాముల ప్రేమ. మిక్కిలిగా శోభించినను కాలాంతరమున పోయిన యెడల అది కుసుంభరాగము. దేవహూతీ కర్దముల ప్రేమ ఉదాహరణము. మిక్కిలి శోభించుచు, ఎన్నటికిని మాసిపోని ప్రేమ మాంజిష్ఠరాగము. నలదమయంతుల ప్రేమ ఉదాహరణము. ఇక విరహవిప్రలంభమున సమాగమానంతరము ఏదియైన కారణమున నాయికానాయకుల కెడబాటు కలిగినచో అది విరహ మగును. అభిమాన మూలకముగ కలిగిన విప్రలంభము ఈర్ష్యావిప్రలంభము. నాయికా నాయకులేదేని కార్యవిశేషముచేత కాని, సంభ్రమము వలన కాని భిన్నదేశము లందుండుట సంభవించిన అది ప్రవాసము. 'ప్రవాస మన కొన్ని యామడల దూరము గల దేశమని భ్రమింపరాదు. స్వేచ్ఛగా కలిసికొనుట కవకాశములేని ప్రతిబంధక భూయిష్ఠమగు దేశమని యర్థము. కావుననే సాహిత్యదర్పణకారుడు విరహవిప్రలంభమును ప్రత్యేకముగ పేర్కొనక ప్రవాస విప్రలంభముననే చేర్చివేసెను'[16] అని సన్నిధానము వారి వ్యాఖ్య. శాపవిప్రలంభ మన 'ఇంతకాలము నీవు పత్ని నెడబాసి యుందువ'ను సిద్ధ పురుషాది వాగ్విశేషమగు శాపవశమున కలిగిన విప్రలంభము.

రసార్ణవ సుధాకరకర్తయు విశ్వనాథుని వలె మానప్రవాసపూర్వరాగ కరుణ విప్రలంభము లని చతుర్విధములుగనే పేర్కొనెను. రసగంగాధరకారుడు ఈ ప్రకార విభాగమనావశ్యక మని భావించినవా డగుటచే సంభోగ విప్రలంభములను మాత్రమె చెప్పి విశ్వనాథుడు చెప్పిన కరుణవిప్రలంభముపట్ల తన అసమ్మతిని సూచించినాడు.

యువతీయువకులలో ఒకరు లోకము వీడి చని, తిరిగి వచ్చెడి వారైన అది కరుణ విప్రలంభము అని సాహిత్యదర్పణము.

'యూనో రేకతరస్మిన్ గతవతి లోకాంతరం పునర్లభ్యే

---

16. కావ్యాలంకార సంగ్రహము -సన్నిధానం వారి వ్యాఖ్య, పు.407

విమనాయతే యద్రైకస్తదారసః కరుణ విప్రలంభాఖ్య' -:3-209:
కరుణ విప్రలంభమును రసాంతరముగ కొందరు గ్రహింతురు. మరికొందరు దీనిని విప్రలంభ శృంగార భేదముగనే భావింతురు. రసతరంగిణీ రసచంద్రికల అభిప్రాయములు పరస్పర విరుద్ధములని, వానిని విపులముగ చర్చించి, సాహిత్య దర్శనము ఈవిషయమై నిష్కృష్టాభిప్రాయము నిట్లు చెప్పుచున్నది. 'నాయికా నాయకులలో నొకరికి అన్యులు జీవించి యున్నట్లు నిశ్చయజ్ఞాన మున్నచో విప్రలంభము. మరణించినట్లు నిశ్చయజ్ఞాన మున్నచో అది కరుణము. వారు నిజముగా మరణించిరా! లేదా! అను ప్రశ్నతో మన కిట పనిలేదు. మరణించినను, మరణింపకపోయినను, మరణించిరను నిశ్చయజ్ఞాన మున్నచో నది కరుణమే అగును. అట్లు మృతి పొందినను, పొందకపోయినను, జీవించియున్నట్లు నిశ్చయ మున్నచో వియుక్తుల ప్రలాపమున రతియే ప్రదాన మగుట రతిస్థాయిక మగు విప్రలంభమే రస మగును. సప్రత్యాశము విప్రలంభము. నిష్ప్రత్యాశము కరుణము అని పలితార్థము'.[17] ఒక్కటే రసమునకు రెండు స్థాయిభావము లుండుట భరతుని మతమునకు విరుద్ధము కావున కరుణ విప్రలంభమును రసాంతరముగనంగీకరించుట కంటె శృంగారభేదముగ పరిగణించుటయే సమంజసము. అట్లయిన నది రతిస్థాయిక మయి మునివచనమునకు విరోధము కలుగదు. దీనిని కరుణ రసమున కంగముగ పేర్కొనిన సమంజసమని కొందరు భావించిరి.

రసార్ణవసుధాకరమున పూర్వరాగము శ్రవణము వలన గాని, ప్రత్యక్షదర్శనము వలన కాని,చిత్రదర్శనము వలన కాని, స్వప్నదర్శనము వలన కాని కలుగుననియు, దైవము వలనను, మనుష్యయత్నము వలనను గల్గు పారతంత్ర్యమున నీ పూర్వరాగము రెండువిధము లనియు సోదాహరణముగ చెప్పబడినది. [18] కావ్యాలంకార సంగ్రహమున ప్రవాసవిప్రలంభము - భావి విప్రలంభము, భవద్విప్రలంభము, భూతవిప్రలంభము అనిమూడు భేదములుగ చెప్పబడినది.[19]

ఈవిధముగ విప్రలంభము చతుర్విధము లగుటచే సంభోగము కూడ చతుర్విధములని కొందరి మతము. 'వినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే' విప్రలంభము లేనిచో సంభోగమునకు పుష్టిలేదు అని యుండుటచే నీ చతుర్విధ

17. సాహిత్య దర్శనము, పు. 217
18. రసార్ణవసుధాకరము, బులుసు వారి వ్యాఖ్య,పు.540
19. కావ్యాలంకార సంగ్రహము, సన్నిధానం వాం వ్యాఖ్య, పు. 408

వి[ప్రలంభముల యనంతరమున కలిగిన సంభోగము చతుర్విధములుగ నుండు ననిరి. ఎట్లన పూర్వరాగానంతర సంభోగము, మానానంతర సంభోగము, కరుణవి[ప్రలంభా నంతర సంభోగము, మున్నగురీతిగా నుండును. రసార్ణవ సుధాకరమున సంక్షిప్తము, సంకీర్ణము, సంపన్నతరము, సమృద్ధిమంతము అని నాలుగు విధములుగ చెప్పబడి, పూర్వానురాగము వలన సంక్షిప్తమును, మానము వలన సంకీర్ణమును, [ప్రవాసము వలన సంపన్నతరమును, కరుణము వలన సమృద్ధి మంతమును కలుగునని చెప్పబడినది.[20]

భరతుని నాట్యశా[స్త్రమున 'శృంగారం [త్రివిధం విద్యాద్వాఙ్నేపథ్య [క్రియాత్మకమ్' ៖నాట్యశా., 6-77៖ అని వాక్, నేపథ్య, [క్రియాత్మకముగ శృంగారము మూడువిధములుగ చెప్పబడినది. వాక్యశృంగారము రాగోద్బక మగు వచన రచనలచే [ప్రసరించును. నేపథ్యశృంగారము వేషభూషాదుల ఆకర్షణమున నుండును. [క్రియాత్మకము అంగాంగ సంబంధము గలది.

శారదాతనయుని కథనము ననుసరించి భరతులు పార్వతీపరమేశ్వరుల సంభోగమును అభినయించినప్పుడు తూర్పుదిక్కుగా నున్న [బహ్మ యొక్క ముఖము నుండి కైశికీవృత్తితో శృంగారము జనించెను. భరతుని వలెనే ఈతడును శృంగార, రౌ[ద్ర, వీర, బీభత్సములు [ప్రధానము లని చెప్పి,వానినుండి హాస్య, కరుణ, అద్భుత, భయానకము లుత్పన్నము లగునని ఈనాలుగే [ప్రధానరసము లని చెప్పినాడు. అగ్నిపురాణము నందలి పద్ధతి మిగిలినవాని కంటె భిన్నమగు చున్నది. ఇందు రసోత్పత్తి యుత్తమోత్తమ మగు నానందము నుండి చూప బడినది. ఆనందము నుండి అహంకారము, అభిమానము ఉత్పన్నమైనవి. ఈ అభిమానము నుండి రతి యుద్భవించినది. దాని నుండి తక్కిన రసము లన్నియు గల్గినవి. అవియే [క్రమముగా శృంగారము, రౌ[ద్రము, వీరము, బీభత్సముగా రూపొందినవి. ఈ నాలుగును [ప్రధాన రసములైనవి. వాని నుండి హాస్యము, కరుణము, అద్భుతము, భయానకము జనించినవి.[21] దశరూపకమున రసాస్వాదన సమయమున వికాస, విస్తార, విక్షోభ, విక్షేపములనెడి నాలుగు దశలుండునని, వానినుండి వరుసగా శృంగార, వీర, బీభత్స, రౌ[ద్రములు రూపొందినవని చెప్పబడనది. ఈ నాలుగును హాస్య,

20. రసార్ణవసుధాకరము, బులుసువారి వ్యాఖ్య,పు.595

21. Agnipurana - A study by Dr. S.D.Gyani, p.89

అద్భుత, భయానక, కరుణములకు జనకస్థానములు. ఈ అంశములు -

'స్వాదం కావ్యార్థ సంభేదాత్మానంద సముద్భవః
వికాసవిస్తర క్షోభ విక్షేపైః సచతుర్విధః
శృంగార వీర బీభత్స రౌద్రేషు మనసఃక్రమాత్
హాస్యాద్భుత భయోత్కర్ష కరుణానాంత ఏవహి'[22]

అనురీతిని గలవు. అను శృంగారమునకు అద్భుతము, హాస్యము, వీరము పోషక రసములు కాగా, కరుణము, బీభత్సము, రౌద్రము, భయానకము విరోధిరసము లయినవి.

## శృంగారము రసరాజముః

'శృంగార హాస్య కరుణ....' అను శ్లోకానుసారము నవరసములలో దీనికి ప్రథమస్థానము, మరియు ప్రధాన స్థానము ఈయబడినదని తెలియుచున్నది. కామము సకలజాతి సులభ మగుట చేతను, అత్యంత పరిచిత మగుటచేతను, నిఖిల జనులకు హృద్య మగుటచేతను, పండిత పామర మనోరంజకమై కావ్యకర్తలకు కల్పవృక్ష మగుటచేతను ఇది మొదట నిర్దిష్ట మయినదని చెప్పవచ్చును. ఈ శృంగారము రసరాజముగ పేరు గాంచినది. ఇది రసరాజ మగుటకు గల కారణములను ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ఇట్లు వివరించిరి. మానవసృష్టికి ఆదికారణ మయిన కామవాసన సర్వమానవ సాధారణమే కాక, సర్వప్రాణి సాధారణ మనియు, మానవ మానవేతర స్థావర జంగమాత్మక ప్రపంచ మంతయు కామవాసనాపూర్వకము గానే ప్రవర్తించుచున్నదనియు, ఆదినుండి చిత్తసుఖము నిచ్చు మాధుర్యము కలదనియు, కావ్యము నందు వలె లోకము నందును అద్యంత సుఖదాయక మయినదనియు, జీవైశ్వర్యైమను ఆధ్యాత్మికసిద్ధికి ఛాయ యగుటయే గాక, దానిని ప్రతిఫలింప చేయు ముకుర మనియు, శృంగార రసానుభవశాలి తన ఆత్మను పరమాత్మలో సుకరముగా లీనము చేయగల డనియు, క్షాళితము కాదగిన మాలిన్యమిందు తక్కువ అనియు చెప్పిరి.[23]

"శృంగం ప్రాధాన్య మియర్తీతి శృంగారః - సర్వ రసములలో నిది యుత్తమత్వమును పొందుచున్నది కావున శృంగార మగుచున్నదని ధర్మసూరి,

22. దశరూపకము, 4-43, 44 శ్లో.
23. సాహిత్య శిల్పసమీక్ష, పుటలు 160-62

శృంగ మన కామోద్రేకము. దానిని కలిగించుటకు కారణమై రత్యాది ప్రధాన ప్రకృతులచే విస్తరించు రసము శృంగార మనబడునని విశ్వనాథ కవిరాజును; మన్మథోద్రేక కారణంబై స్త్రీపురుష నిష్ఠమైన రసము శృంగార మనబడునని కావ్య ప్రకాశ వ్యాఖ్యలో భట్ట వామనాచార్యుడును, – ఇట్లు చెప్పబడినవానికి సామరస్యమును కలిగించుచు రసాంతరాపేక్షచే మధురమై, యుత్తమమై, శృంగారరసమే రత్యాది ప్రకృతులచే దేవ తిర్యఙ్నరాది జాతి సామాన్యంబుగ నమితానంద సంధాయకంబై యలరారుచున్నదని, 'శృంగార ఏవ ःఏకः మధురః పర ప్రహ్లాదనో రసః' అని ఆనందవర్ధనాభినవ గుప్తుల మత మెంతయు నొప్పియున్నద'[24] ని మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు. ఈ కారణములను మనసునందుంచుకొనియే కాబోలు భోజుడు –

'అమ్నాశిషుర్దశరసాన్ సుధియోవ యంతు
శృంగార ఏవ రసనాత్ రసమామనామః'[25]

అని శృంగార మొక్కటియే రసమని చెప్పినాడు. ఇతడు శృంగారమును అహంకారము, అభిమానము అనువానితో సమానముగ తీసికొని 'రసోభిమానోఽ హంకారః శృంగార ఇతిగీయతే' అని చెప్పినాడు. 'శృంగం రీయతే ఇతి శృంగారః' దేనివలన అత్యున్నతదశ కలుగునో అది శృంగారము అని వ్యుత్పత్తిని చూపి ఈ శృంగారపదమును అహంకార సమానార్థకముగ గైకొనినాడు. భరతాదులు చెప్పిన భావము లన్నియు నీ యహంకారము నుండియే పుట్టినవని, దీని నాధారముగ చేసికొని మానవస్వభావమును విశదీకరించుటకు యత్నించినట్టివాడు. ఈతని యుద్దేశ్యమున ప్రేమ ःఇష్టముः అనునదియే సర్వరసములకు మూలము కాన – అనగా నీయిష్టమే ःసుముఖతయేः లేనిచో రసోత్పత్తి కలుగదు కాన ప్రేమ కూడ సహంకార రూపముగనే గైకొనబడినది. 'రసంతు ఇవా ప్రేమాణా మేవా మనంతి సర్వేషామపి రత్యాది ప్రకర్షానాం రతిప్రియో, రణప్రియోఽ మర్షప్రియః, పరిహాసప్రియః, ఇతి ప్రేమణ్యేవ పర్యవసాత్' అని సరసస్వతీ కంఠాభరణము ःపరి.5ः. కావున ఈతని దృష్టిలోని శృంగారమునకు, భరతుడు చెప్పిన నవరసములలోని శృంగారమునకు వ్యత్యాస మున్నట్లు స్పష్టమగు

24. శృంగారరస విమర్శనము – ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, 1913–14, సంపుటి2, సంచిక 4, పుటలు 330–31
25. సరస్వతీ కంఠాభరణము, పరి.5

చున్నది. కావున ఈతని సిద్ధాంతము సరియైనదిగా గన్పట్టుట లేదు.

శృంగారము రసరాజ మనుటకు గల కారణమును శ్రీ నారాయణరెడ్డి గారు తమ వ్యాసమున ఉపనిషత్తులలో కామమే సృష్టికి మూలమని కలదు. ఆత్మ సంకల్పమే మిధునముగా రూపొందెననియు, సృష్టి యంతయు దీని పరిణామ రూపమే యని బృహదారణ్యకోపనిషత్తు తెలుపుచున్నదనియు, మనువు 'అకామస్య క్రియాకేచిత్ విద్యతే నేహ కర్హచిత్' అను సూత్రమున కామ ప్రాబల్యము నుద్ఘాటించె ననియు, దీనిని గుర్తించియే భోజుడు 'రసోభిమానోఽ హంకారః శృంగార ఇతిగీయతే' అని సిద్ధాంతీకరించె ననియు[26] చెప్పియున్నారు. వీరు రాయప్రోలు వారి అమలిన శృంగారమును గూర్చి చర్చచేయుచు ప్లాటో ప్రేమ సిద్ధాంతమును కూడ (Platonic love) వివరించి యున్నారు. శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ వ్యాసమున భరతునిచే చెప్పబడిన ధర్మశృంగారము, అర్థశృంగారము, కామశృంగారము మొదలగువానిని గూర్చి వివరించి మోక్షశృంగారము కూడ కలదని భరతుడు చెప్పెనని వాని కుదాహరణముగ 'యోమాం ప్రయతతే హంతుం మోక్షమాస్థాయ పండితః....'అని అశ్వమేథ పర్వమున నున్నట్లు, 'శ్రేయః పుష్పఫలం కాష్ఠాత్కామో......'అని శాంతిపర్వమున నున్నట్లును చూపియున్నారు.[27] వీరు ప్రియతరాఖ్యానము శృంగారమునకు సన్నిహితమైన దగుటచేతను ఈప్రీతి కేవలము ఆధ్యాత్మిక మగుట చేతను ప్రేయస్, ప్రీతి, వాత్సల్యము అను మూడు శృంగారరూపములు కలవని, భక్తి నాల్గవ దని, ఇవన్నియు శృంగారరసములో కన్పించు భావము లనియు చెప్పినారు ःఅదే వ్యాసముః.

శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు పలువురి ఆలంకారికుల వలెనే శృంగారరస రాజత్వము నంగీకరించుచు శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్, స ఏవ చేదశృంగారీ నీరసం సర్వమేవతత్' అని శృంగార ప్రాధాన్యము నుగ్గడించి సుకుమారమైన శృంగారము సర్వజన హృదయాహ్లాదకర మగుటచేతను, అన్ని రూపకము లందు జొన్పబడుటచేతను, నాలంకారికులచే నగ్రస్థాన మీయబడి యుండుటచేతను, అందరికి అనుభవవిషయ మగుటచేతను, దీనిని రసరాజ మనుటలో నతిశయోక్తి లేదు[28] అని చెప్పియున్నారు. శ్రీ రాయప్రోలు వారు తమ రమ్యాలోకమున -స

26. అమలినశృంగారతత్త్వము, ఆంధ్రపత్రిక, 1963-64, శోభకృత్తు, పు.81
27. 'శృంగారరసము' భారతి 1954 అక్టో.సంపు.31. సంచిక 10. పు.336-339.
28. 'శృంగార రసము', ఆంధ్రసారస్వత పరిషత్పత్రిక, 1932, సంపు.21, సంచిక.1, పు.27

'రసములకు నెల్ల శృంగారరసము తల్లి
యనిరి పూర్వులు సంభోగమవధి గాక
అక్షరానందసిద్ధి లక్ష్యముగ నెంచు
నవ్యులకు నది అప్రధానముగ మెలగె' అనియు
'కరుణశృంగారములు రెండె కావ్యమందు
నిజరసవిపాక భోగమందింప గలవు
సహజపూర్ణ చిన్మయ సుఖాస్వాదనమున
శోకమథిత మనోదోష శుద్ధి కలన'[29]

అనియు అనేక ప్రాచీనాలంకారిక గ్రంథములలో దాదాపుగా ఏకచ్ఛత్రాధిపత్యమును నెరపుచున్న శృంగారమును దిగలాగి, కరుణమును గద్దె నెక్కించిరి. ఈ యభిప్రాయ భేదమున కేమి గాని జగత్తు యొక్క అవిచ్ఛిన్నతకే శృంగారము మూలమగుటచేతను, 'ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః' అని తైత్తిరీయోపనిషత్తు ఉద్ఘోషించుటచేతను, 'సంతతి శ్శుద్ధవంశ్యాహి పరత్రేహచ శర్మణే' అనియు 'క్రియాణాం ఖలుధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణం' అనియు, 'ప్రజాయై గృహ మేథినామ్' అనియు అనేకవిధముల శృంగారాలంబన మగు గృహస్థాశ్రమము కూడ మిక్కిలి పొగడబడుటచేతను, 'ధర్మావిరుద్ధో భూతానాం కామోస్మి భరతర్షభ' అని భగవానుడే గీతలో వచించుటచేతను శృంగారమున కెంతటి ప్రాముఖ్యము గలదో విపులముగా వివరింపకపోయినను సువిజ్ఞేయ మగుచునే యున్నది.

---

29. రమ్యాలోకము, పుటలు 12, 13

## భారతము – శృంగారము :

ఇట్లు శృంగార రస సంబంధి యగు పలువిషయములను పరిశీలింపగా శృంగార రస స్వరూపమును, అందలి భేదములును, వాని స్థితిగతులును, ఇత్యాది అంశములు తెలియవచ్చినవి. ఇక తిక్కన గారి భారతమున నిది ఎంతవరకు గలదో చూడవలసి యున్నది. శృంగార వీరములలో నొకటి నాటకమున అంగి కావలెనని లాక్షణికోక్తి. శ్రవ్యకావ్యముల విషయమున నింతటి కట్టడి లేకున్నను వీని ప్రాధాన్యమునే పలువురు ఆలంకారికులు నొక్కి వక్కాణించిరి. ఆంధ్రవాఙ్మయము నంతటిని రసదృష్టితో పరికించిన శృంగారరస ప్రధానకావ్యములు కోకొల్లలుగ కానవచ్చును. ఆలంకారిక గ్రంథము లందు సహితము దీని విస్తృతిని చూచిన నిది తక్కిన రసముల కంటె సువ్యాప్తమనుట సత్యము. కాని మన భారతమున మాత్రము ఇది అంగి రసస్థానము నాక్రమింపక అంగముగనే యుండి తిక్కన గారి భారతమును నానారసాభ్యుదయోల్లాసి అనుటకు దోహదము చేసినది. భారతము నందలి అంగి రసము శాంతము. కావున ప్రధానరసమును దృష్టి నందిడుకొని శృంగారరస వర్ణనమును కావించినాడు తిక్కన. ఆతడు అంగరసముల పరిమితి నెరిగి రచన చేసినవాడై రసౌచిత్యమును పాటించినవాడు.

స్త్రీపురుషుల అన్యోన్యాలంబనము కలిగిన ప్రేమాఖ్య చిత్తవృత్తి విశేషమును తిక్కనగా రెచ్చటను విపులముగ వర్ణింపలేదను కేతవరపు వారి మాట ఇట స్మరణీయము.[30] ప్రధానరసమును దృష్టియం దిడుకొని శృంగారమును విభావాదులచే పరిపుష్టము చేయక కేవల భావమాత్ర పర్యవసితముగను, ప్రకరణానుకూలముగను చెప్పినాడు తిక్కన. లలితశృంగారమున కాటపట్టగు భాగము ఈతని విరాటపర్వము నందే గలదు. విరాటపర్వము నందలి ఉత్తరాభిమన్యుల వివాహవర్ణమున లలితమగురీతిని శృంగారరసము పోషింపబడినది.

'వీనులఁ దియ్యమెక్క మును విన్కిఁ బరస్పరరాగవృత్తిలో
నూనినఁ జూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబుల
చ్చో నొక యింతసేపు నెడ సొచ్చుట కోర్వకయుండ నున్న య
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్'[31]

30. తిక్కన కావ్యశిల్పము, పు.487

31. విరా., ఆ.5, ప.393

'అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు' అని మారవికారము లంకురించినట్లుగ చెప్పినాడు. ఇట ఈ శృంగార రసమునకు ఆలంబన విభావము ఉత్తరాభిమన్యులు. వీరు రూప వయో విద్యాభిజాత్యాదులచే ననురూపులు. పరస్పరావలోకనము చేయునప్పుడు వీరిరువురి తీరుతెన్నులు ఏరీతి నున్నవో తిక్కన రసబంధుర మగురీతిని పాఠకుని కన్ను ఎదుట కాననగునట్లు –

'వరు చూడ్కి ముద్దియ వదనంబుపైఁబాఱి
తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరము
నడుగుల యొప్పుపై నల్లనడరుఁ
బతి విలోకనములు పడఁతుకమైఁ దీవఁ
గలయంగఁ బలమాఱు మెలఁగుచుండు
వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునఁజొక్కి మగిడివచ్చు
నొండొరువుల లేఁజెమటలనూని వ్రేగు
పడిన చాడ్పున నవయవ భంగు లందుఁ
దగిలి మఱవునఁదడయు సిద్దఱ విశాల
నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ'[32]

అని వర్ణించినాడు. తిక్కన ఈపద్యమున దశవిధములగు శృంగారచేష్టలలో నొకటి యగు చక్షుఃప్రీతిని రమ్యముగ వర్ణించి రసపోషణము గావించినాడు. తదుపరి వధూవరు లిరువురు 'మందార కల్పలతలు విరులు గమియ నొండొంటిపై కురియు' రీతిని వారి దోయిళుల నినుపొందచేయు నక్షత్రప్రకరములను అన్యోన్య మస్తకము లందు పోసికొనిరట. ఇది తలఁబ్రాల వర్ణనము. వివాహసమయమున తలఁబ్రాలు పోసికొనుట అనునది అచ్చతెనుగుదేశీయ సంప్రదాయము. ఈ సంప్రదాయానుసారము వర్ణించినవాడై తన దేశీయాభిమానమును కూడ చాటుకొనినాడు తిక్కన. లజ్జచేతను, ముగ్ధత్వముచేతను వినమ్రమయ్యె, యింతవరకు వరుని చక్కగా చూడజాలకపోయిన యుత్తరకు, తలఁబ్రాలు పోయునపుడు చక్కని అవకాశము లభించినది. అట్లే గురు

---

32. విరా., ఆ.5, ప.395

జన సమక్షమున వధువును బాహాటముగ చూడజాలకపోయిన అభిమన్యునకు చక్కని అవకాశము లభించినది. ఈ సందర్భమున నూతన వధూవరుల ముగ్ధమోహన శృంగారచేష్టలను తిక్కన ఎంత స్వాభావికముగు విధమున వర్ణించినాడో చూడుడు -

'లలిత తనూ విలాసముల లజ్జకతంబునఁజేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవుసాలక యోరలువాఱు చూపులన్
లలిఁ దలఁ(బాలు వోయునెడలం దగవొందిన నూలుకొల్పి యి
మ్ములఁబచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్'

-విరా., ఆ.5, ప.398

చిత్తమున గాఢానురాగముచేత చూపు తెఱగుదోప కెంపారెడు తీగబోడియైన ఉత్తర యొక్క మృదులపాణిని అభిమన్యుడు పల్లవాలంబి మత్తేభలీల గ్రహించినాడట. ఇట నీ అలంకారము లెంతయు రసరామణీయకములు. కోమల లాలిత్యములకు ప్రధానమై, ఆలంబనము లేనిదే నిలువలేని లతను స్త్రీతోడను, లతకు సుస్థిరాలంబమై దానిని వాతాద్యుపద్రవముల నుండి రక్షించు వృక్షమును పురుషునితోడను పోల్చుట కవి సమయము. మందారవృక్షమును ఆశ్రయించికొని పైకి ప్రాకిన లత యొక్క ప్రసూనములు ఆ వృక్షముపై రాలుటయు, మందార పుష్పము లాలతపై పడుటయు స్వభావసిద్ధమగు మనోహర ప్రకృతి దృశ్యములు. వర్ణనానైపుణ్యము అలంకార ప్రయోగనిపుణత గల తిక్కనార్యుని ఈ యుపమానము వలన వధూవరుల రూపు రేఖావిలాసాదులు, వారి అనుకూల దాంపత్యము ధ్వనిత మగుచున్నది. ఇట్లే పాణిగ్రహణానంతరము ఏకాసనస్థులగు నీ వధూవరుల వర్ణనము హృదయంగమమై యున్నది. సహజ కోమల సౌకుమార్య లాలిత్యప్రధాన యుత్తర. బాహువీరశౌర్యస్థైర్య గాంభీర్య గుణప్రధానుడు అభిమన్యుడు. ఇట్టి ఈ యిరువురికి వివాహప్రాప్తిచే ననురూప సంయోగము సిద్ధించినది. ఇట గమనింప తగినది మరియొక విషయము. 'చిత్తమున గాఢరాగంబు చేత....మత్తేభ లీల' 5-399 అను వర్ణనమున వయోనురూపమగు రక్తిమతో నొప్పు కోమలమగు హస్తకిసలయమును అభిమన్యుడు ఆసక్తితో విలాసముగ గ్రహించినరీతి భద్రేభము విలాసముగ పల్లవములను గ్రహించురీతి నున్నదని వర్ణించినాడు. ఏనుగు చిగురుటాకుల యందు గల ఆసక్తిచే వానిని నలిగిపోనీయకుండ బహు జాగరూకతతో అతి సుకుమారముగురీతిని వృక్షాగ్రముల నుండి గ్రహించును. ఇది ప్రకృతి సిద్ధమగు విషయము. కిసలయము మార్దవ

కోమలతారక్తిమలను ప్రధాన ధర్మములగ కలిగియున్నది. అట్టి కిసలయమును ఆమె హస్తముతో నుపమించుటచే యుత్తర సౌందర్యము కొంత స్ఫురిత మగుచున్నది. అట్లే పల్లవాంబి మత్తేభలీల అనునదియు నర్థవంతము. అభిమన్యుని గాంభీర్య ప్రధానమగు మూర్తిని, ఉత్తరయందు దాతనికి గల యనురక్తిని, ఈ ఉపమానము వ్యక్తము చేయుచున్నది. మరియు ఉత్తర హృదయమున నున్న గాఢానురాగమును హస్తము వ్యక్తము చేయుచున్నదా అనునట్లు ఆమె అరచేయి రక్తిమతో నొప్పుచున్న దను ఉత్ప్రేక్షయు ఎంతో అర్థవంతముగనున్నది. ఆలంకారిక మతానుసారము శృంగారవర్ణము ఎఱుపు. 'హోమసమయమున లభించిన సంస్పర్శ కారణమున వధూవరులందు కల్గిన సాత్త్విక భావోదయమును వర్ణించుటతో నీ ఘట్టము లలిత శృంగారమునకు శిరోభూషణ మగుచున్నది.[33] అను భూపతి వారి మాట ఎంతయు సత్యము.

'కోర్కులు గెడఁగూడుకొని పారమెయ్దిన
చిత్తంబు లూఱుటఁ జిగుళులొత్తఁ
బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు
మేనను మవ్వంబు మిగిలిపొదలఁ
దఱివేచి చనఁబోయి తడఁబడి మార్గతి
వడి చూపులాడట బయలుపఱుపఁ
జెమటల తావులు తమలోనఁ గలసి వే
ఱొక్క సౌరభమునై చొక్కుసేయ
గాఢసంస్పర్శభంగులు గల్గునట్టి
హోమసమయ కృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పారిఁబొరి గ్రమ్మదేర
సమ్మదాంబుధిఁదేలిరి సతియుఁబతియు'[34]

అని స్పర్శసౌఖ్యానుభవము వలన వధూవరుల దేహములు స్వేదముచే సిక్తములైనట్లు వర్ణించినాడు. ఈపద్యమున సాత్త్వికభావోదయ వర్ణనము కలదు. ఈ విధముగ నీఘట్టమున ఉత్తరాభిమన్యులను ఆలంబన విభావముచే, వీరి యౌవన, భూషణ, చేష్టాదులను ఉద్దీపన విభావములచే, కటాక్షాదులను అనుభావములచే, ప్రియముఖావలోకనము అను వ్యభిచారీభావముచే, 'స్వేదము' అను సాత్త్వికభావముచే పరిపుష్టమై

33. భారతము – తిక్కన రచన, పు.38
34. విరా., ఆ.5, ప.402

రతి అను స్థాయి భావము శృంగారరసముగ పర్యవసించినది.

ఈ సందర్భమును గూర్చి ఆచార్య యస్వీ జోగారావు గారు 'కలిగిన అవకాశమును చక్కగా సద్వినియోగము చేసికొన్న సరసమతులు వారు. ఇక ఫలావస్థ తరువాయిగ అంకురిత, పల్లవిత, కోరకిత, పుష్పితావస్థలన్నియు నాయొక్క గడియలో పరిక్రమించినవి. ఆ సమయమున చెమట చిత్తడిలోనే యొకసౌరభ స్వారస్యము గోచరించు ననుట అనుభవైకవేద్యమైన మాట. రసికశిఖామణి తిక్కన యీఘట్టమున సెలయేటి జాలున విరిసిన వెన్నెల వలె ఆ ముగ్ధమనస్సుల వికసించిన స్నిగ్ధ శృంగారము నతి లలితముగ, స్వచ్ఛముగ, స్వాభావికముగా, ఔచితీ మహితముగా, మసృణ మనోజ్ఞముగా పోషించెను. చిరస్థాయిగా నిలిచిన భారత వంశాంకురమా పుణ్యదంపతుల కడుపుపంటయే కదా'[35] అని చెప్పియున్నారు. మూలమున ఈ ఘట్టము అతి సంగ్రహమై యుండ, దానిని సర్వాంగసుందరముగా నభివర్ణించి పరిపుష్టిని కలుగజేసినాడు తిక్కన. ఇట్లీఘట్టము శృంగార రసపోషకము.

భారతము నందలి శృంగార రసపోషణమునకు మరియొక ఉదాహరణము సుకుమారీ నారదుల ప్రణయవృంత్తాంతము. ఇట తిక్కన గారు నారదుని విషయమే స్పష్టముగా వర్ణించిరి. కాని, సుకుమారి మనోభావముల నట్లు చెప్పలేదు. ఇది శాంతిపర్వము ప్రథమాశ్వాసమున కలదు. నారదుడు, అతని సోదరి కొడుకు పర్వతుడు – ఇరువురును మహీ మండలమున త్రిమ్మరు వేడుకచే ఒకనాడు దివినుండి వచ్చినవారై తమలోన సమయ మధికనిష్ఠమై చేసికొనిరి. 'నిజ చిత్తవృత్తు లొండొరులకు దాడక యుండువారము. అటుగాక శాపార్హత వాటిల్లఁగలయది' అని పలికి ఉచితవర్తనమున ఉండిరి. ఒకనాడు సృంజయుని చూచినవారై, అతడు విశిష్టభక్తితో నర్చనముసేయగా, ఆతని ఆలయమున కొన్ని దినములు వసింతు మనిరి. ఈ మాటలకా ప్రభువు సంతోషించినవాడై, తన కుమార్తె అయిన సుకుమారిని రావించి 'ఇక్కన్నియ మీకు పరిచర్యసేయ సమాధానంబున నుండుము' అని చెప్పి అన్నెలంతతో నీవు దేవోపచారముల వారి నారాధింపుము అని నియోగింపగా, వలయు వస్తువులను సమకూర్చుచుండ వీరిరువురును ప్రీతులై సుఖముగ నుండిరి. ఇట్లుండగా నారదునకు సుకుమారిపై అనురాగము కలిగినది. దీనిని తిక్కన యిట్లు వర్ణించినాడు –

'అల్లఁదనంబున యనువు మైకొనఁజూచు

35. మహాకవిమార్గము – విరాటపర్వ విమర్శ, వ్యాసుని వాణి– తిక్కన బాణి,పు.123

నడపుకాంతికి వింతతొడవుగాఁగ
వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు
దేరని వళులతో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవుల కలమేర
లెల్లను బిగియెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కి
తారకంబులఁ గల్కితనము దొడరఁ
జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు
జవ్వనంబు చెన్ను నివ్వటిల్ల
మునికిఁదెలుప సృంజయుని పుత్రి మెలఁగు వి
ధంబు నారదునకుఁ దగులొనర్చె'[36]

నారదుడు మదన బాణాసారము తనుబొదువ ధైర్యసార మెడలి దుర్వార మనోవ్యథ వంతం గూరి క్రమంబున కృశాంగకుం డయ్యెనట ౹1-249౹. మరియు వెనుబడు చిత్తవృత్తియును, వెల్వెలఁబాఱెడు నాననమును కలవా డయ్యెనట. ఇట వైవర్ణ్యమను సాత్వికభావము వర్ణింపబడినది. తదుపరి పర్వతు డీతనికి శాప మిచ్చుట, నారదుడు ప్రతిశాప మిచ్చుట, నారదు డామెను వివాహ మాడుట, ఆముని శాపముచే వానరాననము కలిగినవాడయినను, ఆమె విరక్త గాక తగ ప్రీతితో నుండుట – ఇత్యాది అంశములు వర్ణింప బడినవి. ఇట శృంగారమునకు ఆలంబనము సుకుమారీ నారదులు. ఉద్దీపనము సుకుమారి యౌవనము. ఇచ్చట కేవలము నారదుని మనోభావములనే వర్ణించి, సుకుమారి మనోభావములను వర్ణింపలేదు.

మరల నీ శృంగారము భారతోపాఖ్యానములలో నొకటి యగు 'సుదర్శనోపాఖ్యానము'న చోటుచేసికొన్నది. శృంగార రస ప్రధానమగు నీయుపాఖ్యానమున అగ్నిదేవుడు సుదర్శనాకరమును కోరు సందర్భమున తిక్కన నూతన సన్నివేశమును కల్పించి రసవంత మొనర్చినాడు. సంగ్రహకథను విపులీకరించి శృంగారరసమునకు వలయు విభావాది సామగ్రిని సమకూర్చినాడు.

మనువంశమున పుట్టి సర్వజనతామందారమై నేలఎల్లను పాలించి జగత్రయీ ప్రణుతలీలను పాల్చి యుండెను దుర్యోధను డను రాజు. ఈరాజునకు నర్మదకు నొక

36. శాంతిపర్వము, ఆ.1, ప.248

కన్యారత్న ముద్భవించినది.

'వినుదానికిఁ బేరు సుద
ర్శన యన్నరనాయకుండు సంప్రీతిమెయిం
బెనిచి తన యగ్నిహోత్రం
బున పరిచర్యలకుఁబనిచె బుజ్జవములతోన్'

– ఆనుశాసనికము, 1-46, 47

అని ఈయుపాఖ్యానము ప్రారంభమైనది. ఈ యుపాఖ్యానమునకు నాయికా నాయకులు సుదర్శనాగ్నిదేవులు. సుదర్శన తండ్రి యాజ్ఞమేరకు ఆతని అగ్నిహోత్రమునకు పరిచర్యలు చేయు సందర్భమున అగ్నిదేవున కామెయందు మనసు కలిగినది. శృంగారము ప్రవర్తించినది.

'అర్చించునప్పు డయ్యంగన కెంగేలి
జగి సొంపు చిత్తంబు దిగిచి కొనఁగ
నరసి కన్గొను నప్పు డయ్యింతి కనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ
నన్యులఁబనిఁబంచునప్పు డమ్ముద్దియ
పలుకులతీపు గొర్కులఁ గెరల్ప
నల్లన యూఁదెడునప్పు డక్కొమ్మ వా
తెఱతావి ధైర్యంబుఁ ద్రిప్పుకొలుప
మరుడు దోడ్తోడఁ దేఁకువమాలి కదిసి
తూపుగముల గ్రొవ్వాఁడిమి సూపనంత
కంత కగ్గలమగు వలవంతఁదూలి
పోయెఁ బావకుఁడేమి నెప్పుదు నరేంద్ర'[37]

ఇందు అగ్నిదేవునకు మానవతాలక్షణ మాపాదింప బడినది. ఇందలి శృంగార రసమునకు ఆలంబనవిభావము సుదర్శనాగ్నిదేవులు. ఉద్దీపనవిభావము సుదర్శన రూపము, యౌవనము, చేష్టలు. ఈ పద్యమున తిక్కన గారు సుదర్శన బాహ్యచేష్టాభి వర్ణనముచే అగ్నిదేవుని అంతర్వికారములను కలిపి చెప్పిరి. అనగా ఆమె అనుద్బుద్ధరసమూర్తి. అతడు అప్రకటితానుభావుడు. సుదర్శన ప్రతిదినము అగ్నిదేవుని

37. ఆనుశాసనికపర్వము, 3.1, ప.48

అర్చించు చుండును. అప్పుడు రాగము దినదినము అభివృద్ధి అగుచుండగా, తన మనసులోని కోర్కెను చెప్పవలయు ననుకొనుచున్నాడు అగ్నిదేవుడు. తనను తాను నిబ్బరపరచుకొన లేకున్నాడు. దీనికితోడు మరుడు ఈతని బాధించుచున్నాడు. 'ఇట్లు మదనాగ్ని నుదిలకొని అగ్నిదేవుడకాంతతో నేకాంతంబున నిట్లనియె' ఆనుశాసనికము, ఆ.1, ప.49 –

'చిగురుటాకుల గాసిసేయు నీ యడుగుల
        చెలువంబు సూడ్కులఁజేర్చికొనియె
మారేడు పండుల గారాముసెఱచు నీ
        యెలచన్నుఁగవ వేడుకలఁబొనర్చె
నునుఁదీవఁ జీరికాఁగొనని నీ మైఁదీవ
        మురిపంబు డెందంబు మరులు కొలిపె
నెఱసందురుని నిగ్గువఱుపంగఁజాలు నీ
        నెమ్మోము దాలిమి వమ్ముసేసె
నాతి నీకునై పెక్కు బన్నములు వడితి
నంగజునిచేత వల్లభవగుము నాకు
నావుడును సిగ్గుగదిరి యాననము వాంచి
యలఁతి యెలుఁగున నిట్లను నా లతాంగి'[38]

ఈవిధముగ శృంగారరసస్థాయి యగు రతి పుట్టుక చెప్పబడినది. సుదర్శన చిత్త మెట్లున్నదో చెప్పబడలేదు. అంతమాత్రమున నిది ఏకత్రైవానురాగమై రసాభాసము కాజాలదు. ఏమనగా 'వల్లభవగుము నాకు' అని అడుగగా సిగ్గుగదిరి యాననము వాంచి యలతి ఎలుగున –

'కులకన్యలకు వేడుకఁ
దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం
దలకొనఁదగునే గురు జన,
ములకా కత్తెఱఁగువారు పురుషార్థవిధీ' – ఆనుశాసనికపర్వము, 1–51 అని

పలికినది. తలవాకిట నిలబడి, వేడుకబడి పరపురుషులతో మాటలాడుటకు కులకన్యకలు తలకొనరాదు కదా! కులకన్యకల ఆ వేడుక తెఱగునకు తగిన మాటలు వరులతో

38. ఆనుశాసనికపర్వము, ఆ.1,ప.50

మాటలాడవలసినవారు గురుజనము కదా! అనగా తలితండ్రులు కదా! అని భావము. తిక్కన గారు ప్రయోగించిన 'తలవీడుల( బరులతోడి తగుమాటలకుం దలకొనుట' అనుదానికి సిగ్గును, మర్యాదయు విడిచి అని భావార్థము. సుదర్శన యొక్క ఈమాటల వలన ఈమె చిత్తలక్షణము తెలియుచున్నది. ప్రత్యేకముగ తిక్కన గారు 'ఈమె చిత్త మిట్లున్నది' అని చెప్పకపోయినను, ఈమె మాటలవలననే ఈమె మనస్సును వెలువరించిరి. సుదర్శన మాటల వలన అగ్నిదేవుని యం దామెకు మనస్సున్నదను విషయము స్పష్టమగుచున్నది. కనుకనే 'వల్లభ వగుము' అని అడుగగనే సిగ్గు గదిరినది. ఆననము వాంచినది. అలతి ఎలుగున మాట లాడినది. కావున నిది యుభయనిష్ఠ మగు రతియై శృంగారరసమే అయినది కాని రసాభాసము కాదు.

ఈసందర్భమున కేతవరపు వారు మరికొంత విపులమగు చర్చను గావించి యున్నారు. 'ఈ సుదర్శన యాంతర్యమును తిక్కనగారు సీసపద్యము మొదటిపాదమున చిత్రముగా నిక్షేపించిరి. మొదటిపాదాంతమున 'కొను' ధాతువు ప్రయుక్తమైనది. అది కర్త్రర్థకమున ప్రేరణాత్మనేపద చిహ్నము. మిగిలిన మూడు పాదాంతముల యందలి క్రియలు అట్టివి కావు. అవి కర్మార్థక విషయముగా నున్న ప్రేరణములు. క్రియాఫలము కర్తృగామి యగుచున్నపుడే కొను ధాతు వనుప్రయుక్త మగును. అగ్నిదేవుని చిత్తమును సుదర్శన తన కెంగేలి యర్చనారూప క్రియకు ఫలముగా పొందినది. అనగా వాని చిత్తము తనకుస్వాయత్త మగునట్లుగా నామె తన కెంగేల అర్చించినది. కనుక మొదటినుండి సుదర్శనకు కూడ వానియందు మనస్సున్నది. ఒక్క క్రియాశబ్దము యొక్క ప్రయోగవైచిత్రి నాశ్రయించి తిక్కన్నగారు సుదర్శన విషయమును పరమ రమణీయముగా నభివ్యక్తము చేసిరి'[39] ఈ పద్యమునకు మూలము మృగ్యము. మూలమున రసవంతముగ లేని ఈ ఘట్టమును రసవంతముగ చేసినాడు తిక్కన. విభావాదులతో నిట శృంగారము చక్కగా పోషింపబడినది. సుదర్శనావిషయమున ఆమె మనోవికారము నంత విపులముగా వర్ణింపకపోవుటకు గల కారణము ఇది అంగరసమే కాని అంగిరసము కాదు. శాంతరస ప్రధానమైన ఈ గ్రంథమున శృంగారమున కంతటి దీప్తిని కలిగించుట మంచిది కాదను భావనతో ఈతడాపని చేయలేదు. అగ్ని విషయమున అట్టి వర్ణనము తత్ప్రకరణమున

39. తిక్కన కావ్యశిల్పము,పు.479

కవసరము. ఈవిధముగ అంగిరసమునకు భంగము కలుగని రీతిని ఈ ఘట్టము లందు అంగరస పోషణము ఎంతవర కావశ్యకమో అంతవరకు మాత్రమే చేసి రసౌచిత్యమును పాటించినవాడు తిక్కన.

ఈయన స్త్రీపురుషుల ఇరువురి విషయమును చెప్పినది ఒక్క ఉత్తరాభిమన్యుల వివాహసందర్భముననే. అదియైనను లలితమై, మనోజ్ఞమై అంగరసముగా నిలిచినదే కాని అతివేలముకాలేదు.

తిక్కన తన భారత భాగమున తిర్యగ్గతిని కూడ వర్ణించి యున్నాడు. తిర్యగ్గతమైన రతియు రసాభాస మని ఆలంకరికమతము. విభావాదుల పరిపుష్టి యున్ననాడు తిర్యగ్గత మయినది మాత్రము రసమేల కారాదు? అనువిషయము రసాభాస ప్రకరణమున విపులముగ వివరింపబడినది. కాన ఇట విడువబడినది.

'ఇంపైన ప్రియకాన నిచ్చి నిల్చిన మధు
 వాదటనాను మత్తాలివిభుని
జెట్టుపల్ పచరించి చుట్టుఁగ్రుమ్మరి మనో
 రమ నియ్యకొలుపు మరాళవిభుని
ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నిచ్చు
 మెయిన చొక్కెడు శుక మిథునములను
గమిఁజూసి తలిరు జొంపమునకు మెయిమెయిఁ
 దాఁకంగఁ జను పికదంపతులను
జూచి చూచి యుల్లంబున నేచి కోర్కు
లడరఁ జిడిముడిపడు భ్రమానుపడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడపడు దురంత
చింతబారికి నగపడు సింహబలుఁడు'

-విరాటపర్వము, ఆ.2, ప.306

అను వర్ణనమును,

ఉద్యోగపర్వము నందలి -

'ఎత్తినవేడ్కఁ గంధరములెత్తి మొగంబులు సాఁచి చూడ్కులం
జిత్తములున్ నిగిడ్చి తమ చెందెడు నిక్కలు రోసి యింపు ద
ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చు కాయ్పులం
జిత్తజకేళిఁదేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్' -ఆ.2, ప.109

అను వర్ణనమును తిర్యగ్గతికి ఉదాహరణములు.

ఇక విరాటపర్వమున నాభాసరూపమున ప్రవర్తించిన శృంగారము– కీచకునికి ద్రౌపది యందు కలిగిన మోహావేశ వర్ణనము. ద్రౌపదిని కీచకుడు కామించినాడు. కాని ద్రౌపదికి అతనిపట్ల అటువంటి భావము లేదు. ఇది ఏకత్రైవానురాగమై రసాభాస మయినది. కేవలము కీచకుని ముఖముగనే శృంగారము వర్ణింప బడినది. కీచకుడు తన అప్పగారికి నమస్కరించుటకై వెడలినవాడై అక్కడ ఉన్న ద్రుపదరాజపుత్రిని చూచుటతో కథ ప్రారంభ మయినది. అక్కజమైన ఆమె చెలువము ఆతని ఆత్మకు దుర్భరమయి ఆతని హృదయమను మృగము కాముడను బల్లిదపు వేటగాని బారి పడినది. చిక్కిన మనమును ద్రిప్ప నశక్తుడై మనోజవికారమగ్నుడై పాంచాలిని పరికించినాడు కీచకుడు.

'వెఱవక ననుఁజూచి వీఁడని యెదఁ గలు
షించిన నొండొండ చెమటవొడమ
ననుచితకృత్యంబు లాచరించు విధాత్ర
బలిమికి నెవ్వేఱపాటు దోఁప
నిచ్చట దిక్కు లేరెవ్వరు నాకను
భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమి యుపాయంబు లేమి నా
ననమున వెల్లఁదనంబు గదుర
... ... ... ...'

–విరా., అ.2,ప.33

నిలచిన ద్రౌపదిని చూచి వివేకహీనుడై-యన్నరాధముడు మదన వికృతిగా దలచి రాగసాగరపూరనిర్మగ్నుడై 'కామీస్వతాం పశ్యతి' అను మాటను సార్థకము నొందించినాడు. మొదట మనోజవికారమగ్నుడు. పిదప రాగసాగరపూర నిర్మగ్నుడు. అనంతరము తమకము మనమున కప్పివేయగా పరితప్తుడు. ఆవెనుక బెగ్గలం బంతకంతకు నగ్గలింప నొదవు చెమటతో చిత్తంబు చెదరినవాడునునై, తుదకు నెందు మెలగ దలపేది ఆసింహహబలుడు 'అనంగుపట్టియాడెడు జంత్రంబు పగిది' నున్నాడు. ఇట్లు కందర్పదర్పగోచరుడైన కీచకుడు తన సోదరి వలన ఆ కోమలి కలరూపు తెలిసికొనినాడు. వెరవుమాలి ద్రౌపదిని సమీపించినవాడై తన అభిలాషనెఱింగించినాడు.

ఆమెయు మెత్తని పలుకుల నాతని వారింప సమకట్టినది. కాని ఆతని ప్రలాపములు 'హద్దు పద్దు'ల నతిక్రమించుటచే నాతని జంకింప నుత్సహించి 'దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫురద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్' ׃విరా., 2-55׃ అని తన పతుల పరాక్రమమును చెప్పి బెదరింప చూచినది. బలగర్వితుడు, దుర్విదగ్ధుడు, రూపాభిమాని అగు కీచకుడు ఊరుకొనక

'... ... నాయతుల బాహు
బలముఁ జెనయంగ భవదీయ పతుల కారు
మూడు లోకంబు లందు నెవ్వాడులేఁడు
నిక్కువంబింత నమ్ముము....'

-విరా.,2-56

అని ద్రౌపదికి సమాధానము చెప్పినాడు. ద్రౌపది 'అందని మ్రాకుల పండ్లు గోయదలచుట హితమే' అని ప్రశ్నించి రావణాదులను దృష్టాంతీకరించి, ఆతని ప్రయత్నము వారింప యత్నింపగా, చిన్నబోయిన మొగముతో, మదనాగ్ని జ్వాలలు దనుకగ, నిట్టూర్పుగాడ్పు దందడి నిగుడ సుదేష్ణ పాలికి జనినాడు కీచకుడు. ఆమె గావించు ఉపదేశమును పెడచెవిని పెట్టి తుట్టతుదకు తన పట్టుదలచే నామె నంగీకరింపచేసి ద్రౌపది తన యింటికి వచ్చునట్లుగావించుకొనినాడు. ఆమె నచట పరాభవింప సమకట్టి తాను పరాభూతు డయినాడు. ఈ సందర్భమున ద్రౌపది సౌందర్యవర్ణనము లన్నియు రసమయములే.

'నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి
యచ్చునఁబెట్టి నట్లుందమొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలు సేసినట్లొప్పు మెఱపి
... .... ... ...' -విరా., 2-52

అని ఆమె అంఘ్రితలములు, కుచములు, ఆననము, కచభరమును వర్ణించినరీతి,

'గండు మీలకుఁ బుట్టి కాముబాణములతోఁ
గలసి యాడెడు నట్టి కన్నుగవయు
... .... .... ...' - విరా., 2-67

అను వర్ణనమును శృంగార రసమయము. ఇక కీచకుడు ద్రౌపది తన ఎదుటకు

వచ్చుటను భావించిన సందర్భము, విరహమునకు లోనైన సందర్భము కూడ శృంగారరసమయములే. కీచకుడు ద్రౌపది యందలి మోహముచే పరితపించినరీతిని తిక్కన –

'కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళఱికెడు
వాలుగుసోగల నేలుదెంచి
కరువలి సుడియమిఁ గదలక చెన్నొందు
నెఱ విరితమ్ముల నుఱకతెగడి
బెడఁగొందఁ దుడిచిమైఁదొడసిన వలరాజు
వాలిక తూపులఁదూలఁదోలి
పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతిపూరించు
క్రొక్కారు మెఱుఁగుల నుక్కడించి
తన విలోచనములు నాదు మనము నాఁచి
కొనఁగ నయ్యింతి ననుఁ గనుగొనియొ నాత్మఁ
గైకొనియె రాగరసమున గడలుకొనియె
మదనవికృతి బయల్పడ నుదిలకొనియె'     –విరా.,2-83

ద్రౌపది నయనముల నాలంబనముగా గొని కీచకుని దుర్విదగ్ధత చేసిన సుకుమారమైన ఊహ యిది. తనయం దేకోశమునను మనసులేని ఆమెను గూర్చి తన వద్దకు వచ్చినట్లు, తనను చూచి మదనవికారము నాపుకొనజాలనట్లు, తన సర్వమును విలోకన మాత్రమున స్వాయత్తము చేసికొన్నట్లు, మధురలజ్జ పొందినట్లు ఊహ చేసినాడు కీచకుడు. ఈవిధముగ కొందలవడు కోర్కులగ్గలించి, చిఱ్ఱుముఱ్ఱాడుచుండఅచ్చెలువ చెలువు తగిలి తన యిచ్చబాఱు చిత్తంబు పజ్జ నరిగినవాడై –

'లీల నాముందట నాలేమ వొలసినఁ
జూడ్కికిఁ జబ్బన చూఱగాదె
కనువిచ్చి నన్నునా తనుమధ్య సూచినఁ
దనువున కమృతసేచనముగాదె
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ
ల్కిన చెవులకు రసాయనముగాదె

యెలమినమ్మె లంత నన్నేలయింపఁ దివిరిన
నెడద కానందంబు నిక్కగాదె
... ... ... ...'     -విరా., ఆ.2,ప.86

అని అనేకభంగుల అనంగవిభ్రమంబులకు అనురూపంబులగు బహువిధ ప్రలాపముల ప్రొద్దు గడుపుచు అమ్మదిరాక్షి రాకకు ఎదురుచూచు చుండెను. ఇట్టి దశలో కీచకుడుండగా సుదేష్ణచే పంపబడిన ద్రౌపది అచ్చటికి వచ్చినది. కాని కీచకుడూహించినట్లు రాలేదు. దానితో నాతని యూహాప్రపంచము తలక్రిందులు కాగా ఉచితానుచితములను కోల్పోయి, రహస్యప్రకాశవిభేద విచారశూన్యుడై ద్రౌపది వెంటబడి కొప్పుపట్టి లాగి పడదన్నినాడు. ఇదియె ఈతని నాశమునకు హేతు వయినది.

కీచకుడు ఉద్యానవన మందు విహరించు సందర్భమున చేసిన వర్ణనములు శృంగార రసమయములు.

'కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు
మాటలఁ దగు మఱుమాట లార్తుఁ
గుచము లురంబునఁ గుదియుంచి క్రమమున
నిఱిసిన కౌఁగిట నింపానర్తు
నంగుళంబుల నల్లనలకలు గబళించి
కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్వ
మనము మనంబున బెనఁచి కేళికిఁ జొచ్చి
సతిఁదేల్తు సౌఖ్యరసంపు నిట్ట
దనివు మొదలైనఁ జిగురొత్త తమకమునకుఁ
బ్రాఁకువెట్టుచు మగుడఁ బైఁబడుచు వింతి
వింతభంగుల కెలయించి వెకలిఁజేసి
యభిమత క్రీడనములకు నలవరింతు'[4]     -విరా.,ఆ.2,ప.310

అను వర్ణన మెంతయు శృంగార రసమయము. ఈ విధముగ తిక్కన ఎంతటి విపులమగు శృంగారరస వర్ణనము చేసినను చివరి కది అభాసమయి 'ఏకత్రైవానురాగః' అను నాలంకారిక నియమమునకు తార్కాణమయినది. కీచక విషయమున వర్ణితములైన మోహవికారాదులును, విరహమును శృంగారాభాస పోషకములైనవి. పరసతిని కామించిన

నీచకాముక చిత్తప్రవృత్తి వర్ణనము శృంగార రసపోషకము కాజాలదు. రతి అనుస్థాయిభావము ఉభయనిష్ఠ మయినపుడే అనుభావాదులచే పోషితమై శృంగారరసముగ పరిణమించును. ఇట రతి అనుభయనిష్ఠము కావున ఏకత్రైవానురాగ మగుటచే నిది రసాభాస మయినది.

ఇక ఈతడు చేయు ప్రకృతి వర్ణనములును శృంగారమయములే. ఉదాహరణమునకు ప్రభాతకాలవర్ణనమున, తిక్కన రచన –

'పెనఁకువఁ దనిసిన తనువు లొండొంటితోఁ
గీలించి నిద్రించి మేలుకాంచి
తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ
బొలయు వేఁబోకటి మలయపవను
నింపారు చోఁకున నిగురొత్తు చిత్తంబు
లెలసి యొండొరులపైఁబొలయు చూడ్కి
లాదట నుపకరణావలి వెడవెడ
యాదరించుట రాగమడరఁ దొడరి
కేళి సలిపిరి ... ... ...' –విరా., 2–238

అనురీతిని శృంగార రసోత్కర్షకము.

ఎంతటటి శృంగార వర్ణనము చేసినను ఔచిత్యమును వీడనివాడు తిక్కన. ఆ తన్వంగి తనులత, కిసలయ హస్తకెంగేలు, కమలాస్య ముద్దుమొగము, ధవళాక్షి తొంగలి తరచు రెప్పల చెన్ను, అనురీతిని భావగాంభీర్యములగు విశేషణములతో ప్రధానావయవములను, బాహ్యదృష్టికి నగపడెడు ముఖ్యావయవములను మాత్రమే వర్ణించినాడు కాని తన కర్వాచీనులైన ప్రబంధకవుల వలె నఖశిఖపర్యంతము వర్ణింపలేదు. శృంగార మనునది అవయవముల యొప్పులోనే కా కవాని వలన వ్యక్తము చేయబడు నాంతరంగిక గుణసంపద యందే యున్నదని ఘోషించువాని వలె తనులత కాంతి, మొగంబులే మెఱుగుల మొత్తము, మున్నగువానినే ప్రశంసించినాడు. సౌఖ్యరస, రాగరస పదములను శృంగారరస పరముగ వాడినాడు. రస శబ్దము వాచ్యము చేయుట దోషమగునో కాదో ఆ ప్రకరణము నందు వివరింపబడినది కావున ఇట విడువబడినది.

తిక్కన గారి శృంగార రసపోషణ విషయమున గల విశేషమును గూర్చి

ఆచార్య కేతవరపు వారు చెప్పిన మాటలు సముచితములు. ఇచ్చట స్మరణీయములు. 'కరుణము వలె శృంగార మెచ్చటను స్థాయి నందుకానలేదు. అందుకొనకపోవుటయే భారతమునకు కావలయును. అంగరసముల పరిమితి నెరిగి తిక్కన గారు రచన చేసిరి. స్త్రీల మనోవికారములను వర్ణించకుండ, పురుషుల చిత్తవృత్తిని వర్ణించి స్త్రీల విషయమును సహృదయుల బుద్ధికి వదలుట తిక్కన్న గారి శృంగార వర్ణనము నందున్న ఏకైక విశేషము'.[40]

ఈరీతిగా తిక్కన గారి భారత భాగమున శృంగారరసముతో పాటు శృంగార రసాభాసమును చోటుచేసికొన్నది.

40. తిక్కన కావ్యశిల్పము, పు.487

# 6వ ప్రకరణము

## హాస్యరసము – తిక్కన భారతము

### హాస్యరసము :

హాస్యము నవరసములలో రెండవది. ఇది హాసస్థాయికము. శ్వేత వర్ణము. ప్రమథ దైవతము. 'అపారమగు నీ యాంధ్రసారస్వతమున నిది చాల కొలదిగా గలదు. మృగ్యమని చెప్పుటయు సాహసము కాకపోవచ్చును. శృంగారరస మేమి పుణ్యమొనరించెనో కాని యాంధ్ర కవిపుంగవులచే నది గన్నమన్ననలో సహస్రాంశమైన మిగిలిన రసములు నోచి యుండలేదు'[1] అని శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారి నుడి. ప్రబంధము లందు హాస్యము 'కొత్తిమిరి' ప్రాయముగనైన లేదని, హాస్యప్రధానములగు కావ్యములు తెనుగులో తక్కువగుటకు గల కారణము సంప్రదాయదాస్యమని – ఇట్లు పలువురు పలురీతులుగ తమ తమ లభిప్రాయములను తెలిపి యున్నారు. నవరసపోషిత మని పేర్వడసిన మహాభారతము నందు సహితము ఈ హాస్యము తక్కువగనే అనగా ఏ ఒకటిరెండు తావులందో తప్ప అధికముగా కానదారని పలువురు తలంచిరి. దీనిని తదుపరి పరిశీలింతము.

భరతుని నాట్యశాస్త్రమున దీని సంబంధమగు గద్యయును, ఆర్యలును గలవు. ఇది హాస మనెడి స్థాయిభావము నండి జనించును. వికృతములైన పరవేషాలంకారము, ధార్ష్ట్యము (నిర్లజ్జత), లౌల్యము (విషయము లందు అనియతత్వము), కుహకము (చక్కిలిగింతలు పెట్టుట), అసత్ప్రలాపము, అంగవికలులను చూచుట, అనిమిత్త భయాదులను, అకార్యకరణములును, వికృతవేషాదులను వర్ణించి చెప్పుట మున్నగు

---

1. ఆంధ్రసారస్వత వ్యాసావళి – ఆంధ్రసారస్వతము – హాస్యరసము

విభావముల వలన హాస్యరసముత్పన్న మగును. పెదవులను, ముక్కులను, చెక్కిళ్లను స్పందింపచేయుట, కనులను కొలదిగా మూయుట, విప్పారచేయుట, స్వేదము ముఖరాగము, రెండు చేతులతో తన ప్రక్కలను పట్టుకొనుట అను విభావములచే దీని నభినయింప వలెను. అవహిత్థము, తంద్ర ఃమోహముః, నిద్ర, స్వప్నము, ప్రబోధము, అసూయ మున్నగునవి వ్యభిచారులు.

'విపరీతాలంకారైః వికృతాచారాభిధాన వేషైశ్చ
వికృతైరంగ వికారైః హసతీతి రసః స్మృతో హాస్యః
వికృతాకారైర్వాక్యైరంగ వికారై వికృత వేషైశ్చ
హాసయతి జనం యస్మాత్తస్మాత్ జ్ఞేయో రసో హాస్యః'[2]

విపరీతములైన అలంకారములు, వికృతములైన ఆచారములు, నామములు, వేషములు, వికృతము లైన అంగవికారములు అనువానిచే లోకము హసించును. కావున హాస్యము రస మయినది. వికృతాకారములు, వికృత వాక్యములు, అంగవికారములు, వికృత వేషములు హాసమును కలుగజేయును. కాన హాస్యము రస మగునని తెలియవలెను.

## ఉత్తమ మధ్యమ నీచ హాస్యములు :

'స్త్రీ నీచప్రకృతావేవ భూయిష్ఠం దృశ్యతే రసః
షడ్భేదాశ్చాస్య విజ్ఞేయాస్తాంశ్చ వక్ష్యామ్యహం పునః
స్మిత మథ హసితం విహసితముపహసితం చాప హసిత మతిహసితం
ద్వౌ ద్వౌ భేదౌ స్యాతా ముత్తమ మధ్య మాధమ ప్రకృతౌ'[3]

స్త్రీ నీచప్రకృతులం దిది అధికముగా కన్పట్టును. స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము అని ఇది ఆరుభేదములు. వీనిలో మొదటి రెండును ఉత్తమప్రకృతుల ందును, మధ్య రెండును మధ్యమ ప్రకృతులందును, చివరి రెండును అధమ ప్రకృతు లందును అభివ్యక్తము లగును.

స్మితము ఉత్తమ ప్రకృతిస్థము. అది ఉత్తమ ప్రకృతి యందు సంక్రమించినచో హసిత మగును. అట్లే విహసితము సంక్రమణము వలన నుపహసితము, అపహసితము సంక్రమింపగా నతిహసితము నగును. దీనిని మరొకతీరున గూడ చెప్పికొనవచ్చును. స్మితము కొలదిగా తగ్గిన హసితము, హసిత మతిశయించిన విహసితము, విహసితము

2. నాట్యశాస్త్రము, అ.6, శ్లో॥49, 50
3. నాట్యశాస్త్రము, అ.6, శ్లో॥51, 52

పరస్పర సమీవస్థమైన నుపహసితము, ఉపహసితము పెచ్చరిల్లిన అపహసితము, అపహసితము మితిమీరిన అతిహసితము నగును. ఇట్లు వీనిలో నుపసర్గభేదమున అర్థభేదము నిష్కృష్టము. వీని స్వరూపములు ఈక్రిందివిధములుగా నుండవలెను.

'ఈషద్వికసితై ర్గండైః కటాక్షైః సౌష్ఠవాన్వితైః
అలక్షిత ద్విజం ధీరముత్తమానాం స్మితం భవేత్'
'ఉత్ఫుల్లానన నేత్రంతు గండై ర్వికసితై రథ
కించిల్లక్షిత దంతంచ హసితం తద్విధీయతే'

–నాట్యశా., అ.6, శ్లో.54, 55

చెక్కిళ్ళు కొంచెము వికసించుట, కటాక్షములు సౌష్ఠవమును కలిగి యుండుట, పలువరుస కనబడకుండ గంభీరముగ నవ్వుట స్మిత మగును. చెక్కిళ్ళు వికసించి కనులును, ముఖమును, బాగుగా విప్పారి, పలువరుస కొంచెము కనబడునట్లు నవ్వుట వలన అది హసిత మగును.

'ఆకుంచితాక్షి గండం యత్ సస్వనం మధురం తథా
కాలాగతం సాస్యరాగం తద్వై విహసితం భవేత్'
'ఉత్ఫుల్ల నాసికం యత్తు జిహ్మ దృష్టి నిరీక్షితం
నికుంచితాంసక శిర స్తచ్చోపహసితం భవేత్'

–నాట్యశా.,6–56, 57

కనులును, చెక్కిళ్ళను కొంచెము ముడిచి సముచిత సమయము నందే నవ్వుచు, ముఖరాగ, మధురస్వరములతో కూడియుండిన అది విహసిత మగును. ముక్కుపుటములు విప్పారి, చూపులు వక్రముగా నుండి అంసములను,శిరమును ముడుచుకొనిన అది ఉపహసిత మగును.

'అస్థాన హసితం యత్తు సాశ్రునేత్రం తథైవచ
ఉత్కంపి తాంసక శిరస్తచ్చాపహసితం భవేత్'
'సంరబ్ధసాశ్రునేత్రంచ విక్రుష్టస్వర ముద్ధతం
కరోపగూఢ పార్శ్వంచ తచ్చాతిహసితం భవేత్'

–నాట్యశా., 6–58, 59

అస్థానమందు అనగా శోకాదిసమయము లందు నవ్వు వచ్చుట, కనుల నుండి నీరు కారుట, అంసక శిరములు పైకెగురు చుండుట – ఇట్టిది అపహసిత మనబడును.

కనులలో తొట్రుపాటుండి, అశ్రుసహితములైస్వరము శ్రుతి కటువుగాను నుద్ధతముగాను ఉండిన అది అతిహసిత మగును. ఇందు నవ్వునప్పుడు చేతులతో తన ప్రక్కలను పట్టుకొనవలెను.

## ఆత్మస్థ పరస్థములు :

'ఇత్యేష స్వసముత్థస్తథా పర సముత్థశ్చ విజ్ఞేయః
ద్వివిధః త్రిప్రకృతిగతః త్ర్యవస్థభావో రసోహాస్యః'

-నాట్యశా; 6-61

ఆత్మసముత్థ, పరసముత్థ భేదముచే రెండువిధము లయిన ఈ హాస్యము ప్రకృతిత్రయ గతమై అవస్థాత్రయమును కలిగి యుండును. అసంక్రాంతము లగు స్మిత విహసితాపహసితములు పరసముత్థమలు. సంక్రాంతములగు హసితోపహసితాతి హసితములు స్వసముత్థములు. స్వపర సముత్థముగా ద్వివిధమయిన ఈ హాస్యము ఉత్తమ మధ్యమాధమ ప్రకృతి ననుసరించిన దగుటచే త్రిప్రకృతికము, స్మితాది భేదమున త్ర్యవస్థభావమును అగును.

ఆత్మస్థము, పరస్థము అను భేదములచే హాస్యము రెండువిధములు. తానే నవ్వినచో అది ఆత్మస్థ మగును. ఆత్మగతము లయిన వికృతవేషాది విభావములచే విదూషకుడు తానే హాసము కలవాడయిన అది ఆత్మస్థము. అతడు వానిచే రాణిని నవ్వింపగా నప్పుడు అది ఆమెకు పరస్థ మగునని కొందరు చెప్పుదురు. కాని ఇది సరికాదు. 'ఒకడు నవ్వునపుడు వానిని చూచి వేరొకడు తాను విభావములను గాంచకపోయినను నవ్వుట లోకమున గోచర మగుచున్నది. ఒక్కొక్కచోట విభావాదులను గుర్తించినను గాంభీర్యమున నవ్వకపోవుట యున్నది. అట్లు నవ్వనివారు కూడ పరకీయహాస మవలోకించి యాక్షణమున హాసవిశేషము కలవారగుట లోకస్వభావముగనే యున్నది. అమ్ల దాడిమాది రసాస్వాదము సంక్రమణ స్వభావ మగుట సర్వప్రసిద్ధము. ఒకరు దాడిమాస్వాదము చేయునప్పుడు వేరొకరికి దంతోదక వికారము కలుగును. ఇదియె సంక్రమణస్వభావ తత్వము. హాసమును సంక్రమణస్వభావము. సంక్రమణశీలు నందు సంక్రమించును. ఆత్మస్థ పరస్థ విశేషము నిట్లే గుర్తించుట, నిశ్చయించుట సముచితము'[4] అని నాట్యవేదము. దీని సారాంశము నొక్క వాక్యములో చెప్పవలె ననిన తాను ప్రత్యక్షముగా హాస్యకారణమును

4. నాట్యవేదము

గుర్తించి నవ్వుట ఆత్మస్థము. సంక్రమణము వలన కలిగినది పరస్థము.

సాహిత్యదర్పణమున 'వికృతమైన యాకారము, భాష, చేష్టలు మొదలగునవి గల నర్తకుని వలన హాసము స్థాయిగా గల హాస్యరసము కలుగును. ఇది శ్వేతవర్ణము. ప్రమథదైవతము ః నరసభూపాలీయకర్త గణనాథుని అధిదైవతముగ చెప్పెను ః. జనుడు వికృతాకార వాగ్వేష చేష్టాదులు గల ఎవనిని చూచి నవ్వునో అతడు ఆలంబన విభావము. వాని చేష్ట ఉద్దీపన విభావము. అక్షి సంకోచము, వదనస్మేరత ఇత్యాదులు అనుభావములు. నిద్ర, ఆలస్యము, అవహిత్థము, చాపల్యము, అవేగము మున్నగునవి వ్యభిచారులు'[5] అని ,చెప్పబడినది. ఈ రసవిషయముననే కాక ఈ రసావాంతర భేదముల విషయము నను సాహిత్య దర్పణము నాట్యశాస్త్రముతో ఏకీభవించు చున్నది.

ధనంజయుని దశరూపకము గూడ 'నిద్రాలస్య శ్రమగ్లాని మూర్చాశ్చ సహచారిణః ' ః4-79ః అని ఈ రసవిభావాది సామగ్రి విషయమున నాట్యశాస్త్రముతో నేకీభవించుచునే యున్నది. కావ్యానుశాసన, నాట్యదర్పణ, రసార్ణవసుధాకర కర్తలు పై అలంకారికులతో నేకీభవించు చున్నారు. రసగంగాధరమున శృంగార శాంతకరుణరౌద్రములకు మాత్రము నిర్వచనము లీయబడి, మిగిలిన వీరాద్భుత హాస్య బీభత్స భయానకములను గూర్చి-

'ఏవం యస్యాశ్చిత్తవృత్తియో విషయః సతస్యా ఆలంబనం, నిమిత్తాని చోద్దీపకా నీతిబోధ్యమ్'[6] అని చెప్పబడియున్నది.

క్రింది వ్యాఖ్యానము మాత్రము --

'హాస్యరసస్య వికృత వాగాది మత్పురుషాదిరాలంబనం, తద్వికృతి రుద్దీపనమ్, రదన ప్రకాశాదిరనుభావః, శ్రమోద్వేగాదిశ్చ వ్యభిచారిభావః' అని గలదు.

పై యాలంకారికుల నిర్వచనానుసారము వికృతమైన ఆకారచేష్టాదుల వలన హాస్యము కలుగుననియు, వికృతాకారచేష్టాదులు గలవి ఆలంబనము కాగా వాని లేదా వారి చేష్టలు ఉద్దీపనములుగా నుండునని, కన్నులు చికిలించుట, ముఖమున స్మేరత - ఇత్యాదు లనుభావము లనియు, నిద్రాలస్యాదులు వ్యభిచారులనియు,ఆత్మస్థ పరస్థ భేదముచే ద్వివిధము లనియు, ఉత్తమ మధ్య మాధమ ప్రకృతుల నాశ్రయించి

---

5. సాహిత్యదర్పణము, అ.3, శ్లో॥ 214-17
6. రసగంగాధరము, ప్రథమాననము

షడ్భేదయుత మనియు తెలియుచున్నది. భరతుడు 'అంగనేపథ్య వాక్యైశ్చ హాస్యరౌద్రౌ త్రిథాస్మృతౌ' ꞉నాట్యశా., 6-77꞉ అని అంగ నేపథ్యవాక్యములచే హాస్యము త్రివిధములని చెప్పినాడు.

శృంగారాది విషయమున శకుంతలా దుష్యంతాదుల శృంగారమును చూచి, తదభేదముతో రసాస్వాదమును ఎట్లు చేయుచున్నాడో, అట్లే హాస్యరసాస్వాదమును చేయవలసి యున్నది. కాని హాస్యాదులగు కొన్ని రసములకు అట్టి నాయకాదులు నిబంధింపబడుట లేదు. అట్టిచో రసోదయ మెట్లగునని ఆశంకించుకొని సన్నిధానము వారిట్లు సమాధాన మిచ్చి యున్నారు.

'యస్య హాసః సచేత్క్వాపి సాక్షాన్నైవ నిబధ్యతే
తథాప్యేష విభావాది సామర్థ్యాదుపలభ్యతే
అభేదేన విభావాది సాధారణాత్ప్రతీయతే
సామాజికైస్తతో హాస్య రసోఽయ మనుభూయతే'[7]

నాటకాదు లందు నవ్వుచున్న నాయకుడు సాక్షాత్తుగా నిబంధింపబడకపోయినను, ప్రత్యక్షముగా కానరాకున్నను, సామాజికుని యాంతరదృష్టికి నవ్వుచున్న నాయకుడు కనపడి, వానితో సామాజికు డభేదమును పొంది రసాస్వాదమును చేయును.

ఈ హాస్యరస విషయమై పలువురు విమర్శకుల అభిప్రాయము లెట్లున్నవో చూతము. 'హాస్యరస నిర్వచనము చాల కష్టతరము. నిజమైన హాస్యము మొదటి నుండి పుట్టినది కాదు. హృదయము నుండి స్రవించునది. హాస్య మన వెక్కిరింత కాదు. దాని సుస్వరూపము ప్రేమ. పెద్దపెట్టున గలగల లాడుచు వచ్చుచున్న నవ్వుకన్న సద్దుచేయని చిరునవ్వులోనే దానిలోతు మనకు తెలియును. అని ఆంగ్లరచయిత కార్లయిలు నిర్వచనము. దీనిని పాశ్చాత్యులు మూడుభాగములుగా విభజించినారు - 1.ఉత్తమహాస్యము, 2. చమత్కృతి (Wit) , 3. వ్యంగ్యము (Satire)[8]' అని. శ్రీమతి వేదవల్లి తాయారు గారు తమ గ్రంథమున చెప్పియున్నారు. వీరి అభిప్రాయము లింకను ఇట్లున్నవి. 'విశ్వశ్రేయః కావ్యమ్మ'ను భావము గల మనవారు తేలికరకపు హాస్యముచే ఆనందపరుచుటకు పూనుకొనలేదని, ఉన్నతాశయ ప్రబోధమున కితర మార్గముల నవలంబించినారని, కాని హాస్యము నవరసములలో

---

7. కావ్యాలంకారసంగ్రహము, పు.434
8. తెనుగుసాహిత్యములో హాస్యరసము

నొకటి యగుటచే, దీనికి కొంత అయినను కావ్యములలో స్థానమునీయక తప్పలేదని, గ్రంథమాద్యంతము విపులమగురీతిని చూపించిన రమ్యముగానుండకపోగా వెట్టి ఎత్తినట్లుండునని, సాహితీ ప్రపంచము నందు కథాకావ్యాది ప్రక్రియలందెందు చూచిన హాస్యము కథాసంవిధానమున కంగముగానే ఉపయోగపడుచున్నది కాని ప్రాధాన్యము వహించుటలేదని, హాస్యము వలన నవ్వు నివ్వటిల్లవలెనే కాని ఇతర రసములు ఉత్పన్నము కారాదని, కవిత్వమునకు వలె దీనికిని వ్యంగ్యము ప్రధానమని ప్రసాదగుణ మెక్కువగా నుండవలె నని, లేనిచో నిం దాశ్లీలాదుల కాకరమై ఒరుల మనసు బాధించునని ఉత్తమహాస్య మయినచో ఆపాతమధురమై మానసికోల్లాసము కలిగించునని చెప్పియున్నారు. ఇంకను 'వెట్టిగొల్లలు, వేశ్యమాతలు, సుబ్బిశెట్లు, సాహెబులు, బొజ్జబాపనయ్యలు, విదూషకులు, హాస్యమునకు పాత్రలు అగుదురు. మానవజీవితములోని ఒక్కొక్క విషయము, ఒక్క సుందరమైన సత్యము. ఒక్క మధురానుభూతి. ఒక్క గిలిగింత. మాటల నుచ్చరించుటలోని మార్పు,ఒక్క యూపు, ఒక్క మెలిక, ఒక్క వింతచేష్ట, అప్రయత్నముగా లభించిన యొక తీవ్రభావము హాస్యమునకు వస్తువు. జీవితమార్గములోని మలుపులు, తిరుగుళ్లు, విపరీతపు టూహలు పోకడలు, భావములలోని వింత వింత పరుగులు కూడ హాస్యమునకు వస్తువులే'[9] అని చెప్పియున్నారు.

శ్రీ ముట్నూరి సంగమేశం గారు హాస్యసృష్టికై మన కవు లవలంబించు మార్గములను కొన్నిటిని తెలిపి యున్నారు. - 1. శబ్ద సంబంధమగు వికృతి, 2. అర్థసంబంధమగు వికృతి, 3. కథాగతిలో వక్రత చేకూర్చి ఘటనావికృతిని కల్పించుట, 4. ఆలంబన వర్ణనము, 5.రసాభాసాదుల్ని కల్పించుట. అన్యరసములలో నేర్పడిన రసభంగము వలన కూడ హాస్యము జనింపచేయవచ్చు ననియు చెప్పిరి.హాస్యమును జనింపచేయుట కష్టము కాకపోవచ్చునే కాని, అందౌచిత్యమును పాటించుట కష్టమనియు, కనుకనే మన పూర్వకవులు దానినంతగా పోషింపలేదనియు వీరు అభిప్రాయపడిరి. వీరు తమ గ్రంథమున నవ్వుకలుగుటకు గల కారణములనిట్లు ప్పియున్నారు - 'కొన్ని విషయాలు చూచినపుడు లేదా వినినపుడు లేదా తలచినపుడు ఆయా విషయాల్లోఉండే వికారము, వైపరీత్యము, వైషమ్యము, అతివాస్తవికత,

9. తెనుగు సాహిత్యములో హాస్యరసము

అసహజత్వము, మొదలైన గుణాల వలన మనకు నవ్వు పుట్టును'.[10] ఇంకను అసహజమును సహజముగ భావించినను, సహజమును అసహజముగ భావించినను, అలవాటులో వచ్చిన పొరపాటు వలనను మిధ్యాభిమానము, స్వార్థపరత, అసూయ, మొదలగు గుణములలో నుండు నిస్సారత, కుత్సితత్వము, అన్యాయము, మొదలగునవి చూచిన గాని, చూపించిన గాని, నవ్వు కలుగుననియు చెప్పియున్నారు.[11] శ్రీ సంగమేశం గారు హాస్యరసమున కితర రసములతో గల సంబంధమును గూర్చి చెప్పుచు దీనిని శృంగార వీరముల కంగముగ ప్రయోగింప వచ్చుననిరి. రసవిరోధమును నిర్వహించుపట్ల కూడ నీ హాస్యమునకు తావు గలదు. కరుణ శృంగారములకు, శృంగార భయానకములకు, శృంగార రౌద్రములకు, వీర శాంతములకు మధ్య అంతరమును కల్పించుచు ఉదాసీన రసముగ హాస్యమును ధ్వనింపచేయుట మనవారి విరుద్ధ రసనిర్వహణలో తరచుకన్పించు విశేష మని చెప్పిరి'.[12] వీరి మాటలలోచెప్పవలె నన్న 'హాస్యం లేనిదే శృంగారంలో సరసత అనేదే ఉండదు. అయితే ఈసిద్ధాంతం చాలవరకు దుర్వినియోగం కూడ చేయబడింది. అసభ్యశృంగారాన్ని హాస్యమని గ్రహించి అసలు హాస్యాన్నే అపహాస్యంపాలు చేసిన రచనలు కూడ మనకు దొరకుచున్నాయి. మితిమీరిన హాస్యం శృంగారాన్ని రసాభాసగా మార్చిన పట్లు మన సాహిత్యంలో ఎన్నో ఉన్నాయి. శృంగారంలో వలె హాస్యం భక్తి, వాత్సల్యం, స్నేహం, బంధుప్రీతి మొదలగు భావాలన్నింటిలోను మైత్రి నిర్వహిస్తుంది'[13] అని చెప్పియున్నారు. ఈరీతిగా వీరు అనన్యసామాన్యమగు కృషి సల్పినవారై తమ గ్రంథమున హాస్యరస విషయములను సోదాహరణముగ విపులీకరించి యున్నారు.

'ఈ హాస్యమును అనేకవిధములుగ ప్రదర్శింప వచ్చును. పాత్రల శరీరము యొక్క గాని, అవయవముల యొక్క గాని వైకల్యముచే కలిగించు హాస్య మొకవిధము. పాత్రల యవయవ సంఘటనమున నేదేని వాని యాకారమున సాధారణరూపము కంటె భిన్నమయిన వింతదనము గోచరించినపుడు హాస్యము జనించును. పాత్రల శీలము లందలి పూర్వాపర వైరుధ్యము వలన కూడ హాస్యము జనించును. ఏదైన ఘనకార్యము నొనర్చెదనని ప్రతిజ్ఞా వాక్యములు పలికి అట్లు చేయలేక తద్విరుద్ధముగా

10. తెలుగు హాస్యము, పు.1
11. పైది ,పు.2
12. పైది , పు.17
13. తెలుగు హాస్యము, పు.17

వర్తించుటయు, దురాశచే అందని ద్రాక్షపండ్లకై అర్రులు చాచుటయు, హృదయము నందలి నిజమైన అభిప్రాయమును కప్పిపుచ్చి, సమయానుకూలముగ నెదుటివారి స్వభావము ననుసరించి కపటముగా మాట్లాడుటయు - శీలసంబంధి హాస్య కారణము లగును. వేషాంతరధారణ కారణముచే పాత్రల ఒండొరుల నెరుగక పోయినపుడు పరస్పర విరుద్ధములగు పాత్రలు కలిసి ప్రసంగింప వలసి వచ్చినపుడు కూడ హాస్యము గోచరించును. సమయోచితముగ పదముల నన్యార్థస్ఫూర్తి కలుగునట్లు ప్రయోగించుట కూడ హాస్యరసమును కలిగించును. పదోచ్చారణము సరిగా లేకపోవుట వలనను, అడిగిన ప్రశ్నకు విరుద్ధమగు సమాధానము నొసంగుట లేదా అన్యాపదేశముగ పాత్రల నపహసించుట వలనను, సాధారణ మానవ ఆచారములకు భిన్నముగ పలుకుట వలనను పదజనిత హాస్యము కలుగును'[14] అని ఆచార్య దివాకర్ల వారి అభిప్రాయము.

ఆచార్య నరసింహంగారు హాస్యము మనుష్య ప్రకృతికి దర్పణము వంటిదని చెప్పి దీనిని వ్యక్తీకరించుటలో తిక్కన చూపిన చమత్కృతి విశేషము లనేకములు కలవనిరి. మానవ ప్రకృతికి సహజమగు నవ్వులోని వైవిధ్యమును తేటతెనుగు మాటలలో తెలుగువారి హృదయము అందు నాటుకొనినట్లు కవిబ్రహ్మ వ్యక్తము చేసెననియు చెప్పిరి.[15]

శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారు తిక్కన గారి యిరువది నవ్వులను తమ వ్యాసమున సోదాహరణముగ నిరూపించిరి. అవి పిన్ననవ్వు, చిరునవ్వు, అల్లనగవు, అలతినవ్వు, మందస్మితము, హర్షమందస్మితము, ఉద్గతమందస్మితము, జనితమందస్మితము, అనాదరమందస్మితము, కలకలనవ్వు, వెలుచనవ్వు, ఉబ్బుమిగిలిన నవ్వు, కన్నులనవ్వు, కన్నుల నిప్పురాలు నవ్వు, ఎలనవ్వు, కినుక మునుంగు నవ్వు, నవ్వుగాని నవ్వు, ఎట్టినవ్వు, కటిక నవ్వు, కినుకబూనిన నవ్వులు. గౌరన విశేష ప్రచారములోనికి తెచ్చిన పకపకనవ్వు కాని, శ్రీనాథుడు విరివిగా వాడిన ముసిముసి నగవు కాని ఈతడు వాడియుండలేదు. అనియు, శృంగారఘట్టము అందు తిక్కన స్త్రీ పాత్రలకు ప్రాయికముగ ఎలనవ్వు, అల్లనవ్వు మొదలయిన మృదుహాస్యములు

---

14. ఆంధ్రనాటక పితామహుని హాస్యరసపోషణ - పరిశోధన పత్రిక, 1955-56
15. తిక్కన భారతము - నాటకీయత, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, 1959-60, సంపుటి 48, సంచిక 1,2

హత్తించుననియు, ఈతనిని చూచి తరువాతి తెలుగు కవులు పలువురు ఆతని నవ్వులను తమ కావ్యము లందు సంతరించు కొన్నారనియు ఈ పలువిధములైన నవ్వులతో నీతడు తన పాత్రల వ్యక్తిత్వమును లెస్సగ పరిపోషించుకొనినాడనియు చెప్పిరి.[16] నవ్వులకు తిక్కన వంటి వ్యాఖ్యాత 'నభూతో న భవిష్యతి' [17] అను నండూరి వారి మాట ఎంతయు సత్యము. ఈ రీతిగా తిక్కన నవ్వులపై నిటువంటి విపులమగు విమర్శన ముండుటచే నిక నెట్టి విమర్శనము చేయనవసరము లేదు.

ఉదాత్త గాంభీర్య లోప భయ కారణమున మన ప్రాచీనులు విశేషముగ నాద్యంత హాస్యప్రధాన కావ్యములను వ్రాయలేదనియు, అవకాశము కల్గినప్పుడెల్ల అక్కడక్కడ మాత్రము ఔచిత్యమును పాటించుచు తమ కావ్యములలో హాస్య రసమును పాలింపక జారవిడువలేదనియు, హాస్యరసము వినోదమును కూర్పగలదు కాని వీర శృంగార రసముల వలె విగళిత వేద్యాంతరమైన నిర్భర గంభీర రసానందమును గూర్పలేదనియు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి గారి అభిప్రాయము.[18]

'సంస్కృతాంధ్రసాహిత్యము లందు హాస్యరసపోషణము ప్రధానముగా శృంగారమునకు అంగముగనే జరుగుచు వచ్చినది. ఇది విదూషక ఆలంబనముగ నుండి, వేషము, భాష మున్నగువాని వలన పోషింప బడును. సమర్థులగు కవులయినచో సన్నివేశములను కూడ హాస్యరసపోషకములుగ చేయగలరు. హాస్యము లలితము, సుకుమారము అగు రీతి నుండి వెగటు కలిగింపని విధముగ నుండవలెను. హాస్యమునకు సర్వజనాహ్లాదకరమై, పాఠక ప్రేక్షక హృదయములను సులభముగ నాకర్షించి తన్మయత్వము కూర్చు శక్తి కలదు'[19] అని శ్రీ యడవల్లి ఆదినారాయణ గారు అభిప్రాయపడిరి.

విట్టు, హ్యూమరు అను ఆంగ్లపదములకు సరియైన ఆంధ్ర పర్యాయపదములు లేవని, మాటల విరుపులచేత ధ్వనిగర్భితములగు పదముల కూర్పుచేత, సూక్ష్మ భేదములు గల యీ రెండును ఉత్పాదిల్లి రసప్రదములై కావ్యము లందు గన్పట్టునని,

16. తిక్కన నవ్వులు, భారతి, 1941, ఫిబ్రవరి, సంపుటము 18, సంచిక 1, పు.165
17. తిక్కన- భారతదర్శనము, పు.445
18. ఆంధ్రకావ్యములు - హాస్యరసము, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, 1959-60, సంపుటము 49, సంచిక 1, పు.67
19. తిక్కన శిల్పపు తెనుగుతోట, భారతి, 1957 సెప్టెంబరు, సంపుటి 34, సంచిక 9, పు.17

విట్టనిన చమత్కారమని, హ్యూమ రనిన హాస్యమని, హాస్యమన నవ్వును కలిగించునట్లు విషయములను గూర్చి గాని, పరిస్థితులను గూర్చి గాని, పాత్రములను గూర్చిగాని, చతురముగ మాటలాడుట లేక వ్రాయుట అని, చమత్కారము కేవలము మాటల పొందిక కాగా, హాస్య మాలోచనతో చేసెడి పని అని, చమత్కారము కంటె హాస్యమునం దెక్కువ మానవ స్వభావగ్రహణమును, వస్తు స్వభావగ్రహణమును కలదని శ్రీ సాగి వేంకట నరసింహంగారు తమ వ్యాసమున హాస్యరస సంబంధమగు నీ యభిప్రాయములను వెలువరించియున్నారు.[20]

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తమ వ్యాసమున హాస్యరసము మానవుని యందే కనిపించుచున్నదని చెప్పి, ప్రాచీనులైన భరతాదుల అభిప్రాయములతో పాటు పాశ్చాత్యుల అభిప్రాయములను కూడ చెప్పియున్నారు. 'ఒక విషయమును గూర్చి ఆశపెట్టుకొని నిరీక్షించుచుండగా నిరాశ కలుగగా వచ్చునది నవ్వు అని కాంట్ (Kant )చెప్పియున్నాడు. రాబేలే (Rabelais) చిత్రించిన హాస్యమున వ్యక్తిత్వము గలదు. జీవితముపై ద్వేష మొంచుకొనరాదని బోధించుచు, దోషభూయిష్ఠమగు జగమును స్వీకరించి అందు నిద్రించు శక్తులను మేల్కొలుపు ప్రతి జీవి యందు హాస్యశక్తి యుండుటచేతనే ప్రాణము ధరింపబడు చున్నదని తెలుపుచున్నాడు. ఇతరులు కాశాభంగము కాని, అపజయము కాని కలుగగా మన మనుభవించు నాకస్మికమగు నాధిక్యభావమే హాస్యకారణమని హాబ్స్ (Hobbes) అభిప్రాయము. షోవెనావెర్ (Schopenhaver), మెరెడిత్ (Meredith) ప్రభృతులు. వైపరీత్యమును, భావసంఘర్షణను హాస్యమున ప్రధానముగ గ్రహించిరి. విపరీతములు, అసంబద్ధములు నగు భావములకు గల తాత్కాలిక సమ్మేళనము వలన మానసికమగు హాసము వచ్చుచున్నదని వీరి వాదము. ప్రతివ్యక్తిని తత్పరిసరముల కనుగుణముగ ప్రవర్తింపచేయుట కుపకరించునది హాస్యమని, సాంఘికజీవన మందలి ప్రయోజనములను నిర్వర్తించుటకు హాస్య ముపయోగించుచున్నదని బెర్గ్సన్ (Bergson) వాదము'[21]. శ్రీ పోతుకూచి వారి అభిప్రాయానుసారము దార్శనిక

---

20. 'ఆంధ్రవాఙ్మయము–హాస్యరసము', ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, 1935–36, సంపుటము 24, సంచిక 5,6, పుట.183

21. 'హాస్యరసము', భారతి. 1954 నవంబరు, సంపుటము 31, సంచిక 11, పు.433

దృక్పథమీ హాస్యమున కన్పించుటచే హాస్యముదాత్తము, మనోరంజకము నగుచున్నదనియు -

'ప్రాఞ్చో అగామ నృతయే హసాయ
ద్రాఘీయ అయుః ప్రతరంద ధానాః'

నృత్య హాస్యములకై తూర్పు కేగి జీవితకాలమును పెంచెదము గాక అని వైదికఋషులనినట్లుగను తెలియుచున్నది.

పరస్పర విరుద్ధభావముల నుండి జనించినట్టియు, స్వతంత్రభావములతో సముచితముగ నుద్భవించినట్టిదియు, నగు ప్రాథమిక వాస్తవిక కావ్యమే హాస్యము [22] అని కొందరి అభిప్రాయము. హాస్యము తక్కిన రసములలో వలె గాక కొద్దికాలములో స్థాయి నందుకొని ఆనందమును కలిగించును. చేదు మందునకు తియ్యని చక్కెరను చేర్చి మందునకు ముందుగా నిచ్చిన అది ఎట్లు రుచిమంతమయి ఆస్వాద్య మగునో, అట్లే నీరసమగు నీతికి సారసమయిన హాస్యరసమును కొలదిగ చేర్చిన అదియు రుచిమంతమయి నాస్వాదనీయమయి ప్రయోజనకారి అగును.

హాస్య విషయమున మన ప్రాచీనుల దృష్టి అంధ మనియే చెప్పవలె ననెడి విమర్శలు అంత సమంజసములు కావు. ఏలన నాట్యశాస్త్రమున 6వ అధ్యాయమున ఇతర రసములతో పాటు హాస్యరస వివరణమును కలదు. కరుణ భయానకాది రసములకంటె నిది ఎక్కువగా వివరింపబడి యున్నది. బెర్గ్సన్ (Bergson) వ్రాసిన '(Laughter'వంటి ప్రత్యేక గ్రంథములను మనవారు వ్రాయకపోయినను, భరతుడు చెప్పిన ఆత్మస్థ, పరస్థ భేదములును హాస్యాభినయ మందు చెప్పబడిన షడ్భేదములును మనవారి నిశితదృష్టిని తెలుపుచునే యున్నవి. మరియు హాస్యము ప్రధానముగాగల ప్రహసన మను రూపకభేదము చెప్పబడినది. మునిమాణిక్యం వారు హాస్య విషయమున పరిశోధనము చేసి పెక్కు విశేషములను తెలిపిరి. సంగమేశం గారి 'తెలుగు హాస్యము' వంటి గ్రంథము లిప్పుడిప్పుడు వెలువడుచున్నవి. భమిడిపాటి కామేశ్వరరావు గారు, పోతుకూచి సాంబశివరావు గారు, మున్నగు పలువురు పలు వ్యాసములను రచించి యున్నారు. పాశ్చాత్యులు హాస్య భేదములైన 'wit, humour' అనువానిని గూర్చియు,

---

22. 'At bottom of course, humour is an elemental fact, independent of rationality, it derives from a sense of incongruity'.

ఇతర భేదములను గూర్చియు, నిశితముగ విమర్శలను వెలయించిరి. హిందీలో రామచంద్రవర్మ కృతమగు 'హాస్యరసము' అను గ్రంథము పరిశీలనార్హము. సంస్కృతభాషలో 'Sanskrit Comic Character' అనుపేర జె.టి.పరీఖ్ గారిచే ఒక గ్రంథము ప్రకటింపబడి యున్నది.

కాని మన పూర్వులు హాస్యమును అంతగా పోషింపకపోవుటకును హాస్యరస ప్రధానములగు కావ్యములు వ్రాయకపోవుటకును గల కారణము అందు ఉదాత్తతయు, గంభీరతయు, అంతగా నుండదనుకొనుటయే యని చెప్పనొప్పును. అంతియగాక ఈ రసస్థాయి అయిన హాసము చేయదగినవారు విట, విదూషక, ధూర్త, ద్యూతకార, వేశ్యా, చేటికాదు లగుటచేతను, ఆ పాత్రలలో సాశీల్యాది గుణములకు తావులేకపోవుటచేతను, ఔదాత్య గాంభీర్యలోప భయ కారణముగ హాస్యరస ప్రధాన కావ్యములను వ్రాయులేదనియు, అవకాశము కల్గినపుడెల్ల ఔచిత్యమును పాటించుచు తమ తమ కావ్యములలో హాస్యమును అంగముగ పోసించుచునే వచ్చిరనియు చెప్పవచ్చును. మరియు నిది అప్రయత్నముగ రావలసినదే గాని, ప్రయత్నపూర్వకముగ సాధించునది కాదని, దైవదత్తమగు ప్రతిభచే సాధ్యమని కూడ కొందరు అభిప్రాయపడిరి..

## ఇతర రసములతో సంబంధము :

'శృంగారాత్ హి హాసః' అనుటనుబట్టి ఇది శృంగారము నుండి జనించిన దని తెలియుచున్నది. శృంగారము ఉత్పత్తి హేతుక మగు రసము కాగా, హాస్యము దానినుండి ఉత్పన్నమైనది. శారదాతనయుని కథనము ననుసరించి పార్వతీ పరమేశ్వరుల సంభోగమును భరతులు అభినయించినప్పుడు తూర్పుదిక్కుగా నున్న బ్రహ్మ యొక్క ముఖము నుండి కైశికీవృత్తితో శృంగారము ఉత్పన్న మయినది. జటాజినధరుడు, భోగి భూషణుడు, అగ్నిలోచనుడు, భస్మాంగరాగుడు అయిన శివుడు పార్వతితో కామింపబడగా ఆసమయమున ఆమె సఖుల వలన హాసము అధికముగా జనించినది. కావుననే శృంగారము నుండి హాస్యము జనించిన దనుట.[23] మరియు శృంగారానుకృతియే హాస్య మనియు నాట్య శాస్త్రమున కలదు. ఇది క్రమపరిప్రాప్తమై 'శృంగార హాస్య....' అనురీతిని శృంగారము తరువాతనే చెప్పబడినది. అలంకారిక నియమానుసారము ఇది అంగరసమే కాని అంగిరసము కాదు. ఈ హాస్యమునకు శృంగారము పోషక రసము కాగా, భయానక కరుణములు విరోధిరసము లయినవి.

---

23. భావప్రకాశము, 3వ అధికారము, పుటలు 57, 58

## భారతము – హాస్యము :

తిక్కనార్యుని భారతభాగము నందీ రసమెట్లు పోసింపబడినదో పరిశీలింతము. తిక్కన భారతభాగమున హాస్యము ఏ ఒకటి రెండు తావులందో తప్ప నధికముగ చోటుచేసికొనలేదు. 'నానారస భావనా నాడీ నిదానవిదగ్ధుడు' కావున తిక్కన అవకాశ మున్నంతవరకు హాస్యమును కూడ పోషించె ననియే చెప్పవచ్చును. శ్రీ శేషగిరిరావు గారు 'కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి హాస్యరసపోషణము లెస్సగా చేయలేదని నా తలంపు. ఉత్తరగోగ్రహణ వర్ణనాసందర్భమున ఈ రస ప్రయోగమున కెంతయేని అవకాశము కలదు. కాని ఈ ఘట్టము తిక్కన నిజమైన రస నిష్పత్తిని కలిగింపలేకపోయినాడు'[24] అని ఈతని హాస్య రసపోషణమును గూర్చి చెప్పియున్నారు. కాని ఈమాట లంత సమంజసములు కావేమో! తిక్కనకు తన భారతభాగము నందలి పదునేను పర్వములలో వీరాది యుద్ధత రసములకు మాత్రమే తావు గల యుద్ధపంచకముననను, ఆధ్యాత్మిక విషయ ప్రధానమును, శాంతరస ప్రధానమును అగు శాంతిసప్తకముననను హాస్యమునకు తావు కల్పించుటకు అవకాశము లేకపోయినది. అది యాతని తప్పుకాదు. ఆయా పర్వము లందలి యితివృత్త స్వభావమునకు హాస్యము తగినది కాకపోవుటచేవిడువ వలసి వచ్చినది. అంతమాత్రమున ఈతడు హాస్యరస పోషణమున సమర్థుడు కాడనుట అంత సమంజసము కాదు. యుద్ధపంచకము, శాంతి సప్తకమును తీసివేయగా మిగిలినవి విరాటోద్యోగ స్త్రీపర్వములు. స్త్రీపర్వము ప్రధానముగ కరుణరసము కలది. కరుణముతో హాస్యమును కూర్చుటకు వీలులేదు కావున అచ్చటను హాస్యమున కవకాశము కలుగలేదు. 'నానా రసాభ్యుదయోల్లాసి' అని తాను చేసిన ప్రతిజ్ఞ మొక్కవోకుండుటకా అనునట్లును, 'నవరస సంపోషితము భారతము' అను పండితాభిప్రాయమును బలపరచుటకా అనునట్లును, అవకాశము కలిగినంత వరకు విరాటోద్యోగములలో హాస్యరసమును పోషించి నవరసములను పోషింపగల సమర్థుడ నని నిరూపించుకొనినాడు తిక్కన.

పాండవు లజ్ఞాతవాసమునకు మారువేషములలో విరటుని నగరులో ప్రవేశించిన సందర్భములో మహాపురుష లక్షణలక్షితుడగు అర్జునుని పేడిరూపమును నవ్వువచ్చునట్లుగా వర్ణించినాడు తిక్కన.

---

24. ఆంధ్రసారస్వత వ్యాసావళి – ఆంధ్రసారస్వతము – హాస్యరసము

'కాళ్ల యొప్పిదమాఁడుకట్ట నుజ్జ్వలము సే
యంగ సంకుల బాహు లందమెడలఁ
గంచుక మంగంబు కాంతికి మాటుగా
మెడ హేమపట్టిక మెఱయకుండ
వదనంబు కొమరు భావనఁజేసి వేఱుగా
నుదుటి పెంపలకలఁబొదువఁ బడఁగఁ
బవడంపు జొత్తులఁజెవులు రూపడఁగఁగఁ
బాపటఁ దలకట్టుభంగి గప్ప
మంచు మఱుఁగువడిన మార్తాండుఁడును బోలె
నీఱు గవిసియున్న నిప్పుఁబోలె న
వేషధారియైన విష్ణుండుఁబోలె న
వ్విరటుకొలువు సేర నరుఁడు వచ్చె'[25]

అర్జునుడు తన కాళ్ల యొప్పిదమును ఆడకట్టుచే ।చీరకట్టుచే। కప్పికొన్నాడట. అంగకాంతికి మాటుగా కంచుకమును తొడిగినాడు. బంగారు పట్టెడ వలన మెడ బెడంగును వెలువడకుండ చేసికొనినాడు. తలకొంగు వలన మొగము సొగసు వేరు కాగా, అజానుబాహువుల అందము తెలియరాకుండ చేయుటకు సంకుపూసలు కట్టినాడు. ఈవిధమగు నలంకారముతో నాడవేషము వేసికొనిన అందమైన పురుషనటునివలె అర్జునుని కవి।బ్రహ్మ సృష్టించినాడు. గంభీరమైన ముఖభావమును మార్చుకొని చూపఱకు నవ్వు కలుగునట్లుగ నాడారివాని ముఖవైఖరి నలవరచుకొనినాడు. అంతకుపూర్వపు పాపటను మార్చి ముంగురులు దిద్దుకొని నొసటి యందమును కప్పిపుచ్చి మంచు మరగుపడిన మార్తాండుని వలె, నీరు గవిసిన నిప్పువలె, వేషధారి యైన విష్ణుని వలె ఉన్నాడట. వీరాధివీరుడగు అర్జునుని ఈవేషముతో నున్నట్లు వర్ణించుటచే నిట హాస్యరసము చోటుచేసికొన్నది. ఇట ఈ హాస్యరసమునకు ఆలంబనము అర్జునుడు. ఆతని వికృతవేషము ఉద్దీపనము. ఆలంబనోద్దీపన విభావముల వలన కలిగిన హాస మనుస్థాయి హాస్యరస మయినది. ఇట వ్యభిచారి సాత్త్వి కాదులు స్పష్టముగా లేవు. ఈ సందర్భమున వికృతవేషము వలననే హాస్యము ఒదవినది.

---

25. విరా., ఆ.1, ప.228

విరాట పర్వమున ద్వితీయాశ్వాసము నందు ద్రౌపది కీచకునిచే భంగపాటు నొంది విరటుని కొలువులోనికి ప్రవేశించిన సందర్భమున –

'...    ...    ...    ...

గాన నాథుల దూఱంగఁగాదు వినుము

సతికిఁ దానెంత వడియును సభలలోనఁ

దడవుగా నిల్చి యిట్టులుదగ్రవృత్తి

శంక సెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ' –విరా., 2–148

అని ధర్మజుడు పలికి మరియు –

'పలుపోకలఁ బోవుచు వి

చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం

గులసతుల గఱువ చందము

దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా'

అని నిందించును. ఈ మాటలకు ద్రౌపది తగినరీతిని సమాధానము నొసగును.

'నాదు వల్లభుండు నటుఁడింత నిక్కంబు

పెద్దవారియట్లు పిన్నవారుఁ

గానఁ బతుల విధముగాక యేశైలూషిఁ

గా ననంగరాదు కంకభట్ట'

అనుటతో నాపక 'అట్లగుటంజేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి శైలూషుండకాడు. కితవుండునుం గావున జూదరి యాలికి గఱువతనం బెక్కడి యది'[26] యనును. తన భర్త నటుడు మాత్రమే కాదు జూదరి కూడ అని ద్రౌపది ధర్మరాజును దెప్పుచుండినరీతిలో హాస్యమే కానవచ్చు చున్నది. సైరంధ్రి కంకభట్టు నీవిధముగ 'ఎద్దేవా' చేయుటలో పాత్ర హాస్యమును ఉద్దేశింపకపోయినను, ధర్మరాజు అంతఃస్సాయువులలో తగిలిన దెబ్బ మనకు చిరునగవును తెప్పించును. ఈ సన్నివేశమున పాత్ర లెవ్వియు నవ్వలేకపోయినను, మన పెదవులపై దరహాసము మెరువక మానదు. మరియు ఇట మహానుభావుడైన ధర్మజుమీద కంటె, మానసికముగ దెబ్బతినిన ద్రౌపదిమీద సానుభూతి కలిగి, మనమే త్రిప్పికొట్టినట్లుగ భావించి సంతోషపడుదుము. అజ్ఞాతవాస పూర్వవృత్తము సహృదయునకు విదితము కావున

26. విరా., ఆ.2, ప॥లు 150–53

ఈ సందర్భమున హాస్యము కలుగుచున్నది. ఇట వ్యంగ్య పూరితమగు భాషణము వలననే హాస్య మొదవినది.

కీచకవధ సందర్భమున భీముని నర్మగర్భితములగు మాటల వలన హాస్యమొదవును. స్వాంతము బాహుగర్వ ఘనసంత మసాంధముగాగ, శంక యొక్కింతయు లేక, అహంకృతి ముంగలి గాగ, కీచకుడు నర్తనాగారమున ప్రవేశించినాడు. సంగరోత్సవోద్యమ రభసాతిరేకము బలియల్పడు టించుకలేక, రోషసంభ్రమ మొకయింతయైన పరభావ నిరూప్యము గాక, తన అఖండిత బాహాబలగర్వము ముంగలిగాగ, మదమత్త భద్రగజసదృశగతిని అప్పటికే అచ్చటికి చేరియున్నాడు భీమసేనుడు. నిగూఢరూపమున ఉన్న భీమసేనుని గాంచి పాంచాలి అని భావించి తన అభిమానితను, సౌభాగ్యమదమును, ఉగ్గడింపగా, భీముడా మాట లాలించినాడు. వచ్చుచున్న కోపము నాచికొనినాడు. ఉచిత నిగూఢభంగులగు భాషణముల, తన ప్రియురాలివే అని తోచుటకై మృదురీతిని భీముడు కీచకునితో నిట్లు మాట్లాడినాడు.

'ఇట్టివాఁడవు గావున నీవు నిన్నుఁ
బొగడికొనఁదగు నకట నాపోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ
బడయవచ్చునె యెఱుఁగక పలికితిట్లుఁ
'నాయొడలు సేర్చినప్పుడ
నీయొడ లెట్లగునో దాని నీవెఱిఁగెదు న
న్నేయ బలలతోడిదిగాఁ
జేయ దలంచితివి తప్పుసేసితి గంటే'
'ననుముట్టి నీవు వెండియు
వనితల సంగతికిఁ బోవువాఁడవెయ్యైనం
దనువేఁ బడసిన ఫలమే
కనియెదవిదె చిత్తభవవికారము లెల్లన్'[27]

ఈ మాటలు వినువారి కందరకును ఇందలి హాస్యము మనోవికాసము నొదవింపక మానదు. ఈ సంభాషణములో చక్కని చమత్కృతి కలదు. ఇది కేవలము

---

27. విరా., ఆ.2, ప॥లు 338-40

నర్మోక్తుల వలె నుండుటయే గాక మనోహరమగు వ్యంగ్యమును ప్రస్ఫుటము చేయుచున్నది. నాయట్టి స్త్రీ నీకెక్కడను లభింపదు అనుట తాను నిజమునకు స్త్రీకాదు కనుక. సామాన్య స్త్రీగా భావించితివి కాబోలు అనుటలో నేను భీమ సేనుడను కాని భీతహరిణేక్షను కాను అనురీతిని చమత్కారము కలదు. 'ననుముట్టి నీవు వెండియు వనితల సంగతికి పోవువాడవె!' అనుటలో నా ప్రేమరసము నాస్వాదించిన పిదప పరకాంతను కలనైన తలపవు అనుభావమును కాని, నాచేత పడితివి కాన నిక స్త్రీతోడనేకాదు, ఇహలోకసుఖమునే విడిచెద వను భావమును కాని చెప్పవచ్చును. 'తనువే బడసిన ఫలమే కనియెదవు' అనుటలో నీజీవితములో నిక నీకు కామవికారము లేకుండ చేయుచున్నాను. మృత్యువు నాహ్వానించుచున్నావు అని భావము. ఈ మాటలు పాఠకునికి, వినుచున్న ద్రౌపదికి హాస్యమును కల్గించును. వికృత వచనశ్రవణమున కలుగు మనోవికృతియు హాసమునకు బీజమే కనుక నిట హాస్యరసమునకు తావు కలిగినది. ఇట తిక్కనార్యుని రస నిర్వహణ శిల్పమును గూర్చి శ్రీ రంగారావు గారు 'ఒక రసము నుండి మరియొక రసమునకు పాఠకుని నభిముఖుని చేయు సందర్భమున హఠాత్తుగా తత్పర రసావిర్భావము కలిగింపకుండ మధ్య కొంత హాస్యరసమును కల్పించి తద్వారా అనంతర రసావిర్భావము కలిగించుటలో తిక్కన రసనిర్వహణ శిల్పము దీప్తమగు చున్నది'[28] అని నుడివి యున్నారు. ఈ అభిప్రాయమునే వేదవల్లి మాణిక్యం తాయారు గారు తమ మాటలలో నిట్లు చెప్పియున్నారు. 'కేవల రౌద్రరస ఘట్టము నందు చల్లని చతురోక్తులను జతపరచి కావ్యానందమును కలిగించుట యీతనికి గాక తక్కరులకు సాధ్యము కాదు. ఇటువంటి హాస్యరసమున కాటపట్టులగు పట్టులీ విరాటపర్వమున చాలగలవు'[29] ఈ సందర్భమున హాస్యరసమున కాలంబనము భీమసేనుడు. ఉద్దీపన మాతని నర్మగర్భితము, వ్యంగ్యగర్భితము నగు సంభాషణము.

ఉపకీచకవధ సందర్భమున పాంచాలి సచేలస్నానము చేసి రాగాది వికార నిరాసంబున ప్రసన్న అయిన బుద్ధివలె, సింహబలప్రభృతి కీచక విధ్వంసంబునం దెలివొంది మందయానంబున బురంబు సొచ్చి రాజవీధి నరుగుదెంచు నప్పుడు –

---

28. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana
29. తెనుగు సాహిత్యములో హాస్యరసము

'మన కీచకుల కెల్ల మారియై పుట్టిన
సుదతి వోయెడు నని చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొవ్వెఱుగదేఁ జూతుగా
కని తలసూపక యడఁగువారు
నలవోక గనుఁగొని యంతరంగము బిట్టు
బెదర మాఱు మొగంబు వెట్టువారు
నెదురుగా వచ్చిన నెంత యేనియు దవ్వు
గలుగ వేఱొక త్రోవఁదొలఁగువారు
ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్ట నొదిఁగి
యుండువారుఁ గరంబున నుదరమప్ప
ళించి యమ్మరా రక్కసి యంచు నుల్లి
ములుకువారునై పురజనంబులు దలంకి'
'పులిఁగనుఁగొన్న లేడులునుబోలె విభీతిఁ గలంగఁ బాఱ న
న్నెలఁతుక యంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై
వెలివిరియంగ నీక .... ... ..'[30]
చని దని వర్ణించినాడు తిక్కన. పురజనులు భయచేష్టాదిక వర్ణనముచే హాస్యరసము పోషింపబడినది. వారి చేష్టలను చూచుచున్న ద్రౌపదికి అంతరంగము హాస్యరసముతో నిండినదట. ఇట హాస్యమునకు ఆలంబనము పురజనులు. ఉద్దీపనము వారి చేష్టలు అని చెప్పవచ్చును.

ఉత్తర తనదు గురువు కడకు నరిగి ప్రార్థనావినయ సంభ్రమములు పెనగొనగ నెమ్మి నిట్టు లనినది. తన అన్నగారి సారథి ఒక కయ్యమున చనిపోయెననియు, తగువాడెచ్చటను లేకపోవుటచే నీ క్రియకు నాత డొండొకనిని అచ్చుపఱుప డనియు చెప్పి 'అది యట్లుండె నేడు కౌరవులు పసులం బట్టిరని కూయి వచ్చిన నన్న సన్నద్ధుండై వెనుకం దగుల సమకట్టి, సారథ్యంబు సేయువాడు లేమికి విసాదంబు నొందిన నీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియంబంది నిన్నుఁ దోడ్తేఱ నన్ను బనిచె. నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటంజేసి ఎల్లవిధంబులం దెత్తునని పూనివచ్చితి. నీవును నా పలుకులు గుఱుచసేయక నీపెంపునం బ్రకటంబుగా

30. విరా., ఆ. 3, ప॥లు 35-37

నయ్యుత్తర కుమారునకు రథంబు గడప నియ్యకొని, యియ్యాపదఁ దలఁగ వలయు నిట్లాడంబడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంత పఱుచుట యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి'

'నగుచు బృహన్నల యిట్లను
జగదీశ్వరపుత్రినాకు సారథ్యము నే
ర్పుగలదె నీమాటకు నే,
మిగులంగా వెఱతుఁ బొదము మీఁదట్లుండెన్'
'భవదీయ ప్రార్థనచేఁ
దివిరి పరమ దుష్కరములు దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార
థ్య విధంబొకఁడనఁగ నేల యంబుజవదనా'[31]

ఈ ఘట్టమున అర్జునుడు పేడిరూపము ధరించిన వాడగుటచే నీరెండు పాత్రలకు తగినట్లుగ ద్వ్యర్థిగ మాట్లాడును, ఈపల్కులలోను, చేతలలోను లలితమైన హాస్యము కలదు. 'అర్జును డంతటి మహావీరుడు లోన మండుచున్న కౌరవ బల విజిగీషా పూర్వక విధ్వంసాగ్ని చెలరేగుచున్న దానిని బయల్పడనీక తాత్కాలిక బృహన్నలావేష సముచితభంగి హాస్యప్రాయముగా ప్రవర్తించుట చాలాహృద్యము, సముచితము'[32] అని శ్రీ యడవల్లి వారు చెప్పిన మాట ఎంతయు సత్యము.

ఉత్తర గోగ్రహణ సందర్భమున ఉత్తరుడు బృహన్నలను సారథిగా చేసికొని యాతనికి దృఢ తనుత్రాణము తేరబనిచినాడు.

'తెప్పించి డొడుగు మీవని
యొప్పించిన నిట్టునట్టు నొఱవలు గామైఁ
గప్పికొని యా బృహన్నల
యప్పుడు నగుపించె నచటి యబలా జనమున్'[33]

అను సందర్భముననను హాస్యరసము కలదు. ఇట ఆలంబనము బృహన్నల. ఉద్దీపనము అతని చేష్ట. వికృతచేష్ట వలన కలిగిన హాస్యమిది. ఇది పాత్ర ఉద్దేశించినదే.

---

31. విరా., ఆ.4, పాలు 29-31
32. 'తిక్కనశిల్పవు తెనుగుతోట' -భారతి,1957 సెప్టెంబరు, సంపుటము 34, సంచిక9, పు.17
33. విరా., ఆ.4, ప.39

ఉత్తర కుమారుని ప్రజ్ఞలు హాస్యాస్పదములు. విరటుడు నీ గూర్చి ఎప్పుడును, బాహువిస్ఫూర్జితుడు, శౌర్యశాలి, కులభూతి విశేష విధాయకుండు, భూభరణ విశారదుండు, జన భవ్య తపఃఫల సంభవుండు, కాతర పరిరక్షణుడు అని పదివేవుర ముందు చెప్పుచుండును. దానికి నీడుగచేయు మిత్తఱిన్ ః విరా., 4-7ః అని గవాధ్యక్షుడు ఉత్తరుని కాంతాజనములో నగ్గింపగా దానికి పొంగినవాడై దర్పోద్ధతిని సంగరకౌతుకంబు ముడివడుచుండగా ఉత్తరు డిట్లు పలికెను.

'ఎత్తునఁగొందుఁ గౌరవుల నెల్లను మార్కొని రేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ దేరికి సారధి లేమిఁజేసి నా
చిత్తమునన్ విచారదశసెందెడు నెవ్వఁడు గల్గ నొక్కొ నా
కిత్తఱి నేఁగదా కడపనెంతయునేర్తు రథంబ నంబురిన్'

–విరా., 4-9

అనియు

'కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థు డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చియేఁ బసుల గ్రమ్మఱఁ దేరకయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారంబుఁ జిత్తములందు మెత్తురే'

–విరా, 4- 11

అని బీరములు పలికినాడు. కురువీరులను గెలిచి బొమ్మ పొత్తికలను తెమ్మనగా–

'... ... ...
జనపాలక నందనుండు జయలక్ష్మిం జే
కొనునటె చీరలు దెచ్చుట
పనియె యటుసూడుఁడెల్ల భంగులఁ దెత్తున్'

–విరా., 4-48

అని దర్పముతో పలికిన ఉత్తరుడు కౌరవ రాజ సైన్యమును కనగనే గరుపారిన మేను, తలకు మనము, జిచ్చపడిన చూపునునై తొట్రుపడుచు దిగులు సొచ్చి 'భీష్మ ద్రోణ కృపాది ధన్వి నికరాభీలంబును, దుర్యోధన గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబును, శస్త్రాస్త్ర జాలోష్మసైర చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబును అగు ఆ సైన్యమునునే చేరః శక్తుండనే' అని ప్రశ్నించి ః విరా., 4-52 ః –

'అకృతాస్త్రుఁడ బాలుఁడఁగా
ర్మక విద్యాప్రౌఢిమై నిరూఢులయిన యీ
శకుని జయద్రథ దుర్ముఖ
వికర్ణ కర్ణాది యోధవీరుల కెదురే'
'ఇట్టగు తెఱఁగక వచ్చితి
మెట్టొకొ మన భంగి వీరలిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను
నట్టి కొలఁదిగాదు భీతి యడరెడుఁ దోడ్తోన్' -విరా., 4-53, 54

కౌరవసేనఁ జూచి వడకం దొడంగి రయంబున దేరు మరల్పుము. ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా! అను స్థితికి వచ్చినాడు. బృహన్నల 'అంతిపురమున అట్లు పలికి ఇట్లు కలంగుట ఒప్పుకాదు' అని చెప్పగా 'పసుల దయ్యమెఱఁగుఁ బడఁతుల సంతోషమేల నాకు ననికి జాల నేను' (విరా., 4-59) అని స్థిరముగ నిశ్చయమునకు వచ్చినాడు.

'బహువిధంబులఁ బగుతుర బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక
దవ్వు దవ్వుల నిట్టిన నవ్వరెట్లు' -విరా., 4-62

అని బృహన్నల పలుకగా -

'ఒంటి దలపడి కురుసేన నోర్చువాఁడ
నే యిదేటికి వెడమాట లిట్టులాడ
వారు గానక ముందఱఁ దేరుదోలు
కొని రయంబునఁ బురి కరుగుటయనీతి' -విరా., 4-64

అనినాడు. వారు కానకముందే తేరు నడుపు మనుటలో నీతడెంతటి పౌరుషవంతుడో, శూరుడో విదితమగుచునే యున్నది. చిత్తవృత్త మొక్కించు చిక్కబట్టుకొను మని చెప్పి వివచ్చుడు తేరు పోనీయ నా భూవల్లభ కుమారునకు ఆననము పల్లటిల్లినది. మానసము తల్లడిల్లినది. శరములు, శరాసనములు, ఆ రథముపై డిగ్గ విడిచి అతి రభసమున ధరణికి లంఘించి శీఘ్రముగ పురి దెసకు పారిపో జొచ్చినాడు. పదశతమాత్ర పలాయితుడైన భూమింజయు నెయిది పట్టుకొను సందర్భమున -

'వెలవెలఁబాఱుచు వెగడొందుఁ బెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబులెల్ల నిండఁ జెమర్చుఁ
బదములు గరములుగుదియవడఁకు
హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముఁ దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మాటఁ గీడ్పాటుదోఁప
నిష్క శతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్ట వైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటి దశకంబు నొక యూరుఁ బురముసొచ్చి
నపుడ యిచ్చెద నీకను నార్తుఁ డగుచు' -విరా., 4-80

అబలాజనము ఎదుట బీరములు పల్కిన ఆ ఉత్తరుని యుద్ధరంగమున వెలవెలబారు ముఖముతో, వడకుచున్న పదములు కరములతో, దీనదృష్టితో నుండి, గద్గదికముగ నేడ్చుచున్న స్థితిలో చూచిన హాస్యము కలుగక మానదు. అంగనాజనము ఎదుట బీరములు పలికి, ప్రతిజ్ఞలు సలిపిన ఉత్తర కుమారు డిట్లు కౌరవసేనను చూచి పారిపోవు ఈ సందర్భము హాస్య రసాత్మకము. హృదయము తటతట నదరుట, కరములు పదములు గుదియవడకుట, మున్నగునవి భయానక రససంబంధి యగు సాత్త్వికభావము లయినను, సహృదయునిలో హాస్యమే కలుగును. బృహన్నల వేషధారి అర్జును డను సంగతి తెలియుట వలన సహృదయుడు ఈ హాస్యరసమును ఆస్వాదింప గలుగును. ఆతడర్జునుడను ఎరుక లేకపోయిన, అన్ని బీరములు పలికిన ఉత్తర కుమారుని చూసిన సందర్భమున హాస్యము కలుగక భయానకమే కలుగును. కాని ఈసందర్భమున సహృదయునికి మొదటినుండి బృహన్నలపాత్ర ధారి అర్జునుడను అంశము తెలియుటచే ఈ ఘట్టము హాస్యరసమునకే యుదాహరణ మగును కాని, భయానకరసమున కుదాహరణము ఎంతమాత్రము కాదని నిస్సంశయముగ చెప్పవచ్చును.

ఉత్తర గోగ్రహణ ఘట్టమును గూర్చి శ్రీ సంగమేశం గారు కొన్ని అంశములను చెప్పియున్నారు – ' ఈఉత్తర గోగ్రహణ ఘట్టంలో తిక్కన గారు హాస్యానికి చేసిన

జాగా ఎంతైనా ఉంది. మొదట ఉత్తరునితోపాటు, బృహన్నల రూపు చూసి కౌరవ బలంలో కలిగిన కలకలమూ, తరువాత అతడు అర్జునుడని అనుమానించినప్పుడు పొందిన కలవరమూ, అజ్ఞాతవాసమితి పూర్తి అయిందా! లేదా! అని పడిన సంశయము, సంశయవిచ్ఛేదమై నాక సంబరాలన్నీ అడగిపోయి సర్దుకోవడంలో 'నువ్వంటే నువ్వు' అని ఒకరినొకరు నిందించుకొని పొందిన అలకలూ వగైరాలన్నీ సాముదాయకంగా నవ్వుగొల్పేవిగానే ఉన్నాయి'.[34] ఉత్తరుడు శస్త్రాస్త్రములు తీయబోవు సందర్భంలో 'పాదువు ఎరియందట్టి కనుంగొని నిరూపించి 'సారథీ' అని సవ్యసాచిం బిలిచి యిట్టనియె" ॥విరా., 4-117॥ ఇంత జరిగిన వెనుక ఇతడు బృహన్నలను 'సారథీ' అని బిలుచుటలో గల తెలివితక్కువతనము హాస్యము నొదవించు చున్నది. ఈ ఉదాహరణమును మాత్రమే గాక వీరు మరికొన్ని యుదాహరణములను చూపియున్నారు.

ఉద్యోగపర్వము నందు రాయబార సందర్భమున కృష్ణ భీమసేనుల సంభాషణములలో కొంత హాస్యరసస్ఫూర్తి కలదు. కాని అవి విభావాది సామగ్రీపరిపుష్టములు కావు.

ఈపర్వము నందు గాంగేయుడు కర్ణునితో -

'చిక్కని పోటు మానిసి విసీ వినువారలు నవ్వనేమిగా
నెక్కుడు మాటలాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్ననేఁ
డిక్కడఁ బల్కులన్ గెలిచె దీవతనిన్ మన రాజు కొల్వనన్'
-ఉద్యో., 1-253

అని పలికిన సందర్భముననను, సంజయు రాయబార సందర్భమున ధర్మజుడు -

'ఎదిరిం దమ యట్టులకా
మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుం గుడుమిం
డిదె మీరు వ్రక్కఁ గొనుడని
చదు రడిచిన మనసు పొందు చక్కంబడునే' -ఉద్యో., 1-312

అని పలుకుటలోను వికృతభాషణము వలన హాస్యము జనించినది. కుడుమిచ్చి వ్రక్కగొనుట చక్కని తెనుగుజాతీయము.

శ్రీ సంగమేశం గారు సంజయు రాయబారములోని 'తానైన నపుడు

34. తెలుగు హాస్యము, పు.81

వక్రుండై....బుద్ధులు సెప్పన్' ః1-311ః, 'పాలీక కౌరవులు దుశ్శీలత.......' ఃఉద్యో., 3-329ః, 'అల్పులకు మ్రింగ జేదైన హాలహలము........' ఃఉద్యో.,3-333ః అను పద్యములను హాస్యరసపోషణమునకు ఉదాహరణములుగ చూపిరి.

ఇట్లే భీష్మపర్వమున 'భీష్ముని మాటలకు కోపించి అతడు యుద్ధము చేసినంత కాలము యుద్ధము చేయబోనని ప్రతిజ్ఞ చేసిన కర్ణుడు ఊరకే యింట్లో కూర్చొనలేక మొనల వినోదంబు గనుగొన దలచి యుద్ధరంగమునకు రాగా శ్రీకృష్ణుడు సమీపించి -

'అమరతటినీతనూజుపై యలుకఁజేసి
యనికిఁ జొరవటె యట్టైన నతఁడు సచ్చు
నంతదాఁకఁ బాండవులకై కొంత సమర
కేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ' -భీష్మ, 1-163

ఈ మాటలు విన్న కర్ణుడు లోలోపడ ఏడ్చుకొనినను పైకి నవ్వవలసినదే నట[35]

ద్రోణపర్వమున దుశ్శాసనుడు సాత్యకతో యుద్ధముచేసి పారిపోయిన సందర్భమున ద్రోణుడు దుశ్శాసనుని నిందించిన సందర్భమునను హాస్యము కలదు.

'అడుకులు దిన్నట్లగునే
కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁబఱచితినాఁ
డొడలెఱుఁగక పాండుసుతుల
నుడిగి మడుఁగ వలసె నిప్పుడొక సాత్యకిచేన్' -ద్రోణ., 4-89

యుద్ధము చేయుట అన్న అటుకులు తిన్నట్లా! అనుటలో లలితహాస్యము కలదు. ఇదియు భాషణము వలన కలిగిన హాస్యమే.

ఈపర్వము నందే కర్ణుడు భీముని అవమానించి
'తిండిపోత నీకు భండనం బేటికిఁ
గడవఁ జేరి మనసు కాంక్షదీఱ
నోపుకొలది మ్రింగి యూరక నీవింటి
కడన యుండుమింక నడిచి పడక' -ద్రోణ., 4-239

అని, మరియును -

35. తెలుగు హాస్యము, పుటలు 77,78

'వనమున ఫలమూలంబులు
దిని మునివై యుండఁగాక ధీరోద్ధతివై
ననినేయ నీకు వచ్చునె
చనుమచటికి నుడిఁగి మడిఁగి శాంతుఁడవోలెన్ -ద్రోణ., 4-241

అట్లు నీ యెడలుండదేని -

'చేయలతిం గని సమరము
పేయుము ననుఁబోటి తోడఁజెనయకు నరనా
రాయణులు వారె యచటికిఁ
బోయెదవేఁ బోయి బ్రతుకుపొంక ముడుగుమీ' -ద్రోణ.,4-243

అనురీతిని పలికిన నీచోక్తులలోను హాస్యము కొంత స్ఫురించుచున్నది.

'శృంగారాత్ హి హాసః' - శృంగారము నుండి హాస్యము జనించెను అనుదానికి కూడ తిక్కనార్యుని భారతమున ఉదాహరణము గలదు. సుదేష్ణ మందిరంబున కరుగుచు నంతరంగంబున -

'చయ్యన నేఁగి యంబుజ విశాలవిలోచనఁ గాంచి ప్రీతివై
నయ్యెడ నేకతంబ హృదయం బలరం దగఁ బల్కి యొక్కవై
నియ్యకొనంగఁజేసి యెలయించెద నిక్కకుఁదార్చి నేర్పునన్
శయ్యకుఁ దెచ్చెదంగుసుమ సాయకుపూనికి నేఁడ తీర్చెదన్'
-విరా., ఆ.2, ప.245

అని భావించినవాడై అటకు వెడలిన సందర్భమున నాతడు చేసిన చేష్టలు హాస్యరసాస్పదములు.

'ఎవ్వరితోనైన నెలుఁగెత్తి యొక్కింత
పనిలేని వెంగలి పలుకు పలుకు
మట్టియ లొండొంటి బిట్టుదాఁకగ నేల
నం దంద మునిగాళ్ల నప్పళించుఁ
గడు వికారంబుగా నొడలెల్ల విఱుచుచు
మలఁగి రిత్తకు రిత్త సెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గరతలమునఁ బెలుచగం
బంబు వ్రేయుచు వెడపాటవాడు

మలయు నంతంతఁ జేరువఁ బొలయు నింతి
దన్నుఁజూడమి కెంతయుఁ దల్లడిల్లి
నిక్కిడక్కడఁ బడుఁదగు లినుమడింపఁ
జూచునిత్తన్విఁ బొరిఁబొరిఁ గీచకుండు' - విరా., ఆ.2, ప.250

ఈ పద్యము నందలి కీచకుని వికృతి చేష్టలు హాస్యమును కలిగించు చున్నవి. శృంగారపదములగు చేష్టలగుట వలన ఈ సందర్భము 'శృంగారాత్ హి హాసః' అను ఆలంకారికోక్తి తగిన విధముగా నున్నది. కీచక ప్రవృత్తమగు శృంగారము నుండియే యీ హాస్యము పుట్టినదని చెప్పవచ్చును.

పై పరిశీలనము వలన శ్రీ ఆంధ్ర శేషగిరి రావు గారు భావించినట్లుగ తిక్కన హాస్యరసమును చిన్నచూపు చూడలేదని విదిత మగుచున్నది. ఆతడు హాస్య రసమును విభావాది సామగ్రీపరిపుష్టము చేయకున్నను అవకాశ మున్నంతవరకు హాస్యరసమును పోషించి, దీనికి తన భారతభాగమున సముచితస్థానమును కల్పించెననియే సుస్పష్టమగుచున్నది.

# 7వ ప్రకరణము

## కరుణరసము – తిక్కనభారతము

### కరుణరసము :

నవరసములలో కరుణము మూడవది. కరుణము వయోలింగాశ్రమ భేదముల కతీతమై సర్వమానవ సామాన్యమైనది. 'క్రౌంచద్వంద్వ వియోగోత్థ శోకః శ్లోకత్వమాగతః' అనుటలో మహర్షియగు వాల్మీకిని కదిల్చి ప్రప్రథమ శ్లోకమునకు కారణభూత మయిన కరుణమును, ఇదొక్కటేరస మన 'ఏకోరసః కరుణఏవ' అనుచుభవభూతి ప్రశంసించినాడు. 'ఆర్ద్రమగు మనస్సు చిత్తద్రుతి వశమున నిచట మిక్కుటముగ కన్పించు కరుణరసమున మాధుర్యము కలదని యానందవర్ధనాదు లనిరి. మానవునకు తన పరిసరములతో గల వైలక్షణ్యము, సంఘర్షణ అనువాని నుండి బయలుదేరినది కరుణరస పరిపోషకమగు విషాదము. జీవితములో కన్పడు సంఘర్షణయే విషాదరూపమున కరుణములో కన్పించుటచేత భయ విస్మయోత్సాహములీ ప్రతీతి యందు గలవు. అందచే 'పాపనం వచనామృతం కరుణాద్భుత రసం కించి దుపనిబద్ధం' అని భవభూతి పలికినాడు'[1] అని శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి గారి వ్యాసమున చెప్పబడినది.

కరుణము శోకస్థాయికము. యమదైవతము. కపోతవర్ణము. హృదయ ద్రవీకరణ మొనర్చు శక్తి కరుణమునకున్నట్లు ఇతర రసములకు లేదనుట కాదనరాని సత్యము. శృంగారమున కున్న వ్యాప్తి దీనికి లేదని కొందరు విమర్శకుల అభిప్రాయము. అది కొంతవరకు సత్యము కావచ్చును. ఎందువల ననగా సామాజికుడు శృంగారరసమును

---

1. 'కరుణరసము' – భారతి, 1954 డిసెంబరు, సంపుటము 31, సంచిక 21, పు.507

ఆస్వాదించుటకు గాని, కవి దానిని పోషించుటకు గాని ఎక్కుడు శ్రమపడవలసిన యవసరము లేదు. సంస్కారవంతమగు చేతస్సును ఆవశ్యకము గాదు :ఉదాత్త సభ్యశృంగారము దీనికి అపవాదము: 'కారుణ్యం భవభూతి రేవ తనుతే' అని భవభూతి వంటి మహాకవులు ఏ ఒకరిద్దరో మెప్పువడసి యున్నను, చాలమంది కవులు కరుణమును చిత్రింప లేకపోవుటచే కరుణరస చిత్రణము అంత సామాన్యమైన విషయము కాదనవచ్చును. 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అను లోకోక్తి యాధారముగ భవభూతి యొక్క వీర, శృంగార రస ప్రధాన కావ్యముల కంటె ఉత్తర రామచరితకే ప్రాముఖ్యము కలదని చెప్పవచ్చును.

శ్రీ కాశీభట్ట వారి అభిప్రాయానుసారము మానవుని జీవితమున గల నాలుగు అవస్థలలో బాల్య వార్ధక్యావస్థలందు శృంగారమునకు ప్రమేయము లేదు. మరియు యమ నియమాది సాధనసంపత్తి కలిగి, లౌకికజీవితము నుండి వైరాగ్యము నొందిన వాల్మీక్యాది మహర్షులకు కూడ నిట్టి దానియందు మనసు వర్తింపదు. కాని కరుణమునకు అట్టి విఘాతము లేవియును లేవు. బాల్య యౌవన కౌమార వార్ధక్యము లను నాలుగు అవస్థలందును కరుణమునకు ప్రచారము కలదు.[2] కావున కరుణమునకు సర్వోత్కృష్ట ప్రాధాన్యము కలదనవచ్చును.

కరుణరసోత్పత్తికి మన యాలంకారికులు తమ తమ గ్రంథములలో వివిధ కారణములను పేర్కొనుచు పలువిధములుగ నిర్వచించి యున్నారు. దాని నిర్వచనముతోపాటు తద్రసమునకు గల విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావములను కూడ నిరూపించిరి. మరియు తదభినయమున చూపవలసిన లక్షణములను కూడ చెప్పియున్నారు. వానిని క్రమమున పరిశీలించిన కరుణరస స్వరూపము విదితము కాగలదు.

భరతుడు నాట్యశాస్త్రమున ఇష్టజనుల వధను చూచుట వలన కాని, అనిష్టములైన వాక్యములను వినుట వలన కాని, అట్టివియే ఆగు ఇతర భావవిశేషముల వలన కాని కరుణరసము సంభవించునని చెప్పినాడు. దీనికి స్థాయి శోకము. ఇది శాపము, క్లేశము, ఇష్టనాశము, వియోగము, వైభవనాశము, వధ, బంధనము, విప్లవము, వినాశము, దుఃఖప్రాప్తి, మున్నగు విభావముల వలన పుట్టును. అశ్రుపాతము, విలాపము,

---

2. కరుణరసము – ఆంధ్ర.సా.ప., సంపుటి 15, సంచిక 5, 6

ముఖశోషణము, వైవర్ణ్యము, అంగశైథిల్యము, దీర్ఘనిశ్వాసము, స్మృతిలోపము, మున్నగు అనుభావములచే అభినయింప బడును. నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యము, ఆవేగము, భ్రమ, మోహము, శ్రమ, భయము, విషాదము, దైన్యము, వ్యాధి, జడత, ఉన్మాదము, త్రాసము, అపస్మారము, ఆలస్యము, స్తంభము, కంపము, అశ్రువు, వివర్ణత, స్వరభేదాదులు దీనికి సంచారులు. గట్టిగా ఏడ్చుట, మూర్ఛాదుల నొందుట, పరిదేవనము చేయుట, విలపించుట, ఆయాసపడుట, గుండెలు బాదుకొనుట, అనెడు అనుభావములచే అభినయింప బడును. దీనికి సంబంధించిన ఆర్యలు కొన్ని గలవు.

'ఇష్టజనస్య వినాశాత్ శాపాత్క్లేశాచ్చ బంధనాద్వ్యసనాత్
ఏతైరర్థ విశేషైః కరుణాఖ్య రస స్సముద్భవతి'
'ఇష్టవధ దర్శనాద్వా విప్రియవచనా సంశ్రవాద్వాపి
ఏభిర్భావ విశేషైః కరుణరసోనామ సంభవతి'
'సస్వన రుదితైః మోహాగమైశ్చ పరిదేవితై ర్విలపితైశ్చ
అభినేయః కరుణరసో దేహాయాసాభి ఘాతైశ్చ'[3]

భరతుని తర్వాత విక్రమ ప్రథమ శతాబ్దికి చెందిన గ్రంథ మగు జైనాగమ 'అనుయోగాధ్వర' సూత్రమునుబట్టి కరుణరస స్వరూప మిట్లున్నదని - ప్రియవియోగము, బంధనము, ప్రాణదండన, రోగము, పుత్రాది మరణములు, శత్రువు నుండి కలుగు భయము, మున్నగు కారణముల నుండి కరుణరస ముత్పన్న మగుచున్నదని, శోకము, విలపించుట, ఉదాసీనత దాని చిహ్నము అని డా॥ నండూరి రాధాకృష్ణ గారి సిద్ధాంత వ్యాసమున చెప్పబడి యున్నది.[4]

సరస్వతీ కంఠాభరణ కర్త యగు భోజుని మతమున ఏరసము వలన మూర్ఛ, విలాపము, మనసునకు మృత్యుముఖముగ ప్రేరణము కలుగునో అది కరుణరస మనబడును.

'మూర్ఛావిలాసా కురుతే సాహసే మనః
కరోతి చిత్తం దుఃఖేన యోఽసౌ కరుణ ఉచ్యతే'[5]

---

3. నాట్యశాస్త్రము, అ.6, శ్లో॥లు 60-62
4. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము
5. సరస్వతీ కంఠాభరణము, 5వ పరిచ్ఛేదము

సాహిత్య దర్పణమున ఇట్లు చెప్పబడి యున్నది. ఇష్టనాశ అనిష్టాప్తుల వలన కరుణ ముత్పన్న మగును. ఇది కపోతవర్ణము. యమదైవతము. శోకస్థాయికము. శోచ్య మాలంబనము. దాహాదులు ఉద్దీపనములు. దైవనింద, భూపతనాక్రందనాదులు అనుభావములు. వైవర్ణ్య, ఉచ్ఛ్వాస, నిశ్వాస, స్తంభ, ప్రలాప, నిర్వేద, మోహ, అపస్మార, వ్యాధి, గ్లాని, స్మృతి, శ్రమ, విషాద, జడత, ఉన్మాద, చింతాదులు వ్యభిచారులు.[6]

కావ్యానుశాసన, దశరూపక, నాట్యదర్పణ, రసగంగాధర, రసార్ణవ సుధాకరములు కరుణరస విభావాది సామగ్రి విషయమున చెప్పిన అంశము లన్నియు నాట్యశాస్త్ర, సాహిత్యదర్పణ లక్షణములలో గతార్థము లగుచున్నవి. ఆంధ్ర లాక్షణికులును ఈ కరుణరస విషయమున సంస్కృతాలంకారికుల యభిప్రాయములతో నేకీభవించిరి.

పైని చెప్పబడిన యాలంకారికుల నిర్వచనముల నన్నింటిని పరిశీలించిన కరుణరస స్థాయి యగు శోకము కల్గుటకు గల కారణములు తేటతెల్లము లగును. ఇష్టనాశ అనిష్టాప్తుల వలననో, పుత్రాది మరణ వియోగాదుల వలననో కలుగు చిత్త వైక్లబ్యము శోక మయి, అది కరుణరసముగ పరిణతి నొందునని చెప్పవచ్చును.

భరతుడు నాలుగు రసములనే మూలస్థానీయములుగ చెప్పుచు రౌద్రరస క్రియాఫలితమే కరుణ మని, రౌద్రము నుండి కరుణము జనించినది 'రౌద్రాత్తు కరుణోరసః' (నాట్యశా., 6-39) అని చెప్పియున్నాడు. శత్రు కృతాపరాధాదుల వలన కలుగు క్రోధము రౌద్రమునకు స్థాయి. ఆ క్రోధము క్రియాగత మయినచో కరుణరస స్థాయి అగు శోకము సిద్ధించును. కావుననే కరుణ రసోత్పత్తికి వధ, బంధనము, ఇత్యాదులు కారణములుగ చెప్పబడినవి. ఇవన్నియు రౌద్రకర్మ ఫలములే. తపస్విజనులకు అపరాధము గావించుట అనగా ధర్మగ్లాని అని భావము. వీరికి అపరాధము చేయుట వలన కలుగు కోపముచే శాపము కలుగును. వధ, బంధనాదులు ప్రభువులకు చేయు అపరాధము వలన కలుగు నట్టివి. ధనభ్రంశము, విభవనాశము, ఇష్టనాశము, అనిష్టాప్తి, ఇత్యాదులు సాంఘికవిషయము లనేకములపై ఆధారపడి యుండును. ఈ రీతిగా మానవ జీవితమునకు సంబంధించిన ధార్మిక, రాజకీయ ,సాంఘిక రంగములం దేదైనను శోకమునకు హేతుభూతము కావచ్చును. ధనంజయుని

6. సాహిత్యదర్పణము, 3-222-25 శ్లో.

మతము ననుసరించి సామాజికుని చిత్తదశలలో విక్షేపము అను దశ యందు రౌద్ర ముత్పన్నమై దానినుండి కరుణము జనించినది. శారదాతనయుని కథనము ననుసరించి దక్షాధ్వర ధ్వంస సమయమున దేవత లందరు వికలాంగులుగ చేయబడుటను చూచినప్పుడు పార్వతీదేవి సఖుల యందు కరుణ ముత్పన్నమైనది. కావుననే ఇది రౌద్రము నుండి జనించెనని చెప్పబడినది.[7] అగ్నిపురాణ, శృంగార ప్రకాశికులు చూపిన ప్రక్రియలు విలక్షణము లని, అవి అహంకారము (ego) నుండి వీని పుట్టుకను చెప్పిన వని, ఇది అధునాతన మనోవిజ్ఞాన శాస్త్రప్రసంగములను పోలియున్నదని డా॥ నండూరి రాధాకృష్ణ గారు వివరించి యున్నారు.[8]

'గుణజ్ఞు డగు వైద్యశిఖామణి కటువులగు వస్తువులను కూడ ద్రాక్షరసాదులలో కలిపి పానక మొనర్చి రుచ్యమానమగు రసాయనముగ మార్చి, భౌతిక దేహసంపద సంఘటింప చేయునటుల రసజ్ఞుడగు కవివరేణ్యుడు దుర్భరములగు వియోగములను కూడ చక్కని భావములతో చేర్చి మనోహరమగు కావ్యముగ మార్చి, యాత్మానంద భాగ్యమును సమకూర్చు చున్నాడు. సర్వమానవ మానస లోహములను కరిగించి యానందరూపములుగ పోతపోయుటలో ఈ రసమునకు గల దీప్తి యితర రసములం దంతగా కానరాదు' అనియు 'ఈ కరుణ రస వాహిని మహోన్నత కవితా ఘన గిరి తటమున జనించి వ్యంగ్య భంగీ తరంగ విలసితములై తమ్మాశ్రయించు వారి నానందరత్నాకరమున చేర్చు నవరస తరంగిణులలో దైర్ఘ్య, వైశాల్య, గాంభీర్య, మాధుర్యాదుల యం దసమానమై వెలయుచున్నది. మానవ మానస కేదారములను ఘన భావ సస్య సంపదల ఫలింపచేయు సారమీ శైవలినీ పయఃపూరమున కున్నట్లు ఇతర రస జలౌఘమునకు లేదు. బాలుడు మొదలు వృద్ధుడు వరకును గల మనుష్యసమూహ మొక్కపెట్టున తన యందు లయమై సుఖపారవశ్య మొందునటుల చేయుటలో నీ కరుణరస మెల్ల రసములలో నగ్రస్థానమలంకరించి యున్నది[9] అనియును శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారి అభిప్రాయము.

ఈ కరుణరసమును 'కరుణము' అను పదముచేతనే వ్యవహరింప వలెను. కరుణ – కరుణము ఒకటే యని కొందరు భ్రాంతి పడుదురు. కరుణము రసవాచకము. అకారాంత పుంలింగము. కరుణ దయావాచకము. ఆకారాంత స్త్రీలింగము.

---

7. భావప్రకాశము, 3వ అధికారము, పుటలు 57, 58
8. కరుణరసము – ఆంధ్రవాఙ్మయము
9. 'కరుణరసము' – ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటము 15, సంచిక 5,6

## ఇతర రసములతో సంబంధము :

కరుణమునకు విప్రలంభమునకు, కరుణమునకు రౌద్రమునకు సంబంధము గలదు. విప్రలంభము కూడ ఎడబాటు వలన సంభవించుటచే కరుణమునకు దానితో సంబంధము కలిగినది. కాని ఈ రెంటికిని భేదము కలదు. సాపేక్షాభావ మున్నచో విప్రలంభ మనియు, నిరపేక్షాభావ మున్నచో కరుణ మనియు సిద్ధాంతము. శోకస్థాయికము కరుణము. రతిస్థాయికము విప్రలంభము. విప్రలంభమున కల్గిన శోకమున మరల కలయికతో నంత మగును. కాని కరుణమున కల్గిన దానికట్టి పరిణతి యుండదు. ప్రేయసి ప్రియులలో నొకరికి మరణము సంభవించిన కరుణ మగును. విప్రలంభమున మరణము ఉండదు. దీనిని కరుణ విప్రలంభ మని కొందరు వ్యవహరించిరి.[10] మరణించి తిరిగి జీవించిన కరుణ విప్రలంభము. మరణించినచో కరుణము. ఈ కరుణ విప్రలంభ పదమును కొందరు విమర్శకులు అంగీకరింపలేదు. వేదాల తిరువేంగళాచార్యులు, సన్నిధానము వారు ఈ వాదమును పరాస్తము చేసిరి. అభినవగుప్తున కిది అంగీకారమైనట్లు తోచదు. ధ్వన్యాలోకమునను చెప్పబడలేదు. రసగంగాధర కర్తయు దీని నంగీకరించినట్లు చెప్పలేదు.

ఇక రౌద్రరసముతో దీనికి జన్యజనక సంబంధమే గలదు. కరుణము శాంతముగ పరిణమించుట లోకవిదిత మగు విషయము కావున దీనికి శాంతము తోడను సంబంధము గలదు. లోకములో పరమ ప్రశాంతస్థితి నొందిన మహనీయుల జీవితములను పరిశీలించిన ఈ విషయము తేటతెల్లమగును. అది లౌకికము గాని, అలౌకికము గాని శోకము వలన, లౌకిక విషయములపై నిర్లిప్తత ఏర్పడి, మనస్సు భగవదున్ముఖము అగును. అతని ఆధ్యాత్మికదృష్టి మేల్కొనును. అతడు శాంతుడగును. కనుక శాంతమునకు కరుణము రాచబాట వేయుచున్నది. శాంతమునకు ఏవంవిధమగు సన్నిహిత సంబంధము కరుణముతో నున్నట్లు మరి ఏయితర రసములతోను లేదు. ప్రేయోవాత్సల్యములను ప్రత్యేక రసములుగ పలువురు అంగీకరింపలేదు కాని ఈ భావములతో కూడ కరుణమునకు సంబంధము కాననగును. వాత్సల్యమునకు భంగము కలిగిన కరుణము ప్రవేశించును. ఇది కరుణమునకు ముందు దశ. ఈ వాత్సల్యమునకు స్థాయిత్వ మిచ్చునట్టి స్థైర్యములేదు కావున దీనిని పోషించి

---

10. ఈ విషయము 'శృంగారరస' ప్రకరణమున చర్చింప బడినది

రసముగ నిరూపించిన కావ్యమును వాఙ్మయమున కానరాదు. వాత్సల్యముతో కరుణమున కెట్టి సంబంధము గలదో ప్రేయము తోడను అట్టి సంబంధమే కరుణమునకు గలదు. ఈ ప్రేయస్సు కూడ రసపుష్టి నందుకొను పర్యంతము నిలుచు స్థైర్యము గలది కాదు. హృదయద్రవీకరణ విషయమున ఈ కరుణమునకు భక్తిభావముతోడను సంబంధము కలదు. కరుణమునకు అన్యరసములతో గల సంబంధమును గూర్చి డా॥నండూరి రాధాకృష్ణగారు తమ సిద్ధాంత వ్యాసమున మరింత విపులముగ చర్చించి యున్నారు.[11]

## కరుణరస భేదములు :

భరతుని నాట్యశాస్త్రమున -

'ధర్మోప ఘాతజశ్చైవ తథార్థాపచయోద్భవః

తథాశోక కృతశ్చైవ కరుణస్త్రి విధఃస్మృతః'[12] అని కలదు.

ధర్మనాశనముచే జనించునది, అర్థనాశనముచే జనించునది, శోకముచే జనించునది అనెడి అనెడి భేదములచే కరుణము త్రివిధములు. శారదాతనయుడు, భానుదత్తుడు, మున్నగువారు కూడ ఇట్లే భేదపరిగణన మొనర్చినారు. భావప్రకాశికాకారునిది భరతుని మార్గముల ననుసరించియే యున్నది. కాని రసతరంగిణీకారుడు మాత్రము రసాశ్రయములగు ఆలంబనములను దృష్టిలోనిడికొని యీ పరిగణన మొనర్చినాడు.

భావప్రకాశికాకారుడు కాయిక, వాచిక, మానసిక భేదమున నిది మూడు తెరగులని చెప్పియుండెను. భరతుడు వాచికాంగిక సాత్త్విక ఆహార్య భేదముచే అభినయమును నాలుగు విధములుగ చెప్పియుండుటచే, శారదాతనయుడు చెప్పిన వాచిక, కాయికములు రెండును అభినయములోనివే. మానసిక మని అతడు చెప్పినది భరతుడు చెప్పిన సాత్త్వికములోని భాగ మగును. కావున ఇవి అనుభావములే కాని కరుణరస భేదములు కావని చెప్పవచ్చును. రసతరంగిణీకారుడు స్వపరనిష్ఠముచే కరుణమును రెండువిధములుగ పేర్కొనెను. స్వయముగా నాశ్రయు డైన వ్యక్తియే తనకు గల్గిన కష్టముల వలన శోకమును పొందిన స్వనిష్ఠము. అట్లుగాక వేరొక వ్యక్తి ఆలంబన మయి వానికి కల్గిన బాధ వలన ఆశ్రయుడు శోకమును పొందినచో అది పరనిష్ఠము. విభావము లందలి భేదములను చెప్పుచు ఇట్టి విభజనమును పేర్కొనినాడు

11. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము

12. అ.6, శ్లో. 78

సింగభూపాలుడు.[13] రసానుభవము స్వనిష్ఠ పరనిష్ఠ భేదము వలన మారునది కాదు కావున ఈ విభజనమును కరుణరస భేదములను విశేషించి చూపునది కాదేమో యనిపించును.

హిందీ సాహిత్యకారులలో 'దేవ్' తన 'కావ్యరసాయనము'న కరుణము, అతికరుణము, మహాకరుణము, లఘుకరుణము, సుఖకరుణము అని ఐదు విధములుగ పేర్కొనె ననియు, వ్రజావాసీలాల్ ఇష్టజన్యము, స్మృతానిష్టజన్యము, శ్రుతానిష్టజన్యము అని త్రివిధములుగ విభజించె ననియు, రసనిష్పత్తిని దృష్టినందిడుకొని కాని, సామాజికుని దృష్టినం దిడుకొని కాని రసవిభేదములను చెప్పుట అంత సంగతముగా లేదనియు, కావున కరుణరసమునకు ప్రత్యేకముగ పేర్కొనదగు రసభేదములు లేవనియు డా॥ నండూరి రాధాకృష్ణగా రభిప్రాయపడిరి.[14] వీరి అభిప్రాయము సమంజసముగానే ఉన్నట్లు తోచుచున్నది.

---

13. రసార్ణవసుధాకరము- రసికోల్లాసము, ఃబులుసు వారి వ్యాఖ్య, పుటలు 492-99
14. కరుణరసము – ఆంధ్రవాఙ్మయము

## భారతము – కరుణము :

ఇక కరుణము తిక్కన గారి భారతభాగమున ఏవిధముగ పోషింపబడినదో పర్వానుక్రమముగా అనగా భారత కథాక్రమము నందలి కరుణరస ఘట్టములను, వానితోపాటు అందలి యుపాఖ్యానములలోని కరుణరస ఘట్టములను పరిశీలించిన విదితము కాగలదు.

శృంగార హాస్యములను కొలదితావు లందు మాత్రమే పోసించినవాడును, బీభత్సాది యుద్ధత రసములను యుద్ధపంచకమున అధికముగా పోసించినవాడును, అగు తిక్కన హృదయద్రవీకరణశక్తి అధికముగా గల ఈ కరుణమును మాత్రము విరాటము మొదలుకొని మహాప్రస్థానాంతము వరకు అనగా ఆద్యంతమును పోషించినాడు.

విరాటపర్వమున పాండవులు అజ్ఞాతవాస కాలమున తమ తమ వృత్తులను నిర్ణయించుకొనుటకు ముందు 'భూసురోత్తములు దమ్ముం బరివేష్టించియుండఁ దారనుష్ఠింపం బూనిన పని వారల కెఱింగింప దలంచి' సవినయముగ కరములు మొగిచి మాట్లాడుచు –

'.... మాకజ్ఞాత
వాసంబు సలుపంగవలయు నిందు;
ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలులును
జెఱుపనవేతురు చిన్నసన్న
యెఱిగిరేనిఁ జాల నెగ్గువాటిల్లు న
ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి
యింపుడని యనుగ్రహింపవలయు'[15]

అని చెప్పిరి. ఈ సమయమున ధర్మనందనుడు 'విషణ్ణహృదయుడై' డగ్గుత్తికవెట్టి' దుఃఖపరవశు డగు సందర్భమున కొంత కరుణరసస్ఫూర్తి కలదు. ఇది క్లేశము, వైభవనాశము వలన కలిగినది. ఇట స్వరభేదము, విషాదము అనునవి అనుభావములు.

పాండవులు తమ తమ వృత్తులను నిర్ణయించుకొను సమయమున ధర్మజుడు తానేరీతిగ నుండునది చెప్పిన పిదప 'అనిలతనయు నిరీక్షించి తత్కాలజనితంబయిన

15. భారతము, విరా., 1-46,47

ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి...' (విరా., 1-73 వ.) అను సందర్భమునను అశ్రుపాతాదులచే కొంత కరుణరస స్ఫూర్తిని గావించినాడు తిక్కనార్యుడు.

'కీచకుని సదనమునకు జను ద్రౌపది చారువిలోచన. ఆర్తమూర్తి. కీచకుడు పలికిన పలుకులు మరియు ఆతని వర్తన మామెకు స్ఫురించినది. 'పిడుగుపడినవానిఁ గొఱవిం జూడిన తెఱంగున' సుదేష్ణ నియోగించిన యేతదనుచిత వ్యాపారమునకు నిర్వేదమును చెందినది. అశ్రుపూర్ణవదనయై తొట్రుపాటు చెందినది. విషాదభావముచేత మోము వెల్లవోయినది. భయవశమున మేను కంపించినది. స్వేదిల మయినది. దుఃఖిత మయినది. సంకటస్థితి యందు నిశ్చేష్టత నొంది జీవస్థానము బాధాపూర్ణ మయినది. ఇట్టి మహాపత్‌స్థితిని నివారించుటకు తనకు శక్తి లేకపోయినది. అట్టి యశక్తస్థితి యందు బయలు దేరినది. భవితవ్యము పరమ దుఃఖకారణము. తన్మహాపత్కారణ నివారణ సమర్థము హరిస్మరణమే యని తలపోసి మనఃపుండరీకమున పుండరీకాక్షుని నిక్షేపించుకొని ముందుకు సాగినది. ఇక్కడ తిక్కన ద్రౌపదీ దైన్యమును పరమ కరుణరసభరితముగ చిత్రించెను'[16] అని డా॥ రంగారావు గారి అభిప్రాయము. ఇట కేవలము కరుణము మాత్రమే గాక భయానకము కూడ కొంత చోటుచేసికొన్నది.

> 'అలమట బొందు మాయవిధి యాయని దైవము దూఱు నిత్తఱిం
> గల రొకొ నాకు దిక్కను మొగంబున నశ్రులు వెల్లి గొల్పఁ దో
> ట్రిలఁబడు జల్లనం జెదరు డెందము గూడఁగఁదెచ్చి నను గే
> వలమున ముట్ట నెవ్వరికి వచ్చు ననుం గలఁగున్ వెనుంబడున్'
>
> -విరా., అ.2, ప.104

అనుచోట దైన్యము, త్రాసము, అశ్రువు, ఇత్యాది భావములచే కరుణరసస్ఫూర్తి కలుగుచున్నను 'దైన్యంబు తలపోఁత దలకొన్నఁ జెలువ కా, ననమున వెల్లదనంబు గదిరె భయరస వేగంబు పైకొని ముట్టిన....' (విరా., 2-106) అనుచోట కంపము, వైవర్ణ్యము, ఇత్యాది అనుభావముల వలనను స్వేదము, శంక, దైన్యము, త్రాసము, తొట్రుపాటు, ఇత్యాది వ్యభిచారి భావములు వలనను భయానకము స్ఫురించుచున్నది.[17]

---

16. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana
17. ఈ విషయము 'భయానక రస' ప్రకరణమున వివరింప బడినది.

ద్రౌపది సింహబలునిచే భంగపాటు నొందిన సందర్భమున -

'ఎలదీఁగ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీరేణువొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళముల తుంది మంచు దొరఁగెడు
గతి గన్నుగవ నశ్రుకణము లురుల
నిందు బింబము మీఁది కందు చందంబునఁ
గురులు నెమ్మొగమున నెరసి యుండ
సర్వజనవంద్య యైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకువచ్చిన నెంతయు దైన్యమొంది
యవ్విరాటుని సభఁజేర నరిగి నిలిచి'[18]

ఇట వేడిగాడ్పు నిగుడు నాసికను, అశ్రు కణము లురలు కన్నుగవను, నెమ్మొగమున నెరసిన కురులను వర్ణించి ద్రౌపది దైన్యస్వరూపమును కన్ను లెదుట పెట్టినాడు తిక్కనార్యుడు.

ద్రౌపది తన యవమానమును, తన దుఃఖకారణమును, భీమునకు చెప్పినది. అట్టి సమయమున ధర్మజుని, వాని తమ్ములను, వారిశౌర్యాదులను తలచి 'ఎట్టివారి కెట్టి దశను సంప్రాప్తింప చేసినాడో కదా! విధాత' అని చింతించుచు ఒక్కొక్కరిని గూర్చి పలికినది. భూరిప్రతాప మహాప్రతీప దూరవిఘటిత గర్వాంధకార వైరి వీరకోటిమణి ఘృతి వేష్టితాంఘ్రితలు డగు ధర్మజుడు ఒకని కాశ్రితుడై వెడకూడు చీరవెట్టగ నిల్చుట చూచిన ఆమె మనసు వికల మగుచున్నదట. బక హిడింబాద్యసురుల నుదగ్రంబగురీతిని సంహరించిన చేతులు వంట కట్టియలను విరుచుచుండ నామె శోకపరవశ యగుచున్నదట. పరాక్రమమున సర్వ దేవాధిపతియైన ఇంద్రుని జయించి, కూర్మిపేర్మిని వాని యర్ధాసనమును పొంది, ఇంద్రియనిగ్రహంబునం జేసి తానయై వచ్చిన యూర్వశిని కాదని శౌర్య వైభవ శౌచములకు నెలవై పొగడ్త లందిన మానధను డగు అర్జునుడు పేడిరూపమును దాల్చి సుందరులకు నాట గరపువిధము

18. విరా., ఆ.2, ప. 138

అతిదీనముగా నున్నదట. దానిని జూచి ఈమె పుర పురఁ బొక్కుచుండునట. సరసవర్తనమునను, రణరంగ మందును, వితరణకేళి యందును పేర్వడసిన నకులుడు నే డొరులకు నశ్వశిక్షకుడు కాగా అతని దుఃస్థితిని గాంచి అనుదినము కన్నీరు డించుచున్నదట. అతి సుకుమారుడు, దానశీలి, నిగర్వి, అయిన సహదేవుడు గోపాలవృత్తి యందుండి అడవులందు గ్రుమ్మరుచుండ చూచిన పగవారికైన మనము క్రుంగునట. ఇట్లు వారందరి గురించి చెప్పి తుదకు తనను గూర్చి కూడ చెప్పికొనినది. కుంతీదేవికి కోడలినై, ప్రాణప్రదులగు భర్తలను పొంది, వారి ప్రేమ వడసి, రూప గుణ విక్రమంబులు గల కొడుకులను గని, రూఢికెక్కి రాజసూయ యాగమున రాజన్యమాన్య ప్రియాంగన లందెల్ల పొగడ్త గనిన తాను నేడు నీచతరప్రచారమును పూని యుదర పోషణకై పరుల పంచ చేరవలసి వచ్చినదని చెప్పినది. అంతటితో నూరుకొనక పని కంపుబె గాని పనిసేయ నెరుంగనని, చందనాదులను పట్టపురాణులకు రాయుట వలనను, ఆ సుదేష్ణ కనుసన్నలలో పనులు గొని చేయుట వలనను, క్రొత్తలగు కలపంబులను కూర్చుట వలనను మున్నటులున్న పాణితలంబులు నేడు పలు కాయలు కాచిన వని చెప్పి 'చూచితే' అని బేలయై కన్నుల వెంబడి నీరు కాలువలు కట్ట తన మోమును అతని వక్షమున చేర్చి ఏడ్చినది.[19] అంతటితో నాగక-

ఌ 'వానిఁదెగ జూడవైతేని వాయుపుత్ర
నీవు గనుఁగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబుననైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీయాన సుమ్ము'

-విరా., 2-229

అని పలికినది.

ఈ ఘట్టము అత్యంత కరుణరస జనకమగు ఘట్టము. జగన్నుత శూరులు, ధీవిశాలురు నగు పతులను బడసియు, రాజ్యవైభవాదులను గోల్పోయి, పరులయింట యూడిగము చేయుచు, మానధన యైన ద్రౌపది నిండు సభ యందు కీచకునిచే అవమానిత యైన దనిన ఎట్టి సహృదయుని మనమైనను శోకాకులము కాక తప్పదు. ద్రౌపది ఉదాత్తపాత్ర అగుటచే అనుభావాదు లధికముగ కన్పట్టవు. ఉదాత్తపాత్రల

19. విరా., ఆ.2, పాలు190-222

విషయమున వారి దుఃఖము మానసికముగనే వ్యక్త మగును. స్త్రీ సహజముగ సుకుమార హృదయ యగుటచే నామెకు కన్నీరు దొరగినది. ఈమె దైన్యస్థితిని గాంచిన భీమునకు హృదయము కరిగి ఆమె మోమును హృదయమున చేర్చికొని కన్నీరు తుగిచి కాయలు కాసిన వని చూపించిన ఆమె చేతులను తన ముఖమున గదియ చేర్చుకొని నిట్టూర్చుచు అనునయించినాడు. ఇట పాత్రపోషణము, నాటకీయవైదగ్ధ్యములతోపాటు రసాభ్యుచిత పదబంధమును చోటుచేసికొన్నది.

ఇట శోకమున కాలంబనము ద్రౌపది. అపగత రాజ్యవైభవాదుల వలన శోకము కల్గినది. కీచకునిచే బడిన యవమానము వలన నుద్దీప్త మయినది. పూర్వవైభవ స్మృతి, గ్లాని, విషాదము, చింత, మరణయత్నము, మున్నగు సంచారులచే నిది పరిపుష్టమయి కరుణరసస్థితి నందినది.

ఉపకీచకులకు పట్టువడిన ద్రౌపది పరిదేవన వర్ణనమునను కరుణమునకు తావు గల్గినది.

'..... ..... ..... న
య్యతివ భయభ్రాంతచిత్తయై బాష్పజలో
ద్గతి మొగముగప్పి నిట్లని
యతిరావముగా నొనర్చె నాక్రందనమున్'
అనదనైతి నిచట నాలి కుయ్యాలింపఁ
డకట మీరు గలుగ నాక్రమించి
నన్నుఁగట్టి సూతనందను లిమ్మెయి
వెలుపులేక భంగపఱచువారు'[20]

అనతవైరి ఓజయ, మహోద్భుత విక్రమ ఓజయంత, దుర్మాన విఘూర్ణమాన రిపుమర్దన యోవిజయాభిధాన, తేజో నిహతాహితా ప్రకట శూర గుణ ప్రతిభాస యోజయత్సేన విరోధి బాహుబలజృంభణ భంజన యోజయద్బలా' అని పిలుచుటయే గాక ప్రభువులార, వీరులార, సత్పురుషులార, ఉదారులార, నాథులార, గంధర్వ రత్నంబులార, రక్షింప వేగరావలయు మీరు' -ః విరా.,3-20,21ః

అని పరిదేవించినది. ద్రౌపది యంతటి ఆమెకు ఇట్టి విపత్కర పరిస్థితి వచ్చుట, ఆమె అట్లు పరిదేవనము చెందుట కొంత కరుణరసావహమైనదే కాని విభావాది

20. విరాటపర్వము, ఆ.3, పః 18,19

సామగ్రీవిలసితము కాదు. 'బాష్పజలోద్గతి' మాత్రమే వర్ణింప బడినది.

ఉద్యోగపర్వమున ధర్మజాదులు శ్రీకృష్ణుని రాయబారమున కంపు సమయమున సంధిసేయుమని ప్రార్థించిన మాటలను విని యవమానభారమును ఇన్నినాడులు చిచ్చొడిగట్టినట్లు ధరించిన ద్రౌపది శౌరితో గద్గదకంఠియై తాను పడిన భంగపాట్లను చెప్పిన సందర్భమున కరుణరసస్ఫూర్తి కలదు.

'ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్యమొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁబలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు' –ఆ.3, ప.100

తాను పడిన భంగపాట్లు నన్నింటిని వివరించి –

'ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంట్రుకల్
దావలచేతఁబూని యసితచ్ఛవిబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి యార్తయై'[21]

గోవించుని ముందటం బెట్టి మరియు మాట్లాడినదట. ఈ సందర్భమును దైన్యము, విషాదము, గాద్గద్యము, అశ్రుపాతము, ఇత్యాది భావములచే వర్ణించినాడు. తిక్కనార్యుడు. ఇట నాటకీయవైదగ్ధ్యమును గలదు.

ఇట్లే కుంతీసదనమునకు జనిన కృష్ణునితో కుంతి ఆత్మీయబంధువును గాంచుటచే పెల్లుబికిన దుఃఖముతో అమ్మాధవు మెడ వట్టికొని ఎలుంగెత్తి ఏడ్చుచు మాటలాడిన సందర్భమునను కరుణరసము కలదు (ఉద్యో., 3-182-20 ప॥లు). శోకము వెల్లిగొనగా కొండొక దిగంబాటెడు చిత్తంబుతో మాటలాడినదట కుంతి. దుఃఖాతిశయముచే నామెకు స్వరభేదము కలిగినది. తదితర విభావాది సామగ్రి మాత్రము ఇట లేదు. ఉదాత్తపాత్ర విషయమున సాధారణముగ రసపోషణము కేవల భావమాత్రముగనే యుండును. అనుభావాదు లంతగా కానుపింపవు.

భీష్మపర్వమున ధృతరాష్ట్రుడు భీష్ముని పతనమును విని విలపించు సందర్భము కరుణరస విలసితము. పితృసమానుడగు భీష్ముని మరణమును వినినంతనే ధృతరాష్ట్రుడు

---

21. ఉద్యో., ఆ.3, ప.114

శోకార్ణవమున మునిగినాడు. సంజయుడు భారత రణప్రకారము చూచివచ్చి అమిత పరాక్రమశాలి యగు భీష్ము డస్తమించెనని చెప్పగానే -

'....చిత్తంబు జల్లని యొల్లంబోయి మూర్ఛిల్లి, కొండొకసేపునకు శిశిర విభావంబుల సేదదేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరంగ గద్గద కంఠుడై' ః భీష్మ., 1-50ః పలవించినాడు. భీష్ముని పరాక్రమమున స్మరించుచు విలపించినాడు

'దేవాసురవరు లొక్కటి
యై వచ్చినఁ జిక్కువఱచు నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండి శ
రావలి పాలయ్యె.....' -భీష్మ., 1-51
'అంచిత తాలకేతు కిరణాళి మెరుంగులు గాఁగ....
.... ... ... ... ... ..' -భీష్మ., 1-52

ఈ పద్యములలో నీతని బాధకు కారణము చెప్పబడినది. బాహువిక్రమశాలి యగు భీష్ముడు పాండవాంబుధి వెల్లివిరిసినపుడు నిలువ నిమ్మగు దీవి యగునని తలచినాడు. అట్టి భీష్ము డస్తమించుటచే నాతని కోరిక సఫల మగునను ఆశ పోయినది. ఈ యిష్టనాశమే ఈతని శోకమున కిట కారణ మయినది. ఇట శోకమున కాలంబనము ధృతరాష్ట్రుడు. మూర్ఛ, విలపనము, మున్నగు అనుభావములచేతను, వైస్వర్యము, అశ్రువు, మున్నగు సాత్త్వికభావములచేతను, చింత, దైన్యము, స్మృతి, మున్నగు సంచారులచేతను ఇది పుష్ట మయినది.

ఇష్టజన నాశమని చెప్పుటచే ఎవరికి కష్టము కలిగినను దానిని కరుణముగా పరిగణించుటకు వీలులేదు. కరుణమున ఎవరియెడ సానుభూతి కలుగుట కవకాశమున్నదో వానినే ఆలంబన విభావముగ తీసికొని వలెను. నాయకునికి గాని, తత్పక్షపాలంబులకు గాని ఇష్టజననాశనాదుల వలన కలిగిన దుఃఖము సహృదయుని హృదయమును కరిగించును. కాని ప్రతినాయక పక్షపాలంబులకు గలిగిన ఆపత్తి వలన సహృదయుని హృదయము ద్రవింపదు. అయినను ప్రత్యక్షముగ యుద్ధము నందు పాల్గొనక, నిస్సహాయుడైన ధృతరాష్ట్రుని యెడ నిచ్చట కొంత సానుభూతి కలుగును; యుద్ధానంతరము మరింత కలుగును. ధృతరాష్ట్రుని యెడ సహృదయునకు కొంత సంకోచముండునేమో గాని పరమ పతివ్రతాశిరోమణియు, వాత్సల్యవతియు నగు గాంధారి యెడ సానుభూతి గాక మరొక్కటి కలుగుట కవకాశము లేదు. కనుక

నిట్టివి కరుణరసమున కుదాహరణము లుగా పరిగణించుట సమంజసము.

ఈ పర్వముననే దుర్యోధనుండు పుచ్చిన దుశ్శాసనుండు కుంభసంభవు పాలికిం బోయి భీష్ముని పాటు చెప్పిన నతండు మూర్ఛిల్లి యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథు కడకు జనిన సందర్భమున –

'... ... ... ... ...
కాలుసేయార్చుటలు లేక కన్నుఁ గవల
నశ్రులొలుకంగఁ జిత్తంబు లడలఁ బాండు
సూనులతిఁ జూచుచుండిరి గాని యించు
కయును గడఁగరు మనవారు గయ్యమునకు' –భీష్మ., 3-417

అని వర్ణించిన సందర్భమున కరుణము, మూర్ఛ, అశ్రువు, విలపనము, మున్నగు భావములచే పోషింప బడినది.

ఇట్లే ద్రోణుని వధ వినినంతనే – 'హృదయంబు జల్లనఁ జెదర వదనంబు వెల్లనయి మొగుడ నివ్వెఱఁ గంది కొండొకసేపు నిశ్చేష్టితుండై యుండి గద్గద వికలకంఠుండగుచు' (ద్రోణ., 1-79) చింతించిన సందర్భముననుకరుణము గలదు. భీష్ముని పాటు వినినప్పటి కంటె ఇప్పుడు ధృతరాష్ట్రుడు ఎక్కువగా విలపించెను. దానికి కారణము నాటికి ద్రోణు డుండె నను ధైర్యము కావచ్చును. కావుననే ఈ ఘట్టమున అనుభావ సాత్త్వికభావములు పై ఘట్టము నందు కంటె నధికముగ చూపబడినవి.

'... ... ... ... ...
... ద్రోణుని పాటు వినియు
వేయి వఱియలై పోవదు ఱాయి గాఁగ
నోపు నాగుండె యేమని యుమ్మలింతు– –ద్రోణ., 1-80 అని

ఆత్మగ్లాని నొందినాడు. ద్రోణుని పరాక్రమమును స్మరించి, తన సైన్యము ఆతనిని కాపాడలేకపోయిన దని నిందించి, కొంతసేపు చింతించి, తదుపరి 'వివశాత్ముడై తన కొడుకుల గెలుపు నెడ నాసమాలుటం జేసి, సొమ్మవోయి పడిన సుదతు లాక్రందన రవముతోడ సత్వరముగ నెత్తి, సెజ్జ యందిడి మెలపున శిశిరవిధులు సేయ సేద తేఱి' నాడు (ద్రోణ., 1-94, 95). అటుపిమ్మట శత్రుపక్ష బలమును, ధర్మమును గణించి స్వపక్షవినాశమును ఊహించి, 'నాచే వచ్చెం గౌరవులకుఁ జేటు' (1-100)

అని వెచ్చనూర్చి ఊరకుండినాడు. ఇందు శోకము, మూర్ఛ, కంపము, వైస్వర్యము, స్తంభము, వైవర్ణ్యము, అశ్రువు, మున్నగు సాత్త్వికభావములచే వ్యక్త మయినది. చింత, స్మృతి, దైన్యము, జడత, మున్నగు వ్యభిచారులచే నిది పుష్టమయినది. ఈ ఘట్టమున అనుభావముల కంటె సాత్త్వికభాములే ఎక్కువగ కన్పట్టును.

డా॥నండూరి రాధాకృష్ణగారు ఈ సందర్భమును గూర్చి ఏదైన మానసోద్వేగము మిక్కిలిగ కలిగినప్పుడు ఆ భావవ్యక్తీకరణమున అనుభావములకు స్థాన ముండదనియు, సాత్త్వికములకే ప్రాముఖ్య ముండుననియు మనోవైజ్ఞానిక శాస్త్రము చెప్పుచున్నదనియు, సాత్త్వికభావములు హృదయాంతరాళములలో గల్గిన బావముల వలన వాని మార్పు వలన జనించునవి గాక భావ తీవ్రతను బట్టి హెచ్చుగ గన్పట్టుననియు చెప్పియున్నారు.'[22]

అభిమన్యుని వధ భారతము నందలి వీరరస ప్రధానమగు ఘట్టములలో నతి ముఖ్యమయినదే అయినను ఇది కొంతవరకు వీరరసమును, కొంతవరకు కరుణ రసమును కలిగియున్నది. మిలమిల మెరిసి నేలవ్రాలిన యభిమన్యుడు బాలుడు. ద్రోణాది కురువీరులను 'ముప్పుతిప్పలు పెట్టి' మూడు చెరువుల నీళ్లు త్రావించి' కయ్యపు పాడి దప్పిన కరకువారిచే చుట్టుముట్టబడి అసువులు బాసిన వీరాభిమన్యుని రణపాండితి హృదయము నెంతగా నుర్రూత లూగించునో, ఆతని మృతి అంతగా కడుపులో చెయివెట్టి కలచును. ఈ ఘట్ట మట్టిది. తిక్కన రచనయు నట్టిది. అభిమన్యుని వధ వరకు గల ఘట్టమును వీరోచిత వర్ణనలతో చక్కగా చిత్రించి వధానంతర ఘట్టమును బీభత్సముగ చిత్రింపక చక్కని యుపమానములతో రమ్యత్వము నాపాదించి నత్యంత రమణీయమగు రీతిని వర్ణించినాడు. 'నెత్తుటఁదోగి నేల యెఱనింగి తెఱంగున నుండె...' 'కరి కళేబరములు ధరణీ ధరములు....' (ద్రోణ., 2-127, 128) అను పద్యములు ఉదాహరణములు[23]. అభిమన్యుని మరణమునకు ప్రకృతి యంతయు విలపించినట్లు-

'పెక్రంద్రు గూడి యుమ్మొయి
నొక్కనిఁజంపుట యధర్మ మోహో యనిన
ద్దిక్కులను బెద్ద యెలుఁగున
నక్కజముగ భూత సంచయంబులు వలికెన్' -ద్రోణ.,2-134

22. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము
23. చూ॥బీభత్సరసము

అని వర్ణించినాడు. ఇటనుండి నడచిన కథలోను విషాదచ్ఛాయలు గలవు. 'కౌంతేయులు చిన్నఁబోవు నాననంబులతో శోకసంతప్త చిత్తులయి చని రివ్విధంబున ధర్మతనయుండు దన నికేతనంబున కరిగి యచట నిఖిల పరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్న సమయంబునం దమ్ముని దెస కూరిమి నారం గూరిన వగపెంపున ధైర్యంబు సొంపఱి, వివర్ణ వదనుండగుచు' (ద్రోణ.2-137

'కొడుకుఁబొడగాన కర్జునుఁ డడిగెనేని
వానితో నింక నేమనువాఁడ హరికి
నతని గారాబు చెలియలి కధిక దుఃఖ
మేన చేసితి వగవంగ నేమిగలదు'

'బాలుఁడు సుకుమారుఁడు పె
క్కాలములం జొచ్చి యెఱుఁగఁ డనక మొన సారం
జాలుగుదు చొరుమని పనిచితి
నేలా నన్నాన దోస మెఱుఁగఁగ నిచ్చన్'

'కుడువను గట్టను బూయను
దొడువను బోఁ బనిచి కాక తొలుత మొన సారం
గొడుకుం బనుచుట కెవ్వఁడుఁ
గడఁగునె నాయట్టి పాపకర్ముఁడు దక్కన్'[24]

అని పలవించినాడు. తనంతట తానుగా అభిమన్యుని ప్రోత్సహించి పంపుటచే నితని కింతటి శోకము ఉద్భవించినది. అందును ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డని పంపి, తమ వంటి పెద్ద లుండియు సాయపడలేకపోయిరే అను చింత దానిని ఇనుమడింప చేసినది. అచ్చట అర్జునుడు సంశప్తకులను చంపి తిరిగి వచ్చునెడ దుర్నిమిత్తములు గన్పట్టగా దిగులు పడుచు నింటికి చేరినాడు. అచటి జను లందరును ఈతనిని చూచి ఆననములు వంచి ప్రక్కకు తొలగిరి. అర్జునుడు ధర్మరాజు కొలువుండిన మందిరమున కేగి చూడగా నం దభిమన్యుడు లేడు.

'అలరు మొగముతోడ నభిమన్యుఁడేలొకో
యెదురు రాఁడు నాకు నెట్టివార్త

---

24. ద్రోణపర్వము, 2.ఆ. పద్య. 140-142

చెవులు సోఁకు నొక్కొ చేవెట్టి కలఁచిన
భంగిఁ ద్రిప్పికొనఁ దొడంగె మనము' -ద్రోణ., 2-230
అని భయపడుచునే మోమున వెల్లదనమున గదుర ధర్మజుని విడిదికి పోయినాడు. 'వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి సవ్యసాచి యడుగులు దొట్రుపడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుంగొని యెలుంగు రాల్పడ నిట్లనియె'.

'ఆననములు వెలువెల్లం
గానడ లొదవినది మీకుఁ గానఁ దడవ మీ
లో నభిమన్యుఁడు లేఁడే
మో నాకుంజెప్పుఁ డేల యూరక యుండన్'[25]

ద్రోణుడు పద్మవ్యూహమును పన్నిన విషయము అతనికి తెలియును. దానిని భేదించుట మాత్రమే అభిమన్యునకు తెలియును కాని తిరిగి వచ్చుట తెలియదు. అందువలన అర్జునుని భయము మరింత హెచ్చి, తుదకు శోకముగ పరిణమించినది.

'అన్నగుమోమును నత్తెలి
గన్నులు నవ్వేడఁద యురముఁ గన్నారంగాఁ
గన్నను బ్రదుకుదుఁ గానక
యున్నను బ్రాణంబు లెట్టు లుండఁగనేర్చున్'
'అక్కట మందభాగ్యునకు నట్టి తనూభవరత్న మెవ్విధిన్
డక్కె విధాత నిర్దయుఁ డొడంబడునే కడు మేలి వస్తువుల్
పెక్కుదినంబులుండ్కి యరిబృందము పిల్చినఁ బోటుబంటనై
యక్కడకేల పోయితి మహా గుణభూషణుఁ గోలుపోయితిన్'
-ద్రోణ., 2-238, 240

అనుచు చదికిలబడి పోయినాడు. ఈ విధముగ నభిమన్యుని రూపమును, సౌకుమార్యమును, తన దౌర్భాగ్యమును తలచుకొని -

'హా యను ధర్మరాజతనయా యను నన్నొడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లినేఁపఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటివోకఁ దగవేయను నేగతిఁబోవువాఁడ నే

25. ద్రోణపర్వము, ఆ.2, ప॥లు 232, 233

నో యభిమన్యుఁడాయనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్'
-ద్రోణ., 2-242

అని అనేక ప్రకారముల పలవించి, ఆతడు చనిపోయిన విధమును అడిగి తెలిసికొని మరల మరల వాపోయినాడు. ఇట పుత్రమరణ మను అనిష్టాప్తి వలన ఈ శోకము కలిగినది. దీనికి ఆలంబనము అర్జునుడు ఇందు అనుభావములు తక్కువ.

ఇట్టి విషాదకరమును, అత్యంత తీక్ష్ణమును అగు మానసోద్వేగము కల్గినపుడు క్రోధము వలననే ఇది యుపశమించునని, ఇది యొక మనోవైజ్ఞానిక మగు సత్యమని, అర్జునుని శోకము సైంధవునిపై కలిగిన క్రోధము వలన అంతమైనదను డా॥నండూరి రాధాకృష్ణ గారి అభిప్రాయ మిట స్మరణీయము.[26]

కన్నతల్లి అగు సుభద్ర శోకమింత అంత అనరానిది. మాతృమూర్తి సహజముగ ప్రేమమూర్తి. మాతృసహజమగు నా ప్రేమయే గట్టుతెంచుకొని స్రవించినది.

'మేను మృదుశయ్య సగము నామేని మీఁద
సగముఁగాఁ జేర్చికొని ముద్దు మిగుల నిద్ర
సేయునట్టి నీవిప్పుడు చెనఁటి నేలఁ
దనువు వొందుట కోర్చితే తండ్రి చెపుమ' -ద్రోణ., 2-334

అని వాపోయినది. మరియు

'అనిల తనూజు లావు గలఁడందురు సాత్యకి శౌర్యశాలినాఁ
జను ద్రుపదుండు సంగర విశారద భావము పూని యుండు మా
త్స్యునిఁ బటు విక్రమాఢ్యుఁడని చూతురు పాండవు లిందఱుండియు
క్కనికిఁ గడంగలేర నినుఁ గావఁగ నేమననేర్తుఁ బుత్రకా' -2-336

అని భీమాదుల నిష్ప్రయోజకత్వమును తలచి తలచి విచారించినది. ఈ రీతిగ బహుప్రకారముల పలవించుచున్న ఈ ఘట్టము కరుణరసోత్పాదకమే అయినను విభావాది సామగ్రీ పరిపోషితము కాదు. 'శోకంబున ఆకులతం బొంది' అని వర్ణించినాడే కాని అనుభావాదుల వర్ణనము మాత్రము లేదు.

కర్ణపర్వమున కర్ణుని మరణమును విని పలవించు ఘట్టమునను శోకమునకు తావు కలిగినది. మొదట సంజయుని 'దుశ్శాసన మృత సంబంధమగు' మాటలను విని 'దుర్యోధనుండును దెగి యనకాదలంచి విహ్వలించి మూర్ఛిల్లినం దల్లడిల్లి

26. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము

యార్తనాదంబులతో వివశంబు లయి వనితాజనంబులు గన్నీరుగ్రమ్మ వసుంధర నొఱగిన నంతకుమున్న వచ్చియున్న విదురుండును నా సూతనందనుండును జేరి చేసేత శీతల జలసేచన మృదువ్యజన వీజనంబుల నన్నరనాథుని నారీసముదాయంబును సేదదేర్చిన నాసీనుండై యతండు దీర్ఘ నిశ్వాసంబు లడరం జింతిల్లి.....'కర్ణ., 1-11వ అను సందర్భమున మూర్ఛ, వివశత్వము, నిశ్వాసము, అశ్రువు - ఇత్యాది భావములచే కరుణము పోషిత మయినది. తదుపరి కర్ణుడు మరణించెనని తెలిసి -

'ఆలలోని యాఁబోతును బోలె నొప్పుఁ
గురు బలంబులో నున్మద ద్విరదమూర్తి
సింహ సంహననుండు నిస్సీమ విక్ర
మాభిరాముండు వోయెనే యక్కటకట'

అని తొడంగి హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు -

'సంజయ మురభంజనుని ధ
సంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుంజెనకి యైన గెలుతు న
నుం జచ్చెనె యట్టివాఁడునుం గయ్యమునన్'

అనియు -

'... ... ... ... ...
యట్టి కర్ణుఁడీల్గె నట్టె యింకెక్కడి
బ్రదుకు మనకు నేటి భండనంబు
దీని వినియు నాదు మానసం బేమియుఁ
గాదు వజ్రమయముగాఁగ నోపు'

అని విలపించి మరియును -

'పారి బంధు పుత్ర మిత్రుల
పరిభవములు వించు నిట్లు ప్రాణముతోనె
వ్వరు నుండుదురే యేనా
క్కరుఁడును దక్కంగ నింత కష్టంబగునే'[27]

---

27. కర్ణపర్వము, ఆ.1, వ॥లు 18-24

అని పలికి మరణోద్యుక్తుండై జలాగ్ని విష ప్రాయోపవేశాదు లుగ్గడించెను.

ఈ సందర్భము కరుణరసావహము. ఇట ఈ శోకమునకు ఆలంబనము ధృతరాష్ట్రుడు. ఇష్టనాశము వలన ఇది ఉత్పన్నము. విలాపము, మరణ యత్నము అనునవి అనుభావములు. చింత, స్మృతి, దైన్యము వ్యభిచారులు. అశ్రువు, వైస్వర్యము సాత్త్వికభావములు.

సంజయుడు దుర్యోధన, శల్య మరణములను గాంచి పిదప –

'కురుక్షేత్రము నందుండి పూర్వాహ్ణంబునఁ గరి నగరంబున కరుగుదెంచి' –

'పారిఁబారి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రుపడ సంభృత శోకత రాజవీథి నె
వ్వరిఁ గనియైన హా మహిత వైభవ హా ధృతరాష్ట్రపుత్ర హా
కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్'
'జన నయనచకోరానం
దనుఁడగు నృపచంద్రుఁ డనుచితంబయిన విధం
బున నస్తమించె నంచుం
దనుడోలనభరిత భూరిదైన్యం డగుచున్'[28]

ఏడ్చుచెరగు నెలుంగుతో జననాథ శల్యుడు సమసె సౌబలుడు గీటడఁగె....' శల్య.,1-9 అని చెప్పు సందర్భమున కరుణరసము విభావాది సామగ్రిచే పరిపుష్టమయినది. ఇట శోకమునకు ఆలంబనము సంజయుడు. ఇష్ట నాశము వలననే నిదియు జనించినది. వినాశము, దుఃఖప్రాప్తి అను విభావములను గలవు. అశ్రుపాతము, విలాపము, ముఖశోషణము, వైవర్ణ్యము, మున్నగునవి అనుభావములు. విషాదము, దైన్యము, కంపము, అశ్రువు, వివర్ణత, గాద్గద్యము, సంచారులు.

ఈ సంగతి వినిన వెంటనే 'అమ్మహీపతి మూర్ఛిల్లె. విదురుండును వివశుండై యొఱగెఁ గాంధారియుఁ గోడండ్రును జెయ్యేదిపుడమిం బడిరి తక్కటి చుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబుల చందం బైరి సంజయ ప్రయత్నంబున నందఱుం గ్రమంబునం దేఱిరప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితిఁ దమ్ముండ యిటమీఁద నీవ నాకుగతి యగు మనుచు మగుడ నిగుడు

28. శల్యపర్వము, ఆ.1, పలు 5-7

'అరుగుదెంచి యందంత నవనీకాంతుఁ గాంచి యధిక శోకాక్రాంతయై యార్తింగూరి యాక్రందనంబుసేయ....'ః సౌప్తిక.,2-25, 26ః అని వర్ణించిన సందర్భమును కరుణరసావహమే.

ఇట శోకమున ముఖ్యముగ ద్రౌపది ధర్మజుడు ఆలంబనములు. పుత్రపౌత్ర మరణము వలన ఇది ఉత్పన్న మయినది. ధర్మజుని విలాపము నందు కంటె ద్రౌపది విలాపమున అనుభావము లెక్కువగ చూపబడినవి. ధర్మజుని విషయమున మూర్ఛ చెప్పబడగా, ద్రౌపది విషయమున అశ్రుపాతము, విలాపము, ముఖశోషణము, వైవర్ణ్యము, ఇత్యాదులు వర్ణింప బడినవి. స్త్రీలకు సహజముగ మనఃస్థైర్యము తక్కువగా నుండును. వారు ఇట్టి ఆపదలకు తట్టుకొనలేరు. పురుషులు కొంతవరకు ధీరత్వమును కలిగియుందురు. ఇట్టి ప్రకృతసిద్ధమగు అంశమును కడు చక్కగా చూపియున్నారు తిక్కన గారు.

స్త్రీపర్వము ఆద్యంతము కరుణరసోస్ఫోరకమే. దీనిని 'కరుణరస' పర్వమన్నను అనవచ్చును. స్త్రీపర్వము ప్రధానమున భావాత్మక మయినదని, ఇందు కథకు ప్రాధాన్యము లేదని, ఒక విధముగా కథయే లేనిదనవచ్చునని, శోక భావమునకే ప్రాధాన్యమొసగబడినదని, ఇది కరుణరసాత్మ మని డా॥రంగారావు గారు అభిప్రాయ పడిరి.[30] ఇది ఎంతయు సత్యము.

ధృతరాష్ట్రుడు కౌరవ వధూవర్గముతో పొలికలనికి పోవు ఘట్టము హృదయ వేదనాపాదకమగు శోకోత్కటమున కాటపట్టగు ఘట్టము. పదునెనిమిది దినముల మహాయుద్ధము ముగిసినది. పదునెనిమిది అక్షోహిణుల సైన్యము నేలకొరిగినది. తదుపరి నక్కలు, కాకులు, రాబందులు, గ్రద్దలు, తోడేళ్లు, మున్నగునవి అట పడియున్న శవముల కొఱకై కాట్లాడుకొనుచున్న యుద్ధభూమిలో తాళికట్టిన భర్తలను, తమ తోడబుట్టిన వారిని, నవమాసములు మోసి కన్నబిడ్డలను, బ్రదుకును పంచుకొనిన బంధుమిత్రంబును వెదకుకొనుచు నారీజనకోటి అంతిపురమున వీడి ఎండనుబడి వచ్చుటను తిక్కన గారు ఎట్లు వర్ణించిరో చూడుడు.

'చేతులు నడుదలసేర్చు టుత్కటశోక
మాకారములు దాల్చినట్టులుండ

30. Conception & Practice of Poetry of Kavitrayam & Nachanasomana

విరిసిన వేనలుల్ వెన్నులఁ బ్రక్కల
నెఱసి చూపఱదృష్టి నీఱుసేయ
నందంద దొరఁగెడు నశ్రుజలంబుల
పెంపున మోములు ముంపఁబడఁగ
నేమియుఁ దొడవులు లేమిఁ బాడఱియున్న
యంగంబులందు దైన్యంబు నెరయఁ
బతుల నన్నలఁదమ్ముల సుతుల హితులఁ
బేరుకొని వాతులెండంగఁ బ్రేముడించి
పనవు పలుకులు వినువారి వనటఁదేల్పఁ
గురు కుమార నారీజనకోటి వచ్చె'
'చెలులైనఁజూడఁ బయ్యెద
దొలఁగుటకును సిగ్గుపడు వధూజన తతియ
త్తల యెదుర నేకవస్త్రం
బులతో నంగములు వికృతిఁబొందఁగ నడచెన్'[31]

వీరికి ఒడలిమీద స్పృహయైనను లేదట. వారి మనస్సులు ఈలోకమున లేవు. పూర్వము పయిట కొద్దిగా చెదరినను సిగ్గుపడెడి వీరు, నేడు అత్తల యెదుట నేకవస్త్రంబులతో నంగములు వికృతి పొందగ నడచిరట. మరియు వేటకాండ్రు మగసింహములను చంపగా పర్వతకందరముల నుండి వెలువడు ఆడు సింహముల వలె హర్మ్యముల నుండి వెలువడు కురుకాంత లొప్పిరట. దర్మజుడను జనసహితుడై సమరతలంబునకు రాగా ఈ వనితాజనము లక్కౌంతేయాగ్రజుం గనుంగొని, కరంబులెత్తి ఏడ్చుచు, నెదుర్కొని దూఱినవిధము స్త్రీజన సహజమును, స్త్రీజన స్వభావానుగుణమును అయి యున్నది. 'ధర్మవేదిత్వ మీధరణీశ్వరుని కెక్కడి యది' అనుచు తండ్రుల, మామల, తాతల, కొడుకుల, తోబుట్టువుల ద్రుంచెననియు, క్రూరత మెరయునట్లు కురుజనంబుల కూల్చెననియు, సఖుల సంబంధుల జంపిన అదయుడనియు నిందించి, అంతటితో తృప్తినొందక, 'అందర మ్రింగితి విభూతి యన నీకెద్దీ' అనియును పలికిరి. ఈ హృదయ శోధకములగు పలుకులు ఎట్టివారికైనను కన్నీటిని తెప్పించును.

---

31. స్త్రీపర్వము, ఆ.1,పాలు 98, 99

స్త్రీపర్వమున గాంధారి మూర్తీభవించిన శోకదేవత. భీముడు గదతో తన కుమారుని నాభికి దిగువ కొట్టుటయు, దుశ్శాసనుని క్రూరముగ వధించుటయు హృదయాఘాతములు కాగా-

'అంధులకు నూఁతకోలగా నకట యొకని
నైన నిలుపక నూర్వుర నదయవృత్తి
మ్రింగి తం దెవ్వఁడేనియు మీకు నెగ్గు
లాచరింపనివాఁడు లేఁడయ్యె నయ్య' -స్త్రీ.,1-770

అని భీముని దీనముగ ప్రశ్నించినది. తాను దుఃఖాతిశాయి యైనను, తనవలెనే దుఃఖమున నున్న ద్రౌపదిని చూచి గాంధారి వెలువర్చిన సానుభూతియు ప్రశంసనీయము. 'పుత్రశోకమునఁ బొగులుచు నెండ దాకి వందిన తీగ చందమున నున్న ద్రౌపది గాంధారిని సమీపించి మ్రొక్కి వెక్కుచున్న' యా వృద్ధమాత -

'పుత్రి యిట్లగునమ్మ శోకముఁ బొంది కుందుచునున్న నీ
గాత్ర మొండొక కీడుపాటిలి కందుఁ... ...'
-స్త్రీ., 1-183

అని ఆమె నూరార్చినది. గాంధారి ఈ పర్వము నందు తన దుఃఖమును మాత్రమే గాక ఇతర కౌరవ పాండవ వనితా జనముల హృదయగత మగు దుఃఖమును గూడ వెలువరించినది.

'ధృతరాష్ట్రం బొదివికొని వాసుదేవ పురస్సరులయి యప్పనికిం జనుచుఁ గౌరవకాంతలఁ దత్ప్రదేశంబునకు నడపించిన నప్పుడయ్యతులు పతులును సుతులును సోదరులును బౌత్రులును మిత్రులును గుణపంబులై పడియున్నఁ జూచి చెయ్యేది మేదిని నొఱగువారును, వావిడిచి యరచువారును, బురపురం బొక్కువారును, బడిపొరలుచుఁ బొగులువారును వేనలులు వీడి వెన్నుల విరియం దిరుగువారును బలవించువారును బేర్కొని యగ్గించువారును మ్రాన్పడువారును, మోములుందలలును మోఁదుకొనువారునునై రప్పుడా దుర్యోధన జనని జనార్దనుం బేర్కొని చేరంబిలిచి పరమశోకార్త యగుచు' (స్త్రీ., ఆ.2, వ.10) రణరంగమున తమ ఆత్మీయుల కళేబరములను గాంచి పలువిధముల హృదయవిదారకమగు భంగి దుఃఖించుచున్న కురుకాంతల నొక్కొక్కరినే కృష్ణునకు చూపుచు తన హృదయ వేదనను

వెలిగ్రక్కుచున్నది. మాటమాటకు కోటి నిప్పుకోలలు హృదయమును దొలియున్నట్లుగ వ్యాఖ్యానము గావించినదట.

పాలికలను నందు మహావీరు శరీరములను కంకశివాగృధ్రకాక కులము లాదిగా గలుగు క్రవ్యాదములు పీకుచున్నవి. హంసతూలికాతల్పములందుండు భోగిజనముల మృదుగాత్రములు పరుసని ధరణి భాగమున కూలియున్నవి. నిత్యోత్సవముగ చెవిని సొగియించు వీణారవమును, గానమును, వేణురావమును విను రాజులకు నేడు శివారుతము శరణ్యమైనది. సారచందన హృద్యకస్తూరి కాది లేపనాలిప్తి నుండెడు భూపవర్యులు శోణిత పంకదిగ్ధాంగులైరి (స్త్రీ.2-15, 16). స్వీయనాథ, జనక, పుత్ర, సోదర, శవముల పొంత కేగి శిరములు గానక వెదకువారు కొందరు, పెక్కు ముక్కలుగనైన తమవారి యంగములను దగ్గరకు చేర్చి మూర్ఛిల్లువారు కొందరునైరని -

'అట్టలకడ నుత్తమాంగముల్ గానక
యిటమట నలుగడ లరయువారు
దలలు చేతులఁగొని తనువు లత్తలమునఁ
దఱచు పీనుఁగులలోఁ దడవువారు
శిరములు మేనులఁజేర్చి భావించి ని
జాన్యముల్ వ్రేసి కొంచఱచువారు
తునియలు పెక్కైనఁ బనివడి గూర్చి రూ
పుఱు గనుంగొని మూర్ఛ మనుగువారు
నైన కౌరవ పాంచాల మానినీ జ
నముల నచ్చ్యుత చూడుము నాథ జనక
పుత్ర సోదర శవముల పొంతకేఁగి
పెక్కు దురవస్థ లొందెద రక్కటకట' -స్త్రీ., 2-22
'అవయవములు రూపఱగఁ గ్రవ్యాది భక్షి
తంబులైయున్కిఁగొన్ని శవంబు లువిద
లెంత సూచియు నవి గొంద ఱెఱుఁగఁజాల
రయ్యెదరు సూడు తమ బంధులగుటఁ గృష్ణ' -స్త్రీ.,2-23

ఈ వర్ణన మంతయు కరుణరసోత్పాదకమే.

దుర్యోధనుని కళేబరము గాంచి గాంధారి మూర్ఛనొంది, కొంతసేపునకు తెలిసి, తచ్ఛవంబుకడకు పోయి,

'విపుల వక్షముమీఁద నస్త్రులు వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతికుంజర కౌరవేశ్వర నేల నిమ్మెయి నీ యుదా
త్తపు శరీరముఁ బొందఁబాడియె తల్లి వచ్చిన భక్తితో
నుపచరింపక లాఁతివై యిటు లూరకుండుట యుక్తమే' స్త్రీ.,2-27

అని మరియు ననేక ప్రకారంబుల పలవించుచు యా సుబలనందన హాహాకారంబు లెసగ రోదనంబు చేసినది.

'ఆహవంబున యందు నీ వోహటించి
పోవ నడివచ్చు నడికంటెఁ జావుమేలు
శస్త్రజీవితఁ బరలోకసౌఖ్య మనుభ
వింపు మమరత్వ సంపద వెలయు మంటి'
'అని చెప్పియుంటి నా చె
ప్పినయట్టులు సేసి యితఁడు పేరును బెంపుం
గని యుండఁగ నిట్లడలున
మునుఁగుటరయఁ గడుపుశోకమున పెంపు సుమీ' -స్త్రీ.,2-23,34

అని దుఃఖించినది. ఒకవంక కన్నకడుపు తీపిచే దుఃఖించుచుంటి ననియు, మరొక వంక ధృతరాష్ట్రుని దిక్కులేమి తలచి దుఃఖించుచుంటి ననియు చెప్పిన మాటలు చదువరుల గుండెలను కరగింపకమానవు. కోడండ్ర దుఃఖమును, కుమార్తె దుస్థితిని చూచుకొలది గాంధారి శోకము పట్టరానిదైనది. తన కోడలిని చూపి -

'కొడుకుచావుకంటెఁ గొడలి యడలునఁ
బెరిఁగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గలమెరియంగఁ
దొడఁగె దీనికేది తుది యుపేంద్ర' -స్త్రీ.,2-44

అని వాపోయినది.

'చూడు మిమ్ముద్దియ సుతుఁజూచి వదన మ
ల్లార్పుచుఁ బ్రాణేశు నాననంబు
పై జూడ్కి యడరించి పాణితలంబున

నందంద నెమ్మొగ మడచికొనుచు
... ... ... ...' -స్త్రీ., 2-45

ఉన్నదట. మరల కొడుకుదెస కరిగిన మనసు పేరడలున మునుగగ అతని చెన్నుమోమున తన మోము మోపి మూర్ఛిల్లుచు, మరల దెలివొంది విభుని ఉరమును గ్రుమ్ముచున్నదట. ఇది ఎంతటి హృదయవిదారకమగు దృశ్యమో కదా! మరియు -

'ఈ సుమధ్యమ యిమ్మహీశ్వరు బాహు త
తంబున లలితోపలాలనంబు
నొంది రాగిల్లెడు నుల్లంబుతోనుండు
నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ
వచ్చుఁ గనుంగొన వశముగాదిది యిట్టి
కొడుకును మనుమండుఁ బుడమినిట్లు
పడియుండఁ జూచెడు పాపజాతికి నిప్పు
డవియక నిగ్గడియైన యినుప
గుండియకుఁ జేటు పాటింపకఁ బుండరీక
నయన యెన్నఁడుఁ లేమి నిర్ణయముగాదె
యింతకోర్చెడునట్టి వారెన్నఁడేని
నుర్వి నెందేనిఁ గలుగుదురొక్కొ యొరులు' -స్త్రీ.,2-47

అని అనేకభంగుల విలాపము చేసి 'కౌరవనృపతి తనూజశతంబు గంటె' అని తన శతపుత్రులను చూపి దుఃఖాబ్ధిని మునింగినది.

'జననియుఁ దండ్రియుఁ దొలు బా
మునఁజేసిన పాపకర్మమునఁగాక సుయో
ధనుఁడు మొదలయిన నూర్వుర
ననఘుఁడు ధర్మజుఁడు నామ మడపఁగ దగునే' -స్త్రీ.,2-54

అని మాతృసహజముగ పలవించినది. ఇంతలో దుశ్శాసనుని శవము పొడగట్ట -

'అచ్యుత వీఁడె మహోభీతభుజుఁడగు
భీము గదాహతి భూమిఁగూలి
యాతనిచేత సర్వాంగంబులందును
గలుగు క్రొన్నెత్తురు కాంక్షఁద్రావఁ

బడి మఱి తెగబారి పడియున్నవాఁడు దు
శ్శాసనుఁ డీతండు....' -స్త్రీ., 2-55

అనియు -

'వీఁడెఁ వికర్ణుండు వాఁడి మెఱుంగు మే
ఘంబులగముల మధ్యంబు నందుఁ
దేజరిల్లెడు మాడ్కి రాజిల్లుచున్న వాఁ
డు ... ...' -స్త్రీ., 2-64

అనియు దీనముగ పల్కినది. మరియు -

'రమణి పారిఁబోరిఁ గన్నీరు గ్రమ్మఁ జుట్టు
మెలఁగి కాకుల గ్రద్దలఁ దోలంగ నడుచు
చున్నయది పాసి యవివోవకున్న నిట్లు
సూతురే తల్లులెందును సుతుల నకట'

అని హృదయవిదారకముగ పలికినది. కన్నతల్లి తన ముద్దుల కుమారులను ఇట్లు కనుట హృదయమును కరగించు దృశ్యము. ఇట్లే దుర్ముఖుని, శూరసేనుని, వివింశతుని గని దుఃఖించినది.

ఉత్తర విలాపమును తిక్కనార్యుడు కరుణరసాత్మకముగ చిత్రించినాడు. అభిమన్యుని కళేబరముపై బడి దుఃఖించు ఉత్తర దీనావస్థనుగాంచి గాంధారి -

'ఉత్తర యిక్కుమారోత్తము నురమున
వ్రాలి మోమునఁ దన వదన కమల
మందంద సేర్చుచున్నది మున్ను గన్నంత
మెలఁగంద నేరక చెలులమాటు
గొను సిగ్గుపెంపున వనట నిట్లయ్యె ని
ప్పుడు మాటిమాటికిఁ బొలఁతి ప్రియునిఁ
గనుఁగొని బిగియారఁగౌఁగలించుచు శిర
మూరుతలంబున నునిచి పాణి
పల్లవంబున నానన మల్లనల్లఁ
దొడయుచును నిన్నుఁ జూచుచుఁదోడుతోడఁ
బొడము పెల్లునఁ గన్నీరుదుడిచికొనుచు
నలత పెనువెల్లిఁదేలెడు నంబుజాక్షి' -స్త్రీ., 2-74

అని వర్ణించినది. ఇది ఎంతయు స్వాభావికమగు వర్ణనము. 'నిన్బొందఁ గాంచి యాఱునెలలుపోయె నంతియ' అనుమాటలు హృదయమునుకరగింప శక్తిగలవి. ఇట మోమున మోమిడుట, కౌగలించుకొనుట, మున్నగు అనుభావములు వర్ణింప బడినవి. ఈ అనుభావముల వర్ణనము స్త్రీజన సహజమగు బేలతనమును చూపుచు కరుణరసోద్దీపకముగ నున్నది.

'హృదయమున వగలేని యట్టిట్టునట్టుఁ
దిరుగుచున్నది దుస్సల వరుని శిరము
గానకీకూఁతు నిమ్మెయిఁ గనుటకంటెఁ
దలఁప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ' -స్త్రీ., 2-96

అని తన కూతు చూచి వాపోయినది.

భూరి శ్రవసుని వర్ణించు ఘట్టమున భూరిశ్రవసుని తల్లి తన భర్తకొరకు, సుతుని కొరకు దుఃఖించుటలో కరుణము అంగిగా, శృంగారము అంగముగా గలదు. ఇట శృంగార, కరుణరస సాంకర్య ముండుటచే నిది రససాంకర్య ప్రకరణమున వివరింప బడినది.

తరువాత గాంధారి సోదరు డగు శకుని కళేబరమును గాంచినది. అతడొనర్చిన దుష్కార్యముల నన్నిటిని తలచినది. కురువంశ నాశనమునకు పాండునందనులతోడి వైరమునకు నీతడే కర్తయని నిందించినది. తదుపరి కురు పాండవ పక్షమున నింకను చనిపోయిన వీరుల చుట్టును చేరి దుఃఖించు ప్రియాంగనా జనమును కృష్ణునకు చూపినది.

స్త్రీపర్వమున చివరిఘట్టము ధర్మజునకు కర్ణుడు అగ్రజుడని తెలుపుట. ధర్మరాజు అనుభవించిన ఆవేదన వర్ణనాతీతము. తన సోదరుని చేతులార చంపుట వలన వారి దుఃఖము అధికమైనది. 'దుస్సహంబులగు నమ్మాటలు చెవుల నూఁడినట్లయిన-బాండవులు పరమ దుఃఖావేశము నొంది రందు భీమాదులు నివ్వెఱపడియుండ ధర్మనందనుండు దల్లడిల్లుచుం దల్లితో నిట్లనియె –

'అనిలజార్జునుల మార్కొన నేర్చె నెవ్వని
యుత్సాహమూఁది సుయోధనుండు
... ... ... ... ...'

అని ఆతని బలపరాక్రమముల నుగ్గడించి 'అట్టి కర్ణునిఁ గొంగున నగ్ని డాఁచినట్టు లెమ్మెయి డాఁచితో యమ్మ అని అడిగినాడు.

'భానుపుత్రుని చావు బంధులనెల్లఁ
బరమ సంతాపంబు పాల్పడఁజేసె
... ... ... ...
... మాకు గలుగ దడలు'

అని విలాపంబు సేసి 'విషాదము శిథిలవర్ణంబులతో'[32] తిలోదకంబు లిచ్చినాడట. ఈతడు విలపించినరీతి హృదయమున్న ప్రతిమానవునికి కన్నీరు తెప్పించును.

ఈరీతిగ ధర్మజుడు కర్ణుని గూర్చి విలపించు ఘట్టమున 'హత పాత్ర గతే కరుణే' అను కరుణాభాస లక్షణముననుసరించి కరుణాభాసమా అను సందేహము కలుగవచ్చును. శత్రువును సంహరించి, ఆతని మరణమునకు విలపించుట కరుణాభాస లక్షణము. కాని ఇట కరుణాభాసము కాదు. ఏలన కర్ణుడు తన కగ్రజుడని తెలిసిన పిదప విలపించినాడు. ఇది ఇష్టనాశము వలన కలిగిన దుఃఖమే కావున కరుణమే కాని కరుణరసాభాసము కాదు.

స్త్రీపర్వ మంతయు కరుణరసావహమే అను నంశము విదితమగు చున్నది. కౌరవ పాండవ స్త్రీజనములు శోకమున కాలంబనముగ నుండిరి. ఈపర్వమునందంతట ఇష్టనాశమే కాన ఈ కరుణము పితృ, భర్తృ, పుత్ర, పౌత్ర నాశము వలననే కలిగినదని చెప్పవచ్చును. అనుభావవర్ణనము ఇందు హెచ్చుగా కాననగు చున్నది. దానికి గల కారణము వీరందరు స్త్రీజనంబు లగుటయే. స్మృతి, దైన్యము, జడత, మోహము, ఇత్యాది సంచారిభావము లిందు గన్పట్టును. స్త్రీజనాలంబనము, స్త్రీజనాశ్రయము నగుటచే నీ కరుణ మిట యింత ఉత్కటమయినది. ప్రాచీన కవులగు కాళిదాస భవభూత్యాదులు నాయికానాయక గత వియోగము వలన కరుణమును పోషింపగా, తిక్కనార్యుడు పుత్రాదుల వినాశము వలన కరుణమును పోసించినాడు. కావున ఈ భారతభాగము పుత్రాది వియోగమును గూర్చి చెప్పిన ఆలంకిరిక నియమమునకు లక్ష్యప్రాయముగ నున్నదన వచ్చును.

ఈపర్వము నందలి ఛందోరీతియు రసానుగుణముగనే యున్నది. ప్రథమాశ్వాసము చివర శిఖరిణిని వాడియున్నాడు. ఈ వృత్తౌచిత్యమును గూర్చి

32. స్త్రీపర్వము ., ఆ.2, 177-184

డా॥ పాటిబండ మాధవశర్మగా రిట్లు చెప్పి యున్నారు. 'స్త్రీపర్వమున ప్రథమాశ్వాసము ధృతరాష్ట్ర విలాపమయము. ఆతని విలాపమున అంతర్వ్యాహి నిగ పాండవద్వేషము కనిపించును. ఓజఃప్రదీప్తసమయిన యార్ద్రత యాతని చిత్తలక్షణము. ఈ యాశ్వాసము చివర ఓజస్విని యైన శిఖరిణిని వాడెను. ద్వితీయాశ్వాస మంతయు గాంధారీ విలాపము. ఆమె చిత్తము కరుణరసమయము. ఆ యాశ్వాసము చివర మధుర మంథరమైన 'మందాక్రాంతము'ను తిక్కన వాడెను. పర్వరసానుసారి యైన వృత్తమును పర్వాంతమున వాడుట ఛందోమర్మజ్ఞతకు పరాకోటి. 'ప్రావృట్ ప్రవాస వ్యసనే మందాక్రాంత విరాజతే' అని క్షేమేంద్రుడు మేఘసందేశము నందలి మందాక్రాంత విప్రలంభమునను,కరుణమునను ఉచితముగా నుండు ననుట సత్యమే. కరుణరస తరంగిణి యగు స్త్రీపర్వము యొక్క పర్వాంతమున మందాక్రాంతనే వాడి కవిబ్రహ్మ ఔచిత్యమును పాటించినాడు'[33] ఈ మాటలెంతయు సత్యములు. ఇట్లే మణిమాల ॥స్త్రీ.,2-107॥, మంజుభాషిణి॥స్త్రీ.,1-63॥, దోధకము, తోదకము, తోటకము, ఇత్యాది వృత్తముల నన్నిటిని వాడి తన రసపోషణ సామర్థ్యముతోపాటు ఔచితీసంపాదనమును కూడ చాటుకొనినాడు తిక్కన.

కరుణము నింత ఉత్కటముగ వర్ణించుటకు గల కారణమేమి? ఈపర్వముననే ఇంత విపులముగ ఏల వర్ణింపవలయును? అని ఆశంకించుకొని ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగా రిట్లు నమాధానమును చెప్పియున్నారు. 'భారతమున ప్రధానమైనశాంతమున కత్యవహితముగ ముందు ప్రవర్తింప చేయబడిన అంగరస మిది. తత్పూర్వ మున్నవి వీరాది యుద్ధరసభావములు ఎంత తావన్మాత్రలుగ చేయబడి వర్ణింపబడినను అవి శాంతరస విరోధులే. ఈ కరుణము వీరాది యుద్ధరసభావముల స్ఫూర్తిని దూరీకరించి సహృదయుల బుద్ధులను శ్వాంతమున కభిముఖము చేయుటకు గాను ప్రవర్తింపచేయ బడినది. అందువలన విపులముగ వర్ణింప బడినది'[34] ప్రధాన రస దృష్ట్యా శాంతిసప్తకమునకు పూర్వమిట్లు కరుణమును ఉత్కటముగ వర్ణించుట తిక్కనార్యుని రసపోషణ సామర్థ్యమును వెల్లడిచేయుచున్నది.

శాంతిత్రయములో మొదటిదగు శాంతిపర్వమున ప్రధానముగ శాంతమే యున్నను ఉపాఖ్యానములలో నొకటి యగు కపోతోపాఖ్యానమున మాత్రము

33. ఆంధ్రమహాభారతము - ఛందశ్శిల్పము. పు.283-284

34. తిక్కన కావ్యశిల్పము, పు. 469

కరుణము చోటుచేసికొన్నది. ఇది కరుణరస విలసితమగు గాథయేయై నను అంగిరసమగు శాంతమున కున్ముఖముగనే నడచినది. అంగిరసపోషణమునకు దోహదము చేసినది.

ఒకనాడు పెనుగాలియు, వానయును ముట్టి ఒక మహాటవిలోని జీవుల కన్నింటికి భయంకర మగునటుల వినాశకారియై ఎసగినది. పాపాత్ముడగు బోయ పక్షులను వధించువాడు ఏతదర్థమునకై ఏగుదెంచి గాలివానలో చిక్కుకొనినాడు. ఆయరణ్యమంతయు జలమయ మగుటయు, చీకటిపడుటయు, కారణములుగ నాతడొక వనస్పతిని, జొంపమయి యున్నదానిని ఆశ్రయించి రాత్రి యగుటచే శిలయె సెజ్జ గాగ శీతార్తుడై యుండినాడు (శాంతి., 3-307).

'ఆలుబ్ధకుఁడత్తరువర
మాలోకించి కడుభక్తి ననియె నిచటి భూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలత ననుఁగాచుటకు విశిష్ట వినీతిన్' -శాంతి.,3-308

ఈరీతిగ నాతడు ఈతరువు నాలోకించి ప్రార్థించుచుండగా ఆ మహీ రుహకోటరములో నున్న ఒక కపోతము తన వల్లభ ఎటయేని మేతకు పోయి రాక తడసిన శోకించి -

'ఎచట నున్నది యొక్కొ యింతప్రొద్దొకచోట
నుండునే ననుఁబాసి యుజ్జ్వలాంగి
యమ్మేను లేకున్న నిమ్మేని కలిమి ని
రర్థకం బధికానురాగయుక్త
యగు సతి గుణముల యైహికాముష్మిక
సుఖసాధనంబులు సువ్వె పతికి
యేకారణంబున నేమయ్యెనో వాన
యేపునఁదెగియెఁగానోపు నకట
... ... ... ...' -3-310

అని పలవించినది. ఈ మాటలను బోయ వలలో చిక్కుకొని యున్న పెంటి పావురము వినినది. దాని మనము సంతోషమగ్నము కాగా -

'పతి మదికి నింత యెక్కిన
యతివ గదా పుణ్యవతి ప్రియాలాపములీ
గతి వినఁగాంచితి జన్మము

గృతకృత్యంబయ్యె నాకు గెలిచితి జమునిన్' -3-311

అని యానందించినది. తన గతిని పతి కెఱింగించి విధికృతంబునకు వగవం బనిలేదని మరియు నిట్లనినది -

'శరణము సొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁజేయుటత్యధిక ధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసి మహోర్తు వీని శరణాగతు నోదనభంగి నాపదం
బొరయకయుండఁ జేయుము ప్రభూతపుసీతునఁ గొంకు వోయెడున్'
-3-313

అని ప్రబోధించినది. మగపావురము శోకమును డిగ్గ విడిచి సకరుణముగ బోయను తన యీప్సితార్థంబేమని అడిగి, కనుగొని, తత్ప్రకారమున నొక యగ్నిని రాజవేసినది. 'సీతున సకలాంగకంబులు ప్రతున్నము లయ్యెడు దీనిఁబాపవే' యనిన ఆ బోయ తన యంగకంబుల నయ్యె నల శిఖాకలాపమున నల్లన యల్లన కాచి శీతబాధ నముడుగంగ చేసికొనెను. తదుపరి ఆకలిదీర్చు నుపాయము గానక చివర కాపావురము 'నీవు డస్సితి వాతిథ్య నియతివలయు నా శరీరం బాహారంబుగ నిచ్చెద గొనుము' - 3-321, 322ః అని పలికి అగ్ని కాహుతియైనది. దానినిగని పాపాత్ముడగు ఆ బోయ విస్మయంబడి ప్రాన్పడి తరువాత -

'కలదె యిమ్మెయి పౌరుషంబు జగతిం గారుణ్య మేపార ని
ష్ప్రాలుఁగిల్లెచ్చునె మేను .... .... ' -3-325

అని అంతరంగమున వైరాగ్యంబు నిరంతరంబగుటయు నంత నిలువక దాను పట్టిన పులుగుల నన్నిటిని స్వేచ్ఛగా విడిచిపుచ్చి తన్ని హతిసాధనమును పారవైచెను. ఆ కపోతినాథు డట్టు అగ్నిలో పడుటకు శోకవహ్ని చిత్తమాకులముగ, వెలుగు రాలుపడగ నిట్లు స్త్రీసహజమగు విధమున పలవించినది.

'నా యాకలి కోర్వవెపుడు
వేయైనను నేఁగొనంగ వెండియనుభవిం
తాయాసపడుటఁ గనుఁగొని
నోయుదు ననుఁబాసి యిటు సనుట దగవగునే' -3-330

అని తన భర్తయొక్క ధర్మబుద్ధిని, తన యందలి అనురాగమును స్మరించినది. ఇంతలో తమ దాంపత్యజీవనము స్ఫురణకు రాగా -

'ఇగురు జొంపంబుల నింపారు విరులను
బలుపైన పొదల క్రేవలకుఁదార్చి
.... .... ....' -3-332

'ఆనందమొంద గేలి సలిపెడు నీదగులీల మఱువ నావశంబె ప్రాణేశ ప్రాణంబు లిపుడ, నిన్నకూర్చి యేతెంతు నీసన్నకడకు' అని గొంకులేక యనలము ఘనముగ దరికొల్పి, మది వికాసము పొంద తన వల్లభుం దలఁచుచు లీలం జొచ్చియతనిం గూడ జనినది.

ఈ విధముగ వీరు శరణాగత రక్షణమునకై వైరాగ్యముతో తమ ప్రాణముల నర్పించి స్ఫురిత విమానముపై నమరపతి గొలువ పుణ్యలోకమున కరిగిరి ।3-358।

ఇందు కరుణము అంగముగ పోసింపబడి బోయవాని శిలాహృదయమును కూడ కరగించి పాపాత్ముని పుణ్యాత్మునిగా మార్చినది.

'... ... ... ... ...
... ... బెంపారు వైరాగ్య సం
పద పాపంబునెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థాన పుణ్యత్వమొం
దెద నేనిప్పుడ యంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁడై' 3-327

అనురీతిని మార్చగల ఇంతటి అద్భుతశక్తి కరుణరసమునకు తక్క తదితర రసము దేనికిని లేదనుటకు ఈ యుపాఖ్యానమే నిదర్శనము. ఈ కపోతోపాఖ్యానమున కపోత దంపతులను కేవల పక్షిదంపతులుగ కాక మానవులలోని దంపతులుగానేచిత్రించినట్లు కాననగును. ఈ కపోత దంపతుల భావము లన్నియు మానవ స్వభావానుగుణముగనే ఉన్నవి. వీని ప్రవర్తనయు శ్రేష్ఠమానవ గుణగణముల పైననే ఆధారపడి యున్నది. కావున కవిబ్రహ్మ యగు తిక్కనార్యుడు ఇట మానవీకరణమును (humanisation) ఏర్పరచినట్లు విదిత మగుచున్నది. ఇవి తిర్యక్కులను స్ఫురణము లీలామాత్ర గోచరము. మానవకోటి యందు ఉత్తముని స్వభావమును చిత్రించుటలో ఎంతైన ఆవశ్యకత యున్నది. కాని ఈ ఉత్తమత్వమునే తిర్యక్కులలో వెలార్చుట బహుకష్టసాధ్యము. ఇట్టి దుష్కర కార్యమును, అనితరసాధారణమగు కార్యమును చేపట్టి దానిని సాధించి అర్వాచీనులగు అనంతామాత్యాదులకు మార్గదర్శకు డయినాడు తిక్కన.

ఆనుశాసనిక పర్వమున భీష్మనిర్యాణ సందర్భమున గంగాదేవి కృష్ణాదులను కనుగొని దుఃఖించు ఘట్టమును కరుణరసావహమై చదువరులకు కన్నీటిని తెప్పించును.

'ఉదకంబులం దుండి యుత్థితయై శోక
విహ్వలత్వంబున వికలగమన
యగుచు నెమ్మోముపై నశ్రులు గ్రమ్మఁగాఁ
జనుదెంచి కౌరవసమితి యెదుర
నిలిచి ... ... ...' –అను.,అ.5,474–476

అని విలాపము చేసినదట. ఇట శోకమున కాలంబనము గంగాదేవి. పుత్రనాశన మను విభావము వలన ఇది జనించినది. వికలగమన యగుట, నెమ్మోముపై నశ్రులు క్రమ్ముట, అను అనుభావములచే నిది వర్ణితము.

అశ్వమేధము నందలి పరీక్షిన్మరణ ఘట్టము కరుణరసపూరితము. అంతఃపుర స్త్రీల విలాపము వలన నిది పోషిత మయినది.

'పద్మనాభుండు వచ్చిన బాలుఁ జంకఁ
బెట్టికొనిపోయి మ్రొక్కింతుఁ బ్రీతి యెసఁగ
నని తలంచుచు నుండితి నమ్మనోర
థంబు విఫలంబుగాఁజేసె ద్రౌణిపేర్చి'

'అని యంత నిలువని వలవంత పెంపున బాలశవంబు నెత్తికొని యంకతలంబున నిడికొని తదాననం బాలోకించి'

'తాత లోకగురుఁడు దామోదరుఁడు వచ్చి
యుండ లేచి మ్రొక్కి పుజ్జ్వలాంగ
ధర్మవేదియైన తండ్రికిఁ బుట్టియ
ధర్మపరుఁడ వగుట తగునె నీకు'
'కనువిచ్చి గొంతిఁజూడుము
ననుజూడుము ద్రుపదనృప తనయఁ జూడుము నీ
జనకుని తల్లి సుభద్రం
దనయా చూడు తలయెత్తి దరహాసముతోన్'
'అని పలవించి యా సరసిజాసన మూర్ఛ మునింగి నేలవ్రా
లినఁ గరుణంబు పెంపున విలీనతఁబొందు మనంబులన్ సబా

ష్పనయన యుగ్మకంబులను బొడఁటు మోములు నైన కౌరవాం
గన లయలంతఁ గాంచిన వగల్ మిగులుం బగవారికేనియున్'[35]

అని వర్ణించిన సందర్భము కరుణరసోత్పాదకము, ఇట శోకమునకు ఆలంబనము అంగనాజనములే అయినను ప్రధానముగ ఉత్తర ఆలంబనము. పుత్రనాశమను విభావము వలన జనించినది. అశ్రుపాతము, విలాపము, ముఖశోషణము, మున్నగు అనుభావములచేతను, మూర్ఛ, విషాదము, దైన్యము, కంపము, అశ్రువు, వివర్ణత, మున్నగు సంచారులచేతను నిది పోషింప బడినది.

ఈ పర్వముననే హృదయమును కరగించు సన్నివేశము మరి యొకటి గలదు. అర్జునుని రాక వినగనే సైంధవుని కుమారుడు హృదయ మాగి మరణించును. సోదరియైన దుస్సల నెవ్వగతో మనుమని తోడ్కొని అర్జునుని కెదురేగి పౌత్ర ప్రాణభిక్ష నర్థించును. అప్పుడు అర్జునుడు శోకాక్రాంతుడై శోకమడర –

'రాచకొలమిది గాల్పనే క్రౌర్య మూల
మని తలంచుచు నాతఁ డయ్యతివతోడ
నధమవృత్తి సుయోధనుం డంతకంటె
నేముఁ గొఱగాము మాచేత నింతపుట్టె' -4-47

అని పలికి బహుసాంత్వనముల నూరార్చి, యా సుదతి మస్తకముం దన యక్కున చేర్చి యామెను వీడ్కొలుపును, ၊ అశ్వమేధ., 4-46-48၊ ఇది విభావాది సామగ్రీపరిపోషితము గాదు. కరుణము ఇట రేఖామాత్ర గోచరము.

అశ్రమవాసపర్వము నందలి ప్రథమాశ్వాసమున గల ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడై వనమునకు పోవు సందర్భమునను తిక్కన కరుణరసావిష్కరణమును గావించినాడు.

'గొంతి మొదలైన కౌరవ
కాంతాజనులెల్ల నెవ్వగలఁ బొగులుచుఁ బ
క్ష్మాంతంబుల బాష్పసలిల
సంతానము లురులఁదోన చనుదేరంగన్' -అశ్రమవాస., 1-138

ఏగు చుండిరి.

35. అశ్వమేధపర్వము, ఆ.3, ప॥లు 182-186

'పాండవాగ్రజుఁ డక్కురు భర్తవలను
శోకదీనుఁడై తప్పక చూచి యేడ్చి
హా మహారాజముఖ్య యెందరిగె దనుచు
నొడలు కంపింపఁ జదికిలఁబడియె నధిప' -అ(శ., 1-140

ఆ ధర్మజుని చేష్టలను, స్థితిని, పలుకులను వర్ణించి శోకమును పెంపొందిచినాడు తిక్కన. ఏమియు చేయలేక ఏడ్చి ఏడ్చి తుదకు నొడలు కంపింప చదికిలబడియె ననుటచే నీ సందర్భ మెంతయో స్వాభావికమై రసోద్బోధకంబగు చున్నది. ఇంకను-

'నరుఁ డనునయించె వెసన
న్నరపతి నెత్తుచును దాన నయమున్ వనటం
బురపురఁబొక్కెం గురు భూ
వర యద్దెస తెలుఁగురాదు వాక్రువ్వంగన్' -1-141

ఈ చివరి వాక్యముచే ఆస్థితి వర్ణింపశక్యము కాదని చెప్పుచు ఆ శోకమును పరకోటి నధిష్ఠింప చేసినాడు తిక్కనార్యుడు. 'పిదప కుంతియు నరణ్యమునకు బోవ సిద్ధపడుటయు, ధర్మజాదులు వలదని ప్రార్థించుటయు ఆ సందర్భమున వారి సంభాషణములు, చేష్టలు, ఏడ్పులు, ఓదార్పులు ఎంతయు నుదాత్తములై ఎట్టి ధైర్యవంతునకైనను కన్నీరు తెప్పించునవై యున్నవని'[36] ని శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారు చెప్పియున్నారు.

ధర్మజుడు ధృతరాష్ట్రప్రభృతులు మృతు లగుటకు శోకించు సందర్భమును కరుణరసమునకు ఉదాహరణము కాగలదు.

'... ... నయ్యశేషవృత్త
మును నేర్పడఁగ వింటి మూడు కళేబర
ములు గంటి నక్కురుపుంగవుండు
భార్యయుఁ బాండుని పత్నియు సద్గతి
నొందిరి నీవింక నుమ్మలింప
కుండుమని శోకమొదవి యాతడు బాహు
లెత్తి యెలుఁగు సెలఁగ నేడ్పుఁదమ్ము

36. ఆంధ్రభారత కవితావిమర్శనము, పు. 424

లడలు గదిరి యేడ్చి రవ్వార్త నంతఃపు
రమున రోదనార్తరవము లెసగ'        -ఆ(శ., 2-156

'అవ్విశేషంబు -

'విని పౌరజనసమూహము
లనయంబును వనట మునిగి హాహారవముల్
వినువీథి ముట్ట రోదన
మొనరించె నవ్వేళఁ గరుణ ముత్కటమయ్యెన్'- ఆ(శ., 2-157, 158

అని వర్ణింప బడినది. ఇష్టనాశము అను విభావము వలననే శోక ముత్పన్న మయినది. ఎలుగుసెలఁగ నేడ్చుట, రోదనము, ఇత్యాది భావములచే నిది పోషితము. తదితర భావసామగ్రి అంతగా లేదు.

'పటు తరంబగు ఛటచ్ఛట రవ మెసగంగ
(మాకులుఁ బొదలును (గాఁచికొనుచుఁ
...     ...     ...'    -ఆ(శ., 2-151

అను పద్యమున వర్ణితమైన కార్చిచ్చు కుంతీసహితంబుగా గాంధారీధృతరా(ష్ట్రులను దగ్ధులను గావించినది. ఉపవాసక్లేశమున కాలుగదల్ప జాలని కుంతీ గాంధారీ ధృతరా(ష్ట్రుల నిట్టి మహానలము చుట్టుకొనుటచే యుక్కిరిబిక్కిరియై దిక్కుగానక యోగనిష్ఠామా(త శరణ్యులై దేహములను విడిచిరి. ఇది కావ్య మర్యాదలతో విలసిల్లిన కరుణరసఘట్టమని, అంగియైన శాంతమున కిది దోహదము చేసినదని ఈ సందర్భమును వివరించుచు శ్రీ కేశవసంతుల నరసింహశా(స్త్రి గారు చెప్పియున్నారు.[37] 'తొలగిపోవ లావు లేరైరి' అను చెప్పుచోట వారి స్థితి కొంత దయనీయముగా కనిపించును. ఇట విభావాదిసామ(గి కొలదిగనైనను లేదు. కరుణరసచ్ఛాయ గలదని చెప్పవచ్చునేమో కాని కరుణరస ఘట్టమనుట కంతగా అవకాశము కానరాదు.

మౌసలపర్వము యాదవనాశము, కృష్ణనిర్యాణము, ఇత్యాది ఘట్టములచే కరుణరస(ప్రధానమగు చిన్న (ప్రబంధ మనిపించును. ఈపర్వమును యధామూలకముగ తెనిగించెననియు, (ప్రధానములగు కావ్యలక్షణము లన్నియు సమకూరి కరుణ రసపోషణము స(క్రమముగ నిర్వహింపబడినదనియు, విరాటమున లేని వస్త్వైక్యము

37. మహాభారతోపన్యాసములు, పు.287

కూడ ఇందు సంఘటిల్లినదని పలువురు అభిప్రాయపడిరి. ప్రసిద్ధమగు యాదవులచరిత్ర ఇందలి యితివృత్తము. కరుణరస మంగిగ, వీరము అంగముగా గల పర్వము, ధర్మజుని హృదయము శమాభిముఖమై నది. కణ్వాదుల శాపముతో నుపక్రమింపబడిన యితివృత్తము, ద్వారక యందలి మహోత్పాతములు, సాంఘికములైన అల్లకల్లోలములు, యాదవుల యున్మార్గ ప్రవర్తనము - ఇత్యాదులచే పోషింపబడి యాదవనాశముచే రసోన్ముఖము గావింపబడి, బలరామకృష్ణ నిర్యాణములచే రసోత్పత్తి నొంది, యాదవాంగనల ఆక్రందనములచే పరిపుష్టి నందినది.

'ద్వారకావాసులెల్లను దల్లడం బు
లుల్లములఁగప్ప మోముల నురుల బాష్ప
ధార లతికరుణముగ హాహారవంబు
లెసగ నేఁగిరి వెనుకను నిరుదెసలను' -మౌసల, 145

అను సందర్భమునను -

' ... ... ... ...

... నని నిర్గతప్రాణులై పడియున్న
భోజులను నంధకుల వృష్ణులను గలయఁ
జూడంగ నుత్కటశోకంబు గదిరిన
నటిముటి మేదిని నొఱగువారు
విప్రలాపంబు నానాప్రకారంబులఁ
జేయువారును నిరుచేయి నెత్తి
యలత నాక్రందనములు హాహావముల
తో నొనర్చువారును నైన...' -మౌసల., 151

అను సందర్భమునను విలాపము, అశ్రువు, రోదనము, ఇత్యాది అనుభావములు కలవు.

కృష్ణుడు లేమిచే కాంతివిహీనమై దీనమై యున్నదట ద్వారకానగరము. అట్టి ద్వారక యందు ప్రవేశించునప్పటి అర్జునుని చుట్టుకొని విలపించు మురాంతకాంగనల స్థితి కొంతవరకు కరుణరసోత్పాదకమే యనవచ్చును.

'అరిగి మగండు సచ్చిన కులాంగనయున్ శశిగ్రుంకినట్టి శ
ర్వరియును బోల్పఁ బట్టగుచు వారిజనాభుఁడు లేని దీనతం
బొరసి కృపైకభాజనతఁ బొందిన యప్పురిఁజూచి మానసం
బెరియఁగఁజొచ్చె నేటి కెదురీఁదిన చాడ్పున నేమిసెప్పుదున్' -
మౌసల.,98

ఆత్మబంధువగు అర్జునుని కనగానే అంతవర కడగియుండిన వారి దుఃఖమంతయు నొక్కుమ్మడిగ పైకి ఉబికినదై ఆ యాదవాంగన లందరను ముంచి వైచినది.

'గనుటయుఁ గ్రొత్తపేరడలు సైపగఁలేక మురాంతక ప్రియాం
గనలు పదాఱువేలును మొగంబులఁగప్పఁగ బాష్పవారి రో
దనరవముల్ సెలంగఁగఁ బదంబులు దొట్రుపడంగ దైన్యముల్
తనువులు దాల్చినట్టు దెరలం జనుదెంచిరి పార్థు పాలికిన్' -
మౌసల.,100

'వారలఁగాంచి శోక మనివారణఁ జిత్తము పెల్లగింప న
క్కౌరవ సత్తముండెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచుం
దేరొకభంగి డిగ్గి యిలఁద్రెళ్లిన యద్దురవస్థఁ జూచినన్
వైరులకైన డెందములు వ్రయ్యలుగావగదాఁకు భూవరా' -మౌసల;101.

దైన్యములే తనువులు దాల్చినట్లుగా నున్న ఆ అంగనాజనముల వర్ణనము, వైరికైనను డెందము వ్రయ్యలు చేయుస్థితి యందున్న అర్జునుని వర్ణనము కరుణారసోత్పాదకములే. యాదవాంగనల శోకమునకు వారే ఆలంబనము. ఇష్టనాశము వలన జనించినట్టిది. అశ్రుపాతము, విలాపము, వైవర్ణ్యము అనుభావములు. విషాదము, దైన్యము, కంపము, అశ్రువు, వివర్ణత సంచారులు. అర్జునుని విషయమునను ఎలుగు గాద్గద్య మగుటను వర్ణించినాడు.

శల్యపర్వమున కురుపతి యూరుభంగము జరిగిన పిదప సంజయుడు తనను సమీపింపగా ధూళి పొదివిన వదనంబుపై నరసిన వెంద్రుకలు వాయంద్రోచికొని సంజయుని మొగము చూచి ధర్మనందనుని నిందించుచు నవుడుగఱచి, కన్నీరు గ్రమ్మ నిట్టూర్పు నిగడించి తన దుఃస్థితిని గూర్చి పరితపించెను. చిన్ననాటనుండి అనూన వైభవములను అనుభవించి మానధనుడుగ మన్ననకెక్కి 'నేల నాలుగుసెరగుల నేలి భీష్మ గురు కృపాదులపై కార్యభారము నిలిపియున్నవానికి తుది నిట్టులుండ

వలసె' అనుదానికంటె దుఃఖదాయకమగు అంశ మింకొక్కటి యుండదు.

'మఱియు నొకండు వింటె పవనూనతనూజుని చెయ్దిఁబెన్దొడల్
విఱిగి ధరిత్రిఁబడ్డయెడ వేగమె వచ్చి శిరంబుఁదన్నె నే
డ్తెఱఁగలయిష్ట శత్రు నవధీరితుఁ జేయుట యొప్పుగాక యే
పఱినఁ బరాభవించిన జనావళి నవ్వదె నొవ్వదే మదిన్'

అని తన యవమానమును తలచి మనసులో కుమిలినాడు. ఆ యధర్మయుద్ధమును నూరజాటుమని సంజయునితో 'అనిమిష వాహినీ తనయు నస్త్రకళా గురు.......' అని తనకు వారిపట్ల గల క్రోధమును వ్యక్తపరచినాడు. తన పూర్వవైభవమును స్మరించినాడు. తామందరును కలసి పాండవులకు చేసి ఎగ్గుల నేమాత్రము దలపక తన దుఃఖావేశముచే వారలను దూఱినాడు.[38] ఇది కరుణరసాత్మకముగా స్థూలదృష్టికి తోపవచ్చును. వైభవనాశము వలనను, క్లేశము వలనను దుఃఖము సంభవించినది. అశ్రువు, విలాపము, అవుడు గఱచుట, మున్నగు అనుభావములచే నిది వ్యక్తము స్మృతి, దైన్యము సంచారులు.

కాని ప్రతినాయకుడును, అనేకానర్థములకు కారకుడును, ఏమాత్రము పశ్చాత్తాపమును లేక ఎదిరిదోషములనే యెంచుచు నున్నవాడును అగు దుర్యోధనునకు జరిగిన భంగపాటు వలనను, ఇష్టజన విభవనాశనముల వలనను సహృదయున కెట్టి సానుభూతియు గలుగదు. కనుక నిట్టిదానిని కరుణరసమునకు ఉదాహరణముగ స్వీకరించుట తగదని భావింప వలెను.

భీష్మద్రోణాదులు నేలకొరిగిరన్న వార్త వినినప్పుడు ధృతరాష్ట్రుడు పడిన యావేదన సహృదయుని మనమును కదల్చును. కంటికి కన్నీరు తెప్పించును. ధృతరాష్ట్రుడు ప్రతినాయకపక్షమునం దుండినను నిస్సహాయు డగుటచేత ఆతనియెడ సహృదయునకు ఆయాతావుల సానుభూతి కలిగితీరును. కనుక కరుణమునకు ఉదాహరణములుగ గ్రహింపవలసి వచ్చినది. కాని రథచక్రము నేలను క్రుంగినప్పుడు అప్రతీకారంబులగు రోషవిషాదంబుల కన్నీరొలుక రథము డిగ్గినాడు కర్ణుడు (కర్ణ., 3-350) ప్రతినాయకపక్షము వహించి, అనేక పాపములకు ఒడిగట్టిన కర్ణుని యెడ శ్రీకృష్ణునికి సానుభూతి కలుగనట్లే సహృదయునకు సానుభూతి కలుగదు. కర్ణుని నొప్పించుటకును, కర్ణుని సంహరించు పనికి అర్జునుని ఒప్పించుటకును, శ్రీకృష్ణుని

38. శల్యపర్వము, ఆ.2, పాలు 381-394

సోల్లుంఠన వాక్యములు భారతమున గలవు ఈ వాక్యముల వలన ఏదైన సానుభూతి లేశము సహృదయునకు కలుగబోయిన అది సుదూరమగును. కనుక ఇట్టి సందర్భములను కరుణరసమునకు ఉదాహరణములుగ స్వీకరింపలేదు.

ఇక కరుణాభాసమునకు ఉదాహరణము - 'ఇట్లు మహాతేజోధనుండగు నజ్జననాథుం డట్లు శోపియించి కుంతి చేసిన కర్ణగోపనంబు ప్రసంగంబుగా నంతరంగంబు గృతపడిన కార్యంబుల దెస నిగుడం దన కతంబున మృతిఁబొందిన యుభయపక్ష బంధుమిత్రకోటు లం దలంచి, యుమ్మలించి, విశేషించి కర్ణు చావునకుఁ దూర వగచి విహ్వలించి వివ్వచ్చు నాననం బాలోకించి...' ౹శ్యాంతి., 1-42౹.

మహాభారత యుద్ధానంతరమున ధర్మజుడు జ్ఞాతిపధమునకు ఉద్విగ్నమనస్కుడయ్యెను. తన కతంబున మృతి పొందిన ఉభయపక్ష బంధుమిత్రకోటిని దలంచి ఉమ్మలించి విశేషించి కర్ణు జావునకు దూర వగచి విహ్వలించెను. ఇట నాటికి కర్ణుడు తన కగ్రజుడని తెలిసినది కావున కర్ణుని గూర్చి విలపించిన సందర్భములోను, తన పక్షము వారిని గూర్చి విలపించిన సందర్భములోను ఇష్టనాశమే కావున కరుణమే గలదు. కాని ఇట 'ఉభయపక్షముల' నుటచే శత్రుపక్షము వారికొఱకు కూడ విలపించినట్లు అర్థమగుచున్నవి. ఎరిగి ఎరిగి యుద్ధముచేసి, జ్ఞాతివధ మొనర్చి జరిగిన దానికి ఉమ్మలించుట 'హతపాత్రగతే కరుణే' అను కరుణాభాస లక్షణమునకు లక్ష్యమగుచున్నదేమో యని అనిపించు చున్నది.

డా॥ నండూరి రాధాకృష్ణగారు ఉద్యోగపర్వము నందలి ధృతరాష్ట్రుని దుఃఖమును ౹ఉద్యో.,2-184-200౹ గూర్చి చెప్పుచు ఇట కరుణాభాసము కలదనిరి. 'నేనేమిసేయుదు నెందు జొత్తు నెవ్వరి శరణంబు వేడెదు...' అనురీతిని పలవించినాడట. ధృతరాష్ట్రుడు. ఈ సందర్భమును వివరించి చివరగా 'ఈఘట్టము కేవలము కరుణాభాసమును మాత్రమే కల్గించును. ఏమన పాఠకులకు మొదటినుండియు ధృతరాష్ట్రుని మనస్తత్వ మెఱుకపడినదే. అతడు తన లోభత్వమునను పుత్రులపై గల మమకారము వలనను నింతకు దెచ్చికొనినాడు కావున నిట్టివానిపై పాఠకులకు సానుభూతి కలుగదు. కావున ఈతని శోకము వలన కరుణము కలుగక కరుణాభాసము మాత్రమే కలిగినది'[39] అని చెప్పిరి.

---

39. కరుణరసము - ఆంధ్రవాఙ్మయము

పాఠకులకు సానుభూతి కలుగకపోవచ్చు నను మాట సత్యమే అయియున్నను కరుణాభాస లక్షణము దీనికి వర్తింపకపోవుటచే దీనిని కరుణాభాస మనుటకు వీలులేకున్నవి.

తాత్కాలికమగు మానసోద్వేగమును కలిగించినను అది యెల్లయు శాంత రసాభిముఖ్యమును కలిగించునది కావున కరుణమును ఒకింత విపులముగానే తిక్కన గారు పోషించినారు. శాంతవీరములతో కొంచెము కుడిఎడముగా తిక్కన గారి భారతభాగమున కరుణము తావు కలిగించుకొన్నది. ఇది శాంతమునకు అంగ మయినది.

# 8వ ప్రకరణము

## రౌద్రరసము - తిక్కన భారతము

### రౌద్రరసము :

నవ రసములలో నొకటి యగు రౌద్రము క్రోధస్థాయికము. రక్తవర్ణము. రుద్రదైవతము. భరతుని నాట్య శాస్త్రమున రౌద్రరస సంబంధమగు గద్యయు, కొన్ని ఆర్యలును గలవు. వానిని పరిశీలించిన రౌద్రరస స్వరూపము విదితము కాగలదు. ఇది క్రోధ మనెడి స్థాయి భావము నుండి జనించును. ఇది రక్ష దానవోద్ధతమగు మనుష్యప్రకృతికము. సంగ్రామహేతుకము. అనగా రాక్షసుల, దానవుల, ఉద్ధతమనుష్యుల ప్రకృతులకు సంబంధించి యుండుననియు, సంగ్రామము వలన జనించుననియు అర్థము. క్రోధము, అధర్షణము: ఇతరుల భార్యలను చెరచుట:, అధిక్షేపము :దేవ-జాతి-అభిజన-విద్యా-కర్మలను నిందించుట, అవమానము, అసత్యవచనము, ఉపఘాతము :పనివారలను బాధించుట:, వాక్పారుష్యము :కొట్టుదును, చంపుదును అని భయపెట్టుట :, అభిద్రోహము :చంపదలంచుట:, అసూయ, మున్నగు విభావములచే రౌద్రరస ముత్పన్నమగును. కొట్టుట, విరచుట, మర్దించుట, నరకుటఆయుధమును గ్రహించుట, శస్త్రములను ప్రయోగించుట, రక్తమును స్రవింపచేయుట మున్నగునవి ఇందలి అనుభావములు. మరియు ఎఱ్ఱని కనులు, చెమట, బొమ ముడివేయుట, పండ్లుకొరుకుట, ఔడు కరచుట, చెక్కిళ్లు అదరుట, అరచేతుల నాండొంటితో రాయుట, మున్నగు అనుబావములచే రౌద్రమును అభినయింప వలెను. సంమోహము, ఉత్సాహము, అవేగము,అమర్షము, చపలత, ఉగ్రత, గర్వము,స్వేదము, వేపథువు, రోమాంచము, స్వరభేదము, మున్నగునవి ఇందలి వ్యభిచారులు.

ఉద్రేకముతో చంప తలంపుగలవారును, ఆయా పాత్రధారులును ఉద్ధతులు. రాక్షసులును, దానవులునుఉద్ధత ప్రకృతి గలవారు. ప్రతిజ్ఞాపాలనమున రుధిర పానము గావించిన భీమసేనుడు, మొదలగువారు మానవులలో ఇట్టివారు. ఇందు అనుభావముగ చెప్పబడిన తాడనపాటనాది కర్మలను రంగమున ప్రత్యక్షమున

ప్రదర్శింపరాదు. కావున వచన మాత్రముననే వర్ణింప వలెను. 'యుద్ధము, రాజ్యభ్రంశము, మరణము, నగరోపరోధము, ప్రత్యక్షముగ రంగమునప్రదర్శింపరాదని నిషేధమున్నది. రక్తనయనాదులను రంగమున ప్రత్యక్షముగ ప్రదర్శింప వచ్చును. రక్షోదానవోద్ధతాదుల ననుకరించి అభినయించునప్పుడు ఉద్దీపనము లేకున్నను తచ్చేష్టిత మనుకరించునప్పుడు నర్మగోష్ఠ్యాదికము కూడ తాడనాది ప్రధానముగనె యుండును. వారి యారంభమునర్వ మట్లె యుండునని మునియు నినును. ఉద్దీపనములు సంభవించినప్పుడు రక్తనయ నాదికము తాడనాదిగ్రస్తమె యగును. తాడన మనునదిచప్పట్లు చఱచుట, పాటనము బద్దలు చేయుట,పీడనము మర్దనము, రక్షఃప్రభృతులు నర్మవిధానమున గూడప్రహరింతురు. అప్పుడు రక్తము చిమ్ముటయే కాని యధిక ముండదు' [1] అని నాట్యవేదము.

రౌద్రము రక్షోదానవాదులకు మాత్రమే చెప్పబడినది కదా! అదింక ఇతరులకు సంబంధించి యుండదా! అనినదీనికి సమాధానమును ఇట్లు చెప్పవచ్చును. ఇది ఇతరులకును సంబంధించి యుండును. కాని అధికార మిందు స్వీకరింతుము. రక్షోదానవాదులు స్వభావ సిద్ధముగనె రౌద్రులు. అట్లనినిత్యము పరిజనమున క్రుద్ధు లగుదురని తలంపరాదు. వారుస్వభావ రౌద్రముకలవారగుటయె కాదు. అంగరౌద్రమున కూడ నుందురు. అనేక బాహువులు, అనేక ముఖములు, చింపిరిగానున్న పింగల శిరోజములు, ఎఱ్ఱనిమిడిగ్రుడ్లు, భయంకరమయిన నల్లని రూపములునుకలిగి యుందురు. లోకప్రసిద్ధాకారము కంటె వారలకు విపరీతమగు వికృతాకార ముండును. వారు తపమాచరించినచోఅదియు ఘోరముగనె ఉండును. పరవినాశము నభిలషించి వారు తపమొనరింతురు. వారు కంటికికన్పడక పోయినను వారిలో క్రోధాభిసంధి యున్నదనిపించును. వారుశృంగారమును కూడ క్రూరాకారముగనె సేవింతురు. క్రోధకాలమున వలె రక్త నేత్రములను త్రిప్పుచునే యుందురు. కేవలము వారి శరీరము ఇట్లుండుటయే గాక, వారి చేష్టిత మేది అయిననురౌద్రా స్వాదజనకముగనే ఉండును. వారి స్వభావచేష్టితము రౌద్రముగనె ఉండును. వాచిక, ఆంగిక చేష్టలన్నియు రౌద్రభూయిష్టములే. ప్రమదలకూడినపుడు, బతిమలాడుకొను సందర్భములను సర్వమును పరుషముగను, క్రూరముగను ఉండును. ఇది అంతయు రక్షోదానవుల రీతి,రాక్షసాదులను అనుకరించెడి పురుష లందును సంగ్రామ సంప్రహారకృతమైన రౌద్రరస ముత్పన్నమగును. ఇది

1. నాట్య వేదము, పుటలు 221-22

ఉద్ధతరీతి. ఉద్ధత మనుష్యులు బహు బాహుముఖములతో నుందరు. కేవలము రక్షోదానవుల కార్యము లుండక పోయినను సంగ్రామ సంప్రహారములు, తాడనపాటనాదులును ఉండును. బహు బాహుత్వాదులు లేకపోయినను ఈ యుద్ధతులు క్రోధోచితము లయిన వాగంగ చేష్టితములచే రౌద్రప్రకృతు లగుదురు. ఈవిషయములను వివరించు అనువంశ్యములైన ఆర్యలు -

'యుద్ధప్రహార ఘాతన వికృతచ్ఛేదన విదారణైశ్చైవ
సంగ్రామ సంభ్రమాద్యైరేభిః సంజాయతే రౌద్రః
నానాప్రహరణమోక్షైః శిరః కబంధ భుజకర్తనైశ్చైవ
ఏభిశ్చార్థ విశేషై రస్యాభినయః ప్రయోక్తవ్యః
ఇతి రౌద్రరసో దృష్టో రౌద్ర వాగంగ చేష్టితః
శస్త్ర ప్రహారభూయిష్ఠ ఉగ్రకర్మ క్రియాత్మకః'[2]

యుద్ధప్రహార ఘాతములు, వికృతచ్ఛేదన విదారణములు, సంగ్రామ సంభ్రమాదులచే రౌద్రరసము జనించును. వివిధములైన శస్త్రములనుప్రయోగించుట, శిరమును, మొండెమును, భుజములను ఖండించుట, మున్నగు వానిచే దీని నభినయింప వలెను. ఇట్లు రౌద్రములైన వాక్కులు, అంగములు, చేష్టలు కలిగినదై శస్త్రప్రహారములతో కూడినదై, ఉగ్రకర్మలతో నిండినదై రౌద్రరసము ఒప్పుచుండును.

సాహిత్యదర్పణమున ఇట్లు కలదు - 'రౌద్రమునకు క్రోధము స్థాయి భావము. రక్తవర్ణము. రుద్రు డధిదేవతః ౹రక్తాధిదైవతః- రక్త మధిదేవత అని ఒకచో కలదు. నరసభూపాలీయమున ఫాలాక్షు డనెను -నరసభూపాలీయము. సన్నిధానము వారివ్యాఖ్య,వు. 437॥. ఆలంబన విభావము శత్రువు. వాని యపకారాది చేష్టలు ఉద్దీపన విభావములు. పిడికిట పొడుచుట, నేలమీద పడవేయుట, వికృతముగాచీల్చుట, సంగ్రామమున సంభ్రమించుట, మున్నగు వానిచే రౌద్రము లెస్సగా నుద్దీప్తమగును. భ్రూభంగము, ఓష్ఠనిర్దంశము, బాహు స్ఫోటనము, తర్జనము, ఆత్మావదాన కథనము, ఆయుధోత్క్షేపణము, ఉగ్రత్వము, ఆవేగము, రోమాంచము, స్వేదము, వేపథువు, మదము, అక్షేపము, క్రూర సందర్శనము అనునవి అనుభావములు. మోహము, అమర్షము,ఉగ్రత ఆవేగము, మన్నగునవి వ్యభిచారి భావములు.[3]

---

2. నాట్య శాస్త్రము, అ. 6, శ్లో॥ లు 64-66
3. సాహిత్యదర్పణము, 3-227-30 శ్లో ॥

ధనంజయుని దశ రూపకమున -

'క్రోధోమత్సర వైరివైకృతమయైః పోషోఽస్యరౌద్రోఽనుజః
క్షోభః స్వాధరే దంశకంప భృకుటిస్వేదాస్యరాగైర్యుతః
శస్త్రోల్లాస వికత్థనాంస ధరణీఘాత ప్రతిజ్ఞాగ్రహై
రత్రామర్ష మదౌస్మృతిశ్చపలతా సూయౌగ్ర్యవేగాదయః ॥ [4]

"శత్రుకృత తిరస్కృతి మొదలైన వాని వలన పుష్టమయి రౌద్రమగుచున్నది అని ధనంజయుడు పేర్కొనినాడు.

ఈ రీతిగాదశరూపక లక్షణముమాత్రమే కాక, రసగంగాధర, కావ్యానుశాసన, రసార్ణవసుధాకర, నాట్యదర్పణముల లక్షణములును పై వానితో సంవదించు చున్నవి.

పై యాలంకారికుల నిర్వచనములను పరిశీలింప రౌద్రరసస్వరూప మిట్లు అవగత మగును. రౌద్రమునకు స్థాయి క్రోధము. శత్రువులు ఆలంబనము. వారి చేష్టలు ఉద్దీపనము. పిడికిటిపోటులు, నేలపై బడవేయుటలు, వికృతముగా చీల్చుటలు ఉద్దీపనములు. ఔడుగరచుట, కనుబొమలు ముడుచుట, ఉగ్రత, ఆవేగము, రోమాంచము, స్వేదము, కంపము,ఇత్యాదులు అనుభావములు. మోహామర్షాదులు వ్యభిచారులు.

**ఇతర రసములతో సంబంధము :** రౌద్రము కరుణము తరువాత పేర్కొన బడినది. శారదాతనయుని కథనము ననుసరించిఈ రౌద్రము 'భరతులు దక్షాధ్వరధ్వంసము నభినయించినప్పుడు పశ్చిమ దిక్కుగా నున్నబ్రహ్మముఖము నుండి ఆరభటీవృత్తితో కూడిఉత్పన్నమైనదట' [5] భరతుడు దీనిని జనకరసమని, ఉత్పత్తి హేతుకమగు రసమని, దీనినుండి కరుణము ఉత్పన్నమైనదనుచు 'శృంగారాద్ధిభవేద్హాస్యో రౌద్రాత్తు కరుణోరసః, ।నాట్య, 6-31। అనిచెప్పియున్నాడు. శారదా తనయుడును రౌద్రము నుండియే కరుణము జనించెనను నభిప్రాయమును చెప్పెను : చూ. కరుణరసముః.

డిమమున దక్క మిగిలిన వాఙ్మయమున రౌద్రరసమునకు అంగిగా స్థానము లేదు. వీరాదులకంగముగనే యిదిఎక్కుడు రమ్యము. అలంకారిక నియమానుసారముగ కూడ ఇది అంగముగపోషింపబడవలయునే కాని అంగిగా దీని కవకాశము లేదు. ఇది

4. దశరూపకము, 4-75 శ్లో ॥ ।నరిసెల్లి వారి వ్యాఖ్యానము, పు. 85।
5. భావప్రకాశము, 3వ అధికారము, పుటలు 57, 58

వీరమునకుఅంగముగ నుండి అంగిరస పోషణకు ఉపకరించును. కరుణముతో జన్యజనక సంబంధమును కలిగియున్నది. యుద్ధవీరముతో నిది ఎక్కుడు సామ్యమును కలిగియున్నది. ఈరెండింటికి ఆలంబనోద్దీపన విభావములు సాధారణములే. మరియు అనుభావ వ్యభిచారులు కూడ పెక్కు సాధారణములే. అయినను రౌద్రమునకు స్థాయి భావము క్రోధము. యుద్ధవీరమునకు స్థాయిభావము ఉత్సాహము. రౌద్రరస నాయకుడు ధీరోద్ధతుడు. వీరరస నాయకుడు ధీరోదాత్తుడు. రౌద్రరసమున కనుభావములగు రక్తాస్యత్వము, రక్తనేత్రత్వము యుద్ధవీరమునకు అనుభావములు కావు. ఈ రీతిగారౌద్ర వీరరసములకు గల భేదసామ్యములు తెలియనగును.

ఈరౌద్రమునకు హాస్యశృంగార భయానకములు విరోధి రసములు. వీరము పోషకరసము.

**రౌద్రరస భేదములుః** 'అంగనేపథ్య వాక్యైశ్చ హాస్య రౌద్రో త్రిధాస్మృతౌ' ః నాట్య, 6-77ః అనుసూత్రము ననుసరించి అంగ, నేపథ్య వాక్యములచే ఈ రౌద్రము త్రివిధములని తెలియుచున్నది. వాక్య రౌద్రమునే స్వభావ రౌద్రమని వ్యవహరింతురు.

భారతము – రౌద్రము :

తిక్కన గారి భారతభాగమున రౌద్రము ఎట్లు పోషింపబడినదో పరికింతము. రౌద్రరసమును దృష్టియం దిడుకొని తిక్కన కృత భారతభాగమును పరిశీలించిన రౌద్రరసస్ఫూర్తి తరచుగా భీమునియందే పొడసూపు చుండును.

సభామందిర ప్రాంగణమున కీచకునిచే కచాకృష్టయై, పదాహత అయిన ద్రౌపదిని సభలోనుండి చూచినప్పుడు భీమునకు కలిగిన కోపమును వర్ణించిన సందర్భమున రౌద్రరసము గలదు.

'తానును నన్నయు నయ్యా
స్థానమ్మున నుండి పవనతనయు డసహ్యం
బైన మనోవల్లభ యవ
మానము నాసింహబలుని మదజృంభణమున్'
'కనుఁగొని కోపవేగమున గన్నులనిప్పులురాల నంగము
ల్దనరఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంత దంతపీ
డన రట దాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై'
'నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి
యేపునరేగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూర్చి యెండొంటితోఁ
దాఁకంగ పీకమైఁ దన్ని యాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁబెట్టి
పలుచని రొంపిమై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలిసేసి పిడుచగొనఁగ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె' [6]

---

6. విరా., ఆ. 2, ప॥ లు 132 – 34

అని భీముని పేర్చిన కోపాటోపమును తిక్కన వర్ణించినాడు. భీముని ఘనతర కోప వేగమున నిప్పులురాలు కన్నులందును, సాంద్రఘర్మసలిలము గ్రమ్మిన అంగము లందును, నితాంత దంతపీడన రటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్త నర్తనఘటనాప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తి యందును రౌద్రరసము మూర్తీభవించినది. భీముని రౌద్రరూపమును వర్ణించుపట్ల తిక్కన సందర్భోచితముగ భాష నుపయోగించి ఆ రౌద్రస్వరూపమును స్ఫురింపచేయునని అనుటయే గాక 'అతని యాకారము నెంత చక్కగానో చిత్రించి, యొక పటుదీర్ఘ సమాసముచే నాతని పండ్లు కొరుకుట కూడ మన చెవులలోఁ గింగురు మనునట్లుగా జేసి యాతని మూర్తిని మన కండ్లయెదుట బెట్టినాడు'[7] అని శ్రీ కోరాడ వారు చెప్పియున్నారు. రౌద్రము క్రోధస్థాయికము. ఉద్ధత ప్రకృతికము. భీముడు ఉద్ధతుడు. శత్రువగు కీచకుడు ఆలంబనము. అతని కృత్యము లేదా అతడు చేసిన అపరాధము ఉద్దీపనము. ఇది అవమానము, వాక్పారుష్యము, అభిద్రోహము అను విభావములచే ఉత్పన్న మయినది. నిప్పులురాలు కన్నులు, అంగము లందు ఘర్మ సలిలము క్రమ్ముట, పండ్లుకొరుకుట, కనుబొమలు ముడివేయుట అనునవి అనుభావములు. ఉగ్రత, స్వేదము వ్యభిచారులు. ఈ రీతిగా ఈ సందర్భము విభావాది సామగ్రీ పరిపోషితముగ రౌద్రము రసపర్యంతముగ పోషింపబడినది.

కీచకవధ సందర్భమున మొదట నర్మగర్భితములగు మాటలు మాటలాడి పిదప–

'అనుచున్ గ్రక్కున లేచి రోషకఠినంబౌ హాసమాసూతు నె
మ్మన ముద్వేగముఁబొందఁజేయు బలసామగ్రిసముజ్జృంభణం
బున వానిం దలపట్టి వంచుటయు నేపుం జేవయుం దోఁపవాఁ
డను మానింపక బెట్టదల్చికొని కోపాటోప దీప్తాంగుఁడై[8]

గంధర్వుడను తలంపున యుద్ధమునకు దిగగా నిరువురు భుజబలాటోపము మెరయురీతిని కొంతసేపు పోరిరి. ఇవ్విధమున నేచి ఇరువురు బెద్దయుప్రొద్దు పోర వాయుపుత్రుని బలము తోడుతోడ పెరుగ దొడగినది. కీచకాధముని లావు తరుగజొచ్చినది. దాని నెరింగి యుదగ్రతచే ఆ బకవైరి గ్రక్కున వాని నడంగబట్టి పడవైచి, పంచానన మేణమును పాదుపునట్లుగా అతనిని మహోగ్రత నాక్రమించి

7. ఆంధ్రభారత కవితా విమర్శనము, పు. 330
8. భారతము, విరా., ఆ. 2, ప. 340

బెడిదములగు పిడికిటిపోట్లతో పొడిచి చంపినాడు.' : విరా., 2-350-52 : ఇది యాతని రౌద్రరసానిష్కృతికి తార్కాణము. ఇచ్చటను అలంబనవిభావము కీచకుడే ఉద్దీపనము అతని చేష్టలు. పడవేయుట, సంగ్రామమున సంభ్రమించుటలచే ఇది యుద్దీప్త మయినది. కొట్టుల, మర్దించుట అనుభావములు. ఉగ్రత వ్యభిచారి భావము. డా॥ రంగారావు గారు రౌద్రరసస్ఫూర్తికి ఓజోగుణభూయిష్ట రచన గావలెనని ఆలంకారికులు నిర్ణయించి యున్నారు. 'గాఢబంధత్వమోజః' అని కావ్యాలంకార సూత్రవృత్తి. చంపకమాల దీర్ఘ సమాసఘటితమే కాని సీసమున నెక్కుడను అట్టిది కానరాదు. అయినను తిక్కన తన సామర్థ్యము చే రౌద్రరసస్ఫూర్తిని కలుగజేసినాడని అభిప్రాయపడినారు.[9]

ఇట ఇది భీముని క్రోధము వలన జనించినది. భీముడు చేసిన కృత్యము ధర్మబద్ధ మయినను అధర్మపక్షావలంబిపట్ల చేసిన కార్యమయినను, చేసిన కృత్యములో క్రౌర్యము అధికముగ కనిపించుటచే రౌద్ర మయినది.

వీర రౌద్రములు రెండును అత్యంత సన్నిహిత రసములు. సాహిత్యదర్పణకారుడు 'రక్తాస్య నేత్రతా చాత్ర భేదినీ యుద్ధవీరతః' అని రక్తాస్య, రక్తనేత్రత్వాదులను రౌద్రమునకు సూచించి ఈ రెండిటికి గల భేదమును తెలిపియున్నాడు. ఈ సందర్భమున రక్తాస్య, రక్తనేత్రాదులు చెప్పబడకపోయినను పడవేయుట, కొట్టుట, మర్దించుట, ఇత్యాది భావసామగ్రి యుండుటచే రౌద్రమునకు ఉదాహరణముగ చూపుట జరిగినది. కీచకుని చంపు సందర్భమున క్రౌర్యముండుటచే రౌద్రమయినను, చంపుటకు పూర్వము చూపిన ఉత్సాహము వీర మగుటచే ఆ ప్రకరణమునను ఉదాహరించుట జరిగినది. ఈ ఘట్టమున వీరము రౌద్రముగా రూపొందినది.

ఉపకీచకవధ సందర్భమునను రౌద్రము పోషింపబడినది -

'అని పలవించు నయ్యెలుఁగులా పవమాన తనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు వీంద్రుడు గ్రమ్మఱ నింతసేసిరే
యనుచు సరోషసంభ్రమత నాయితమై వెసఁబాఱి వప్రలం
ఘన మొనరించె ... ... ... ' - విరా., 3=22

'ఇట్లు లంఘించిపోయి పరేతభూమి
యొద్ద నలుదిక్కులును జూచి యొక్క యున్న

9. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana

తావనీజంబు వెఱికి రౌద్రాతిరేక
మడర భుజశిఖరంబునయం దమర్చి' - 3- 23
'వికటభ్రూకుటి ఘోరఫాలకలిత స్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుండుం బ్రమర్దన దశావిర్భావ సంభావితాం
గకుఁడుం జిత్త విదాహ దోహల సమగ్రక్రోధవేగుండునై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తితోన్'విరా.,3-24

ఇట్లు రౌద్రరూపముతో నున్నవాఁడై పాఱదొడంగిన ఉపకీచకులను 'వడిన్ పట్టుకొని వారిని బడల్పడవేసి విశృంఖల విక్రమముచే అందరను చేతులతీటవో నుఱుముసేసి' నాడు. ఇచ్చట 'భీముని' వర్ణించిన తీరంతయు రౌద్రరసస్ఫోరకమే. రౌద్ర మాతని వికట భ్రూకుటి ఘోరఫాలము నందును, చలద్వికృతోష్ఠము నందును, క్రోధవేగమునందును, ప్రమర్దన దశావిర్భావసంభావితాంగకము లందును మూర్తిగట్టి యున్నది. ఉపకీచకులు ఆలంబనముగ, వారి కృత్యము లుద్దీపనముగ నిది దీప్తమయినది. అవమానము, అభిద్రోహము అనుననియే విభావములు. వికటమైన భ్రూకుటి, చలించుచున్న ఓష్ఠద్వయము, స్వేదము అనుభావములు. ఉగ్రత, గర్వము, స్వేదము వ్యభిచారులు.

విరాట పర్వమున చివరి యాశ్వాసమున విరాటుడు కంకుని సారెగొని వ్రేయుటలో రౌద్రరసస్ఫూర్తి కలదు.

'అనిన రౌద్ర రసము మనమున నడరంగఁ
బడగయెత్తును రగపాలురేఖ
నెనయు చేతిసారె గొని వ్రేసెఁ బతిపేడి
గడన యుడుగుమన్న నుడుగవనుచు' [10]

ఇట కంకుని మాటల వలన విరటునకు క్రోధము కలిగి ఆ క్రోధావేశము నాపుకొనలేక చేతిలోని సారెను కంకునిపై విసరినాడు. ఉత్కట క్రోధావేశముచే రౌద్రరసము స్ఫూర్తి వహించినది. విభావాది సామగ్రి ఇట వర్ణితము కాలేదు. కాని పడగయెత్తిన త్రాచుపాము వలె నున్న చేతితో 'వ్రేయుట' అను నొక్క అనుభావముతోనే స్ఫూర్తిమంతము గావించినాడు.

యుద్ధపంచకమున రౌద్రరసాత్మకములగు సన్నివేశములు పెక్కులు కాననగును.

---

10. భారతము, విరా., 1. 5, ప. 259

భీష్మని తృతీయ దివస యుద్ధమున భీష్మని ధాటికాగలేక పాండవ సైన్యములు విచ్చుటను జూచి శ్రీ కృష్ణుడు -

'గంగా నందనుఁ గూర్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్య వీ
రాంగమ్ముల్ నుఱుమాడి తత్ప్రబల సైన్యంబెల్ల మాయించి యి
త్తుం గౌంతేయుల కిమ్మహీవలయమున దుర్దాంత చంచద్భుజా
సంగస్ఫూర్జిత చక్రవిక్రమకళా సంక్రీడనోన్మాదినై' - భీష్మ., 2- 153

అని పలికినాడు. ఇట వీరమే కానవచ్చినను చక్రవిక్రమకళాసంక్రీడనోన్మాదినై అనుటలో ఉన్మాదశబ్దముచేత రౌద్రము రేఖామాత్రముగ స్ఫురించు చున్నది. కాని 'పద్మ నాభుండు సునాభంబగు నా చక్రంబుగైకొని దక్షిణకరంబున నమర్చిపేర్చి యుగ్యంబుల పగ్గంబులు నాగలముడిచి యరదంబు డిగ్గనుఱికి -

'అవని గంపింప లలితపీతాంబరంబు
చెఱఁగుదూలఁ జక్రాంశులు దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజిత భయంక
రాననంబునఁ జెలఁగంగ నడరుఁ బెలుచ'

'అంహోమర్దనుఁడా జనార్దనుఁడు మాద్యద్భీష్మ కుంభీంద్రుపై
సింహోల్లాస విభాసియై కవియు నుత్సేకంబు నాటోపమున్
రంహస్ఫూర్తియు దీప్తమూర్తియును సంరంభంబు జూడన్ జగ
త్సంహారోన్ముఖుఁడైన రుద్రుగతి రౌద్రప్రక్రియం బొల్చినన్' [11]

శ్రీ కృష్ణుని వర్ణనము నందు క్రోధరంజిత భయంకరాననమున, రుద్రుగతి రౌద్రప్రక్రియం బోల్చినన్ అను పదములచే రౌద్రరసస్ఫూర్తి స్ఫుటమగు చున్నది. అయినను ఇట అనుభావాదులచే పుష్టము కాలేదు.

భీష్మని నవమదివస యుద్ధమునను ఇట్టి ఘట్టమే యున్నది. అచ్చట గూడ రౌద్రరసస్ఫూర్తి గలదు : భీష్మ., 3- 261- 63 :

గురుడు పాండవబలములపై దెప్పదెరల తీవ్రముగ శరతతిని కురిసిననాడు -

'కనుఁగాని పార్షతుండపుడు గట్టుపకాసయి వీఁకఁదాఁకినం
దునిమె నతండు తద్ధనువుఁదోడన పెక్కు శరంబులేసె నా

11: భీష్మ., ఆ. 2, ప॥ లు 154- 56

తని మెయినొండు విల్లు ద్రుపద క్షితిపాల సుతుండు గ్రక్కునం
గొని శరసంతతిం గురిసి కోపముఁబెంచిన నాతఁ డుగ్రతన్'
'ఆ విల్లుద్రుంచి రౌద్రర
సావేశంబొప్ప నాలుగమ్ముల రథవా
హావలిని సూతు నొక్కట
దేవగణము వొగడ వసుమతిం బడవేసెన్' [12]

ఈ సందర్భమున రౌద్రరసస్ఫూర్తి కలదు కాని అది విభావాది సామగ్రీ పరిపోషితము గాలేదు. భీష్ముని దశమదివసమునాటి యుద్ధమున కొంతరౌద్రరసస్ఫూర్తి కలదు. భీష్ముడు రౌద్రరసమూర్తియై ఆనాడు విజృంభించినాడు.

కుంభసంభవుడు ఏదిక్కునం జూచినదానయై పెక్కు రథంబులను బద్ది పాండవ పాంచాల యోధులకు పుట్టునట్లుగా విహరించి వివిధ విశిఖనియమంబులు నిగిడించుచు -

'కూల్చుచు గజముల నెత్తుటఁ
దేల్చుచుఁ దురగములవీఁకఁ దేరులు మరలన్
వెల్చుచుఁ గాల్బలములఁ బొరి
మాల్చుచు రౌద్రముగ మారి. మసఁగిన భంగిన్'[13]

సంగరక్రీడ సలుపు సందర్భము రౌద్రరస విలసితము. కాని విభావాది సామగ్రి పరిస్ఫురణముగా లేదు. భీష్మద్రోణులు ప్రతినాయక పక్షావలంబులైనను పాండవపక్షపాతులు గాన వారియెడ సహృదయులకు సానుభూతి యుండును. గనుక, రౌద్రమున కుదాహరణములుగా వీనిని స్వీకరించుట అయినది.

ఇట్లే శకుని సహదేవుని తాకి-

'తురగవ్రాతము నొంచి కేతువు వెసం ద్రుంపంగ నాతండు గ్రో
ధరసంబుగ్రము గాక యుండియును గాంధారేశు వీతధ్వజున్
విరథున్ విస్ఫురితాస్త్రఘట్టితునిఁ గావింపన్ తదాభీలమూ
ర్తి రథంబుద్దతి డిగ్గి పాటి యతఁడుర్విం గూల్చె దత్సారథిన్' [14]

---

12. భీష్మ., ఆ.2, ప॥ లు 382-83
13. ద్రోణ. 3. 1, ప. 141
14. ద్రోణ. 3. 1, ప. 161

ఇట క్రోధరస మనుపేర సహదేవుని యందు రౌద్రరసస్ఫూర్తిని గావించినాడు తిక్కన.

ద్రోణాచార్యుడు సత్యజిత్తుతో యుద్ధము చేయు ఘట్టమున వృకుడు సాయపడు సందర్భమున -

'ఘనతర కోపవేగమునఁ గన్నుల నిప్పులురాల సత్యజి
త్తనువు వృకాంగమున్ విశిఖధారల ముంచె గురుండు వారలా
తని వడికోర్చి మైగలయఁదాఁకఁగ సారథి యుబ్బడంగ వా
హనములు బీఱువోవ సిడమల్లలనాడఁగనేసి రుద్ధతిన్' [15]

కుంభజుడు సత్యజిత్తుని వేయగా, వృకుడు ద్రోణుని నొప్పింపనతడు కినిసి వృకుని తల తునియగ, నతని హయములు సారథియును మునుడ్కొగ నారుబాణములు వేసినాడు. తదుపరి సత్యజిత్తు కెంపారెడు ఆననముతో, నపుడుగఱచి, యుద్ధము చేయబూనగా అర్ధచంద్ర విశిఖప్రహతిని అతని తలను డొల్లవేసినాడు. ద్రోణ., 1-2-288-91:. ఇదంతయు రౌద్రరసావిర్భావమే. ఇట మరల ఘనతరకోపవేగము, నిప్పులురాలు కన్నులు, కెంపారెడు ఆననము, అపుడుగఱచుట, ఇత్యాది క్రోధరసభావములను వర్ణించినాడు తిక్కన.

ఈ పర్వమున చతుర్థాశ్వాసమున భీముడు ద్రోణునితో యుద్ధము చేయు సందర్భమున భీముని రౌద్రరసమూర్తిత్వము గోచరించు చున్నది. కన్నుగవకెంపారగా నితడు ద్రోణునితో నిట్లు పలికినాడు.

'ప్రియములు వల్కి నిన్ననుసరింపగఁగఁ బార్థుఁడుగాఁడుసుమ్ము దు
ర్జయ భుజశక్తి నిర్మథిత శత్రుఁడు భీముఁడు గాని ....
.... .... .......
.... ... దర్పము సూపకుందునే'

అని పలికి -

'గదసారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సొలించి య
మ్ముదుకం డుర్వికి దాఁటిపోయె నది రశ్మిల్ మింటఁ బర్వంగ బె
ట్టిదమై మ్రోయుచు వచ్చి బల్విడుగు మాడ్కిందాఁకుడున్ గుఱ్ఱముల్
సదిసెన్ సారథి మ్రగ్గెఁ దేరు వాలిసెన్ సైన్యంబు భీతిల్లగాన్' [16]

15. ద్రోణ., ఆ. 1, ప. 287
16. ద్రోణ., ఆ. 4, 148-50

యుద్ధము చేసినాడు. ఇటుట రౌద్రము విభావాది సామగ్రీ పరిపోషితము కాకున్నను శత్రుపక్షమువాడగు ద్రోణుని ఆలంబనముగా గలిగి, అతని వ్యంగ్య భాషణములు ఉద్దీపనములుకాగా, ఆ క్రోధము కొంత స్థాయిత్వము నందినది. కన్నుగవ కెంపారుట, గద సారించుట అనుభావములు.

భీమసేనుడు దుర్మద దుష్కర్ణులం జంపు సందర్భమునను రౌద్రము కలదు.

'కినిసి బకమర్దనుఁడు వెసఁ
దన యరదము వాని తేరుదాఁక బఱపి యా
తనిమీఁద నుఱికి క్రుమ్మెం
గనుకని నెంపపాడి సెదరఁగాలం గేలన్' - ద్రోణ., 5-62.

'అమ్మహోగ్ర సముద్ధతిం జూచి పాంచాల సైనికులు సింహనాదంబులు సేసిన సహింపక సూతసుతుండును, దత్సోదరులును నవ్వీరులఁ బొదివిన నత డద్భుతంబుగా ధ్రువు (ధ్రుము) నరదంబుమీదికి లంఘించి వానిఁ బిడికిటిపోటున జావం బొడిచి జయరాతునిపైఁ గవిసి యాతని నతని సూతునిఁ గాళ్లు లిరుగేలంబట్టి వ్రేసి గతాసులం జేసిన ....... ఇవ్విధంబున జిత్రవధ విహారంబున విజృంభించు నా భీమసేనుం జూచి రుద్రుండు రభసోద్రేకంబునం బాండవేయులకు దోడ్పడం జనుదెంచెంగాక మానవు లిట్టివారునుం గలరే యనుచు నీవారెల్లను వెఱచఱచి యిద్దఱొక్క తెరువునం బొక పఱచిరి' (ద్రోణ., 5-63). ఇట రౌద్రము క్రోధము, అభిద్రోహము అను విభావములచే ఉత్పన్నమయినది. కొట్టుట, విరుచుట, మర్దించుట, శస్త్రములు ప్రయోగించుట, నరకుట - ఇందలి అనుబావములు. ఉగ్రత, గర్వము, అమర్షము వ్యభిచారులు.

భీముని క్రోధాతిశయమునకు మరియొక యుదాహరణము దుస్ససేనుని వధ సందర్భము. ఈ సందర్భమున భీముని క్రోధాతిశయమునే కాక, విశృంఖల వీరవిహారమును, అతని క్షణక్షణ వైవిధ్యమున మెరయు నా ట్యోల్లాసమును కవికడు సుందరముగను, ప్రత్యక్ష మగునట్లును చిత్రించెనని శ్రీ యడవల్లి ఆదినారాయణ గారు చెప్పియున్నారు.[17]

గదలీలం గాని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
న్మద యానంబునఁ గిట్టి ఘోటకములన్ బ్రమందించి బాహాబలం

17. తిక్కన కర్ణపర్వ నిర్వహణము - భారతి, 1961 జనవరి, సంపుటి 38, సంచిక 1, పు.53

బు దలిర్చన్ భవదీయ సూను నరదంబుం ద్రెళ్లఁ ద్రోవంగ బె
ట్టిదపుం దోమర మెత్తి కొంచతఁడు దాఁటెన్ నేలకున్ గక్కునన్'
కర్ణ., 3-204

*అట్లు దాటి బెట్టువెచిన యత్తోమరంబురం బాడనేచి యక్కీచకారాతి పదుమూడు వత్సరంబులు దమ పడిన పాట్లను బ్రతిన చందంబును డెందమున నా వహిల్ల నుద్దండ గదాదండంబున దుశ్శాసనువైన నతండు నెత్తురు దోరఁగ ధరణింబడిన బెబ్బులి లేడికొాదమం బొదుపు పోలికం బొదివి మెడ ద్రొక్కి యెక్కుడు మదంబున' నతనితో మాటలాడినాడట (కర్ణ., 3-205వ.) ' నీ మాటలు వినుటకు నా కినుక పొలవేడ్కపడియెడున్' (3-206) అను నీ తెలుగు నుడికారపు సొంపున క్రోధజ్వాలల తీవ్రత గమనింప తగును. భీముని మహోగ్ర ప్రభలకు కౌరవానీక మతిభీతి గదిరి నలుగడలు విచ్చినదట.

'లీలం గేలనమర్చి మత్తగజకేళి సుందరోల్లాస మా
భీలత్వం బలరింపఁ ద్రిప్పుఁజదలం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలంద్రొచు మొగంబు ద్రేయు దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కాలూఁదుంబయిఁ గృమ్మఱంగ మెడ చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్'
- కర్ణ., 3-210

అను పద్యములో భీముని క్రోధ వికటతాండవము, దాని వివిధ రీతులు చిత్రింపబడినవి. చివరి యా 'నవ్వు' కూడ రౌద్రము యొక్క అంశము. ఊరక గుండె చీల్చి రక్తము త్రావిన అది కేవలము ప్రతిజ్ఞానిర్వహణము అగును. దాని కది చాలును. కాని ఈ క్రియ అంతయు అతని క్రోధము, కసి యొక్క అవధులను ముట్టుచున్నది. అందుచేతనే 'ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి' (3-211) అని తిక్కన గారు వ్రాసిరి. 'గద సేతంగొని యంత్యకాల యమురేఖం బేర్చి రక్తంబు చాయ దలిర్పందనువుగ్ర సుందరము... ' (కర్ణ.., 3-219) అను పద్యము నిట్టిదే. భీముని ఇట్టి రౌద్రమే అట్టి కార్యమునకు హేతువయినది. అతని మర్దించుట, కొట్టుట, చంపుట - ఇత్యాది క్రోధ భావములచే నిది పోషిత మయినది.

శల్య భీమసేనుల గదా యుద్ధమున -

'కనుఁగాని భీముండు గన్నుల నిప్పులు
రాల ఖండాల కీలాలం రంజి

తంబును రిపు సైన్య దైన్య ప్రదంబును
నాత్మీయ వాహినీ హర్షకరము
నైశతధారా మహోభుజగ క్ష్మా
ధర శృంగ సమత సుదగ్రమగుచు
నెనిమిది యంచుల నెసఁగు మెఱుంగుల
దారుణంబగు గదాదండ ముగ్ర
రేఖ సారించి రౌద్రముద్రేకమందఁ
గదిసి మద్రాధిపుని తురంగములఁ జదియ
మోఁదె నాతండు దోమరమునఁ దదీయ
విపుల వక్షంబు భేదించె నృపవరేణ్య' [18]

అని వర్ణించిన సందర్భమునను భీముని నిప్పులురాలు కన్నులను వర్ణించి రౌద్రరస స్ఫూర్తిని కలిగించినాడు తిక్కన.

భీమసేన దుర్యోధనుల గదాయుద్ధమును తిక్కన రౌద్రరసభరితముగనే వర్ణించినాడు.

'చండ గదా పరస్పర ఘట్టనంబుల
మింటఁ బెల్లడరెడు మంటగములఁ
బరమ ఘోరములగు పదతాడనంబుల
నొలయు వసుంధరా చలనములను
నుద్భట క్రోధసము ద్రేకములం జూడ్కు
లందుల్లసిల్లెడు నరుణరుచుల
దారుణ ధ్వనులగు తర్జనలీలలఁ
బరంగు పర్వతగుహా ప్రతిరవముల
ననిమిషుల దృష్టి మిఱుమిట్లుగొనఁగ భుజగ
పతియుఁ గూర్మంబు సంకటపడఁగఁ దరణి
కిరణములు వెల్కఁబాఱ దిక్కరులు బెదర
నొప్పె సత్త్రాలితాఁకు మహోగ్రమగుచు ' – శల్య., 2-255

---

18. శల్య., ఆ. 1, ప. 168

రౌద్రము ఉద్ధతమగు మనుష్య ప్రకృతికము. సంగ్రామ హేతుకము. ఇట వీరిరువురును ఉద్ధత ప్రకృతి గలవారే. ఇరువురును క్రోధసముద్రేకులే. వీరి క్రోధసంజనితముగనే రౌద్ర ముద్భవించినది. ఇరువురి చూడ్కులందు అరుణరుచు లుల్లసిల్లుచున్నవి. ఈ పదతాడనములు, అరుణరుచులు, తర్జనలీలలు అనుభావములు.

సౌప్తికము నందలి అశ్వత్థామ యొక్క బీభత్సకృత్యమంతయు రౌద్రమునకు పర్యవసానమే. అతని క్రోధమునకు పరమావధి అది. అట్టి దారుణ హింసా కాండతో కాని యాతని క్రోధము చల్లారలేదు. ఈ క్రౌర్యము రౌద్రము వలన జనించినను అందు అధికముగ జుగుప్సయే జనించుటచేత అది బీభత్సమునకు ఉదాహరణముగ ఆ ప్రకరణమున చూపబడినది.

తిక్కనార్యుడు యుద్ధపంచకమున ఈ రౌద్రరసమును కేవల సూచనామాత్రముగ పేర్కొనిన తావులును పెక్కులు గలవు.

'మహోగ్రకోపమున తత్తురగంబులం జంపి (భీష్మ., 3-40)
'సముద్యత్క్రోధుడై శక్తివైచెం (భీష్మ., 3-61)
'రోషాతి భీషణుండై ఏరికిం తేరి చూడరాక (భీష్మ., 3-73)
'రౌద్రరస మహోగ్రాకృతులై' (భీష్మ., 3-87)
'రౌద్ర మెసగ' (భీష్మ., 3-37)
'అతి రౌద్రంబున ' (భీష్మ., 3-69)
'క్రోధమునం కనునిప్పులు రాలంగ ' (భీష్మ., 3-350)
'రౌద్రాకృతిన్..' (ద్రోణ., 1-345)
'రౌద్రభంగి.. ' (ద్రోణ., 1-369)
'రౌద్రస్ఫూర్తిమై.. ' (ద్రోణ., 1-393)
'రౌద్ర రసోల్లసిత విలసితమూర్తియై.. ' (ద్రోణ., 2-18)
' రౌద్రంబు రూపంబు దాల్చిన విధంబున.. ' (కర్ణ., 1-145)
'అత్యంత రౌద్రంబు నావహించె.. ' (కర్ణ., 1-186)
'రభసోద్రేకము రౌద్రముఁ బెంప.. ' (కర్ణ., 1-207)
'రౌద్రరసంబునం బెనచినం గనుంగొని' (కర్ణ., 1-343)
'సక్రోధాంతరంగంబుతోన్ ' (కర్ణ., 2-352)
'రోష రక్తలోచన రుచుల' (కర్ణ., 2-363)

'కోపసముద్భటాకృతిన్' (శల్య., 1-313)

'కోపోద్గమోద్భట వేగంబున' (శల్య., 1-315)

ఇత్యాది ఉదాహరణము లింకను చాలగలవు.

అశ్వమేధ పర్వమున త్రిగర్త దేశాధీశులు యుద్ధము చేయు సందర్భమున రౌద్రరసము కలదు. కాని రసపర్యంతము లేదు. శత్రువీరులు పంతమునకు దిగి యౌద్ధత్యము ప్రకటింప మానధనుడగు నాయకునకు క్రోధము వచ్చుట సహజము. గాండీవ పతనము వలన కలిగిన అవమానముచే నీ క్రోధము ఉత్పన్న మయినది. అవమానము రౌద్రరస విభావములలో నొకటి. అవినయ ప్రధానమైన శాత్రవోద్ధత. ఇచ్చట విభావానుభావ వర్ణన మెంత రసోదంచితమో గమనింప తగును.

'అట మున్న గాండివంబు
త్కటరయమున నెత్తి కోప దహనుం డత్యు
ద్భటమూర్తిఁదాల్చె నన మి
కుట్కటమై కడగంటి కెంపు గొమరారంగన్'

ఆ బీభత్సుడు -

'పిడుగులు వడిఁ బెక్కొక్కటఁ
బడియెడునన దొరఁగఁజేసెఁ బటు విశిఖము ల
ప్పుడు మేదిని దోఁపద చె
ప్పుడు కొలఁదియె రథికవరుల పీనుఁగుపెంటల్'[19]

ధనువు రయమున నెత్తుట, కోపదహను డగుట, కడగంటికెంపు కోపభావమున కనుభావములు. బీభత్సుండను శబ్దమర్థశక్తితో అర్జునుడు వైరిబలమును బీభత్స మొనరింప నుత్సహించుచుండెనను భావము కల్గించుచున్నది. అంతటి క్రోధము పొందిన యాతని కార్ముక నిర్ముక్త బాణాసారము పిడుగల దొంతర యనుటలో నలంకారధ్వని గలదు. ఒక్కొక్క విశిఖము ఒక్కొక్క వజ్రాయుధము. 'రథికవరుల్ పీనుగుపెంటల్' అనుటచే మహారథికవరులను మాత్రమే మ్రందించి మిగిలిన సైన్యమును జాలితో వదిలి యుండుననిపించు చున్నది. సింహము గజేంద్రమస్తిష్కమాంస ఖాదనము చేయు వైఖరి ఇది. ఇట క్రోధమునకు అనుభావాదులు చెప్పబడుటచే క్రోధము స్థాయిగా గల రౌద్రము కాననగుచున్నది. కాని ఈ రౌద్ర రసము రసపర్యంతముగా లేదు. ఏలన ఈ అర్జునుని కోపము

19. అశ్వమేధ., ఆ. 4, ప॥ లు 16 - 18

తాత్కాలికము మాత్రమే. పాలపొంగు వంటిది. అన్నమాటను నిరాదరించరని శత్రువుల మీద కల్గిన తాత్కాలిక మానసికోద్రేకమే కాని మరొకటి కాదు. క్షణములో నాతని కోప ముత్కటమై 'భగ్గున' మండి, తదుపరి ఆరిపోయినది. కాన నిట ఈ రౌద్రము రసపర్యంతములేదని చెప్పవచ్చును.

శ్రీనాథునిచే కొనియాడబడిన తిక్కన గారి రసాభ్యుచితబంధ మెట్లున్నదో పరికింతము. విరాటపర్వమున రౌద్రరసస్ఫోరకములగు తావులతో పాటు రౌద్రరసాభ్యుచిత పదబంధము గల తావులును గలవు. ఉదాహరణములుగ --

'దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్స్యతు
క్గీర్వాణాకృతు లేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముంగొనుట తథ్యంబెమ్మెయిం గీచకా'

విరా.,2-55

'అవనీచక్రము సంచలింపగ దివంబల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైల నికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణనమొంద గ్రోధము గృతార్థత్వంము నొందించి చి
త్రవధ ప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్'. -

విరా.,2-284 అనునవి చూపవచ్చును.

ఈ రెండు పద్యములలో మొదటిదానిని గూర్చి ఆచార్య యస్వీ జోగారావు గారు "మూలమున 'గంధర్వా : పతయోమమ । తేత్వాంసిహన్యు : కుపితా స్సానుబంధ మమర్షణా :' అనియున్న చప్పిడిమాటను సాగదీసి యొరదీసిన కరవాలము వంటి సమాసముతో రౌద్రరసాభ్యుచితబంధ సుందరముగ వర్ణించినారు తిక్కన"[20] అని చెప్పియున్నారు. రెండవ పద్యము రౌద్రరస వ్యంజకము. ఈ రౌద్రరసమునే తిక్కన కోపరసమని కూడ పేర్కొనినాడు : అనిలజు కోపరసంబు పేర్మి చెలచి - విరా. 2-137 :

ద్రోణపర్వమున ద్వితీయాశ్వాసమున అర్జునుడు కృష్ణునితో తన ప్రతిజ్ఞా విషయంబులైె వాక్యములను చెప్పు సందర్భమున రౌద్రరసాభ్యుచిత పదబంధము కాననగును. 'ఏను జయద్రథుం జంపుటకు దమకించితలుమునప్పుడు నాకు నెవ్వ రడ్డంబు సొచ్చిరేనియు'.

---

20. మహాకవి మార్గము - విరాటపర్వ విమర్శ, వ్యాసుని వాణి - తిక్కన బాణి

'పటు నారాచపరంపరా ప్రసర దర్పం బేర్పడం బేర్చి త
ద్భట సంఘంబును ఘోటకవ్రజము శుంభత్స్యందనౌఘంబును
ద్భట కుంభి ప్రకరంబునుం బొదివి విధ్వంసంబు గావించె నె
త్తుట జొత్తిల్లెడునట్లు సేయుడు సమిద్భూభాగ మత్యుగ్రతన్'
- ద్రోణ., 2 - 306 - 7

అనుపద్య మందులకు ఉదాహరణము.

ఇట్టివే మరికొన్ని ఉదాహరణములును కలవు.

**రౌద్రాభాసమునకు ఉదాహరణము** - 'పితృసమో జ్యేష్ఠః' అని యున్నను సదా,చారసంపన్నుడైన అర్జునుడే ధర్మజునంతటి వానిని అంతమొందింప నుద్యమించుట ఒక విపరీత సన్నివేశము. అర్జునకు రణోత్సాహమును కల్గించుటకై 'నీదు గాండివం బెరవుగ నిచ్చి నీవు నాగలెక్కి హరిన్ రథిజేయన్ సూత తనూభవు తత్సహాయుల పారిగొనడే ఒక్క మాత్రలోనన్' ፡కర్ణ. , 1-66፡ అని-

'గొంతి కడుపపునందు గొడుకు జూలై నీవు
దోపకుండవైతి తోచినట్టి
పిండ మెడలియైనఁ పిదప దిగంబడ
దయ్యె నింతపుట్ట దట్టులైన'
'అనిన గృపాణంబు గొని సవ్యసాచి య
వ్విభుద్రేయ దలచిన విష్ణు డెఱిగి
వాలుగేలనమర్చ వలసిన కతమేమి
కౌరవు లియ్యెడలేరు మనము
ధరణీశ్వరుని సేమ మరయంగ వచ్చితి
మీతని కుశల మిట్లేర్పడంగ
గంటిమి సంతోషకాలంబుగాకిది
క్రోధకాలమె వధ్యకోటి యిచట
నేదిగాఁగ నలిగితీవని పలికిన
రూక్షభంగి యగు కటాక్షదృష్టి
యానరేంద్రుమీద నడరంగ నర్జును

డమ్మురారి కిట్టులనియె నధిప'
'వినుమొరులకు గాండివ మి
మ్మని నన్నెవ్వండు పలికె నతని శిరము గ్ర
క్కునఁ బగుల ద్రేయుటకుఁ జే
సినవాడ ఁబ్రతిజ్ఞ నాదుచిత్తములోనన్'[21]

అని పలికియున్నాడు.

ఈ పద్యము లందు ధర్మజుని చంపుటకై సవ్యసాచి కృపాణమును గొనుటయు, రూక్షభంగి యగు కటాక్షదృష్టి ఆ నరేంద్రుమీద అడరించుటయు రౌద్రమునకు ఆకరము కాగలదు. కాని ప్రతిజ్ఞాపాలనము కైనను అది గురుజన వధము సందు ప్రవర్తించినది కనుక 'రౌద్రే గుర్వాది గత కోపే' అను రౌద్రాభాస లక్షణము ననుసరించి ఇది రౌద్రాభాస మగుచున్నది.

తిక్కన గారి రచనయందు వెలవెల బారు నాననములో భయానక మెట్లు వెల్లివిరియునో, నిప్పులురాలు కన్నులందు రౌద్ర మట్లే తాండవించునని చెప్పవచ్చును.

---

21. కర్ణ. , ఆ. 3, ప ॥ లు 66-68

# 9వ ప్రకరణము

## వీరరసము — తిక్కన భారతము

### వీరరసము :

నవరసములలో ఐదవది యగు వీరరసము ఉత్సాహస్థాయికము. మహేంద్రదైవతము. గౌరవర్ణము.

భరతుని నాట్యశాస్త్రమున —

'ఉత్సాహాధ్యవసాయాత్ అవిషాదిత్వాత్ అవిస్మయాన్మోహాత్
వివిధాదర్థ విశేషాత్ వీరరసో నామ సంభవతి
స్థితి ధైర్య వీర్య గర్వైః, ఉత్సాహ పరాక్రమ ప్రభావైశ్చ
వాక్యైశ్చ ఆక్షేపకృతైః వీరరసః సమ్యగభినేయః'[1]

ఉత్సాహము, అధ్యవసాయము, అవిషాదము, అవిస్మయము, అసంమోహము అనువాని వలనను, ఇట్టివే అగు నితర అర్థవిశేషముల వలనను వీరరసము సంభవించు చున్నది. స్థైర్యము, ధైర్యము, వీర్యము, గర్వము, ఉత్సాహము, పరాక్రమము, ప్రభావము, ఆక్షేపపూర్వకములైన వాక్యములు అనెడి అనుభావములచే నిది అభినయింప బడును.

దీనికి పూర్వమందు గల గద్యయును కొన్ని అంశములను తెలుపుచున్నది. వీరము ఉత్తమ ప్రకృతికము. ఉత్సాహము ఉత్తముల స్వభావము. అసంమోహము, అధ్యవసాయము, నయము, వినయము, బలము, పరాక్రమము, శక్తి, ప్రతాపము, ప్రభావము, మున్నగు విభావముల వలన వీరము ఉత్పన్న మగును. ధైర్యస్థైర్యములు, త్యాగశౌర్యములు, వైశారద్యము, మున్నగు అనుభావములచే దీనిని అభినయింప వలెను. ధృతి, మతి, గర్వము, ఉగ్రత, అమర్షము, స్మృతి, రోమాంచము, ప్రతిబోధము, ఇత్యాదులు సంచారులు.

---

1. నాట్యశా. , అ. 6, శ్లో॥ లు 67, 68.

సాహిత్యదర్పణకారుడు 'వీరరస ముత్తమ నాయకము. దీనికి స్థాయి యుత్సాహము. అధిదేవత ఇంద్రుడు. వర్ణము హేమవర్ణము ః గోమేధిక వర్ణమని నరసభూపాలీయముః ప్రతినాయకు డాలంబనము. వాని యుత్కర్ష యుద్దీపనము. చాతుర్యము, ఆమంత్రణము, స్థైర్యము, ప్రసాదము, మున్నగునవి అనుభావములు. క్రోధము, అభిమానము, హాసము – ఇందు వ్యభిచారు లగును.'[2]

రసతరంగిణీకారుడు– 'పరిపూర్ణ ఉత్సాహః సర్వేంద్రియాణాం ప్రహర్షో వా వీరః' అని చెప్పియున్నాడు.

హేమచంద్ర రామచంద్రులును, ధనంజయ భానుదత్తులును, జగన్నాథుడును భరత విశ్వనాథుల ననుసరించిన వారే. సర్వజ్ఞసింగభూపాలుడు, భరతాదులను అనుకరించినను, మరింత విపులముగా దీనిని వివరించినాడు.

వీరము క్రమప్రాప్తము. నాట్యవేదమున రసములను శృంగార హాస్యాది క్రమమున నిరూపించుటలో నొక విశిష్టమగు రమ్యభావ మున్నదనియు, రౌద్రము అర్థ ప్రధానము. కామార్థములు ధర్మమూలము లగుటవలన ధర్మప్రధానమయిన వీరము అనంతరము నిరూపిత మయినదనియు చెప్పబడినది.[3] వీరమునకు ముందు చెప్పబడిన రౌద్రమున సంగ్రామ సంప్రహారయోగము గలదు. అది యుద్ధవీరమునకు కలదు. కాని వీరమున జిఘాంస యుండదు. ఇది ఆనంతర్యహేతువు. వీరము ఉత్తములరసము. ఏలన ఉత్సాహము ఉత్తముల స్వభావము. కావ్య నాట్య ప్రయోగాదు లందు వీరమునకు ఉత్తమ ప్రకృతియే హేతువు. కావుననే ధీరోదాత్తాది చతుర్విధనాయకులలో వీరత్వము అనుగతముగ నుండుట సుప్రసిద్ధము. ప్రతి మానవుడు ఉత్సాహము కలవాడే అగును. కాని అయోగ్యవిషయమున ఉత్సాహము అభిలషణీయము కాదు. అది అనుపదేశ్యచరితము. చరితము ఉపదేశార్హమయినపుడు వారి యుత్సాహము ఉచితావసరముననే యుండును. అసంమోహమున ఉన్నపుడే అవసరౌచిత్యమును వారు గుర్తింపగలరు. కావుననే అసంమోహాది సంపత్తి విభావముగా నుపదిష్టమయినది. విషాదదూరుడయి, విస్మయమును వ్యామోహమును వర్జించి, క్రియాధ్యవసాయి డయి, పురుషార్థసాదన కుద్యుక్తు డగుటయే ఉత్సాహము. సాధారణముగ ఉత్తముని యందు సముచిత కార్యనిర్వహణమున చిత్తస్థైర్యము కాననగును. ఎట్టి విపత్కరతపరిస్థితి యందైనను అది అట్టిట్టు గాదు. అంతియ

2. సాహిత్యదర్పణము, 3-232-34

3. నాట్య వేదము, పు. 150

గాదు. అది మరింత అతిశయించును. లోకోత్తరకార్యసాధకమై శౌర్యత్యాగాది గుణములుగా నది ఆవిష్కృత మగును. వీరమున కిది నిదానము.

శారదాతనయుడు ఈ ఉత్సాహశబ్ద వ్యుత్పత్త్యర్థమును తెల్పుచు 'తంద్రతాభి భవము' అని అపేర్కొనెను. కునికిపాటును తిరస్కరించునది అని అర్థము.

'ఉత్తంద్రతా మభిభవత్యత ఉత్సాహ నిర్వహః, ఉత్సాహ్యతే చోత్సహత ఉత్సాహ యతివాభవేత్'[4] – ఉత్సాహము పొందుట, ఉత్సాహపడుట, ఉత్సాహపెట్టుట అని అర్థములు అని అతడు చెప్పియున్నాడు. తంద్రతాభిభవమని చెప్పుట వలన ఈ యుత్సాహప్రవృత్తి యందు స్తబ్ధత గాని, నిద్రాది తమోగుణములు కాని, ప్రమాదాదులు గాని మచ్చునకైన గోచరింపవు. ఇంతియగాక 'తత్ప్రవృత్తి మెరపు వలె చకచ్చకితమై, తరళసుందరమై, నిరంతర ప్రవాహరూపమై, తేజోమయమై సర్వకార్యము లందు సత్వర ప్రసారక్రియా లక్షణసంశోభితమై యొప్పునని తాత్పర్యము'[5] అని 'వీరరసము'న గలదు.

భావప్రకాశికాకర్త 'ఉత్సాహః సర్వకృత్యేషు సత్వరామానసీ క్రియా' ః అధి.2, పు. 35ః అని ఉత్సాహభావమును నిర్వచించినాడు. డా॥ సుబ్రహ్మణ్యం గారు 'ఈదృష్టితో శారదాతనయుని లక్షణమును పరిశీలించిన భావము యొక్క విభావోద్దీపిత్వమును 'ఉద్దాప్యతే' అను పదముచేతను, ఉద్బుద్ధదశను 'ఉత్సాహతే' అను పదముచేతను, దాని బహిర్గోచరత్వమును 'ఉత్సాహయతి' అను పదముచేతను నిరూపించినట్లు చెప్పవచ్చును'[6] అనిరి. ప్రతాపరుద్రీయకర్త లోకోత్తర కార్యములకే ఉత్సాహమును పరిమితము కావింపగా, శారదాతనయుడు కార్యమాత్రము నంగీకరించెను.

కావ్య కళాతత్త్వ ప్రకాశికాకారుడు కళాదులయం దీయబడిన యర్థ విశేషముల నాధారముగ గొని 'వీర' పదమున కొక సమగ్రమైన నిర్వచన మీయ యత్నించినాడనియు, వీరరసము – శక్తిమత్త్వమును, ధీరత్వమును, దుర్వారకృత్య నిర్వాహమును, వ్యాపకత్వమును, చలనమును, చాలనమును, విహారమును, విషయగర్భితత్వమును అభిలాషయును, ప్రేరకత్వమును, ధీరభాషణమును, నెట్టుకొని పోవునట్టి లక్షణమును, మార్గదర్శకత్వ లక్షణమును, ప్రక్షేపణమును అనెడి

---

4. భావప్రకాశము, అధి.2, పు. 35
5. వీరరసము, పుటలు 46, 47
6. వీరరసము, పు. 47

అర్థవిశేషములకు కలిగియుండు ననియు డా || సుబ్రహ్మణ్యం గారు వివరించి యున్నారు.[7]

'తతోఽర్థ కామయోర్ధర్మ మూలకత్వాత్ ధర్మప్రధానో వీరః' అను అభినవగుప్తుని మతము ననుసరించి ధర్మపురుషార్థులగు ధీరోదాత్తుల నాశ్రయించి యుండు యుత్సాహమే వీరరసనామ యోగ్య మగును కాని ధర్మ విరుద్ధమయిన యుత్సాహము వీరమునకు స్థాయి కాజాలదనియు తెలియుచున్నది.

భరతుడు -

'భావాయే ఉత్తమానంతు న తాన్మధ్యేషు యోజయేత్

యోభావాశ్చైవ మధ్యానాం న తాన్నీచేషు యోజయేత్'[8]

అని శాసించుట వలన అభినవగుప్తు డట్లు నిర్ణయించెను.

'చతుర్విధనాయకుల జీవితములను ధర్మవీరమే శాసించుచుండుట గాంతుము. ధీరోదాత్తుని యందు ధర్మము వీరమును, ధీరోద్ధతుని యందు వీరము రౌద్రమును, ధీరలలితుని యందు వీరము కామమును, ధీరశాంతుని యందు శాంతము వీరమును అనుశాసించును' అని వీరరస' గ్రంథము చెప్పుచున్నది.[9]

వీరము శృంగార, రౌద్ర, బీభత్సముల వలె జనకరసము. భరతుడు 'వీరాచ్చైవాద్భుతోవృత్తిః' (నా. శా., 6-39) అని చెప్పుట వలన వీరము జనకము. దీనినుండి అద్భుతము జనించును కాన అది జన్యము అని తెలియుచున్నది.

శారదాతనయుని రసోత్పత్తి కథనము ననుసరించి భరతులచే ప్రయుక్తమయిన 'త్రిపురదాహక' మనుపేరు గల రూపకదర్శనమున చతురాననుని నాల్గుముఖముల నుండి చతుర్విధవృత్తులతో పాటు శృంగారాదులగు ప్రధానరసములు ఉదయించినవని తెలియుచున్నది. చతుర్ముఖుని దక్షిణ దిఙ్ముఖమున నుండి సాత్వతీవృత్తితో వీరము ఉదయించినదట.[10]

**ఇతరరసములతో సంబంధము :** వీరమునకు భయానక శాంతములు విరోధిరసములు. రౌద్ర, అద్భుత, శృంగారసములు పోషకరసములు. వీరమునకు శాంతము విరోధిరసము కాదని 'వీరమునకు శాంతము విరోధిరసమని

---

7. వీరరసము, పు. 52
8. నాట్య శాస్త్రము, అ. 25, శ్లో. 116
9. వీరరసము, పు. 54
10. భావప్రకాశము, అధి. 3, పుటలు 57, 58

పేర్కొనుటకు ఎట్టి ఉపపత్తులును గోచరింపవు. వీరమున శాంత మంతర్భూతము కాకపోవచ్చును కాని శమసాధన పర్యంతము ముముక్షువు నందు ఉత్సాహము శాంతమునకు పోషకముగా నిలుచుచున్నపుడు శాంతమునకు వీరము విరోధి యనుట అసమంజసము' అని డా॥ సుబ్రహ్మణ్యం గారు సోపపత్తికముగ నిరూపించి యున్నారు.[11] ఈ వాదము సత్యదూరము కాదు. ఇట్లే భయానకమును వీరమునకు సంచారిగ గ్రహింపవచ్చు నని వీరి తలంపు. లోకమునందు కార్య సాధకులలో తాము చేపట్టిన కార్యములు సఫలీకృత మగులోగా ఎట్టి విఘ్నములైన కలుగునేమో యను భయము కలుగుట సహజము కావున దీనిని సంచారిగ గ్రహించుటలో తప్పులేదని వీరిభావము.

శృంగారవీరములే రమ్యకావ్యమగు నాటకమున అంగిగా నుండవలె నను అలంకారిక నియమము ననుసరించి నవరసములలో వీరరసమునకు గల స్థానము విదితము కాగలదు.

కథావశమున వీరరస నాయకునకు నాయికాసంబంధము కలిగినపుడు శృంగారమునకును, యుద్ధవీరాదులలో నాయకుని ఉత్సాహాతిశయమును గాంచిన శత్రువుల అవస్థాదికమును వర్ణించు సమయమున హాస్యమునకును, తావు గలదు కావున శృంగార హాస్యములతో వీరమునకు కొంత సంబంధమున్నట్లు చెప్పవచ్చును. అట్లే ప్రతినాయకగతమగు భంగపాటు ఉత్సాహమును పోషించును. ఇష్టజన వియోగము వలన శోకమును పొందు నాయకుడు తత్కారకులగు వారిని సంహరింప నుత్సహించుటచే దీనికి కరుణముతోడను కొంత సంబంధమున్నట్లు తెలియుచున్నది. రౌద్రమునందు వలె శత్రుకృతాపరాధ ప్రశంస ఇందు అధికముగా కన్నట్టును కావున రౌద్రముతోడను దీనికి సంబంధము గలదు. దాన, ధర్మ, దయా వీరములకు రౌద్రముతో సన్నిహిత సంబంధములేకున్నను, యుద్ధవీరమునకు మాత్రము రౌద్రముతో ఎక్కువ సాన్నిహిత్యము కలదు. ఆలంబనోద్దీపములు, సంచారిభావులు ఈ రెండింటికిని చాలవరకు సమానములు. కాని రౌద్రమునకు గల రక్తాస్య రక్తనేత్రత్వములు మాత్రము యుద్ధవీరమునకు లేవు. శత్రునాయ కాశ్రయమగు భయము, నాయకాశ్రయమగు వీరమునకు అంగము కావచ్చును. యుద్ధవీరాదు లందు నాయకుని రణోత్సాహమునకు ఫలితముగా నున్న రక్తసిక్త బీభత్సావహమగు

---

11. వీరరసము, పు. 58

యుద్ధభూమిని వర్ణించు సందర్భమున దీనికి బీభత్సము తోడను సంబంధ ముండవచ్చును. ఈ రీతిగా వివేచించి చూచిన వీరమునకు శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, భయానక, బీభత్సములతో సంబంధమున్నట్లు అనిపించును.

**వీరరస భేదములు :** 'మానవజీవిత సర్వావస్థ లందు వ్యాపించిన వీరము బహుముఖములుగ సాధకునికి గోచరించును కావునను, అట్టిది సాహిత్యము నందును ప్రతిబింబించును కావునను లాక్షణికులు వీరరసమును బహువిధములుగ వింగడించి ప్రపంచించినారు'[12] అని డా॥ సుబ్రహ్మణ్యం గారు.

నాట్యశాస్త్రము ననుసరించి –

'దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవచ

రసం వీరమపి ప్రాహ బ్రహ్మ త్రివిధమేవచ' –6–80

దాన, ధర్మ యుద్ధవీరము అని త్రివిధములుగ తెలియుచున్నది. ధనంజయాదులు కూడ త్రివిధములుగనే పేర్కొనిరి.

'సచదయా రణ దాన యోగాత్త్రేధా' – 4–73

అని దశరూపకము.

భరతుడు చెప్పిన దాన, ధర్మ, యుద్ధవీరములకు మారుగా నీతడుదయాయుద్ధ దాన వీరములను పేర్కొనెను. ధనంజయుడు వదిలిపెట్టిన ధర్మవీరమును గ్రహించి విశ్వనాథాదులు దాన, ధర్మ, యుద్ధ, దయావీరములని చతుర్విధములుగా పేర్కొనిరి. రసగంగాధరకర్త యుద్ధవీరము, దానవీరము, దయావీరము, ధర్మ వీరము, సత్యవీరము, పాండిత్యవీరము, క్షమావీరము, బలవీరము అని ఎనిమిది విధములుగ పేర్కొనెను. అచ్యుతరాయలు తన సాహిత్యసారమున

'ఉత్సాహస్థాయిభావస్య వీరో ద్వాదశధాతుసః

యుద్ధ దాన దయా ధర్మ సత్య విద్వత్తపోబలైః

త్యాగ యోగ క్షమా జ్ఞానై స్తదుపాధేర్విభేదతః[13]

అని తొలుత ద్వాదశభేదములుగ పేర్కొని పిదప మరికొన్ని చేర్చి ఇరువది యొక్కటిగా పెంచెను. అవి వరుసగా సంపద్వీరము, రూపవీరము, కళావీరము, గానవీరము, అహింసావీరము, ఐశ్వర్యవీరము, కవిత్వవీరము, శ్రద్ధావీరము, భక్తివీరము,

---

12. వీరరసము, పు. 65
13. సాహిత్యసారము, పూర్వార్థము, 4వ ప్రకరణము, శ్లో. 99

ఇట్లు బహువిధములుగా వ్యాపించియుండు వీరమును మూడువిధములని గాని, నాలుగువిధములని గాని నిర్ణయింపరాదని, కావ్యానుశీలన ప్రవృత్తులగు సహృదయులు కావ్యలోకమున మరికొన్ని భేదములను ఏర్పరచుకొనవచ్చునని, విజ్ఞులు దానికి సంతోసింతురనియు, మరికొన్ని భేదములు బుధు లూహింతురు గాక అని బుధులపై భారమును మోపినాడు. డా॥ సుబ్రహ్మణ్యంగారు 'స్వాతంత్ర్యవీరము, యశోవీరము, మానవీరము' అని మరి మూడింటిని అదనముగా చేర్చియున్నారు. ఆచార్య నరసింహంగారు 'ఇట్లనంత భేదముల నంగీకరించుచో శాస్త్రమున కవస్థాదోషము పట్టును'[14] అని చెప్పిన మాట ఎంతయు సత్యమనిపించును. కావున పలువురు అలంకారికులచే అంగీకృతములైన దాన, ధర్మ, దయా, యుద్ధవీరములనే గ్రహించుట శ్రేయస్కరము.

---

14. సాహిత్యదర్పణము, పు. 238

## భారతము - వీరము :

తిక్కన గారి భారతభాగమున వీరరస మెట్లు పోషింపబడినదో పరికింతము- విరాట పర్వమున భీముని వీరమునకు తావు కలిగినది. ద్రౌపది కీచకునిచే పరాభవింపబడినదై ఆరాత్రియందే మహానసశాల కరిగి, సుప్తుండైన వృకోదరుని మేల్కొలిపి తాబడ్డ యవమానమును వివరించి, ధర్మరాజాదుల స్థితిని వేవిధముల వివరించి, విలపించి, మేరుధీరుడైన భీముని స్వాంతమును కలంచి, అతని డెందము నటమట నొందించి చింతాక్రాంతు డయిన కౌంతేయుని కీచకవధకై నియోగించినది. అవమానఘూర్ణితమానయైన ద్రౌపది అతని యత్నమును మరింత పటిష్ఠమొనర్చుటకొ అన్నట్లు 'వాని దెగజూడవైతేని . . .' : విరా. , 2-229: అని బెదిరించినది. ఆమెయొక్క భావతీక్ష్ణతను, తనను ప్రేరేపించు ప్రయత్నమును గమనించినవాడై, అప్పటికే అతనిపట్ల క్రోధమూనిన భీమసేనుడు దానికై ఇంత వగవవలెనా అను భావముతో చిరునవ్వు నవ్వినవాడై-

'జలజదళాక్షి కీచకునిఁ జంపుట కిమ్మెయి ముట్టఁబల్కఁగా
వలయునె యేనుజూడ ననివారణ నిన్నుఁ బరాభవించి వాఁ
డిల మన నింక నాంధ్రడకును నెవ్వరు భంగమునీఁ గఁజాలు వా
రలఘు మదీయ బాహుబల మప్పుడచూపని తప్పు సాలదే' -విరా.,2-231

'ఎల్లి యెల్లివిధంబుల నెందుఁజొచ్చె
నేని నా ధర్మతనయుండు తాన వచ్చి
యడ్డపడెనేని నీవ పెంపారు కరుణఁ
గాచితేని నాచేఁబడుః గీచకుండు' - 2-232

అని ప్రతిజ్ఞాపూర్వకముగ పలికినాడు. ఇట ఎన్ని ఆటంకములు కలిగినను అనగా ధర్మజుడు తానే వచ్చి అడ్డుపడుట, ద్రౌపది పెంపారు కరుణచే కాచుట - ఇత్యాదులు కలిగిననుతన ప్రయత్నము ఆగదని స్థిరచిత్తుడై కీచకవధోత్సాహమును ప్రకటించినాడు. ఈ విధముగ నిట ఆభాసప్రాయమయిన శృంగారమున జనించి పత్నీపరాభవ దర్శన జనిత క్రోధమున ప్రవృద్ధమై, కష్టపరంపరా శ్రవణమున పరిపుష్టమయి, కీచకవధోత్సాహము చివరకు భీమునికలో స్థిరమై వీరముగ పరిణమించినది.

భీమానుమతమున మరునాడు ద్రౌపది కీచకుని కంటపడి నీ వొక్కరుండువు అరుగుదేరవలయు నని పలికి నర్తనాగారమును సంకేతస్థలముగ నిర్ణయించి, ఆ

వార్తను భీమున కెఱింగించినది. 'అత్యంత చింతా ధూతాత్ముడైన నాకుఁబరమోత్సాహము సంధిల్లె' అని ఆకార్యమున కుత్సహించినవాడై-

'వెఱవక సంకేతించిన
తెఱగున నయ్యెడకు నరుగుదెంచునొకో కొం
దఱదెచ్చునొకో వెడఁగై
యఱిముఱి వెలిపుచ్చునొకొ రహస్యంబెల్లన్' - 2-277

అను భావపరంపరా సమాకుల చిత్తుడై -

'వచ్చు మదాంధవృత్తి ననివారణ నొక్కఁడు నాట్యశాలకుం
జొచ్చు నవశ్యమున్ వెదకి చూచి ననుం గని యప్డు సంగరం
బిచ్చు మదీయ బాహు బలహీనబలుండయి నీకు ప్రీతిగాఁ
జచ్చు ననంశయంబిది విచారము లన్నియు నింక నేటికిన్' - 2-278

అని తన యుత్సాహమును సుస్థిరము గావించుకొనినాడు. ఈ రీతిగా సుస్థిరీభూతచేతస్కుఁడయి కట్టలుకన్ బెబ్బులి గోలవ్రేసినటు లుగ్రాకార మేపారగ మండపము సంక్షోభింపగా నేతుననియు, సాళువము కాకి నొడిసిన భంగి పొదువుదుననియు, పిఱుసనిన వెస బైకురుకుదుననియు పఱిపఱి సేయుదు నీవ్రాన్కి పారంబొనర్తుననియు పల్కి, అవనీచక్రము సంచలింపగ, దివంబల్లాడగ, అశాచయం బవధూతంబుగ, గోత్రశైలనికరం బాకంపమును పొంద, అర్ణవములు ఘూర్ణనమొంద క్రోధమును కృతార్థత్వము నొందించి చిత్రవధప్రౌఢిని ఆ సూతు తెగటార్తు ననినాడు. ఈ పల్కులన్నియు భీముని యుత్సాహసంపదను ఇనుమడింపచేయు చున్నవి ఉత్సాహము స్థాయియై వీరము కృతర్థాత నొందినది. ద్రౌపది సమయభంగ మగునేమో యని భయపడి కొంత వారించినను భీముడు ఆ మాటలను గీటున బుచ్చి నిగూఢవృత్తియై తిన్నని యుపాయమున అతని తెగటార్తు నని పలికి తన యుత్సాహమును ఇనుమడింప చేసికొనినాడు. ఇట్లు సజాతీయ విజాతీయభావములచే భీముని యుత్సాహము సందిగ్ధదశ నందక స్థిరత్వము గాంచి వీరముగ పరిణమించినది.

ఇట వీరమునకు ప్రతినాయకుడగు కీచకుడు ఆలంబనము. కీచకుని ఉత్కర్ష ఉద్దీపనము. స్థైర్యము, ధైర్యము, గర్వము, ఉత్సాహము అనుభావములు. క్రోధము, ఉగ్రత, ఇత్యాదులు వ్యభిచారులు. కొందరి మతము ననుసరించి ఇది బలవీరమున కుదాహరణము. వనితా వేషమున నున్న భీముడు కామాంధుడైన

కీచకునితో నొనర్చిన నిగూఢార్థ సంభాషణములలో శృంగారంపు మేలిముసుగున హాస్యమే తొలుత తళుక్కు మనును. శృంగారము తొలగగనే హాస్యమునకు వెనుక వీరమే దోబూచులాడినది. ఇట్టి సన్నివేశకల్పన మెంతటి క్లిష్టమైనదో తన్నిర్వహణ మంతటి కష్టమైనది. ఈ ఘట్టమందు సంవాదమంతయు హృద్యమైనది.

దక్షిణగోగ్రహణ సందర్భము నందును, ఉత్తరగోగ్రహణ సందర్భము నందును వీరరసము కొంత వరకు చోటు చేసికొన్నది.

గోగ్రహణవార్త వినిన విరటుడు -

'ఏమీ నిక్కమె మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండే మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలుమే
లామైతోడనె పోవుఁగాక యని వీరాలాపముల్ వల్కియు
ద్దామ క్రోధశిఖాకలాప వికటోద్యద్భ్రూకుటి స్ఫూర్తియై' - 3-139

అని మంత్రి దండనాథులను పురికొలిపి యుద్ధమున కుత్సహించినాడు. కాని విరట సుశర్మల నడుమ పోరు ఘోరముగ జరిగి తుదకు విరటుడు సుశర్మచే బంధితు డయినాడు. ధర్మజుడు ఆ స్థితిలోనున్న విరటుని రక్షించుట తమ ధర్మమని భావించి అనిల నందను నవలోకించి సత్వరంబగు చిత్తంబుతో మత్స్యవిభునివలను సూపుచు -

'ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి
యున్నవారము గావున నుగ్రరిపుల
పాలుపడకుండ విడిపింపఁబాడి యితని
నెయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ' - 3-203

అని పలుకగనే భీమనందనుడు మేను పెంచినాడట. ఇది అతని యుత్సాహమునకు నిదర్శనము.

'... ...        ... ... ..  ...'
...        ఇదె సాలవృక్షము రయంబున దీన నరాతిసేన డా
ల్లి నడిచి యీ సుశర్మని బలంబు జలంబును మాన్పి యవ్విరా
టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్' - 3-204

అని పలికి నీవు తమ్ములు నొక్కెడ నిలిచి చూచుచుండు డని పలుకుటలో ఈతని యుత్సాహ మెట్లు స్థిరత్వము నొందుచున్నదో విదితము కాగలదు. ఇట భీముని బలవీరము ధర్మజు ధర్మవీరమునకు పోషకముగ నున్నదనుచు డా॥ సుబ్రహ్మణ్యం

గారు భీముని యుద్ధోత్సాహము మిత్రజనాపదుద్ధరణ సమర్థము, శత్రు భంజన సమర్ధము నని చెప్పి వీరుని బలమున కిదే ప్రయోజనమని, విరటుని రక్షించుటలోనీరెండు ధర్మములు ఇమిడియున్నవని, అవి ఉపకారికి నుపకారము చేయుట, గురుజనవాక్యపరిపాలనము నని చెప్పిరి.[15]

ఉత్తరగోగ్రహణఘట్టమున అర్జునుని యుద్ధవీరము గలదు. భీష్మద్రోణ కృపాది ధన్వి నికరాభీల మయిన కౌరవసైన్యమును చూచి ఉత్తరుడు భయకింపితు డగుట, దైన్యముతో భీరువులగు పలుకులు పలికినవాడై రథము దిగి వెన్నిచ్చి పరువెత్తుట -ఇత్యాది అంశములు హాస్యరసాత్మకములై అంగిరసమగు వీరమునకు అంగముగ నిలిచి తదుత్కర్షకు హేతువు లయినవి.

'. . . కౌరవులు గోవర్గంబు గొంపోవగా

గనియోఁ గ్రమ్మఱి రిత్తవోదునె భయోత్కంపంబు నీకేటికిన్'-4-68

అని మరల

'వెఱవకుమన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న

త్తెఱఁగదియేల నీకుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁజి

చ్చఱపిడు గెట్టు లట్టడరి శూరుల మొత్తమునుగ్గుసేసె దం

బఱపెద సేన రాజధృతిఁబాపెద గోవుల గ్రమ్మఱించెదనన్' -4-83

అని చెప్పినాడు. ఇట అర్జునుని యందు కౌరవులతో యుద్ధము చేసి, గోవుల గ్రమ్మరింపవలె నను ఉత్సాహము కాననగుచున్నది. ఈ సందర్భమును గూర్చి శ్రీ యడవల్లి వారు ఇట శైలి కూడ వాత్సల్యపూరకముగను, ఉత్సాహ జనకముగను పాగినదనియును, ప్రతిశబ్దము రసపోషకము అగుటయే మహాశిల్ప మనియును అనినారు,[16] ద్రోణుని మాటల వలన ఈతడు 'సింగం బాకటితోగుహాంతరమునం జేడ్పాటుమై నుండి మాతంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చునోజ'ను సమరస్థే యాభిరామాకృతినివచ్చినట్లుగ తెలియుచున్నది. ద్రోణాచార్యుడు అర్జునుని ప్రశంసింపగా కర్ణుడు కినిసి 'ఒక వీరునకు ఒక వీరుడు చాలునని ,పొదులునించెద నర్జునునిగాత్రశాలలో నని, శరవర్షముచే అర్జునాగ్నిని సాధించెదనని (విరా., 4-201-3) పలికినాడు. ఇది అర్జునుని వీరమునకు ఉద్దీపన

---

15. వీరరసము, పు. 166
16. 'తిక్కన శిల్పపు తెనుగుతోట ' భారతి, 1957 సెప్టెంబరు, సంపుటము 34, సంచిక 9, పు. 17

మయినది. వీరావేశముతో కర్ణునిపై కురికియుద్ధము చేయు సందర్భమును -

'ద్రోణుడు రయమున నేసిన
బాణము లెడతెగక యొక్క బాణమపోలెన్
శ్రేణియయి వోవఁ బార్థుడు
రేణువు గావించు . . . . . ' - 5-129

రీతిని ద్రోణునితో యుద్ధముచేయు సందర్భమును వీరరస స్ఫోరకములే. ఇట్లే కృపాచార్యునితోను, భీష్మునితోను, దుర్యోధనునితోను యుద్ధముచేయు సందర్భము లందునుఅర్జునుని యుద్ధవీరమునకు తావు కలిగినది. ఈ యుద్ధమున అటనట వీరమునకు రౌద్రము కూడ అంగముగ చేయబడినది. ఈరీతిగ అర్జునుని యుద్ధ సందర్భమునం దంతయు శత్రుపక్షమగు కౌరవు లాలంబనము కాగా, వారి ఉత్కర్ష ఉద్దీపనము అయినది. ధైర్యము, శౌర్యము, వైశారద్యము, ధీరభాషణము, ఇత్యాది అనుభావములచేతను, ధృతి, క్రోధము,ఉగ్రత, ఇత్యాది వ్యభిచారులచేతను పోషింపబడి వీరముగ పరిణమించినది. ఇది యుద్ధవీరమునకు చక్కని యుదాహరణము.

ఉద్యోగపర్వమున సంజయుడు ఉపప్లావ్యము నుండి హస్తినకు చేరి ధృత రాష్ట్రునితో తెలుపుమని అర్జునుడు పుత్తెంచిన పలుకు లన్నియు ః ఉద్యో., 2-134-44ః వీరరసావలంబనములు.

'విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ విల్లందమై యుండ న
స్మద్యోధావలి మానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట యేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్' -
ఉద్యో.,2-143

అను పద్యమును -

'గాండీవ గుణరవం బొండాండ చెలగంగ
శరపరంపర లాకసంబుగప్పఁ
బ్రతివిశిఖములు ఖండితములై రాలంగ
నెదిరి సైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబులై యవ
యవభేది మెఱుఁగని యట్లుగాఁగఁ

దునిసిన నెత్తురు నెనడును నెమ్ములు
        నెఱచియు గండలు నెనసి సమర
తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళ
హరులు శోబిల్ల నొగలపై హరి యెలర్ప
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁగని కానికానఁడు రాజరాజు' ఉద్యో. , 2-144

అనుపద్యమును అర్జునుని రణోత్సాహమును తెలియచేయచున్నవి. ఇట వీరము రస పర్యంతము లేదు.

సామదానాది నీత్యుపాయములచే పాండవులు కౌరవులతో సంధి యొనర్చి తమ భాగమును తాము పొందవలె నను యత్నము ఈపర్వమున అధికముగా కొననగుటచే కొందరి మతము ననుసరించి ఇటకౌంతేయుల నాశ్రయించినది యత్నవీరము.

'మమ్మెఱుఁగర దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱియెఁఱుగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుగుఁదు
పామ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్' - ఉద్యో., 3-34

అని ఎల్లవిషయములు విశదపరచి ధర్మజుడు మకుటాయమానమైన ఒక్క మాటలో యత్నవీరమును ప్రదర్శించినాడేమో యనిపించును. దీనిని యుద్ధవీరమున గతార్థము చేయవచ్చును.

కుంతి శ్రీకృష్ణునితో 'భీమార్జునుల కిట్లనిచెప్పుము' :3-198:
'కొడుకుఁగాంచు రాచకూఁతు రెద్దానికి
నట్టిపనికి నుచితమైన సమయ
మొదవెఁ దడయుటింక నొప్పదు జనములు
నట్లుగాని పురుషులనరు మిమ్ము'
'భుజబలమున జీవించుట
నిజధర్మము మెత్తఁబడుట నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా
త్మజఁ గార్యంబడుగుమనుము తగ నందఱతోన్' -3-199,200

అని చెప్పిన పలుకుల వలన పాండవులలో నిద్రాణమైయున్న ఉత్సాహము

పెల్లుబుకును. దీనివలనిటకొంత వీరరసస్ఫూర్తి కలదు అనవచ్చును.

కుంతి కర్ణునకు అతడు తన పుత్రుడని తెలిసి ధర్మతనయాదులైన నీతమ్ములకును,ధార్తరాష్ట్రులకును నీవ తగు విభుడవు అని పలికినది. ఈ మాటలను విని కర్ణుడు తన ధీరత్వము విడువక – 'ఏనవశ్యంబును దుర్యోధనునికై నీకొడుకులతోడం బెనంగుదు'.

'నీపలు కెంతవోలినను నిర్ణయ మిట్టిదకాని యొండు లే
దీపనిమీది భారమున నీవిట వచ్చితిగాన పాండవుల్
సేపడిరేని జంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్దవాడు సమకూరిన బిట్టఱజంపు దుంజుమీ' –4–67–8

అని పలికినాడు. సవ్యసాచి చేత జచ్చుటయును కీర్తికరమ అని, ఏవిధముగా చూచినను ఆమెకు కొడుకు లేవురుగాని, ఆర్వు రనుట విడువుమని పలికినాడు.

కర్ణు'డఱసేయక' చెప్పినను దానమును, 'అరసేసి' యిచ్చుటవలనను, ప్రతినాయకపక్షావలంబియైన కర్ణుని ప్రసక్తివలనను, దానము కొంత కుంటువడినది. అలంకారికముగ దానవీరమునకు ఉదాహరణము కాకపోయినను దానవీరమే లేదనుటకు మనస్కరింపకున్నది.

యుద్ధపంచకమున యుద్ధవీర మధికముగా కలదు. ఈయుద్ధ పర్వములందు వీరముతోపాటు రౌద్ర బీభత్స భయానకములు కొంత చోటుచేసికొన్నవి. భారతమున అంగిరసము వీర మయినచో దీనిని విపులముగ వర్ణింప వచ్చును. కాని వీరమున కట్టి స్థితి లేదు. శాంతమునకు గాక యేయితర రసమునకును భారతమున అట్టిస్థితి లేదు. కావున తిక్కనార్యుడు ఏరసమును నిరూపింపదలచినను అంగి యగు శాంతము వీగిపోకుండునట్లును, శాంతమునకు పోషక మగునట్లును చేయవలసి యున్నది. తిక్కన కృత భారతభాగము నందలి పదునేను పర్వములలో ఐదు పర్వములు యుద్ధపర్వములే యగుట వలన వీరాదులు సులభముగ ప్రతీయ మానములై అంగిరసభంజకములగు నవకాశము కలదు. ఈ విషయమై ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రి గారు 'భీష్మద్రోణకర్ణఅర్జునాది పది పదునైదుమంది కురు పాండవ వీరుల నాలంబనోద్దీపనముగా పదునెనిమిది దినములపాటు జరిగిన ఒక యుగాంత మహాయుద్ధమును, యుద్ధరసములు రసములుగా మూర్తి గట్టు కొనకుండ అట్లని స్ఫూర్తియే లేకుండ చేయబడక – మొత్తము మీద శాంతమున కంగభూతముగ సర్వమును నిర్వహించి చూపుట సామాన్యమైన విషయము కాదు. తిక్కన గారు

భారత యుద్ధము నంతయు నట్లు నిర్వహించి చూపిరి. అది ఆయన కావ్యరసమును కొనియాడు కవిత్వతత్త్వ నిరతిశయానుభావనంద భరితాంతఃకరణము యొక్క నిత్యజాగరితమైన లక్షణమునకు పలక్షణము' అని చెప్పియున్నారు,[17]

తిక్కన ఈ భారతయుద్ధమును యథావిధిగ వర్ణించుచు 'వేసిన బాణమును వేయకుండ, చేసిన రీతిని మరల చేయకుండ' వర్ణించినా డనుట సత్యదూరము కాదు. 'పది నారాచముల నేసె' 'పడ్వింశతిసాయకంబులు దనువునం జొనిపె', 'అతని జత్రుదేశంబున నొక వాలమ్ము, వక్షమున పెక్కును గ్రుచ్చిన', 'సూతు నొక్క వాలమ్మున యశ్వముల నాలుగింట', 'అయిదు నారసముల నాతనిఁ జదికిలబడగ నేసి' అనురీతిని బాణసంఖ్యతోపాటు, మానుష, అచల, క్రౌంచ, గరుడ, మకర, శ్యేన, మండల, వజ్ర, కూర్మ, శృంగాటక, చక్ర, సూచీ, కూర్మ - ఆది వ్యూహములును ఈ యుద్ధపంచకమున తరచుగా కాననగు సంశములు.

'యుద్ధపంచకమున గనపడు వీరులలో ప్రతివాడును ఉత్తముని వలె భాసించి కారణజన్ముడెనట్లును, ఏదో యొక వైయక్తిక ధర్మము నాశ్రయించి యుద్ధము చేసినట్లును గోచరించెదరు' అని వీరరస కావ్యమున గలదు.[18]

యుద్ధపర్వము లందెచ్చట చూచిన వీరరసము యొక్క ఉజ్జ్వల తాండవము కాననగును. కావున వీని యందలి వీరమును గూర్చి చెప్పవలెనన్న వీనినన్నిటిని యథాతథముగ నుదాహరింపవలసి వచ్చును. కనుక వీరరసప్రధానములగు నొకటి రెండు ప్రముఖములగు యుద్ధఘట్టములను గూర్చి మాత్రమే చెప్పికొనుట శ్రేయస్కరమగు పద్ధతి.

ద్రోణపర్వము నందలి అభిమన్యుని యుద్ధము యుద్ధవీరమున కొక చక్కని యుదాహరణము. ధర్మజుడు ద్రోణునిచే రచింపబడిన పద్మవ్యూహమును ఛేదింపుమని అభిమన్యుని కోరినాడు. ధర్మజు నంతటివాడు తన నభ్యర్థించుటచే అభిమన్యునకు ఉత్సాహము కలిగి -

' ... ...... ... ...

దీని ముఖంబు భేదించు తెఱంగు నా
కెఱిఁగించె మాతండ్రి డియేను దెఱపి

---

17. తిక్కన కావ్య శిల్పము, పుటలు 272-73
18. వీరరసము, పు.. 176

సేయనేర్తు (జొచ్చి చించి చెండాడెద
మూకలెల్ల జట్టుముట్టినపుడు
వెడలునట్టి వెరవు విన దానికేమి     నా
చొచ్చు నేర్పు బలువుఁ జూడు మధిప' - ద్రోణ. , 2-5

అని పలికినాడు. ధైర్యస్థైర్యాదు లీతనిలో కాననగు చున్నవి. మరియు ద్రోణుడు మనమున మెచ్చుకొనునట్లు అమ్మైన గలగింపక యిట్లు కురు ముఖ్యుడుధర్మసుతుడు గారవించిన జతనమును నిష్ఫలముసేతునా! అనియు -

'ఇదె యొక పిన్నవా (డడరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం
గదుపుల వెల్చు గోపకునికైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద నిని మామ ప్రీతివిలసిల్లగ దండ్రియు సంతసిల్ల బె
ట్టిదుఁడగు కౌరవేంద్రునకు డెప్పరమయ్యెడు భంగిఁ బేర్చెదన్'
ద్రోణ. , 2-11

అనియు పలికినాడు. డా॥ సుబ్రహ్మణ్యం గారి అభిప్రాయానుసారము ఈ పల్కులలోయశోఽనుప్రాణిత యుద్ధోత్సాహము ప్రకటిత మగుచున్నది. ఈ రీతిగ అర్జునునకు గలిగిన యుత్సాహమునకు 'బాలుడవు నీవు బహువిధ సమర కర్కశులు వారు' అని సారథి అవరోధము కలిగించినను ఏమాత్రము చెదరక, బెదరక-

'. . .      . . .      . . .      . . .
యనికి బలారి వచ్చినఁ బురారిగణంబులుఁ దానుఁ బన్నినం
గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడుఁదాకిన నే జయింతు మా
ర్కొని యనుచుండుదున్ సరకుగొందునె ద్రోణునిఁ దోడియోధులన్'
- ద్రోణ., 2-15

అని పలికినాడు. అనగా నిట ఈతని ఉత్సాహము స్థిరత్వము నొంది వీరముగ పరిణమించుట కవకాశము కలిగినదని అర్థమగుచున్నది. 'అతని పూనిక తన మాటను నిలువఁబెట్టుకొనుటకేనట! అదనుకు పరాక్రమముఁ జూపనిచో తన పూర్వప్రతిజ్ఞలు ప్రగల్భములై తాను నిందింపబడును. కావున నిందు మానవీర చ్ఛాయలు స్పష్టముగా గోచరించు చున్నవి' అని డా॥ సుబ్రహ్మణ్యంగారు చెప్పిరి.[19]

---

19. వీరరసము, పు. 178

19 ఇట్లు వీరు చెప్పియున్నను ధృతి, గర్వము, ఇత్యాది భావసామగ్రిని కలిగియుండి యుద్ధవీరమునకు ఉదాహరణ మయినదని చెప్పవచ్చును. ఈ యుద్ధవీరము అభిమన్యుడు వ్యూహములోనికి చొచ్చి యుద్ధము చేసిన సందర్భమున మరింత స్ఫుటముగ గోచరించును.

'ప్రకట బలాఢ్యులాక్కడఁ దిరంబయి పల్వురు వీఁక భూమి పా
లకునకు నడ్డమైనఁ దవులంబడి హుమ్మని నోరికండ నాఁ
చికొనిన మ్రోఁగు బెబ్బులి విశేషముదోఁపఁగఁబార్థు పట్టి సా
యకముల నాంచినం దెరలి రందఱు లేళుల పిండు నాకృతిన్'
'అతఁడందఱ మార్గణములు
నతిరయమునఁ ద్రుంచుచుం దదంగముల శర
ప్రతతులు నించుచుఁ బోరఁగఁ
బతి సేనకుఁ జేయి వీచెఁ బరవస మలరన్' [20]

యుద్ధము చేసినాడు. తన వీరవిహారముచే వృషసేనుని మూర్ఛనందించినాడు దుశ్శాసనుని పారిపోవునట్లు చేసినాడు. లక్ష్మణకుమారుని చంపినాడు. దీనితో కౌరవపక్షము విజృంభించి ధర్మముచే నాతని జయింప నసమర్థులై, అధర్మము నవలంబించి వంచనచే నాతని విరథుని చేసిరి. అయినను అతడు ధైర్యము కోల్పోవక -

'వాలును బలకయుఁ గొని యబ్బాలుఁడు
దయమార గగన భాగంబునకు
న్మీలిత ధృతి సారుండై
లీల నెగసిపోయె మండలీభూతగతిన్' - ద్రోణ., 2-110

ద్రోణకర్ణులు ఈ వాలును, బలకను కూడ త్రుంచివేయగా తన తేరిమీద నొప్పెడు ఘన చక్రమును గొని ఉపేంద్రుడు లీల నటించు చాడ్పున యుద్ధము చేసి వీరమనెడు వ్రతమును ధీరత్వనిష్ఠతో తుదిదాక పాటించినాడు. 'అసహాయ్యేఽపి యుద్ధేచ్ఛా సమరాద పలాయనమ్' ‹రసార్ణవ సుధాకరము› అను యుద్ధవీరలక్షణమున కిది లక్ష్యము కాదగియున్నది. ఇట వీరము అధ్యవసాయము, ఉత్సాహము, పరాక్రమము అను విభావముల వలన జనించినది. స్థైర్య ధైర్యాదు లను భావములు. ధృతి, గర్వాదులు సంచారులు.

---

20. ద్రోణ., 2-25-27

'కర్ణుని ఎట్లయినను కూల్తును' అను అర్జునుని పలుకులలో వీరరసస్ఫూర్తి గలదు.

'అట్టిద లోకపర్యవసమా దురవస్థకు ద్రుక్కినేర్తునే
కిట్టుదుఁ 'గర్ణశల్యులను కీటములం గర తాడనంబులం
బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలుగాఁగ ధర్మజుం
గట్టుదుఁ బట్టమన్న నగి గాండిని యద్దనుజారి కిట్లనున్' కర్ణ., 3-261

'నవ్వుల కంటెఁ గాకయని నాకు నశక్యమె కర్ణశల్యులం
గ్రొవ్వడఁగించుటే ద్రుపదు కూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్
నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁగాని యింక నా
మువ్వురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁబెట్టెదన్'

'అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గర కాండంబులుఁ బెక్కు భల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి ని
స్తుర భల్లం బొకటన్ సుయోధనుని చూడ్కిల్ నీఱుగా నిష్ఠ యు
ద్ధుర గర్వోన్నతమైన కర్ణుతలఁద్రుంతుం జూడుమీ వేడుకన్'

- కర్ణ., 3-262-63

కర్ణుని వధోత్సాహము వలన ఇట వీరము కలిగినది. ఇవి వీరరసావలంబనములగు వాక్కులు గాని చేతలు కావు.

ఒక వీరుడు శత్రువుతో యుద్ధము చేయు సందర్భమున అతని దుర్ణయలను స్మరించుకొనుచు ద్విగుణీకృతోత్సాహుడై యుద్ధము చేయుటలో రణస్ఫూర్తి గోచరించు చుండును. దీనికి ఉదాహరణముగ కర్ణార్జునుల యుద్ధమును పేర్కొనవచ్చును.

అర్జునుడు కర్ణునితో యుద్ధము చేయుసందర్భమున -

'గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి
కపటంబు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ
డగు ధర్మసుతు సిరి యపహరించి
యంతఁబోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స
భాస్థలి నమ్మెయి భంగపఱిచి

యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోష యా
త్రావిధి నెపమున దొడిపెట్టి
బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీ సుయోధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాదికర్త వీవ
యిన్నియెడలను నీపాడి యెందుఁబోయె' - కర్ణ., 3-356

అని కృష్ణుడు కర్ణుని దెప్పెను. ఇటు శత్రుపక్షమువారు చేసిన దుర్ణయము లన్నియు చెప్పబడినవి. ఈ మాటలను వినిన ధనంజయుని మనము నందలి రోషానలము రోమకూపముల పటు జ్వాలారూపముల వెడలి మరింత ఉత్సాహముగ యుద్ధము చేయుటకు పురికొల్పినది. కనుక ఇది యుద్ధవీరమునకు ఉదాహరణము కావచ్చును.

దుశ్శాసన దుర్యోధనుల వధ యందును ఇట్టి శత్రుకృత దుర్ణయస్మరణముచే రణోత్సాహము కానసగును. కాని ఈ కార్యము లందు క్రౌర్య మధికముగా నుండుటచే అవి రౌద్రమునకు ఉదాహరణము లయినవి. ధర్మబద్ధమగు కార్యము పట్ల చూపు నుత్సాహమే వీరమగును. చేసిన పనిలో క్రౌర్యము కనిపించిన అది వీరము గాక రౌద్రమగును. మరియు నిట గమనింపదగిన అంశము మరియొకటి గలదు. అధర్మపక్షమున నున్న కర్ణశల్యాదులు ఎంతటి పరాక్రమ సంపన్నులైనను వారు శూరులగుదురే కాని వీరులు కాజాలరు. వీర శూర పదముల కట్టి సూక్ష్మభేదము కలదు. కేవల పరాక్రమము శూరత్వము, ధర్మబద్ధ మయినచో అది వీరత్వము అగును క్రోధసంజనితము కానిది, ధర్మోన్ముఖమైనది, నాయకాశ్రయ మయినది, వ్యక్తిగతమగు కసి, కక్షలేనిది మాత్రమే వీరము. కర్ణుడు ఎంతటి పరాక్రమవంతుడైనను, అతడు అధర్మపక్షమున ఉండుట వలన అతని శూరత్వ మిట్టిది అని చెప్పవచ్చును గాని రణవీరునిగ మాత్రము పేర్కొనుటకు అవకాశము లేదు.

సౌప్తికపర్వమున దయావీరమునకు కొంత తావున్నదేమో యనిపించును. ఆర్తులయెడ దయకలిగి రక్షించు వీరుల ధర్మము దయావీరము అగును. అశ్వత్థామ యొనర్చిన పరాభవముచే శోకించుచున్న ద్రౌపది 'అప్పాపాత్మునకు సహజంబైన శిరోమణి గలదు. దానిందెచ్చియిచ్చిన జూచి జీవంబుతో నుండెదనని తలంచితిని' (సౌప్తిక., 2-36) అని పరుషాక్షరముగ పలికినది. అతంటితో మూరుకొవక -

'క్షత్త్ర ధర్మ మాత్మనెకొని రయమున
నరిగి పాపకర్ముడైన కుంభ

జన్మతనయు ముట్టి చంపుము నామది
కసలు నడలు నుడిపికావు నన్ను' = 2=37

అని భీముని అశ్వత్థామ పరిభవార్థమై నియోగించినది. భీముడు తన సోదరుడగు అర్జునునితోడను, పరివారముతోడను కూడి అతనిని ఓడించెను. కాని అతని సంహరింపక వారు విడిచిపుచ్చిరట. ఆ అంశమును ద్రౌపదితో చెప్పుచు -

'గురుతనయుఁ డగుటఁ బ్రాణము
హరియింపఁగఁ జారక విజయుఁ డశ్వత్థామం
బరిభూతుఁజేసి యాయుధ
పరిగ్రహముతోడ లజ్జఁబాయం జేసెన్' - 2-95

అని విజయుడు అతని ప్రాణమును హరింపక విడిచెననినాడు. ఇట అశ్వత్థామను ఆర్తిని పొందించిన వ్యక్తులు వీరే అయినను, కొంత దయచే అతని సంహరింపక వదలుట వలన నిట దయావీర మున్నదేమో యనిపించును.

ఈ యుద్ధపంచకము నందు యుద్ధవీరమును ప్రకటించు మార్గములలో మరియొకటి - శత్రువీరులలో ఎవ్వరైన విశేష పరాక్రమమును ప్రకటించి నాయక పక్షము వారికి అపార నష్టమును కలిగించిన ఆ నాయకుడు గాని, అతని అనుయాయులు గాని ఆ వ్యక్తిని సంహరించుటకు భీషణప్రజ్ఞ యొసర్చుట యందును వీరరసస్ఫూర్తి కలుగును. సైంధవ, దుశ్శాసన, దుర్యోధనాదుల వధ లన్నియు నిందులకు దృష్టాంతములే.

శాంత్యానుశాసనికములలో వీరమున కవకాశము లేకపోయినది. అశ్వమేధపర్వమున మాత్రము ధర్మజుని ధయావీరమునకు అర్జునునియుద్ధ వీరము అంగముగ పోషింపబడిన తావు కలదు.

యాగాశ్వము వెంట నడచు అర్జునుడు మహాభారత యుద్ధానంతరము తిరిగి గాండీవమును ధరింపవలసి వచ్చినది. దయాధురాప్రవణుడు అజాతశత్రుడు తురంగము రక్షకు పంపునప్పుడు -

... ... ... ...
... ... ... భూ
పవితతి యెల్లనుం దెగియె భారతయుద్ధము నందు బాలురం
దివిరి వధింపఁగాదు కృపఁ దిన్నదనం బెసఁగం జరింపుమీ'

'అని నయవృత్తి నశ్వమున కడ్డము వచ్చిర యేని నీవు బాం
ధవము దలిర్పఁ బల్కి యని దప్పఁగ(బోవుము కిన్కమానుమ'ని
– అశ్వ., 4-6, 7

పలికిన పలుకులను అర్జునుడు మనంబున తలచి త్రిగర్త దేశాధిపతులతో పల్కినాడు. ఇవి ధర్మరాజు యొక్క దయామయ హృదయమును తెలుపుచున్నది.

మరియు అర్జునుడు –

'చంపకు మీరాజుల నను
కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెంపను కుసుమమునకు నా
పంపానరించుటయ – సౌరభముగ నెఱుగుమీ' –అశ్వ. , 4-34

అను ధర్మజుని ఉపదేశమును మరువక తనకు ఎదరుపడిన ప్రతిరాజునకు తెల్పుచు 'దయ'ను ప్రదర్శించినాడు. ఈ సందర్భమున త్రిగర్తాధీశులు తన నెదిరించినను రణపాండితిని ప్రదర్శింపలేక గాండివమును జారవిడుచుకొనినాడు అర్జునుడు గాండివ పతనావమానమున కలిగిన క్రోధముచే –

'అట మున్న గాండివంబు
త్కట రయమున నెత్తి కోపదహనుం డత్యు
ద్భటమూర్తి దాల్చె నన మి
క్కుటమై కడగంటికెంపు గొమరారంగన్'

ఆ బీభత్సుడు –

'పిడుగులు వడి బెక్కొక్కటఁ
బడియెడు ననఁ దొరఁగ జేసెఁ బటు విశిఖముల
ప్పుడు మేదిని దోఁపద చె
ప్పెడు కొలదియె రథికవరుల పీనుగుపెంటల్' –అశ్వ. , 4-16-18

అనునట్లు చేసినాడు. ఇట ఈతని రణోత్సాహము వలన కొంత యుద్ధవీరస్ఫూర్తి కలుగుచున్నది. కాని ఇది రసపర్యంతము లేదు. ఏలన –

'ఆ యుగ్రోద్ధతి సూచి పెల్కుఱి త్రిగర్తానీకముల్ నల్గడం
బాయంబాఱె దదాప్తులేము దగనీ పంపోపి సద్భక్తిమైఁ
జేయంగాఁ బనిగొమ్ము పేర్మిగ మముం జేకొమ్ము సమ్యగ్జయ
శ్రీయుక్తా యనినన్ ధనంజయుఁడు గాచెన్ వారినెల్లం గృపన్'
–అశ్వ., 4-19

ఈ తీరిగ శరణువేడిన వారిని, ఆర్తులను దయతో రక్షించినట్లు తెలియుచున్నది. కాన ఈ ఘట్టమున దయావీరమునకు యుద్ధవీరము తోడ్పడినదని చెప్పనొప్పును.

ఇట్లే సింధుదేశాధీశులతో 'తమ యన్న చెప్పిన వాక్యంబు లుపన్యసించి మీరేల జాలింబడియెదరు ప్రాణంబులు మీకింత సేదయ్యెనే యని' పలికినాడు. అయినను వారు నిలువక ఉరవడింపగా –

'నవ్వుచు నానాశరముల
నవ్వీరుల బొరియఁ జేయ
. . . . . . ' 4-43 - 44

యుద్ధము చేసినాడు. ఇట అర్జునుని రణపాండితి కొంత కాననగును. కాని అత డలవోకగా ఆ వీరులను నిర్జించుటలో రసము పరిపుష్టము కాలేదు.

'ఆశ్రమ వాసము'న ధృతరాష్ట్రుడు వానప్రస్థమున కేగుటకు ముందు భీష్మముఖ్య జ్ఞాతులకు శ్రాద్ధకర్మ నాచరింపదలచి ధనము నర్థించెను. దానికి ధర్మజు డంగీకరించెను. కాని భీముడు అడ్డుపడును. అప్పుడు నరుడు –

. . .  . . .  . . .  . . .
. . .  . . . .  మఱియుఁ దగఁడె పూజ
కాంచికేయుఁ డిట్టులనకుము మనకు న
గ్రజుని పనుపు సేత వ్రతము గాదె' – ఆశ్ర. , 1-18

అని –

'నా యింటి ధనము గైకొని
చేయఁగలాఁడమ్మహీశు చిత్తము సంతో
షాయత్తంబుగ వేగమ
పోయి యనఘ చెప్పు మవ్విభుఁడు ప్రియమందన్' – ఆశ్ర. , 1-120

అని పలికినాడు. ధర్మజుడు 'విదురుం గనుంగొని ప్రభూత విధానములన్ విజేచ్చ ధనమును నర్జునార్థమును దాఁగొని శ్రాద్ధము లాచరించునాడు' । 1-121। అని చెప్పి మరియు –

'వనవాసాయాసంబుల
ననయంబును నలఁగి దాని నాత్మనిడి మరు
త్తనయుండు పెక్కులాడెద
గని మాటల దీన రాజుఁగనలకు మనుమీ'

'ఇతడేమియన్న నేమగు
ధృతరాష్ట్రుడు మాకుఁ బరమ దేవత విను స
మ్మతి దత్ప్రసాదముం బడ
సితి మేమును దత్కృతాభిషిక్తుల మనఘా'
'మా తండ్రి నిష్టవిధములఁ
బైతృకవిధు లాచరింప (బంపుము రథ్య
వ్రాత కనక గోరథములఁ
జేతి కాదవ నర్జునుండ సేర్చుచువచ్చున్' - ఆశ్ర., 1-123-26

అని పలికినాడు. ఈ మాటల వలన ధర్మజార్జునుల దానవీరము స్ఫుటమగుచున్నది.

మౌసలమున కృతవర్మపై విజృంభించిన సాత్యకి వర్ణనమున కొంత వీరరస స్ఫూర్తి యున్నను అతి తప్పుద్రావి, ఉత్తమ ప్రకృతిని కోల్పోయిన సాత్యకిని ఆశ్రయించుటచే నిది ఉదాహరణముగ గ్రహింపబడలేదు.

మహాప్రస్థానమున ధర్మజుని దయాధర్మవీరములు రెండును కలవు. తన నాశ్రయించుకొని తుదదాక వచ్చిన సారమేయమును స్వర్గప్రవేశమున కనకర్హమను ఇంద్రునితో వాదించిన తీరులో దయావీరముస్ఫుటమగుచున్నది.

'...                ...                ...
విను భక్తియుక్తుని విడువు బ్రహ్మ
హత్యఁబోలెడి పాపమని చెప్పుదురు పెద్ద
లట్లు గావున దీని సఖిలధర్మ
సారజ్ఞ విడుచుట సనదు దివ్యసుఖంబు
నకు (గాఁగ బాపంబునకుఁ జొరంగఁ
జాల ...                ....... ' - మహాప్ర., 55

అని పలుకుటలో అతని భూతదయ, ధృతి ఇత్యాది అంశములు వెల్లడి యగుచున్నవి. ఇట 'దయా' స్వభావమే గాక ధర్మముకొఱకై ఎంతటి సుఖమునయినను త్యాగముచేయు ధర్మదీక్షయు వెల్లడి యగుచున్నది. ధర్మజుని ధర్మనీతి వర్తనముచే సారమేయరూపుడగు ధర్ముడు నిజరూపును దాల్చి ఈతని ధర్మస్థితిని కొనియాడినాడు. ఈరీతిగా ధర్మజుడు ధర్మనిష్ఠను ఆజన్మవ్రతముగ సాధించి, ధర్మదీక్షయం

దుత్కృష్టోత్సాహమును చూపి ధర్మవీరమును ప్రకటించి, దీనికి ఫలితముగ కీర్తిని, సశరీర స్వర్గప్రాప్తిని గాంచినాడు.

తిక్కనార్యుని యుద్ధవర్ణనలలో చెప్పికొనదగు మరియొక అంశము రసోదంచితములగు నుపమానములను ప్రయోగించి యుద్ధవీరుని ప్రతాపమును కనులకు కట్టునట్లు చేయుట. అగ్గలికదూది దరికొను నగ్గి తెఱంగున :భీష్మ. , ద్వి. 163 :, ఘనశార్దూలంబు బాలమృగంబు లం గని గనియు చందంబున :భీ. , తృ. 63 : , బలుమానిసి చలిచీమలం గాలం చమరు చందంబున : భీ , తృ 220:, నోరికండ నాచికొనిన మ్రోగు బెబ్బులి విశేషము తోపగ, : ద్రో. , ద్వి. 25 :, చిచ్చు మిడుత్పిండునేర్చు వెలువము దోచెన్ :ద్రో. , ద్వి. 77 :, లేళ్లగమిం గసిన బెబ్బులి యుబ్బుదోప : ద్రో. ,ద్వి. 78 :, పసుల నడుమ సొచ్చు పులివోలె : ద్రో. , 5-126: - ఇత్యాదు లనేకములు యుద్ధపంచకమున కాననగును. సమానబలమును - అనగా తుల్యత్వమును నిరూపించుటకై 'కొఱవి గొఱవి దాకిన చందంబున' :ద్రో. , 4-154 : అనురీతిని కూడ వర్ణించి తన వర్ణనాపాటవమును ప్రదర్శించుకొనినాడు తిక్కనార్యుడు.

**వీరాభాసమునకు ఉదాహరణము** - ద్రోణుడు శరశరాసనము నూడ్చి అనఘమూర్తి యొప్ప గూర్చుండి సంభృత యోగనిష్ఠ నొంది తేజోమయాత్ముడై యుండగా - దృష్టద్యుమ్నుడు -

'అరదముపైకి దాఁటి కుపితాత్మత ద్రోణుశవంబు కేశముల్
గరమున బెట్టమర్చికొని ఖడ్గహతిన్ మెడద్రుంచివైచె స
త్వరముగ మాను మాను మను వాక్యముతో నరుఁడేఁగ దప్పు సు
మ్మర యని ధర్మజుండు దివిముట్టు నెలుగున బిట్టదల్పఁగన్'[21]

అస్త్రసన్యాస మొనర్చి యోగనిష్ఠ నుండి తనువు తొలగజేయ నుద్యుక్తు డగు ద్రోణుని ధృష్టద్యుమ్నుడు పరిమార్చుట వీరాభాసమునకు ఉదాహరణము. కారణజన్ముడయినను బ్రహ్మవధోత్సాహము తత్రాపి గురువధోత్సాహము వీరాభాసమే కాగలదు. 'బ్రహ్మవధోద్యుత్సాహేఽధమ పాత్రగతే తథావీరే' అని వీరాభాస లక్షణము. ధర్మజాదుల పలుకులలో ధృష్టద్యుమ్నుని నీచ కృత్యమును నిరసించుట కాననగును.

---

21. ద్రోణ. , 5-324

స్వపక్షమువారే అడ్డుటకు కారణము ఇది వీరోచితము కాకపోవుటయే. కనుక ఇదిరసాభాసమునకు ఉదాహరణము కాగలదు.

అట్లే భూరిశ్రవుడు ప్రాయోపవశనమతినుండి ప్రాణాయామ పరుండై యోగ యుక్తుండు కాగా ఒడలి కుత్సాహంబు వచ్చి లేచి సాత్యకి కరవాలం బమర్చుకొని మాధవ ధనంజయ భీమాశ్వత్థామ కృప కర్ణులు వలదు వలదని ఎలుగెత్తి వారింప క్రోధోన్మాదంబున శిరచ్ఛేదంబు చేయుట వీరాభాస మనదగి యున్నది. భూరిశ్రవుండు జన్మతః బ్రాహ్మణుండు కాకపోయినను అస్త్రసన్యాసంబు నొసరించి యోగనిష్ఠ నుండుటచే అట్టివానిని చంప నుద్యమించుటను బ్రహ్మవధోత్సాహము గానే పరిగణించుట సమంజసము. క్రోధోన్మాదమున్నను గురువధ కాదు గనుక ఇది రౌద్రాభాసము కాక వీరాభాసమే అనదగియున్నది.

భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ శల్యుల యెడ విరోధమువహించిన పాండవుల వీరము వీరాభాసముగ కాక వీరముగానె పరిగణించుట లెస్స. భీష్మాదులు ప్రతినాయక పక్షావలంబులు. వారియెడ ధర్మజాదులకు ప్రత్యక్ష విరోధము లేదు. ఈ కారణముల వలన వీనిని వీరాభాసముగ పరిగణింపకూడదు. అది వీరమే. లేకున్న యుద్ధపంచక మంతయు ప్రాయికముగ వీరాభాసమునకే అలపట్టగును. అట్లగుట అసమంజసము. కనుక ఇటనున్నది వీరమే కాని వీరాభాసము కాదు.

తిక్కన గారి భారత భాగము నందలి పదునేను పర్వములలో ఐదు పర్వములు యుద్ధపర్వములే అయినను, అందు యుద్ధతరసము లగు బీభత్సాదుల కంటె వీర మధికముగ చోటు చేసి కొన్నది. అది ఎల్లెడల విలసిల్లినది. అయినను ఒండు రెండు తావు లందు దక్క అది విభావాది సామగ్రీ పరిపుష్టము కాలేదు. అది అంగిరసము కాకపోవుటయే దానికి గల కారణము.

# 10వ ప్రకరణము

## భయానకరసము - తిక్కన భారతము

**భయానకరసము :**

నవరసములలో భయానకరస మారవస్థానము నాక్రమించినది. బీభత్సము వలెనే ఇదియు కవి పండితలోకము నంతగా నాకర్షింపలేదు. వాఙ్మయకోటిలో భయానకరసప్రధాన కావ్యములు మృగ్యములనియే చెప్పవచ్చును. అంగముగ మాత్రము చాల కావ్యములందిది కాననగును. కాని అంగిగా దీనికెట్టి స్థానమును లేదనియే చెప్పవచ్చును. అలంకారికులును దీని కట్టి స్థానము నీయలేదు.

భయానకరసము భయస్థాయికము. కృష్ణవర్ణము. కాలుడు అధిదైవతము. భరతుని నాట్యశాస్త్రమున దీనికి సంబంధించిన గద్యమును, ఆర్యలును ఈ క్రింది విధముగా కలవు.

భయమనెడు స్థాయి భావమున నిది జనించును. వికృతరవమును వినుట, పిశాచదర్శనము, నక్కల గ్రుడ్లగూబల అరపులు, ఇతరుల త్రాసమును, ఉద్వేగమును చూచుట, శూన్యగృహమునకు కాని, అరణ్యమునకు కాని పోవుట, స్వజనవధ, స్వజనబంధనములను చూచుట, వినుట, వధాదులకు సంబంధించిన కథలు చెప్పుట, మున్నగు విభావముల వలన భయానక ముత్పన్నమగును. కంపించుచున్న కర చరణములు, చలించు కన్నులు, పులకలు, ముఖవైవర్ణ్యము, స్వరభేదము, మున్నగు అనుభావములచే దీని నభినయింప వలెను. స్తంభము, స్వేదము, గద్గదము,రోమాంచము, వేపథువు, స్వరభేదము, వైవర్ణ్యము, శంక, మోహము, దైన్యము, ఆవేగము, చపలత, జడత, త్రాసము, మరణము, మున్నగునవి ఈ రసము నందు వ్యభిచారి భావములు.

'వికృతరస సత్వదర్శన సంగ్రామారణ్య శూన్యగృహ గమనాత్
గురు నృపయో రపరాధాత్ కృతకశ్చ భయానకో జ్ఞేయః,
'గాత్రముఖదృష్టిభేదై రూరుస్తంభాభి వీక్షణోద్వేగై ః
సన్నముఖశోష హృదయస్పందన రోమోద్గమైశ్చ భయమ్'

'ఏతత్ స్వభావజం స్యాత్సత్వసముత్థం తథైన కర్తవ్యమ్
పునరేభి రేవభావైః కృతకం మృదు చేష్టితై ః కార్యమ్ ః
'కర చరణ వేపథుం స్తంభ గాత్ర సంకోచ హృదయ కంపేన
శుష్కోష్ఠ తాలుకంఠైర్భయానకో నిత్య మభినేయ ః' [1]

వికృతరవము, సత్త్వదర్శనము, సంగ్రామ, అరణ్య, శూన్యగృహ, గమనములు, గురు నృపుల యెడ కావించిన అపరాధము అను వాని వలన భయానకరస ముత్పన్నమగును. గాత్రముఖదృష్టుల యందలి వైపరీత్యము, ఊరుస్తంభనము, శూన్యముగా చూచుట, చలించిపోవుట, అంగములు జారుట, నోరెండిపోవుట, హృదయము కంపించుట, రోమోద్గమము, మొదలగువానిచే దీని నభినయింప వచ్చును. సత్వసముత్పన్నమగు నిది స్వభావజమగు భయము.

ఇక కృతకభయమును సత్త్వసముత్థముగ నభినయింప వలెను ః సత్త్వ మనగా మనస్సమాధానము ః. దీనిని మృదుచేష్టితములచే నొనర్ప వలెను. పై అనుభావములచేతనే యిదియు అభినయింపబడవలెను. కరచరణ కంపన స్తంభములు, గాత్ర సంకోచ హృదయ కంపములు, శుష్కోష్ఠ తాలుకంఠములు మొదలగువానిచే భయానకమును ప్రయోగమున అభినయింప వలెను.

సహజభయము రజస్తమః ప్రకృతులైన నీచులయందును, సత్త్వప్రధానులైన ఉత్తమ ప్రకృతుల యందు ప్రయత్నకృతమైన అనగా కృతకభయమును ఉండునని అభినవభారతి. [2]

'భయానకమునకు భయము స్థాయిభావము. ఇది భూతాధిదైవతముః కాలు డధిదేవత అని ఒకచో గలదు ః. స్త్రీలును, నీచపాత్రలును దీని కాలంబనములు. దీని వర్ణము కృష్ణము ఃవైడూర్యవర్ణమని సరసభూపాలీయముః. దేనివలన భయము ఉత్పన్నమగునో అది యాలంబనము. దానియొక్క ఘోరతరమగు చేష్టలు ఉద్దీపన విభావములు. వైవర్ణ్యము, గద్గదస్వరము, స్వేదము, రోమాంచము, కంపము, దిక్కులు చూచుట అనునవి అనుభావములు. జుగుప్స, అవేగము, సమ్మోహము, సంత్రాసము, గ్లాని, దీనత, శంక, అపస్మారము, భ్రాంతి, మృత్యువు, మొదలగునవి వ్యభిచారి భావములు' [3] అని సాహిత్యదర్పణము చెప్పుచున్నది.

---

1. నాట్య శాస్త్రము, అ.6, శ్లో ॥ లు 69-72
2. అభినవభారతి, సంపుటము 1, పుటలు 327=28 ఃగుప్తభావప్రకాశిక, పు. 210
3. సాహిత్య దర్పణము 3-235-238

రసగంగాధరము పలాయనాదుల వంటి ఒకటిరెండు అనుభావములను అధికముగా పేర్కొన్నను దశరూపక, కావ్యానుశాసన, నాట్యదర్పణ, రసార్ణవసుధాకరముల వలెనే నాట్యశాస్త్ర సాహిత్యదర్పణములతో నంగీకరించు చున్నది. కావున భయానకరస విభావాది సామగ్రి విషయమున అలంకారికులలో అభిప్రాయభేదములు లేవనియే చెప్పవచ్చును.

**ఇతర రసములతో సంబంధము :** శారదా తనయుని కథనము ననుసరించి దగ్ధావశేషులైన ఆదిదేవతల యొక్క అస్థికలను, భస్మమును ధరించి, ఆ శ్మశానమందు నృత్యము చేయుచున్న శివుని గాంచి భూత సంఘములు భయపడెనట. కావుననే బీభత్సము నుండి ఈ భయానక ముత్పన్నమైన దనుట.[4] వీరము భీతా భయప్రదానసార మగుటచే, ఈ భయానకము క్రమప్రాప్తమయి వీరము తరువాతనే పేర్కొనబడినది. బీభత్సముతో జన్యజనక సంబంధము కలదు. దీనికి శృంగారము, వీరము, రౌద్రము, హాస్యము, శాంతము విరోధిరసములు. పోషకరసములు ప్రత్యేకముగ చెప్పబడలేదు.

భయానకరస భేదములు :

'వ్యాజాచ్చైవాపరాద్ధాచ్చ విత్రాసి తకమేవచ
పునర్భయానకం చైవ విద్యాత్ త్రివిధమేవహి' - నాట్యశా., 6-80

అను సూత్రము ననుసరించి ఈ భయానకము కృతకము, అపరాధజము, విత్రాసితకము అనెడి భేదములచే మూడు విధములని తెలియుచున్నది. వ్యాజమున కలుగునది కృతకము. వ్యాజ భయానకములో అనుభావ మార్దవము భాసించును. అపరాధజ భయానకము అపరాధ మొనరించు చోరాదులకు సంబంధించినది. తాను తప్పుచేయుట వలన కాని, ఇతరులు తనయెడ తప్పుచేసిన గాని యిది కలుగును. స్వభావసిద్ధముగా భయపడు స్త్రీబాలాదులు తృణము కదిలినను భయపడుదురు. అది విత్రాసితక భయానకము. విశేషముగ భయపడువారు విత్రాసితులు. బాలాదు లట్టివారు. భయమనునది వినాశశంకాత్మకము. ఉత్తము లందు ఇది సంభవింపదు. అందుచే స్త్రీ, బాల, నీచ ప్రకృతిక మని లోకప్రసిద్ధమై యున్నది.

పలువు రాలంకారికుల నిర్వచనానుసారము ఈ భయానకరసమునకు స్థాయి భయమనియు, ఇది బాల, స్త్రీ, నీచ ప్రకృతిక మనియు, కృష్ణవర్ణమనియు,

---

4. భావప్రకాశము, అధికారము 3, పుటలు 57, 58

అధిదైవతము కాలుడనియు, వైవర్ణ్యాదులు అనుభావము లనియు, శంక, దైవము, అపస్మారము, మృతి - యిత్యాదులు వ్యభిచారు లనియు, ఇది బీభత్సము నుండి ఉత్పన్నమైన దనియు, కృతకాది భేదముచే నిది త్రివిధము లనియు తెలియుచున్నది.

## భారతము – భయానకము :

ఇక తిక్కన గారి భారతభాగమున భయానక మెట్లు పోషింపబడినదో పరికింతము.

విరాటపర్వమున మనోజవికారమగ్నుడై కీచకుడు ద్రౌపదిని చూచు సందర్భమున –

'నెఱవక ననుఁజూచి వీఁడని యెదఁ గలు
షించిన నొండొండ చెమటవొడను
ననుచితకృత్యంబు లాచరించు విధాతృ
బలిమికి నెవ్వెఱపాటుదోఁప
నిచ్చట దిక్కు లేరెవ్వరు నాకను
భయమున మేనఁ గంపంబుపుట్టఁ
జేయంగ నేమి యుపాయంబులేమి నా
ననమున వెల్లఁదనంబు గదుర
... ... ...' 5

నిలిచినది ద్రౌపది. ఇట కొంత భయానకరసస్ఫూర్తిని కలిగించినాడు తిక్కన. భయస్థాయిక మగు నీ భయానకము స్త్రీనీచ ప్రకృతికము. దేనివలన భయ ముత్పన్నమగునో అది ఆలంబనము కావున, దుర్విదగ్ధుడు, రూపాభిమాని అయిన కీచకుడు తనను చూచు కార్యమే ఇట ఆలంబన మయినది. వికృతరవము వినుట, పిశాచదర్శనము, ఇత్యాదులు విభావములుగ చెప్పబడినవి. ఇచ్చట పిశాచదర్శనము కాకున్నను వికృతస్వభావముగల కీచకుని దర్శనము నిమిత్తముగ నిది యుత్పన్నమయిన దనవచ్చును. శరీరమున కంపము పుట్టుట, నివ్వెరపాటు దోచుట – అను భావములు. చెమట పొడముట, ఆననమున వెల్లదనము కదురుట, దైన్యము – వ్యభిచారి భావములు. విభావాది సామగ్రీ పరిపోషితముగ భయానకమును తిక్కన పోషించినట్లు చెప్పవచ్చును.

విరాటపర్వము నందే కీచకు నింటికి ద్రౌపది కల్లు దేరంబోవు సందర్భమున–

'దైన్యంబు తలపోఁత దలకొన్నఁ జెలువ కా
ననమున వెల్లఁదనంబు గదిరె

భయరస వేగంబుపైకొని ముట్టినఁ
        గాంతకుఁ దనులతఁ గంపమడరె
బెగడంతకంతకు మిగిలిన నింతికిఁ
        బదముల నట ద్రొబ్బుపాటు బెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం
        బుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగెఁ
దలఁకు పుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వె
న్బాటుదోఁచె ముట్టుపాటు దొడరె;
వెఱఁగుపాటు దనికె నెఱనాడెనొవ్వ, నె
వ్వగలు వగలనీనె దిగులు వొదివె' [6]

అని ద్రౌపదిస్థితిని వర్ణించినాడు తిక్కన. ఇట భయానకరస విభావాది సామగ్రి వర్ణింపబడినది. తనులత కంప మడరుట, ఆననమున వెల్లదనము గదురుట, పదములు తొట్రుపాటు చెందుట, అవయవము లందు ఘర్మాంబుకళిక లెసగుట – ఇత్యాది అనుభావములచే నిది పోషిత మయినది. ఇట 'భయరస' మని ఇది వాచ్యము చేయబడినది.

కీచకవధ సందర్భమునను భయానకము కొంత చోటు చేసికొన్నదని పలువురందురు. శ్రీ పి. నారాయణాచార్యుల వారు సంస్కృత భారత విమర్శనము చేయుచు నా భారత పరముగ చెప్పిన అంశములు ఆంధ్ర మహాభారతమునకును అన్వయించును. 'భీముడు కీచకుని శరీరమునకు పట్టించిన యవస్థ, దుస్ససేనుని గుండెలు చీల్చి భీముడొనరించిన రక్తపానము –ఈ కథలన్నియు భయానకములు'[7] ఈ ఘట్టమున కోపాటోపదీప్తాంగుడైన భీమసేనుడు పంచానన మేణమును బొదువునట్లు కీచకు నాక్రమించి బెడిదములగు పిడికిటి పోటులతో నాతనిని పొడిచి చంపినాడు. అయినను ఆతని కోపము చల్లారలేదు. వికృతపు చావు చంప మది వేడుకపుట్టి, అతనిని గిట్టి, పట్టి, మస్తకమును పీన దీర్ఘ భుజశాఖలను, పాదయుగమును మేనిలోనికి చొర నుగ్గుగా తురిమి, నించిన, క్రంతల తిత్తియైన యాతని దేహమును నేలపై జదిపి చక్కని ముద్దగా చేసినాడు ః విరా., 2-354ః. కాని యిట భయానకము లేదు. కారణమేమన ఈ ఘట్టమున ప్రతినాయకుడగు కీచకుని యెడ సహృదయున కెట్టి

6. విరా. 2-106
7. మహాభారత విమర్శనము, పు. 10

సానుభూతియు నుండదు. ఆతని మృతి వలన సహృదయుడు సంతసించును, తానే కీచకుని సంహరించినంత ఆనందమును పొందును. కారణ మేమన కవి సహృదయునికి నాయకునితో తాదాత్మ్యము కలిగించును. అట్లు కలిగింపలేకపోయినచో లోపము కవిదే; సహృదయునిది కాదు. కనుక నిట భయము కలుగదు. ఎదురుగనున్న ద్రౌపది మన కిట ప్రమాణము. ఆమెకు భయము కలుగలేదు. 'అవ్యవస్థిత చిత్తానాం ప్రసాదోఽపి భయంకరః' అన్నరీతిని భయము కలుగుట కవకాశమున్నను, అజ్ఞాతవాస సమయపాలనాధురీణుడైన భీముడు అవ్యవస్థితచిత్తుడు కాడు. కనుక నిట భయమునకు తావే లేదు.

ఇట నొక ప్రశ్న యుదయించును. కీచకుని వంటి వాని మృతి వలన సహృదయునకు ఎట్టి భయమును కలుగదా ? అట్లయిన పాశ్చాత్యులు పేర్కొనిన కరుణా సంత్రాసములకు ప్రసక్తి లేదా? అని. సర్వలక్షణలక్షితుడై ఏకైక లోపజనిత బాధాబాధితుడు అక్కడి నాయకుడు. అట నాయకునితో సహృదయుడు సానుభూతి కలిగి యుండును. తనలో కూడ అట్టి లోపమున్న తానును తప్పక భయపడును. అట నాయక ప్రాధాన్యము వలన అట్టిది కలుగును. కాని కావ్యమున ప్రాధాన్యము నాయకునకే గాని, ప్రతి నాయకునకు గాదు గనుక మన కావ్యము లందు కీచకాదులయెడ తాదాత్మ్యము కలుగదు. కీచకుని నాయకునిగా చేసి వ్రాసిన యెడల, నాయక ప్రాధాన్యము వలన సహృదయునకు కరుణాసంత్రాసములు గలిగి హృదయమాలిన్య ప్రక్షాళన మేర్పడుట కవకాశమున్నది.

కాని యీ ఘట్టమున బీభత్సము మాత్రము గలదు. అది ఆప్రకరణమున ప్రసంగింపబడినది.

ఉపకీచకవధ సందర్భమున సరోషసంభ్రమతనాయితమై వెసబారి, యొక్కొ యున్నతావనీజనము వెఱకి రౌద్రాతిరేక మడర భుజశేఖరమునయం దమర్చి, వికలటభ్రూకుటి ఘోర ఫాలకలిత స్వేదోద్భటుడును, చలద్వికృతోష్ఠద్వయుడును, ప్రమర్దన దశావిర్భావ సంభావితాంగకుడును, సమగ్ర క్రోధవేగుండును అగు భీముని చూచి ఉపకీచకులు పారు సందర్భము భయానకరస విలసితము. ఉదగ్రరూప కలితుడైన ఈ భీముని కనుగొని కలగబారివారై, నడవక అంత నిలిచిరట. ఈ సందర్భమును తిక్కన -

'ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొనిరింకెట్లొక్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాగియు సమీపోర్వీజముల్ ప్రాకియుం

జెదరం బాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియున్ భరిత సంక్షోభాత్ములై రత్తఱిన్'
'సూతులు భీతులై ద్రుపదసూతి సమేతముగాఁ గ నగ్గజ
ప్రేతమువైచి వీటిదెస బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ . . .
. . . . . . . . . . . . . . . ,[8]

అని వర్ణించినాడు. నిశ్చేష్టులగుట, పదములు గుదివడుట ఇత్యాది భావములచే వారెల్లు భీతావహులైనది తిక్కన గారు కనులకు కట్టినట్లు వర్ణించి తన వర్ణనాసామర్థ్యమును చాటుకొనినారు. కాని యిట్టిచోటను గూడ భయానకము కాదు. ఇట నాయకుని పరాక్రమమే వ్యక్తమైనది.

బీరాలు పలికిన ఉత్తరకుమారుని వర్ణనా సందర్భమున గజగజ వణకుట, అననము వెల్లనగుట – ఇత్యాది భయానకరస భావములు వర్ణింపబడినను, అట్టి యుత్తరుని గన్న సహృదయునికి హాస్యమే కలుగును కాని భయానకరసము కలుగదు. కావున అది హాస్యరస ప్రకరణముననే ఉదాహరణముగ చూపబడినది.

ద్రోణపర్వమున సంజయుడు ధృతరాష్ట్రున కభిమన్యుని యుద్ధమును గూర్చి చెప్పుచు 'అట్లు పెక్కండ్రు రాజులు నచ్చుటయును, సుయోధనుండు దెరలుటయును గని భవత్కుమారవర్గంబును, దోడి యోధవరులును, మేనులు సెమర్చ, మొగంబులు వెలువెలంబాఱ, నోళ్లెండం గాళ్లు వడంక నలుదిక్కులం జూచుచు ధృతి పెరిగి పోయిన వెఱచఱచి విఱిగిరప్పుడు. . . '[9] అని వర్ణించినాడు. ఈ సందర్భమున మేనులు చెమర్చుట, ముఖములు వెలవెల బారుట, నోళ్ల ఎండుట, కాళ్ల వడకుట మొదలగు భయానక భావ సముదాయమును వర్ణించి కొంత రసస్ఫూర్తిని కల్గించినాడు.

అర్జునుని ప్రతిజ్ఞను విని సైంధవుడు భయపడిన సందర్భమున – సైంధవుడు–
'పెదవులు దడుపుచుఁ గాళ్లన్
గుదివడ వడఁకుచు మనంబు గొందలపడఁగా
నిది యేటిమాట లాడెదఁ
దుదిఁ బార్థుఁడు గానకుండ దొలఁగన వలయున్'[10]

8 విరా. , 3–27, 28
9. ద్రోణ. , ఆ. 2, వ. 87
10. ద్రోణ. , ఆ. 2, వ. 292

అని మీ అందరిచే అనుజ్ఞాతుడ నయి పోయి వచ్చెదనని చెప్పినాడు. నోరెండుట, కాళ్లు వడకుట, ఇత్యాది భావములను వర్ణించినాడు. కాని సహృదయుడు సైంధవుని పాటుతో తాదాత్మ్యము పొందడు.

కర్ణపర్వమున ధృష్టద్యుమ్నుడు కృపాచార్యునితో తలపడి, యోడిపోయిన సందర్భమున అతడు హీనస్వరముతో -

'చరణములుం గరంబులును సంచలభావమునొందఁజొచ్చె మేన్
విరవిరఁ బోవుచున్నయది విహ్వలమయ్యె మనంబు నీతలం
పరయఁగ మేలు మారుత సురాధిప సూనులలోన నల్లనా
క్కఁరు దెసకై రథంబు దొలఁగంగొని పొమ్మడి బీరమేటికిన్'[11]

అని సూతుని రథము తొలగంగొని పొమ్మనినాడు. కరచరణములు వడకుట, భయానకరసము నందలి అనుభావమే. ఇట కూడ కొంత భయానకరసస్ఫూర్తి కలదు.

దుశ్శాసనుని వధసందర్భమున ప్రతిజ్ఞాపూర్వకముగు భీమసేనుని రాక్షసకృత్యము జుగుప్స అను భావముతో పాటు భయ మను స్థాయికి కూడ నెలవయినది. నారసింహు డసురేంద్రు వ్రచ్చుకరణిని రౌద్ర మచ్చుపడగా, అత్యుగ్రతచే దుశ్శాసనుని యురమును చీరి అందు క్రమ్ము రుధిరమ్మును ఉల్లాసముగ దోయిటను గొని త్రావుటయే గాక, ఆ చవికి మెచ్చుకొని మేనుపై, ముఖముపై కలయ చల్లుకొనినాడట. ఇదెంతటి భీషణకృత్యమో బీభత్సరస ప్రకరణమున వివరింప బడినది. బీభత్సరసముతో పాటు నిది కొంత భయానకమునకు కూడ నాస్పద మయినది. ఇట్టి ఈ భీముని భీషణరూపమును చూచి ఇరుపక్షములసైన్యము రాక్షసుడని వెఱగందువారు, గళితాయుధులైనవారు, భీతి మూర్ఛను పడువారు నైరని వర్ణించిన సందర్భమున భయానకరస స్ఫూర్తి కలదు.

ఈ ప్రకరణమున భయానకోదాహరణములు కొన్నియు, భయానకము లెమో యని స్థూలదృష్టికి తోచు ఉదాహరణములు కొన్నియు నీయబడినవి. అన్నియు సమానముగా నున్నను కొన్ని ఉదాహరణములు గాను కొన్ని ప్రత్యుదాహరణములు గాను విశ్లేషించుటకు ఆధారము సహృదయుని హృదయమే. సహృదయుని హృదయమున ఎట్టి స్పందన కలుగుచున్నదో దాని నాధారముగానే

11. క్రర్ణ., ఆ. 1 ప. 158

వీనిని నిర్ణయించుట సమంజసము గాన, ఇట్టి పద్ధతి స్వీకరింప బడినది.

తిక్కన భారతభాగమున భయానక రసమున కంతగా అవకాశము లేకపోయినది. యుద్ధఘట్టము లందు వీరమునే అధికముగ తిక్కన పోషించినాడు. ఈభయానక రసమునకు వాఙ్మయముననే తక్కువ స్థానము గలదు. తిక్కనార్యుడు కూడ ఈరసము నధికముగ పోషింపలేదనియే చెప్పవచ్చును. కాని ఇట చెప్పికొనదగిన విశేష మొకటి గలదు. బీభత్సాద్భుతరసములలో వలె గాక ఇట ఈ రస మున్నంత వరకు విభావాది సామగ్రి పుష్కలయుతముగనే ఉన్నది. ఈ రస విషయమున గమనింపతగిన అంశము మరియొకటి గలదు. తిక్కన గారి 'రౌద్రము' ఏవిధముగ 'నిప్పులు రాలు కన్నులలో' అధికముగా కాననగునో, అట్లే, వీరి 'భయానకము' కూడ 'వెలవెలబారు అననము'లో అధికముగా కాననగు చుండును. ఎచ్చట ఈ రసమును వర్ణించునను ఈ విషయమును మరువలేదు తిక్కన. తుదకు కృష్ణుడు రథము దిగి భీష్ముని పైకి పోవు సందర్భముననను కౌరవయోధులు

'బలుజీవము పోయిన వెలు
వెలఁబాఱుచు నీదుయోధవీరులు పాలిసెం
బాలిసె నదె భీష్ముఁ డనుచును
గలఁగంబడి . . . . . . ' – భీష్మ., ఆ. 3, ప. 266

నట్లు చెప్పినాడు. ఇట్లే వెలవెలఁబారు అననము మనకు భారతమున పలుమారులు పలుతావు లందు గోచరించు చుండును.

ఈ భయానకరసమునకు తిక్కన యింతటి తక్కువస్థానము నిచ్చుటకు గల కారణము నిట్లు చెప్పవచ్చును. ప్రతిరసము ఆనందపర్యవసాయియేయైనను, ఉద్వేగాదులను కలిగించు రసమున కెక్కువ ప్రాధాన్యము నీయలేదు తిక్కన.

# 11వ ప్రకరణము

## బీభత్సరసము – తిక్కన భారతము

### బీభత్సరసము :

శృంగారాది నవరసములలో బీభత్సమునకు ఏడవస్థాన మీయబడినది. వాఙ్మయమున గాని, విమర్శకలోకమున గాని శృంగారాదుల వలె దీనికి ప్రాముఖ్యము నిచ్చినవారు అంతగా కానరారు.

బీభత్సరసము జుగుప్సాస్థాయికము. నీలవర్ణము. మహాకాల దైవతము. భరతుని నాట్యశాస్త్రమున –

'అనభిమత దర్శనేనచ రసగంధస్పర్శశబ్దదోషైశ్చ
ఉద్వేజనైశ్చ బహుభిర్బీభత్సరస ః సముద్భవతి'
'ముఖనేత్ర విఘూర్ణన నయన నాసాప్రచ్ఛాదనా వనమితాస్యైః
అవ్యక్త పాదపతనై ర్బీభత్సః సమ్యగభినయః ప్రయోక్తవ్యః'[1]

అని దీనికి సంబంధించిన ఆర్యలు గలవు. అభిమతము కాని వానిని దర్శించుటచేతను, దుష్టములైన రసగంధస్పర్శ శబ్దములచేతను, వివిధములైన ఉద్వేజనముల చేతను, బీభత్సరసము ఉత్పన్న మగును. ముఖనేత్రములను సంకోచింపచేయుట, ముక్కు మూసికొనుట, ముఖమును వంచుకొనుట, ఎత్తెత్తి నేలకు అంటియు నంటకుండ అడుగులు వేయుట అను అనుబావములచే దీని నభినయింప వలెను. ఈ ఆర్యలకు ముందు దీని సంబంధమగు గద్యయు కలదు. అందు చెప్పబడిన అంశములు – బీభత్సము, జుగుప్స అను స్థాయి భావము నుండి జనించును. అహృద్యము అప్రశస్తము, అప్రియము, అచోక్ష్యము, అనిష్టము లగువాని శ్రవణదర్శనములు ఉద్వేజనము, పరికీర్తనము, మొదలగు విభావములచే నుత్పన్న మగును. అచోక్ష్య మన సహజముగ శుద్ధపదార్థములైనను మలాదులచే దూషితములు. శరీరమును పిండీకృతము చేయుట, ముఖసంకోచము, ఉల్లేఖనము ః వాంతి చేయుటః నిష్ఠీవనము,

---

1. నాట్యశా. , అ. 6, శ్లో ॥ లు 73, 74

గాత్రమును ఎగుర వేయుట, మున్నగు అనుభావములచే దీని నభినయింప వలెను. ఇందు అపస్మారము, ఉద్వేగము, ఆవేగము, మోహము, వ్యాధి, మరణము, మొదలగునవి సంచారి భావములు.

సాహిత్యదర్పణమున 'బీభత్సమునకు స్థాయి బావము జుగుప్స. నీలవర్ణము, ఃఇంద్రనీలవర్ణ మని నరసభూపాలీయముః అధిదేవత మహాకాలుడు ఃచంద్రుడని నరసభూపాలీయముః. దుర్గంధము, మాంసము, రక్తము, క్రొవ్వు, మున్నగునవి ఆలంబన విభావము ః మొదలగునవి అనుటచేత ఎముకలును గ్రాహ్యములుః. అచ్చట కృము లుద్దీపనములు. నిష్ఠీవనము, ముఖ సంకోచము, కనులు ముడుచుకొనుట, మున్నగునవి అనుభావములు. మోహము, అపస్మారము, ఆవేగము, వ్యాధి, మరణము వ్యభిచారులు'[2] అని చెప్పబడినది.

హేమచంద్రుని కావ్యానుశాసనము, రామచంద్రుని నాట్యదర్పణము, జగన్నాథుని రసగంగాధరము, ధనంజయుని దశరూపకము, సింగభూపాలుని రసార్ణవసుధాకరములు, భరతుని నాట్యశాస్త్రము, విశ్వనాథుని సాహిత్యదర్పణముల కంటె అదనముగా నేమియును జెప్పుటలేదు.

ఈ బీభత్సరసము భయానకాంతరము క్రమప్రాప్త మయినది. 'భయానక విభావములు బీభత్సవిభావములు దాదాపు సమానములుగా నుండును. ఇట్టి సాధారణ్య సంభావనముననే భయానకాంతరమున బీభత్స మున్నది' అని నాట్య వేదము.[3] బ్రాహ్మణులకు లశున మనిన ఎట్లు ఇష్టము కాదో అట్లే స్వభావసిద్ధముగా కొందరి హృదయములకు కొన్ని యిష్టములు కావు. ఆయా వస్తువు లయిష్టము లగుటకు హేతువు ధాత్వాది దోషములే. శ్లేష్మ బాధితులకు క్షీర మనిన యిష్టము ఉండదు. మల బాధితులకు భోజనేచ్ఛయే యుండదు. దుర్గంధ ప్రవేశమున నాసాప్రచ్ఛాదన ముండుట, కాలికి రాయి, మేకు, మున్నగున వేవేని తగిలిన అడుగు దూరము పడుట, అస్థికంకాల వ్యాకుల మయిన శ్మశానమున సంచరించినపుడు అస్ఫుటముగ నడుగులు వేయుట, ఒకప్పుడు అంగలు చాచి నడుచుట, ఒకప్పుడు కొద్దికొద్దిగా అడుగులు వేయుట ఇత్యాదు లన్నియు బీభత్సాభినయమునకు ఉపకరించు నట్టివి.

---

2. సాహిత్యదర్పణము, 3-239-241
3. నాట్య వేదము పు. 150

పలువురు అలంకారికుల నిర్వచనముల ననుసరించి బీభత్సము జుగుప్స అను స్థాయి నుండి జనించునని, దుర్గంధము, మాంసము, మేదస్సు, రక్తము, ఇత్యాదులలు ఆలంబనము లగునని, అచ్చట పురుగులు పడుట, మున్నగునవి ఉద్దీపనము లని, నిష్ఠీవనము, పెడమొగము పెట్టుట, నేత్రసంకోచము, ఇత్యాదులు అనుభావములని, మోహము, అపస్మారము, ఆవేగము, మున్నగునవి వ్యభిచారులని తెలియుచున్నది.

**ఇతర రసములతో సంబంధము :** నాట్యశాస్త్రమున 'బీభత్సాచ్చ భయానకః' :6-39: అని ఉండుటచేత ఇది జనకరసమని, దీనినుండి భయానకము జనించునని తెలియుచున్నది. శారదాతనయుడు భరతుని వలె శృంగార, వీర, రౌద్ర, బీభత్సములనే ప్రధానములుగ పేర్కొని వీని నుండి వరుసగా హాస్య, అద్భుత, కరుణ, భయానకములు జనించినవని చెప్పినాడు. బీభత్సము ఉత్పత్తిహేతుభూత మగు రసము కాగా భయానకము దీని నుండి ఉత్పన్నమయినది. శారదాతనయుని రసోత్పత్తి కథనము ననుసరించి 'ఆ నటులు శంభుని యొక్క కల్పాంతకర్మను అభినయించినప్పుడు ఉత్తరదిక్కుగా నున్న బ్రహ్మముఖము నుండి భారతీవృత్తితో బీభత్సము జనించినది.'[4]

ఈ బీభత్సరసమునకు శృంగారము విరోధము. వీరము పోషకము. కాని కొందరు కవులు బీభత్సాత్మకమైన రణరంగములను వర్ణించును సందర్భమున శృంగారముతో జోడించి రమ్యముగా వర్ణించుటయు గలదు. ఈ బీభత్సమును అంగిరసముగా నెవ్వరును అంగీకరింప లేదు. అంగరసముగ నుండవచ్చును. అంగముగా నుండి అంగిరసమును పోషించుట కెంతయు తగిన రస మిది.

ఈ బీభత్సరసము వలన కలుగు అనుభూతి సుఖాత్మకమా! దుఃఖాత్మకమా! అని ఈ బీభత్సరస విషయమున కొందరికి చిన్న సందేహము కలిగినది. కరుణరస విషయమున వలెనే దీని విషయముననుకొందరు ఇది ఆనందహేతువు కాజాలదని, బ్రహ్మానంద సహోదరమగు అనుభూతి దీనివలన కలుగదని భ్రాంతిపడిరి. లౌకిక జగము నందలి కదర్యాదుల వలన ఆనందము కలుగదు కాని సాహిత్యజగత్తు నందలి బీభత్సము వలన ఆనందానుభూతియే కలుగును. కావుననే రసమును అలౌకిక మంటిమి. కనుక తదితర రసముల వలన కలుగు ఆనందానుభూతి వంటిదే ఈ

---

4. భావ ప్రకాశము, అధికారము 3, పుటలు 57, 58

రసము వలనను కలుగునని చెప్పవచ్చును.

బీభత్సరస భేదములు :

'బీభత్సః క్షోభజః శుద్ధ ఉద్వేగీస్యాద్ద్వితీయకః

విష్ఠాక్రిమిభి రుద్వేగి క్షోభజో రుధిరాదిజః' - నాట్యశా అ.6, శ్లో. 81

దీని ననుసరించి శుద్ధము, ఉద్వేగి అని బీభత్సము రెండు విధములుగ తెలియుచున్నది. క్షోభమును కలుగజేయునట్టిది, రుధిరాదిజన్య మగునది శుద్ధబీభత్సము. విష్ఠా క్రిమికీటకములచే కలుగునది ఉద్వేగి బీభత్సము. నెత్తురు, ప్రేవులు, మొదలగు వానిని చూచుట వలన కలుగు బీభత్సము క్షోభకారి యగుటచే శుద్ధము. విష్ఠాదుల దవలన కలుగు బీభత్సము హృదయమును చలింప చేయును. *అశుద్ధ విభావక మగునది యశుద్ధము. అభినవోపాధ్యాయులు భట్టతోతు లిట్లనిరి. శుద్ధబీభత్స మిట్లుండును. సంసార నాట్య నాయక రాగములకు ప్రతిపక్షముగా నుండి, మోక్షసాధనమై విభావవిశేషమున కలుగు బీభత్సము శుద్ధము. శోకమున తన శరీరమును చూచి జుగుప్సపడుటయు కవులు వర్ణించుచునేయున్నారు. కావున బీభత్సము కూడ నిట్టి విశేషముతో కూడి త్రివిధ మగును'[5] అని నాట్యవేదము.

కావ్యాలంకార చూడామణి కర్త -

'పరుస విభావాదులచే

బెరుగు జుగుప్సయ తలంప బీభత్సమగున్

బరువడి రెండగు హేయా

చరణమున విరక్తి వలనఁ జను నెఱుఁగంగన్' - ఉల్లా. 2, ప. 121

జుగుప్సా బీభత్సము, వైరాగ్యబీభత్సము అని బీభత్సమును రెండు విధములుగ పేర్కొనెను.

---

5. నాట్య వేదము, పు. 233

## భారతము – బీభత్సము :

తిక్కన భారతభాగమున గల బీభత్సరస పరామర్శ గావింతము – విరాట పర్వమున భీముడు కీచకుని సంహరించినరీతిలో జుగుప్సాభావమున కవకాశము కలిగి బీభత్సమునకు తావు కల్పించినది. భీమసేనుడు కోపాటోపదీప్తాంగుడై పంచానన మేణమును బొదువునట్లు అతని నాక్రమించి బెడిదములగు పిడికిటిపోటులతో పొడిచి పగతుడు కనుమిడిసి నేలబడి తన్నుకొనునట్లుగ పల్లవ ప్రసూన ఫలభరితమగు ద్రుమాను కూలద్రోయు మత్తగజము వలె కూలద్రోసినాడు. ఇంతటితో భీముని కోపము చల్లారలేదు. వికృతపు చావు చంప మది వేడుక పుట్టినది. ఇట్టి వేడుకతో నాతడు గిట్టి, పట్టి, మస్తకమును, పీన దీర్ఘ భుజశాఖలు, పాదయుగము మేనిలోనికి చొరునట్లు నుగ్గుగా దుఱిమి నించిన గ్రంతల తిత్తియైన కీచకుని ధరణిస్థలికి జదిపి చక్కని ముద్దగా చేసినాడు ౹విరా., ఆ.2, ప. 351–53౹. ఈదృశ్యమును తిలకించిన వారికి రోత జనించును. ఈ జుగుప్స అను స్థాయి భావమున కాలంబనము భీముని భీషణకృత్యమే.

సంకులసమరము, భీకరత్వము నెంత సామర్థ్యముతో వర్ణింపగలడో తిక్కన పాలికలను నందలి బీభత్సమును అంత గాఢ దక్షతతో వర్ణింప గలడు. విరాటపర్వము నందు దక్షిణగ్రహణ యుద్ధానంతరము చేసిన పాలికలను వర్ణనము బీభత్సావహము.

[6]లజ్జావనతాననుండగు సుశర్మ సపరిచ్ఛదంబుగా విడిచి పుచ్చి గుత్తుల కొలందికి గృత్తంబులయి పడియున్న పాదంబుల వలనం గెందలిరుల సెజ్జల చందంబు లగు చోట్లను దునిసి చిక్కుపడియున్న యూరుకాండంబుల వలన మదగజంబులు సొచ్చిన కదళీవనంబులంబోని యెడలును బ్రోవులు గొనియున్న ప్రేవుల వలన లావు గల యంచపిండు పేరాఁకలి నఱిముఱిం బెఱికినఁ గుఱుకులు గట్టిన మృణాళ నాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును నంగుళీయక రుచు లడర నెఱింజాఁగిపడియున్న బాహుదండంబుల వలన నురగ నివాసంబుల ననుకరించు తలంబులును గీలాల జలంబుల పయిం దేలుచు నవ్వినట్లున్న శిరంబుల వలన వికచారవింద దీర్ఘికల విడంబించు తావులును నవయవభేదంబులడంగు నట్లుగాఁ దుత్తునియలై పడియున్న గాత్రంబుల వలనం గృతాంత మహానసశాలల పగిది నొప్పు పట్లును గల పాలికలను గలయంగనుంగొనుచు . . . ,[6] అని వర్ణించినాడు తిక్కన.

---

6. విరా. , ఆ. 3, వ. 236

చిక్కుపడిన యూరుకాండములు, గుత్తులకొలది కృత్తములయి పడియున్న పాదములు, ప్రోవులు కట్టిన ప్రేవులు, జారిపడియున్న బాహుదండములు, నవ్వినట్లున్న శిరములు నట. ఇట్టి పాలికలనును మన కనులకు కట్టినట్లుగ వర్ణించినాడు. ఇది యమూలకము. ఇట్టి రణరంగమును చూచిన ఎవరికైనను రోత జనింపకమానదు. భీషణ బీభత్సముల కాటపట్టగు రణరంగమును మనోహరములగు ప్రకృతిదృశ్యముల సంయోగమునను, చక్కని అలంకారముల మూలమునను రమణీయము గావించుట తిక్కన కవితాశిల్పములోని ఒక విశేషము. కావుననే ఈ రణరంగము ఎంతటి బీభత్సావహముగనున్నను కదళీవనములు, మృణాళనాళములతో నొప్పు కమలాకరములు, కృతాంత మహానస శాలలు అనురీతిని వర్ణించినాడు.

ఉత్తరగోగ్రహణ యుద్ధ మధ్యమున గల రక్తనదీ వర్ణనమునను కొంత బీభత్సరసచ్ఛాయ గలదు.

'చేతులతోఁ టవో నిటుల శేషబలంబుల నుగ్గుసేసి మాం
సాతత పంకయై బహువిధాయుధ మీనములొప్పఁ జామర
వ్రాతము ఫేన భంగిగ నిరంతర వీర శిరస్సరోరుహ
స్ఫీత విభూతిఁ బొల్చునది సేసె రణస్థలి యందు నెత్తుటన్'[7]

ఈ నెత్తుటి నది యందు పంకము మాంసము. మీనములు బహువిధాయుధములు. ఫేనము చామరవ్రాతము. సరోరుహములు వీరుల శిరస్సులు నట. మాంసము, రక్తము, ఇత్యాది వస్తువులను చూచిన జుగుప్స కలుగును. ఈతని రక్తన దీ వర్ణనమును చదువునపుడు మాంసాది వస్తు వర్ణన మాలంబనముగ సహృదయునకు జుగుస్స అను భావము కలుగుట కవకాశము కలదనిపించు చున్నది.

విరాట పర్వమున గలట్టి నదీవర్ణనమే భీష్మ పర్వమునను కలదు –

'సగము సచ్చిన యొడళులు జలచరములు
రక్తపూరంబు దోయంబు ప్రచుర మాంస
పటలి పంకంబుగాఁ గల బహు నదీ ప్ర
వాహములు వాఱె సంగరావని నృపాల'

'అఱువఱలై రథంబులు
నెఱిదప్పఁగఁ బడిన యశ్వనికరంబులు బెం

---

7. విరా., ఆ. 5, ప. 157

దఱచుగఁ గూలిన కరులు
న్గిరిగొనియెన్ సమర మేదినీతలమెల్లన్'[8]
ఇచ్చట కూడ మాంసము, రుధిరము, ఇత్యాదులచే బీభత్సము స్ఫూర్తి గాంచినది. విభావాది సామగ్రి వర్ణితము కాలేదు.
ఈ పర్వముననే మరియొక ఉదాహరణము -
'కొన్నిటి హస్తముల్ సదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ముదూళిగాఁ
గొన్నిటిఁ గుంభముల్ పగులఁ గొన్నిటి గాళులు నుగ్గునూచగాఁ
గొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటివీఁపులు పిండుపిఁచుగా
నన్నిటి భీముఁ డుద్భట గదాహతి నేనికవేఁట లాడఁగన్'
- భీష్మ. , 2-211
మరియు -
'ప్రోవులు గట్టిన గుజ్జుపుఁ
బ్రేవులు నేనుఁగుల తఱచుఁ బీనుంగులు ర
క్తావిలత వెల్ల చీరలు
గావులునై భటనికాయకాయంబులునై' - భీష్మ. , 2-289
అనుచోట ప్రేవులు, రక్తము, ఇత్యాదులచే నిది స్ఫురించు చున్నది. ఈ రీతిగా యుద్ధపంచకమున నెచ్చట చూచినను బీభత్సావహ మగు యుద్ధరంగ వర్ణనము కాననగును. ఇట్టివే మరికొన్ని యుదాహరణములు -
'నిలిచినరూపు డాల్ల ధరణింబడియున్న శరీరమింత లిం
తలు శకలంబులై నెఱయ దందడిమూఁక గలంగ నొంటి గుం
పులు పఱివోవ రక్తజలపూరము రొంపులు ధూళిగా రథం
బులు రభసంబునం బఱపి పోరిరి యోధులు గ్రోధదీప్తులై'
'కొమ్ములఁ గ్రుమ్మియుఁ బాదత
లమ్ములఁ జమరియును గరములం బఱిపఱియై
యిమ్మెడఁలగఁ దిగిచియు నర
దమ్ముల నేనుఁగులు పీటతాటము సేసెన్'
'తురగమున నరుని ద్రేయుచుఁ
గరి దంతము పెఱికి యన్యకరి వైచుచును

8. ద్రోణ. , ఆ. 1, ప॥ లు 274 - 279

ద్దుర రథము చదలఁ ద్రిప్పుచుఁ
గరులు వినోదంబుసేసెఁ గనుఁగొను ప్రజకున్'
'... ... ... గజవ్రజంబు పె
ల్లొఱలుచు నెత్తురుల్ దొరఁగుచుండ నొగింబడియున్కి నత్తఱిన్'
'అశ్వసుభటతతుల యంగ ఖండంబులు
రుధిర కర్దమమున బ్రుంగియున్న
పెల్లుచూడ రౌద్ర బీభత్స కరుణ భ
యానకైక హేతువయ్యె నధిప'[9]
'కాలువలైపాఱు కీలాల జలముల
దేలి పోయెడు మృతదేహములును
బ్రేవులు ప్రోవుల పెల్లునఁ జిత్రిత
చ్ఛాయంబులగు మాంస సంచయములుఁ
గరిహయంబుల కళేబరముల క్రిందఁ
గొండొకతోఁచు భటగాత్ర నికరములును
దలల పెందఱుచులో మిలమిల మెదలెడు
కరపదంబుల నవఖండములును
రౌద్ర బీభత్స నర్త నరంగ భంగి
నపుడు సమరాంగణము ఘోరమయ్యెఁ జూడ
... ... ... ...' - ద్రోణ., 1-386

మరియు 'సంధ్యారాగంబుసొంపునఁ గెంపినుమడించు నెత్తురు మడువుల నోలలాడు భూత బేతాళంబులను శవకబళన లోలంబులగు సృగాలంబులను మాంసచర్వణ కోలాహల బహుళంబులగు కంక గృధ్రాది పక్షి కులంబులనుం జూచి ...' (ద్రోణ., 1-387 వ. – ఇత్యాది వర్ణనము ఈ యుద్ధపంచకమున నెచ్చట చూచిన నచ్చటనే కాననగును. తిక్కన గారి 'బీభత్సము' సాధారణముగ రక్తము, మాంసము, ప్రేవులు, ఇత్యాదులనే ఆలంబనముగ చేసికొని యుండును. రుధిరమాంసాదులను వర్ణించుటతో మాత్రమే తృప్తిపడక, వానిని కబళించు కంక గృధ్రాదుల, భూతబేతాళాదుల వర్ణనమును తిక్కన చేయుచుండును.

---

9. ద్రోణ., ఆ. 1, ప॥ లు 274 - 279

ఇట్లే ద్రోణపర్వమున మరియొక వర్ణనము – 'తేరులు నలియం ద్రెళ్లిన శుండాలంబులును గాలుబలంబుల పీనుంగు పెంట మీద నూఁదుకొనం గూలిన ఘోటకంబులును గుజ్జుపు టట్టల రాసులు మూసికొని యఱవఱలైన యరదంబులును గరటికళేబరంబులును వొదవినం గాలుగాలం బెనఁచు కొని పడియున్న సుభట సమూహంములును గంకణాంగదకాంతంబులైన కరకాండంబుల గములును ముసుంగువడ డొల్లిన సకుండల మస్తకంబులును వీరకటకంబులు మెఱయఁ జిక్కువడియున్న చరణంబులును గ్రిందుపడం దొరఁగిన గాత్రఖండంబులును దునియలైన ధనురాది హేతివ్రాతంబులపైఁ బొడవుసెడక భాహువులతోడం బొలుచు కృపాణప్రముఖ ప్రహరణంబులును గొడుగుల కుప్పలును జామరంబుల ప్రోవులును సిడంబుల తిట్టలును నయి సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె . . .[10]

మరికొన్ని యుదాహరణములు –

'తేరులు చెక్కులు వారణంబుల ఖండ
 ములు భూషణంబుల పొడియు ఘోట
కంబులతునియలుఁ గరవాల తోమర
 శరపరిఘాదుల శకలములును
రథికజనంబుల వ్రయ్యలుఁ జామర
 చ్ఛత్రకేతువుల యంశములు భటుల
తుమురును రౌతుల తుండంబులును గంక
 టముల భాగములుఁ జిందముల నుఱుముఁ
గలసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి
మెదడుగ్రుంగి వియచ్చర హృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప
సంగరాంగణ మతిఘోర భంగి యయ్యె'[11]
'నెత్తుటఁదోగియు నిగిడి పోరెడు వీరు
 లలరిన నడమోదుగుల విధంబు
గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహుదం
 డములు మహాభుజంగముల భంగి

10. ద్రోణ. , ఆ. 2, ప. 60

11. కర్ణ. , ఆ. 1, ప. 177

యవని రక్తాక్తంబులైయున్న యట్టి బ
ల్దలు గెందామర కొలనిపగిది
దఱచుగా నెఱిదప్ప నొఱగిన గజములు
గులిశ భగ్నాచల కులమునట్లు
దునిసి తొఱఁగిన జోదుల తొడలు సామ
జముల కరములు నొండొంటి చందములుగ
నుంగొనఁగ వింతలగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు నయ్యె' - శల్య. , ఆ. 1, ప. 129

సాప్తికపర్వము నందు అశ్వత్థామ పాండవశిబిరమున చేసిన స్వైరవిహార మంతయు బీభత్సావహమే.

'పలువేగంబున ముట్టి ద్రోణ సుతుఁ డప్పాంచాల లోకంబుఁ ద
క్కొటి భూపాలుర ద్రౌపదీతనయ వర్గంబున్ భుజాఖేలనో
ద్భట ఖడ్గోల్లసనంబు పాల్పఱిచి తద్ధాత్రీతలంబెల్ల నె
త్తుట జొత్తిల్లఁగఁ జేసెనేరిపుచమూ దుర్వార ఘోరాకృతిన్'
- సౌప్తిక., ఆ.1,న.137

'కాలాకారతఁ బేర్చి దోర్లసిత ఖడ్గస్ఫారసాంద్రప్రభా
జాలంబొప్పఁగ నిండ్లుసొచ్చి లఘు సంచారంబు శోభిల్లఁ బాం
చాలవ్రాతముఁ గ్రీడమైఁ దునిమె రక్తశ్శ్రేణి మాంసంబుఁ గీ
లాలంబుం గబళించి త్రావి మదలీలాలోలతం గ్రాలఁగన్'
- సౌప్తిక .,ప. 171

ఇంకను నతండు -

'తుండంబుల్ నుగ్గునుగ్గై తొరఁగఁగఁ జాలకం ద్రుంచుఁ గుంభస్థలంబు
ల్ఖండించున్ మౌక్తికంబు ల్గలయఁగఁ జెదరం గాయముల్ వ్రేవ్రుఁబ్రోవుల్
చండంబుల్ సాంద్ర రక్తస్రవమున బెరయన్ జాల్వడన్ వ్రేయు నిమ్మై
శుండాలశ్రేణి మాయించుచు వెలిఁగి హయస్తోమ శాలాగతుండై'
- సౌప్తిక. , ఆ. 1, ప. 175

'కొన్నిటి పాదముల్ నఱుకుఁ గొన్నిటిమోరలు చెక్కు లీలమైఁ
గొన్నిటి కంఠముల్ దునుముఁ గొన్నిటివీఁపులు వ్రచ్చు నుబ్బునం

గొన్నిటి సర్వగాత్రములు క్రూర విచేష్టిత విభ్రమంబుదోఁ
పన్నుఁబుమాడుఁ బ్రౌఢ బలభాసిత భూరి భుజావిహారుఁడై'

- సౌప్తిక. , ఆ. 1, ప. 176

ఇదంతయు నెల్లున్నదన మారి మసంగినట్లు, మృత్యుదేవత కెరలిన చాడ్పున జముడు నలిరేఁగిన కరణి నున్నదట. 'కాలుకాలం బెనంగిన పీనుంగులను గనక రత్న వలయంబులఁ జెలువందు చేతులను దునిసి పడిన కరికరంబులతో సరసమాడు చెలువునం జలనంబు నొందు చరణంబులను నావులించు తలలను వేదండ దంత ఖండంబులన ఘోటక ముఖలేశంబులను రథావయవ శకలంబులను మడువులు గట్టు నెత్తురులను గుప్పలు గొను కండలను బెనంగొను ప్రేవులను బెనుతిట్టలగు నెమ్ములను మూర్తిమంతంబులయినట్టి యద్భుతంబునకు భయానకంబునకు బీభత్సంబమునకు నన్నెల నెలవగునట్లుగ జేయుచు జెలంగి చెలంగి మలంగి మలంగి'నాడు అశ్వత్థామ. (సౌప్తిక., 1-177 వ. ఈతని కరవాలలీలలు భూతబేతాళంబులకు ప్రీతి పెనుపు నట్లుగా నున్నవట.

స్త్రీ పర్వము నందును ఇట్టి పాలికలను వర్ణన కాననగును -

'నుఱుమైన కాల్బలంబులు
నఱవఱలయి యున్నయట్టి యరదంబులుఁ బెం
దఱచగు సూతాంగకములు
నొఱిగిన రథ్యము లగములు నుల్లమలంపన్'

'రావుతుల తుండములు మావఁతుల నుగ్గుఁ దుర
గావలి శవంబులు గజావయవ రాశీ
భావ భయదస్థలులుఁ బ్రేవులును గండలును
బ్రోవులయి పెన్మెదడుపై విరిసి రక్త
స్రావమునఁ బెల్లయిన తేవమునఁ జూడఁ గడు
నేవ మగుపట్ల మృత భావగతులయ్యున్
జీవముల బాయరొకొ నా వికచవక్త్రముల
తోవఱలు రాజులు మనోవికృతి సేయన్'

'హా రరుచులున్ హృదయహారితమూర్తులగు
వారు హరినీలమణి భార విలసత్కే

యూర బహులాంశు చయ చారుతర రేఖులగు
వారు నవ వ్రజ రుచిరోరు ఘృణి మత్కో-
టీర రమణీయు లగువారు గరుడాశ్మమయ
భూరి కటకద్యుతి విహార పరిశోభా
స్ఫారు లగువారలును బోరఁబడి నెత్తురులఁ
గూరుటఁ గరంబెడఁద కారటముసేయన్'
'
. . . . . . . . .
. . . గండలును నెమ్ములఁ గపాలములు
సమ్మిళిత రూపశకలమ్ములయి సంగ్రా
మమ్మతుల దారుణ విధమ్మగుటఁ దెల్పు టధి
కమ్మగు కలంకహృదయమ్మున కొనర్పన్'
'కుత్తుకలబంటి యగు నెత్తురులు దోయిళుల
నెత్తి చవిగ్రోలుచును జిత్తములు దృప్తిన్
జొత్తిలి నితాంత మదమత్తములుగాఁ జటుల
నృత్తములు సేయుచు ఁజలత్తనువికారో
ద్వృత్త పటుహాసముల రిత్తలగు దుర్వచన
వృత్తులను నొండొరుల నెత్తికొని మాంసం
బత్తి తినుటన్ వికట వృత్తులగు రాక్షసుల
మొత్తము పరిక్షుభిత చిత్తత యొనర్పన్'[12]
'ప్రేవుల గండలు పెటికి పేటాడి యం
గదఁగొని మెదళు లగల్చికొనుచు
రొగిలి రక్తంబుఁద్రావుచు లోచన
గుళికల నొలిచి మ్రింగుచు గుండె
కాయ లాదటమెయిఁ గబళించుచును గ్రొవ్వు
దెమలిచి నమలుచు నెముక యూట
చవిగొని యానుచుఁ జావకయున్న రూ
పులు సచ్చుటకుఁగాఁగఁ బెలుచఁదన్ని

12. స్త్రీ. , ఆ.2, ప || లు. 4-8

కొనిన వెఱఁబాయఁ బాఱుచుఁ జెనకి తొడరి
కాలులాడుచు నున్న సృగాలములును
గాకములు రాపులుగులును గ్రద్దలును వృ
కంబులును మానసము వికలంబుసేయ' - స్త్రీ. , ఆ. 2, ప. 9

జుగుప్స అను స్థాయికి ఆలంబనము లగు ప్రేవులు, కండలు, క్రొవ్వు,రక్తము, ఎమ్ములు, మాంసము, ఇత్యాదులన్నియు ఈ సందర్భమున వర్ణితము లయినవి. అనుభావాదుల కిట తావులేదు. లోచనగుళికలను ఒలుచుట, గుండెకాయలను కబళించుట, క్రొవ్వు నములుట, ఎమ్ములయూట చవిగొనుట అనునది ఎంతటి బీభత్సావహమగు వర్ణనమో కదా!

సమరాంగణము లేదా పాలికలనుకు సంబంధించినంతవరకు తిక్కనార్యుని వర్ణనము ఏకరీతిగా నున్నది. పదములలో మార్పుకొని, భావములో మార్పు లేదు. శిరములు, కరములు, చరణములు, కరి తురగాదులు, అరదములు, భూషణాదులు వ్రయ్యలగుట, శకలము లగుట, చెక్కలగుట, పొడియగుట, తునియలగుట, ఖండములగుట, తుండములగుట, ఉఱుమాడుట-ఇత్యాదిరీతినే వర్ణించును. రక్తము వరదలుగ పారుట, ప్రేవులు ప్రోవులు కట్టుట, ఎమ్ములు తిట్టయగుట – ఇవి ఈతని పాలికలను వర్ణనమున సాధారణముగ కనిపించు అంశములు.

భీషణావహమగు పాలికలను వర్ణనమే కాక జుగుప్సావహములగు భీషణ కృత్యములను కూడ తిక్కన తన భారత భాగమున వర్ణించి యున్నాడు.

ద్రోణపర్వమున అలంబసుడు ఘటోత్కచునిచే చనిపోవు ఘట్టము – ఆ భీమనందనుడు –

'పట్టిబలువుగ జటాసురు
పట్టిం బడవైచి యురము పాదమునఁ గడున్
బిట్టుగఁ ద్రొక్కి యతని తల
యట్టకుఁ బాయంగఁ జేసి యార్చిం బెలుచన్'
'ఆర్చి నెత్తురట్ట నమ్మస్తకము పట్టి
కొని యతండుదాత్త ఘోరభంగి
బ్రమరి వాజి కురునృపాలకు నరదంబు
నందు వైచి యిట్టులనియె నధిప'

'కొనుమదె నీమిత్రుని తల

...  ...  ...' - ద్రోణ., ఆ. 5, ప॥ లు 204-6 అని విసరినాడట.

భారతము నందలి బీభత్సావహమగు ఘట్టములలో ప్రధానముగ నాక్కొ-వక్కాణింపదగు ఘట్టము దుశ్శాసన వధ. భీముని ప్రవర్తనములో కల అతనిప్రతిజ్ఞా పూరణోత్సాహము భీముని వ్యక్తిగతమై చూపఱకు బీభత్స భయానక దృశ్య మయినదనియు, ఈ బీభత్సము భీముని మాటలవలనను, ఇతరమైన క్రియల వలనను, ఉత్కటత్వము వలనను తిక్కన చిత్రించినాడని[13] డా॥ రంగారావు గారు చెప్పిన మాటలు సత్యదూరములు కావు.

'లీలం గేలనమర్చి మత్తగజకేళీ సుందరోల్లాస మా
భీత్వం బలరింపఁ ద్రిప్పుఁజదలం బృథ్వీస్థలిన్ వైచుముం
గాలంద్రొచు మొగంబుద్రేయు దెసలుగ్రస్ఫూర్తి వీక్షించు మో
కాలూఁదుం బయిగ్రమ్మఱంగ మెడ చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్'
- కర్ణ. , 3-210

'ఇవ్విధంబున ఘోర విహారంబు సలిపి భీమ విక్రముండగు నా భీమసేనుం డయ్యు వరాజు నాననం బాలోకించి' -

'ఏనురము వ్రచ్చి నెత్తురు
దేనియ యిదె ద్రావెదం గదిసి ననుఁగడిమిన్
మానుప దిక్కు గలిగిన
నానిమ్మెలుఁగింపు మీ మొనంగలవారిన్' .

'అని పెలుచంబలికి కుఠారంబు వెఱికి యతని మొగంబుమీఁద జళిపించి'

'నరసింహు డసురేంద్రు వ్రచ్చుకరణి నౌద్రంబుదగ్రంబుగా
నుర మత్యుగ్రతఁజీరి క్రమ్ము రుధిరమ్ముల్లాసియై దోయిట
న్వైరవారం గాని త్రావుమెచ్చుఁజవికిన్మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను నక్కారవుఁజూచుం బారిన్'

ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి -

'తల్లి చన్నులపాలేనుద్రావ నెట్టు
లాన నే పలుతెఱఁగుల తేనియలును

---

13. Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana

ఖండశర్కరతోడి దుగ్ధంబులనుభ
వింపఁబడవేయవియు నింత యింపుగావు' [14]

ఇట్లు భీమసేనుడు దుశ్శాసనుని ఉరము నత్యుగ్రతను చీరినవాడై క్రమ్మిన రుధిరమును ఉల్లాసముతో దోసిటపట్టి త్రావి, ఆ చవికి మెచ్చుకొనినవాడై మేనును ముఖంబునను భయంకరరేఖలు పారయునట్లుగ చల్లికొనినాడు. ఇది ఎంతటి భీషణావహమగు కార్యమో, జుగుప్సావహమగు కృత్యమో పఠితలకు తెలయగలదు.

ఈ సందర్భమును గూర్చి డా॥ రంగారావు గారు 'ఏమిర పనులని యార్వవు . . . గంటే' : కర్ణ., 3-221 : అనుమాటలు కొనప్రాణముతో నున్న దుశ్శాసనునికి మర్మకృంతనములైనవి. 'నెట్టన యల్గినం దగునె . . .' : 3-222 : – భావశబలత గలవి. కోపము, కసి, నిర్వేదము, ఒక విధమగు జాలి, వెక్కిరింత మొదలగు అనేక భావములు కలవు. ఈ విజృంభించిన భావము అన్నియు దుర్యోధనుని తలదన్ను పని యందలి యుద్యోగములో నిమిడిపోయి శాంతములైనవి. దుశ్శాసను డిప్పుడు చచ్చినాడు. ఈ మాటలన్నియు ననకముందే దుశ్శాసనుడు చచ్చినట్లు మూలమున గలదు. ఇట్లే ఘట్టమున పరమాక్షేపగర్భిత వాక్యసంయోజనము ద్వారా ఆగియాగి విజృంభించుచు చేయు సంహారక్రియ ద్వారా తిక్కన భీమునిలో మహోత్సాహక్రోధములను, క్రియలోని బీభత్స లక్షణమును కన్నులకు గట్టినట్లుగ చిత్రించినాడు. ఈ ఘట్టములో నితరుల యుద్ధములు చొప్పింపబడలేదు. అట్లు చేసినచో ఘట్ట మందలి భావతీవ్రతకు భంగము కలుగు నవకాశమున్నది. మూలమున చిత్రసేన యుధామన్యుల యుద్ధము చొప్పింపబడినది. వీర రౌద్ర బీభత్సరస సమ్మేళనముతో నీఘట్టము పర్వేతర యుద్ధఘట్టములలో విలక్షణమయిన దానినిగా రససంయోజన నిర్వహణ శిల్పబ్రహ్మ యగు తిక్కన విశిష్టమగునట్లు నిర్వహించినాడు'[15] అని చెప్పియున్నారు.

తిక్కనార్యుని రచనలో గమనింప తగిన మరియొక అంశము గలదు. ఎంతటి బీభత్సావహములగు దృశ్యములకైనను చక్కని ఉపమానములతో రమ్యత్వము నాపాదించి మనోహరమగురీతిని వర్ణించును తిక్కన. అందులకు ఒకటిరెండు ఉదాహరణములు –

---

14. కర్ణ., ఆ. 3, ప॥లు 211–16
15. Conception & Practice of Peotry of Kavitrayam & Nachana Somana

భీష్మపర్వమున తృతీయాశ్వాసమున బీభత్స భయానకాత్మక మయిన యుద్ధరంగమును శృంగారాత్మకముగ వర్ణించి ఆ రసముల అతిశయమును అరికట్టినాడు తిక్కన.

'ధరణి నెత్తుటఁదోగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబులఁ జాలనొప్పెఁ
బలుచగాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవవోలె' - భీష్మ : అ.3, ప. 162

ఈ పద్యమునందలి ప్రథమ ద్వితీయ పాదములు రెండును యుద్ధభూమి యొక్క యథాతథమగు వర్ణనము. మిగిలిన రెండు పాదములు శృంగారాత్మకములు. మొదటి రెండు పాదముల వలన నాటి యుద్ధతీవ్రత బుద్ధికి అందీయబడగా, అది మనస్సున స్థిరపడకుండుటకై వెనువెంటనే శృంగారాత్మకమగు ఉపమానము చూపబడి సామాజికుని మనస్సు దీనిపై పడునట్లు చేయబడినది. ఆచార్య కేతవరపు వారు రసస్థితికి పోనీయకుండ స్ఫూర్తిమాత్రపర్యవసితములుగా రసనిష్యంది భావములను నిర్వహించి చూపుట అనగా నిట్లుండుననియు, యుద్ధరసములు కేవలము స్ఫురించుటను మించి మరేమియు కాకుండ శాంతమునకు భంగము లేకుండ యుద్ధపర్వములను రచించుటలో తిక్కన్నగా రవలంబించిన మార్గములలో నీ విరోధిరసములను అలంకారములను సంయోజనపరచుట యొక పద్ధతి [16] అనియు చెప్పియున్నారు.

ద్రోణపర్వమున ద్వితీయాశ్వాసమున అభిమన్యుడు నేలకూలిన సందర్భమునను ఇట్టి వర్ణనమే కలదు.

'నెత్తుటఁదోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండు నక్కుమా
రోత్తముఁ డందు జంద్రుక్రియనొప్పె సితాయుధఖండ భూషణో
దాత్త మణిప్రతానములు తారలచందము నొంది యందమై
యత్తఱి నుల్లసిల్లె వసుధాధిప చూపఱ పిండు చూడ్కికిన్'
-ద్రోణ.,2-127

'కరి కళేబరములు ధరణీధరములు దు
రంగ గాత్రమ్ములు గ్రాహస మితి
నర శరీరములు మీనములు గొడ్డియక
క్షురికాదిశస్త్రంబు లురగకులము

16. తిక్కన కావ్య శిల్పము. పుటలు 276-77

రుధిరార్ద్రశరములు రుచిరప్రవాళముల్
ప్రేవులప్రోవులు ఫేనతతులు
నెత్తురువెల్లువ నీళులు భూషణ
స్తోమాస్థిచయముల తుమురు లిసుక
గాఁగ నంబురాశి కరణి సంగ్రామ భూ
భాగమొప్ప మిగుల భవయోగ
నిద్రనున్న విష్ణునికిఁ బాటియగుచు శో
భిల్లె నమ్మురారి యల్లుఁడందు' – ద్రోణ., ఆ.2, ప. 128

ద్రోణపర్వమున పంచమాశ్వాసమున సాంద్రశోణితపూర సేకంబున ఘోరంబైన సంగ్రామతలమును వర్ణించుచు –

'కరులు రథంబు లశ్వములు గాలుబలంబు చమూపతుల్ మహీ
శ్వరు లఖిలాస్త్రశస్త్రములు చామరముల్ గొడుగుల్ సిడంబు లా
భరణము లిత్తెఱంగునను బార్థ కడుం జెలువొందెఁ జూడ సం
గర మహిఁ జిత్రవస్త్రమునఁ గప్పినచందముఁదోఁపఁజేయుచున్'
– ద్రోణ., ఆ.5, ప. 12

బీభత్సమయమైన యుద్ధరంగము ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బలము, సేనాపతులు, రాజులు, చామరములు, గొడుగులు, సిడములు, ఆభరణములు, మొదలగువానితో కూడినది. అట్టి ఈ యుద్ధరంగమును నేలపై చిత్రమైన వస్త్రమును కప్పినట్లున్నదని వర్ణించినాడు. చిత్రవిచిత్రములగు పూలు, లతలతో, బొమ్మలతో నిండిన ఒక 'తివాచీ' క్రిందపరచిరా అన్నట్లున్నదట ఆ యుద్ధభూమి. రక్తసిక్తమయి బీభత్సావహ మయిన యుద్ధభూమిని ఎంత సుందరమగురీతిని వర్ణించినాడో కదా ! తిక్కనార్యుడు. ఈతని వర్ణనములో నుండెడి వైచిత్రియే అట్టిది. జుగుప్సావహమగు యుద్ధభూమి నుండి పాఠకుని మనసు మరలుటకు ఇట్లు సుందరములగు ఉపమానములు వాడునని విదితమగుచున్నది.

ఇట్లు తిక్కనార్యుడు తన భారత భాగమున యుద్ధమునకు సంబంధించిన పలుతావు లందు బీభత్సరసస్ఫూర్తిని కలిగించినను దేనిని విభావాది సామగ్రీ పరిపోషితము గావింపలేదు. దీనికి గల కారణము నిట్లు చెప్పవచ్చును. భయానకము వలెనే ఇదియు ఉద్వేగమును కలిగించునట్టిది. కావున దీని కెక్కుడు ప్రాధాన్యము నిచ్చియుండకనోపు. కనుకనే ఇది ఎచ్చటను విభావాది సామగ్రీపరిపోషితము కాలేదు.

# 12వ ప్రకరణము

## అద్భుతరసము – తిక్కన భారతము

**అద్భుతరసము :**

శృంగార హాస్యాది నవరసములలో నిది ఎనిమిదియవది. అసాధారణమైన దేదియైనను విస్మయమును కలిగించును. అసాధారణమైనను, అదిలోకోత్తర మయినది కానవసరము లేదు. లోకోత్తరమైన మహత్త్వప్రతీతి యున్నచో అట్టి విస్మయము అద్భుతము అగును. అలౌకికమై, అద్భుతావహమైన దానిలో భగవదంశ కలదు.

సాహిత్యమున అద్భుతమునకు సముచితస్థానము గలదు. నిర్వహణ సంధి యందు అద్భుతము అనివార్యము. 'కుర్యాన్నిర్వహణేఽద్భుతమ్' అని యాలంకారిక నియమము. నిబిడబంధమైన నాటకమున, అద్భుతావహమైన నిర్వహణసంధి మకుటాయమానమై, మానసిక దీప్తిని కలుగజేసి, అలౌకికానంద సంధాయకమగు చున్నది. "మహత్తరమగు ఆత్మయొక్క ప్రతిధ్వనియే యద్భుతమని 'లాంగీనస్' (Longinus) చెప్పినాడు" అని శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి వ్యాసమున చెప్పబడినది.[1]

ఈ అద్భుతరసము విస్మయస్థాయికము. గంధర్వదైవతము. పీతవర్ణము. కొందరి మతమున బ్రహ్మ అధిదేవత. ఈ అద్భుతరసమును గూర్చి భరతుని నాట్య శాస్త్రమున –

'యత్త్వతి శయార్థయుక్తం వాక్యం శిల్పంచ కర్మరూపం వా
తత్సర్వ మద్భుతరసే విభావ రూపంహి విజ్ఞేయం'
'స్పర్శగ్రహోల్లుకసనైర్హాహాకారైశ్చ సాధువాదైశ్చ
వేపథు గద్గదవచనైః స్వేదాద్యై రభినయస్తస్య'[2]

---

1. 'అద్భుతరసము' – భారతి, 1955 జనవరి, సంపుటము 32, సంచిక 1, పు. 10
2. నాట్యశా., అ.6, శ్లో॥ లు 75, 76.

అను కారికలు గలవు. అతి శయార్థయుక్తములైన వాక్యములు, ప్రశస్త కర్మాత్మకమైన శిల్పములు, అత్యుత్కృష్టములైన రూపములును అద్భుతరసమునకు విభావములని తెలియవలెను. స్పర్శము, గ్రహణము, ఉల్లుకసనము ।శరీరమును ఆహ్లాదపూర్వకముగ ఊర్ధ్వముగ కంపింపచేయుట।, హాహాకారము, సాధువాదము, వేపథువు, గద్గదవచనము, స్వేదము, మొదలగువానిచే అద్భుతరసమును అభినయింప వలెను. ఇతఃపూర్వ గద్య యందు దీనికి సంబంధించిన అంశములే మరికొన్ని గలవు. ఇది విస్మయస్థాయి భావాత్మకము. దివ్యజనదర్శనము, మనోరథప్రాప్తి, ఉద్యానవన దేవాలయ గమనము, సభా, విమాన, మాయా, ఇంద్రజాల సంభావనము, మున్నగు విభావములచే నిది యుత్పన్న మగును. విప్పారిన కనులు, రెప్పపాటు లేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము, హర్షము, సాధువాదము, అధికదానము, హాహాకారము, బాహువులను, వదనములను, అంగుళులను, వస్త్రములను ఆడించుట, మున్నగు అనుభావములచే దీనిని అభినయింప వలెను. స్తంభము, అశ్రువు, స్వేదము, గద్గదము, రోమాంచము, ఆవేగము, సంభ్రమము, ప్రహర్షము, చపలత, ఉన్మాదము, ధృతి, జడత, ప్రలయము, మున్నగునవి వ్యభిచారి భావములు. ఇది క్రమప్రాప్తము. 'వీరముచే నింత యయినదని వీరఫల మిది యని నిరూపించుటకే వీరసర్యంతమున నద్భుతమును చెప్పుట సంగత మగును' అని నాట్యవేదము.[3]

సాహిత్యదర్పణమున 'అద్భుతరసమునకు స్థాయి విస్మయము. గంధర్వు డధిదేవత ।బ్రహ్మ యని సరసభూపాలీయము।. పీతవర్ణము ।పుష్యరాగ మని సరసభూపాలీయము।. లోకోత్తరమైన వస్తువు ఆలంబన విభావము. దాని గుణములుద్దీపన విభావము. స్తంభము, స్వేదము, రోమాంచము, గాద్గద్యము,సంభ్రమము, నేత్రవికాసము, మున్నగునవి అనుభావములు. వితర్కము, ఆవేగము, విభ్రాంతి, హర్షము, మున్నగునవి వ్యభిచారులు' [4] అని చెప్పబడినది.

కావ్యానుశాసన, దశరూపక, నాట్యదర్పణ, రసగంగాధర, రసార్ణవసుధాకర కారులు నాట్యశాస్త్ర, సాహిత్యదర్పణకారులను అనుసరించిరి. వేరొండు విషయములను చెప్పలేదు.

పై యాలంకారికుల నిర్వచనముల ననుసరించి విస్మయ స్థాయికము అద్భుతమని, లోకాతీతమగు వస్తువు ఆలంబనమని, గుణముల మహత్త్వము ఉద్దీపన

---

3. నాట్యవేదము, పు. 150
4. సాహిత్యదర్పణము, 3-242-44 శ్లో॥ లు.

మని, స్తంభస్వేదరోమాంచాదులు అనుభావములని, హర్షము, ఆవేగము, సంభ్రాంతి, మున్నగునవి వ్యభిచారులని తెలియుచున్నది.

'రసతత్త్వ చర్చావసరమున పెక్కండ్రు పండితులు ఒక్కొక్కరసము నభిమానించి యిది యొక్కటే రసమని వాదములు చేసిరి. ఆ చర్చల నుండి నాలుగు సిద్ధాంతములు వెలువడినవి. మొదటిది కరుణరస సమీకరణము . . .నాల్గవది యద్భుతరస సమీకరణము. నారాయణ ధర్మదత్తులచే మొదట సిద్ధాంతము చేయబడినది। లక్షణసిద్ధిః పిమ్మట ఆశ్చర్యచూడామణి యందును, అద్భుత దర్పణము నందును రూపొందినది' అని కావ్యాలంకార సంగ్రహమున గలదు.[5] సత్వగుణము వెల్లివిరియుటచే, బ్రహ్మానంద సదృశమగు నొక యానందము కలుగును. అది చమత్కారప్రాణము. చమత్కార మన మనోవిస్తారము. అదియే విస్మయము. కనుక విస్మయమే ఎల్లరసములకును మూలభూతమైనది అని నారాయణుని అభిప్రాయముగ సన్నిధానము వారు వ్రాసినారు.[6] 'ఆత్మ విస్తారరూపమును, చమత్కారము రసమున ప్రధానమై అనుభూత మగుటచేతను చమత్కారసారమై కావ్యానుభూతి యుండుటచేతను, సర్వత్ర అద్భుతరసమే కలదని, రస మనగా అద్భుతమే యని నారాయణు డనినాడు. మనోవిస్తృతి అంగముగా భాసించుచోట్ల శృంగారాది రసములు కలవని, ప్రధానముగా ప్రతీతమగుచోట అద్భుతరసము కలదని రసతరంగిణీకారుడు పలికినాడు. కాగా సర్వ రసములు అద్భుతరసము యొక్క రూపాంతరము లగుచున్నవి. కాని శృంగారాది రసప్రతీతి కంటె అద్భుతరసప్రతీతి విలక్షణముగా కన్పించుటచే రసప్రదీపకర్త యగు ప్రభాకరుడీ వాదమును పరిత్యజించవలెననినాడు. శృంగారమున విస్మయము కన్పింపవచ్చునేమో కాని, శోకమున విస్మయ మావంతయు లేదని దృష్టాంతము నొసగినాడు. ఈ విషయమున అనంతత్వాభివ్యక్తి యున్ననే అద్భుతముగా నెంచబడగలదని 'డెస్వార్' పలుకుచున్నాడు. భావమతి మహత్తరము గంభీరము నగుటచే తదుపాధి యగు రూపము నుండి బహిర్గతమై స్వేచ్ఛను పొంద యత్నించు చున్నదని 'కోన్' (Cohn) పలికినాడు' అని శ్రీ పోతుకూచి వారి అభిప్రాయములు.[7]

---

5. కావ్యాలంకార సంగ్రహము ।సన్నిధానం వారి వ్యాఖ్య।, పు .3314-15
6. - పైది - - , పు. 311
7. 'అద్భుతరసము' - భారతి, 1955 జనవరి, సంపుటము 32, సంచిక 1, పు. 10.

ఇతర రసములతో సంబంధము : 'వీరాచ్చై వాద్భుతోత్పత్తిః' అని నాట్యశాస్త్రము :6-39:. ఈ అద్భుతము వీరజన్యము. వీరము నుండి పుట్టినది. 'అద్భుతశ్చ తథావీరాత్' అని శృంగారతిలకము చెప్పుచున్నది. శారదాతనయుని కథనము ననుసరించి త్రిపురమర్దన సమయము నందు శివుడు ప్రదర్శించిన వీరము వలన సమస్త భూతము లందు అద్భుతము జనించినది. కావుననే వీరము నుండి అద్భుతము జనించినదని చెప్పబడినది. [8] శృంగారాద్భుతము లకును వీరాద్భుతములకును విరోధము లేదు. శృంగారము పోషకరసముగ చెప్పబడినది. ఈ అద్భుతమునకు ప్రత్యేకముగ విరోధిరసము లేవియు చెప్పబడలేదు.

అంగాంగిరస నిరూపణమున అద్భుతమునకు అంగస్థానమే ఈయబడినది. కాని అంగి స్థానము ఈయబడలేదు. కాని దృశ్య కావ్యమున ఇది నిర్వహణ సంధిలో తప్పక యుండితీరవలె ననిరి. అద్భుత మొక్కటే రస మని నారాయణుని వంటివారు ఎంత నొక్కి చెప్పినను, ఎంత ప్రాముఖ్య మిచ్చియున్నను అద్భుతమునకు శృంగార వీరముల వలె అంగిరస స్థానము మాత్రము లభ్యము కాలేదు. అద్భుతరస ప్రధానములగు కావ్యములు వాఙ్మయమున అతివిరళములు. అశ్చర్యచూడామణి వంటివి ఒండురెండే గలవు. కావ్యాలంకార సంగ్రహమున అద్భుతము శృంగార వీరములతో సంకరముగానే యుండుననియు, శృంగార వీర, శాంత నాయకులు స్వార్థమును త్యజించి ధర్మతత్పరత్వమున వర్తించుచోట్ల నద్భుతరసము కనబడుచునే యుండునని, 'వీరస్యైతవచ యత్కార్మసోఽద్భుతః పరికీర్తితః - వీరుని కర్మమే అద్భుత మనబడును అనగా నద్భుతరసముగా పరిణమించును అని భరతుడు. కావున శృంగార వీర శాంతములకే కావ్యమున ప్రాధాన్య మీయబడినదనియు చెప్పబడినది.[9]

అద్భుతరస భేదములు :

'దివ్యశ్చానంద జశ్చైవ ద్విధా ఖ్యాతోద్భుతో రసః
దివ్యదర్శనజోదివ్యో హర్షాదానందజః స్మృతః'[10]

అని నాట్యశాస్త్రము. దీని ననుసరించి అద్భుతము దివ్యము, ఆనందజము అని ద్వివిధములుగ తెలియుచున్నది. దివ్యదర్శనజన్యమైనది దివ్యము. హర్షము వలన జనించుచనది ఆనందజము. దివ్యాద్భుతమున సభావిమానాదులు అనుభావములుగ

---

8. భావప్రకాశము, అధికారము 3, పుటలు 57, 58
9. కావ్యాలంకార సంగ్రహము :సన్నిధానం వారి వ్యాఖ్య:, పు. 318.
10. నాట్యశాస్త్రము, అ.6, శ్లో.82

నుండును. మనోరథవ్యాప్తిచే కలుగు నానందమున రెండవ యద్భుత ముదయించును. వీర రసాదులు వలె నిది యధికబేధములను పొందినట్లు ఎచ్చటను చెప్పబడియుండలేదు.

ఈ అద్భుతరసస్ఫూర్తిని కలిగించుటకు కవులు తమ తమ కావ్యములలో రెండు మార్గముల నవలంబింతురనియు, ఒకటి నాయకుని యందు లోకోత్తర కార్యసాధన రూపమైన ఉత్కటోత్సాహమును వర్ణించి, దాని వలన సామాజికులకు అద్భుతరసస్ఫూర్తిని కల్పించుట; రెండవది నాయకాశ్రయమైన వీరమును గాంచి కావ్యగత పాత్రలే ఆశ్చర్యముద్ర వహించునట్లు వర్ణించుట అనియు డా॥ సుబ్రహ్మణ్యము గారు చెప్పియున్నారు.[11] వీరు వీరరసముతో అద్భుతమునకు గల జన్య జనక సంబంధమును నిరూపించుటకై యిట్లు చెప్పినట్లు కనిపించు చున్నది. అద్భుత రసాస్వాదము కలుగుటకు నాయకుని లోకోత్తర కార్యసాధన రూపముగు నుత్కటోత్సాహము ఒక హేతువు కావచ్చును. కాని ఇది యొక్కటియే కారణమని చెప్పుట యావశ్యకము గాదు. నాయకునితో సంబంధములేని అలౌకికవస్తు ప్రదర్శన వలన కూడ అద్భుతము పోసింపబడుట వాఙ్మయమున కాననగును.

11. 'వీరరసము', పు.56

## భారతము – అద్భుతము :

తిక్కన గారు విరాటపర్వమున ఉపయోగించిన 'నానారసాభ్యుదయోల్లాసి' అను విశేషణము భారతము సర్వత్ర వర్తించు ననుటకు ఉపబలకముగ తదితర రసములతో పాటు ఈ అద్భుతమును చోటు చేసికొన్నది. ఏయే పర్వములలో ఈ అద్భుతము ఎంత వరకు పోషింపబడినదో పర్వానుక్రమముగా పరికింతము.

విరాటపర్వమున కీచకుని వధ ముగిసిన పిమ్మట –

'తన కడిమి కలిమి నచ్చియు
మనమున దలఁకడర సూతు మరణంబు గనుం
గొనుటకు దల్లడపడు ప్రియ
వనిత కతని చావు సెప్పి వడిఁ దన్మాత్రన్'

'అనలము గూఢయత్నమున నయ్యెడకుంగొని వచ్చి దానిఁ జ
య్యన వెలుఁగొందజేయుటయు నచ్చెరువున్ భయమున్ బ్రియంబునుం
బెనఁగొనఁగా గనుంగొనియె భీతమృగేక్షణ భీము డాయఁగాఁ
జని కడు నక్కజం బయిన చందమునం బడియున్న పీనుఁగున్'

'చూచుచుఁజేరి వ్రేల్మిడుముచుం దలయూఁచి విలక్షచిత్తయై
యా చపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింతసేసితి సుఖిత్వముఁ బొందుదుగాక యింక న
ట్లేచిన నిట్లుగా కుడుగునే యనుచున్ వెఱఁగందుచుండఁగన్'[12]

ఈ సందర్భమున అద్భుతరసము కలదు. శ్రీ కోరాడవారు చెప్పినట్లుగ ఈ సందర్భములో నా ద్రౌపదీచిత్రమును, ఆమె మనఃప్రవృత్తులను, అద్భుతాకార చేష్టాదికమును మనము కూడ అబ్బురపడునట్లుగ చేసినాడు. ఈ దృశ్యము నంతను అనగా, అచ్చెరువున్, భయమున్, ప్రియంబును బెనఁగొనఁగా నా కీచకుం జూచు భీతమృగేక్షణ స్వరూపమును మన కనుల యెదుట బెట్టుటకే తిక్కన ఆ భీమునిచే వెలుగు తెప్పించినాడో యన్నట్లు కనబడుచున్నది. ఆసమయమున నామె కాశ్చర్యము, భయము, ప్రియము గలిగినవట'[13] అనియు శ్రీ కోరాడ వారు చెప్పియున్నారు. భీతమృగేక్షణ యగు ద్రౌపది యాప్రాంతమున కరుగు దెంచి నచ్చెరువును, భయమును,

---

12. విరా., ఆ. 2, ప || లు 354-56
13. ఆంధ్ర భారతము కవితా విమర్శనము, పు. 350

ప్రియమును పెనగొనగా కడు నక్కజమయిన చందమున నున్న యా పీనుగును కనుగొన్నదై ముక్కుపైనంగుళము గదియించుకొని మహిత విస్మయానంద నిర్మగ్న అయినదట. అనితర సాధ్యమగు నిట్టి కార్య మాశ్చర్యజనక మగుటచే నిది అద్భుత రసాపాదకమైనది. డా॥ సుబ్రహ్మణ్యము గారు తమ కావ్యమున అద్భుతరస స్ఫూర్తిని కలిగించుటకు చెప్పిన రెండు మార్గములలో నీ సందర్భము రెండవ మార్గమునకు చెందును. ఈ ఘట్టమునకు నాయకుడు భీమసేనుడు. ద్రౌపదిచేతనే 'నీ యుత్తమ నాయకత్వ మెఱిఁగి నిను గొనియాడ నేనెంతదాన' అని పొగడబడినవాడు. నాయకుడగు భీముని ఆశ్రయించుకొనిన వీరమును గాంచి కావ్యగత పాత్రయగు ద్రౌపది ఆశ్చర్యముద్ర వహించినట్లు వర్ణింప బడినది. అద్భుత రసమునకు స్థాయి విస్మయము ఈ విస్మయమునకు ఆలంబనము లోకోత్తరమైన భీముని కృత్యము. తలయూచుట, ప్రేల్మిడుచుట, ముక్కుపై నంగుళము గదియించుట అనుభావములు. సంభ్రమము, ప్రహర్షము, వ్యభిచారులు. మనోరథప్రాప్తి అను విభావముచే నిట ఈ విస్మయము ఉత్పన్నమయినదని చెప్పవచ్చును.

విరాటపర్వముననే అద్భుతరసాపాదక మగు మరియొక ఘట్టము కలదు. వరదాన మహానుభావమున అర్జునుని శిరస్సుపై కిరీటము వొలిచిన సందర్భము. అర్జునుడు నియతమైన ఆత్మ గలవాడయి అధిదేవతలకు ప్రణమిల్లి భక్తితోడ దివ్య కోదండాదులగు సాధనములను గైకొని, సవిశేషస్ఫూర్తి యగు మూర్తి నత్యంత దర్శనీయంబు నొంది -

'బల రిపుఁడిచ్చిన కుండల
ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం
దలఁ ప నని వచ్చె వెంద్రుక
లలవడఁగా బాచిముడిచె సమరదృఢముగన్ -
'తలచుట్టు చుట్టెఁ గుండల
ములు పెట్టె నుద్రిండు గాఢముగఁ గట్టెఁ గరం
బుల వలయంబులుగనుఁ గొని
యెలనవ్వొలయంగ నెక్కె నేడ్తెఱ రథమున్'

అట్టియెడ వరదాన మహానుభావంబునంజేసి -

'పెట్టక కట్టక మౌళిం
బుట్టినక్రియ దీధితులు నభోభాగంబున్

ముట్టి వెలుంగఁగ నింద్రుని

పట్టి కిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితంబై'[14]

ఇట విభావాది సామగ్రీ పరిపోషణము లేదు. కాని అలౌకిక వృత్తాంతముచే అద్భుతరసమునకు తావు కల్పించినాడు తిక్కన.

విరాటపర్వము నందలి ఐదవ యాశ్వాసమున 'కుర్యాన్నిర్వహణేఽద్భుతమ్' అనురీతిని పాండవులు విరటునికి తమ్మెఱింగించుకొని, బయలుపడువారైయున్న సందర్భమున నద్భుతరస స్ఫూర్తి కవకాశమును గల్పించినాడు.

'పాండుసూనులు సమయవిహితాచారంబులు నడపి యుచితప్రకారంబున'-

'తెలుపులగు చీరలను బూఁ

తలబువ్వుల నొప్పి రాజతనయానుగుణో

జ్జ్వలమాననీయ వేషము

లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్'

'చని ధర్మసుతుఁడు సింహా

సనమున భీమాదు లాత్మసముచిత రుచిరా

సనముల సభాస్థలిం గయి

కొని పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్'[15]

'వేడ్కఁ దొడి పూసికట్టి యవ్విరటు డుత్త

రుండు దోఁజనుదేర గొల్వుండు బుద్ధి

నచటి కేతెంచి కని విస్మయంబు నొంది

యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె'

'ఇదియేమి కంక నీవు

న్మద వృత్తిని శంకదక్కి నాగద్దియపైఁ

బదిలంబుగఁ గూర్చుండితి

వదియును గాకిపుడు డిగ వహంకారమునన్' – విరా. ఆ.5, ప. 317–18

అనిన విని మందహాసము చేసి సంక్రందన నందనుడు – 'కౌరవకులోద్వహుఁడార్యనికాయ సంతత ఖ్యాతచరిత్రుడు చిఱుత గద్దియకుం దగఁడే నరేశ్వరా' ౹5–321 ౹ అని మాఱు మాట చెప్పుచు నాతని విస్మయ సంశయములు పెనంగొన నాశ్చర్యరసాంబుధిని

14. విరా., ఆ.4, ప ॥ లు 163–67

15. విరా., ఆ. 5, ప ॥ లు 314 – 16

ముంచివేసినాడు. ఇట ఈ విస్మయము విరటుని ఆశ్రయించుకొనియే యున్నది. విరటునకు కంకుడే ధర్మజుడని ఎన్నడును శంకయే కలుగలేదు. తానెన్నడు తలపని విషయము జరుగుటచే నతడు ఆశ్చర్యరసాంబుధిలో మునిగినాడు. కాని సామాజికునికి అతడు ధర్మజుడని ముందునుండి తెలియును కావున అద్భుతరసస్ఫూర్తి అతనికి కలుగదేమో యనిపించును. అయినను ధర్మజుడు తనను తానావిధముగ వెలువరుచుకొను నను సంగతి సామాజికునకు కూడ తెలియదు కావున వారు అట్లు బయల్పడురీతిలో సామాజికునికి విస్మయము కలిగి రసస్ఫూర్తి కలుగు ననుకొన వచ్చును.. ఈ సందర్భమున ఈ రసము విభావాది సామగ్రి పరిపోషితము కాదు.

ఉద్యోగ పర్వము నందలి విశ్వరూప సందర్శనము అద్భుత రసమునకు చక్కని ఉదాహరణము.

'కట్టెదుర'నున్న యక్కురుపతి కుమారుం జక్కం జూచి యేనొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబుసేసి తనుచు దరహాసంబు సేయు వాసుదేవుని ఫాల ప్రదేశంబున బ్రహ్మయు, వక్షంబున రూపాక్షుండును, వదనంబున వహ్నియు బార్శ్వంబుల నింద్రయమ వరుణ కుబేరులు నాదిత్యమరు ద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి. హల గాండీవ మండిత బాహులగు బలదేవార్జునులు సవ్య దక్షిణభుజంబులను నిజాయుధహస్తులగు యుధిష్ఠిర భీమ నకుల సహదేవులు వీపునను వివిధ ప్రహరణపాణులగు యదు వృష్ణి భోజాంధక వీరులూరులను బ్రభవించిరి. జనిత నానా హస్తవిన్యస్తంబులయి శంఖ చక్రగదా ఖడ్గ శక్తి శార్ఙ్గప్రముఖ నిఖిల సాధనంబులు వెలింగె నేత్ర శ్రోత్ర నాసావివరంబుల సధూమ ధూమకేతు జ్వాలాజాలంబులు నిగిడె రోమకూప కలాపంబులం దరణి కిరణ నిభప్రభలు వెడలె నిట్లు దుర్నిరీక్ష్యంబగు నత్తేజోరూపంబు గనుంగొనం గొలది గాక సకల జనంబులు నయనంబులు మొగిడ్చ యద్భుత భయానక రసంబుల జొత్తిల్లు చిత్తంబుల తోడం గదలకుండ నప్పుండరీకాక్షుండు నారదాది మహామునుల వలనను భీష్మ విదుర ద్రోణ సంజయుల యందును గరుణాంతరంగితంబగు కటాక్షవీక్షణం బొలయ దివ్యదృష్టి యొసగిన నా పుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండి రయ్యవసరంబున'[16]-

'దేవ దుందుభివ్రాతంబు దివిరెఁ గల్ప
వృక్ష పుష్పధారామయవృష్టి గురిసె

16. ఉద్యో. , ఆ. 3, ప. 405

సిద్ధ సాధ్య విద్యాధర శ్రేణి భక్తి
నిచ్చ జయజయశబ్దంబు లెసఁగె జడల' - 3-406

ధృతరాష్ట్రునకు దృష్టి నొసగగా నాతడు అద్భుత మడరురీతిని సమ్మదపూరము గ్రమ్ముచుండగ కృష్ణుని దర్శించినాడు. అచ్చటి జనులందరును నృపాలు సితవిశాలాక్షుని ఆశ్చర్యరసమగ్నంబులగు మనస్సులతో గాంచిరట.

ధృతరాష్ట్రునకు కలిగిన సమ్మదపూరమే ఇట అనుభావము. మరియు ధృతరాష్ట్రుడు సితవిశాలాక్షు డగుట అచటి జనులకు ఆశ్చర్యమును గొల్పినది. ధృతరాష్ట్రునకు దృష్టినొసగుట, దృష్టిని ఉపసంహరించుట రెండును అలౌకికకృత్యములే. కృష్ణుని విశ్వరూప ప్రదర్శనమును అలౌకికమే. ఈ అలౌకిక కృత్యముల వలన అద్భుతము ఉత్పన్నమయినది. ఆవేగము, సంభ్రమము, ప్రహర్షము అనునవి ఇట వ్యభిచారులు. దివ్యదర్శనము, మాయాఇంద్రజాల సంభానవము విభావములు. ఈ రీతిగా నిట అద్భుతము విభావాది పరిపోషిత మయినది.

భీష్మ పర్వమున కృష్ణుడు అర్జునునకు తన విశ్వరూపమును చూపు ఘట్టము-

'నానాస్ఫుటవర్ణంబులు
నానాభంగులును గలుగు నారూపములో
నానాశ్చర్య విధంబులు
గానగ నగుఁజూపెదం బ్రకాశస్ఫూర్తిన్'
'విను మానుష చక్షుర్గతి
గనుఁగొన శక్యంబు గాదు గావున దానిం
గనుట కయి దివ్యచక్షు
ర్జననం బొనరింతు నీకు శత్రువిదారీ'

'అని యతనికి దివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుండైన యా లక్ష్మీశ్వరుండు దన దివ్య రూపంబు సూపె నావిశ్వరూపుని దివ్యతేజంబు సహస్ర సూర్యప్రభానిభం బనుటయుం జాలకుండుం గావున వాక్రువ్వం గొలదిగా దట్టి మహామూర్తి గనుంగొని ధనంజయుండు విస్మయ రోమహర్షణ ప్రహర్షోత్కర్షంబులతో దండప్రణామంబులు సేసి నిలిచి కేలుమొగిడ్చి ఇట్లనియె'.[17] ఈ అలౌకిక కార్యముచే అర్జును నంతటి వానికి విస్మయము కలిగినది. ఇది రసపర్యంతము కాదు. కాని అద్భుతరసచ్ఛాయ మాత్రము గలదు. ఇట్లే అర్జునుడు భీష్ముని నిమిత్తమై నీరు తెప్పించిన ఘట్టము.

17. భీష్మ., ఆ. 1, 208-10వ

కవ్వడిని కనుగొని గాంగేయుడు -

'శరవేదన సర్వాంగము
నెరియఁగ నాకిపుడు పెదవులెండెడుఁ దృష్ణా
భరముడుపఁ దగిన నీళులు
నెరవునఁ దేనేర్తు వీవ వేతెమ్ము నఘా'

*అనిననట్లు కాక యని యతం డతనికి బ్రదక్షిణంబు సేసి తేజోమయంబయిన మార్గణంబు సర్జన్య మంత్రాభిమంత్రితంబుఁ గావించి, మహీతలంబు గాఁడనేసిన భాసురచ్ఛాయంబగు తోయంబు ధారారూపంబున దివ్యగంధ రసోపేతంబయి యెగిసిన'[18] కౌరవులు ప్రకంప గాఢవిస్మయులైరట. ఈ సందర్భమున అర్జునుని ఈ లోకోత్తర కార్యమె కౌరవుల విస్మయమునకు హేతువయి అద్భుత రసాపాదక మయినది.

ద్రోణ పర్వమున తృతీయాశ్వాసమున 'కురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్న కవ్వడిం గనుంగొని కమలనాభుండు' -

'పెఱికితి నలుఁగులు మేనులు
నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నివిరితి హరు లి
త్తఱి నీళులు ద్రావక తె
ప్పఱ వెట్టాకొ శత్రుసైన్య భీకరమూర్తీ'
'వెన్ను మునుఁగ దివియఁగ లే
కున్నను ద్రావఁదగు నీళులొదవిన హయముల్
నిన్ను గెలిపించు ననవుడుఁ
గన్నుల నగి యర్జునుండు గలవివె యనుచున్'
'ధర్మ దివ్యాస్త్ర హతిం బగిల్చి కొలనుత్పాదించి వేదానికి
న్మరజాలంబుల నిల్లుగట్ట మనసైన్యంబల్ వెఱం బొందె న
చ్చెరువందెన్ సురసంఘముల్ హరి నుతించెం బొంగి యప్పార్థు భూ
వర మున్నిట్టిని సూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్'[19]

ఈ విధముగ అర్జునుడు దివ్యాస్త్రములచే కొలను నుత్పాదింపగ హర్షమందస్మితముతో మురారి హయము ల మెయి పెట్టునట్లు సేసి, తరిమి, నీరు త్రావించి సేద దీర్చెను.

18. భీష్మ., ఆ. 3, వ. 429-30
19. ద్రోణ., ఆ. 3, వ || లు 159-62

ఇచ్చుట కూడ అలౌకికకృత్యము వలననే అద్భుతము కలిగినది. ఈ త్రిలోకము లందును ఎవ్వరును చూడనట్టిదియు, విననట్టిదియునగు లోకోత్తర కార్యముగుటచే నిట అద్భుతమునకు తావు కలిగినది. విభావాదుల వర్ణనము మాత్రము అంత స్పష్టముగ లేదు. 'సైన్యములు వెఱనుబొంది అచ్చెరువందెన్' అనుటచే విస్మయము స్థాయిగ నుండి అద్భుతము చోటుచేసికొన్నట్లు విదితమగు చున్నది. ప్రశస్త కర్మాత్మకమైన శిల్ప మిట విభావము. యోధులందరు పిచ్చలించుట అనునది అనుభావము. సంభ్రమము, ప్రహర్షము అనునవి వ్యభిచారులు. అర్జునుడు దివ్యాస్త్రములచే కొలను నుత్పాదించుట లోకోత్తరకృత్యము. అదియే ఆలంబనము.

ఇట్లే ద్రోణపర్వమున చతుర్థాశ్వాసమున ద్రోణ భీమసేనుల యుద్ధసందర్భము-

'ఒండొక తేరెక్కి సము
ద్దండత(జని భీమసేను(డా(కి శరము లొం
డొండ నిగిడించి నొంచిన
గండడ(గక యత(డు గనలు గదిరిన మదితోన్'

'అరదము డిగ్గి యప్పటు శరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరు(డయి వానపై గురియ వంచిన మస్తకమొప్ప(బోవు సుం
దరవృషభంబులీల జని దర్పమెలర్ప(గ నొక్కచే నొగల్
వెరవున( బట్టి తేరు ప్రజ విస్మయమంద(గ వీచి వైచినన్'-

ద్రోణ.,4-153-54

అనుచోట భీముడు ద్రోణాచార్యుని రథమును సుందరమైన వృషభము వలె ఒక్కచే నొగలను నెరవున బట్టుకొన్నట్టివాడై ప్రజలందరు విస్మయము నందగ నుగ్గునూచ మగునట్లు విసరి వైచినట్లు తెలియుచున్నది. భీముని అద్భుతకృత్యముచే ప్రజలందర కును విస్మయము కలిగినది. వారందరి విస్మయమును చూచుచున్న సహృదయునకు కూడ విస్మయము కలిగి అద్భుతరసానుభూతి కలుగును. అనుభావాదుల స్పష్టప్రతీతి లేదు.

ద్రోణ పర్వము నందలి సైంధవ వధయు నద్భుతరసా నద్భుతరసాపాదకముగు అర్జునుడు సైంధవుని తల దునుముటలో నద్భుతరసమునకు దీప్తిని కలిగించినాడు. తిక్కన. మురారి అర్జునకు సైంధవుని జూపగా -

'అత(డు గని గంధమాల్యా
ర్చితమై దొన మెఱయుచున్న శితశరము గ్రో

ద్ధతినేయ డేగ పులుఁగును
గతిఁగొనుక్రియ నది హరించె గ్రక్కున శిరమున్'

'అప్పుడు సత్వరుండై ' –

'శౌరి పార్థ! పార్థ! సైంధవు తల యిలఁ
బడిన నొప్పదది సభంబు నంద
నిలువజేయు మేను నీ కెఱింగించెద
నత్తెఱంగు దెలియ ననిన నతఁడు'

'పటు శరముల మీఁదికి డా
పటికిన్ వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె నము
త్కట రయమున శిరముఁ గందుక క్రీడ గతిన్'[20]

అట్టి సందర్భమున మాయపుచీకటి విరియగ తోయజమిత్రుడు మగుడఁ దోచెనట. బలంబుల చేయంగల కొందరు కోపాయత్తులై కడగి శితబాణముల నరుని పొదివిరి. అతడు వివిధాస్త్రతతులచే వారిని నుడువుచు నింగిని మును నడుపుచుండెడు శిరమున కూడ చిత్రస్ఫురణచే నేనుఱక యున్నాడు. ఇది నిజముగ చిత్రస్ఫురణమే. ఈ విధముగ ఆశ్చర్యకరణ పరిణత బాహువీర్యుడై విక్రమ విహారమును సలుపుచు ఆ శిరస్సునట్లు సభంబున ఎంతసేపు నిలుపవలయు? ఎందులకిట్లు చేయవలసినదని కృష్ణుని ప్రశ్నించినాడు. అప్పుడు వీని మస్తకము నెవ్వడు మహి ని పడవేయునో వాని శిరస్సు శతశకల మగునను శాప వృత్తాంతమును చెప్పి –

'ఈ తల పుడమింబడనీ
కాతని తొడమీఁద వైచునది యాపని వి
ఖ్యాతంబగు పాశుపతము
చేతన యగుఁగాక యొంటఁజెల్లునె మనకున్' – ద్రోణ., 4–329

అని చెప్పి సైంధవుని తండ్రియగు వృద్ధక్షత్రుండు ఉండు ప్రదేశమును కూడ తెలిపినాడు. ఆ వృద్ధ క్షత్రుండు శమంతపంచక సమీపంబున నుండునని చెప్పగా అర్జునుడు 'అట్లకాక యని భక్తియుక్తంబుగా నియతమతిం దత్ప్ర యోగం బాచరించిన నద్దివ్యసాధనంబు సాయకపరంపరాకారంబయి యాశిరం బటగొని చని తదాశ్రమద్వారంబు సొచ్చు నప్పు డజ్జనపతి జపయుక్తుండై యుండ నమ్మహాస్త్రంబు

20. ద్రోణ., ఆ.4, పలు 320–22

మాహాత్మ్యంబున నమ్మస్తకం బతని తొడమీద బడిన నతండు తదీయ స్పర్శనంబున నెఱింగి దిగ్గున లేచుచుం ద్రోచిన నది భూతల పతితం బగుటయు' । ద్రోణ; 4-330।

'పగిలి యాతని తల నూఱు పఱియలయ్యె
శౌరి విజయుని నగ్గించి సకల భూత
ములు మహాద్భుతరసమున మునిఁగె నపుడు
సంహరించె నయ్యస్త్రమా సవ్యసాచి' - ద్రోణ., 4-331

సకల భూతములతోపాటు అందరు అద్భుతరసమున మునుగ వలసినదే. ఇది అట్టి అలౌకికమగు కార్యము. సైంధవుని శిరస్సును చిత్ర విచిత్రముగ నభమున నిలుపుటయే గాక, అతని తండ్రి తొడపై పడునట్లు చేయుట లోకోత్తరమగు కృత్యమే. ఇట ఈ అద్భుతరసమునకు అర్జునుని అలౌకిక కృత్యమే అలంబనము. అర్జునుని వీరమున కిది పరమావధిగ చెప్పవచ్చును. విభావాదులు స్పష్టముగ లేవు.

కర్ణపర్వమున కర్ణుడు చనిపోవుటతోడనే అతని తేజము వారి జాప్తబింబమును సొచ్చినది । కర్ణ, 3-363।. కర్ణుని పూర్వచరిత మెట్టిదైనను ఈ సన్నివేశము మాత్రము సహృదయుని యందు అద్భుతమును కలుగుచేయును. కర్ణుడు ప్రతినాయక పక్షమున వహించినను దినకరాంశముచే జనించిన అతని మృతి తరువాత జరిగిన ఈ విషయము అద్భుతమునే కలుగజేయును. 'మరణాంతాని వైరాణి' అనుట వలన కర్ణుడు చనిపోవుటతోడనే అతనియెడ నున్న భావమును సహృదయునకు మారును. ఈ ఘట్టమున అద్భుతము విభావాది సామగ్రీ పరిపుష్టము కాకపోవుటచే, అది రేఖామాత్రముగ భాసించిన దనవచ్చును.

శల్యపర్వములో అగ్నిదత్తమైన అర్జునుని రథము కాలిపోవు ఘట్టము అర్జునుని, తక్కిటి పాండవులను అద్భుతరసమగ్నులను గావించినది.

'కవదొనలును గాండీవము
నవలనిడం బనుపు ముందర రదము డిగు మే
న విదప డిగియెద శుభకర
మవు నివ్విధమట్లు సేయుమనుడు నతండున్'
'ధనువు తూణీరయుగళంబుఁగొనుచు రథము
డిగుడు శౌరి పగ్గంబుల నాగలముడిచి

డిగియెఁ గేతన కపియు భూతగణయుతము
గాఁదొలంగె నత్తేరు తత్క్షణమమండె'
'తురగంబులతోఁ గూడఁగ
సరదము సకలంబు నుజ్జ్వలానల శిఖలం
జురచురఁబోయినఁ గనియ
న్నరుఁ డచ్చెరువంది కృష్ణునకు నభిముఖుఁడై'

'దేవా యిట్టి యాశ్చర్యంబుం గలదె యీ రథంబు దగ్ధంబగుటకుఁగారణంబేమి' అని అడిగిన మురారి అతనితో యిట్లనియె -

'గురు కర్ణుల యస్త్రాగ్నుల
నెరసినయది మున్ను దీని నిటు గాకుండం
భరపడి రక్షించితి సం
గరముదెగినఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్' [21]

ఇదియును అలౌకిక వృత్తాంతమే. ఈ వృత్తాంతము అలంబనముగ అద్భుతము చోటుచేసికొన్నది.

ఆనుశాసనికపర్వము నందలి భీష్మ నిర్యాణఘట్టమున అద్భుతరసచ్ఛాయ గలదు. భీష్ముడు శరీరమును విడిచి నాకలోకగతు డగు ఘట్టమిది - 'ధారణాను క్రమంబున సమాహితాత్ముండయి వాయువుల సన్నిరుద్ధంబు సేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె సమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబములు వాసికొనుచు వచ్చునయ్యెచోట్లు శల్యరహితంబు లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదులగు నఖిల జనంబులు నాశ్చర్య భరితాంతఃకరణు లగుచుఁ గీర్తించిరా సంయను చతురునిచే సర్వాయతనసన్నిరుద్ధంబై యాత్మమూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంత దవ్వరిగి యంత నంతర్హితంబయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె దేవదుందుభులు మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బాగడుచుం బ్రమోదంబు నొంది రిట్లు దేవవ్రతుండు దివంబునకుం జనుటయు' [22] ఉల్కాకారంబున ఆకసమున కెగయుట అనునది కృష్ణు నంతటివానికే ఆశ్చర్యమును కలిగింపగా నిక మన మెంతటివారము. ఇట్లు ఇట విస్మయమునకు తావు కలిగి అద్భుతము

---

21. శల్య., ఆ.2, ప॥లు 333-37
22. అనుశాసనిక., ఆ.5, ప. 468

కొంతవరకు చోటు చేసికొన్నది. హర్షము, సాదువాదము అనునవి మాత్రమే గలవు గాని తదితర విభావాది సామగ్రి వర్ణితము కాలేదు.

ఆశ్రమవాస పర్వమున ద్వితీయాశ్వాసము నందలి ఒక ఘట్టమున అద్భుతము చోటుచేసికొన్నది. విదురుడు యోగమార్గమున ధర్మరాజు నందు కలియు ఘట్టము అది.

'ధర్మతనూజుండు దత్సమీపంబున
కేఁగి యయ్యోగి కట్టెదుర నిలిచి
యాతండు నయనంబు లర్ధమీలితములై
యుండంగ నూరకయున్నఁగాంచి
నిర్మలాత్మకయేను ధర్మసూనుఁడ నన్నుఁ
గను విచ్చి చూడవే యనుడు నతఁడు
జెప్పల నెగయించి యప్పాండవోత్తముఁ
దప్పక చూచి యుదాత్తయోగ
బలము సైకొని యింద్రియములను బ్రాణ
ములను నింద్రియములుఁ బ్రాణములును గలిపి
నిజ శరీరంబు విడిచి యా నృపతి తనువు
సొచ్చెఁ దేజోమయత్వవిస్ఫూర్తి మెఱయ' - ఆశ్ర., ఆ.2, ప.60

'వినుము ధర్మపుత్త్రుతనువునఁ గాంతియు
లావు నప్పు డగ్గలంబులయ్యె
నొలసె బుద్ధి యధికబల మట్టులగుట తఁ
డెఱిఁగి చోద్యమంది యెలమి నొందె'

'తదనంతరంబ యన్నృతి
విదురశవము మ్రాను సెంది వికృత రహితమై
నిదుర మెయి నొఱగియున్న ప
గిదినుండం జూచి యగ్నికృత్యము నడపన్'

'తలఁచిన మింట నొక్కొలుఁగు ధర్మతనూజ యతిత్వ గౌరవో
జ్జ్వలుని కళేబరంబునకు వహ్నివిధాన మొనర్చుటర్హమే
వలదని మ్రోసె నమ్మజవల్లభుఁ డప్పని దక్కిపోయి భ్రా
తలకును దండ్రికిన్ సువిదితంబుగ నంతయునుం గ్రమంబునన్'

'ఎల్లవారును వినుచుండం జెప్పిన నందఱు నద్భుతరసంబున మునింగిరి': ఆ|శ., ఆ.2, 61-64 : అని వర్ణించినాడు తిక్కన. ఇందు అనేకములైన అద్భుతాంశములు గలవు. తన నిజశరీరమును విడిచి విదురుడు యోగబలమున తేజోమయత్వస్ఫూర్తి మెరయునట్లుగ ధర్మజుని తనువు నందు జొచ్చుట ఒక అద్భుత విషయము. అప్పుడు ధర్మపుత్రుని తనువున కాంతి లావు అగ్గలమగుట మరియొక విశేషము. అగ్ని కార్యములను నిర్వర్తించుటకు సిద్ధపడినపుడు మింట నొక్కొలుగు వినబడుట ఇంకొక విశేషము. ఇవన్నియు నలౌకిక వృత్తాంతములే. ఇట్టి అలౌకికవృత్తముల నాలంబనముగ చేసికొని అద్భుతరసము పోషింపబడినది.

ఈ పర్వముననే వ్యాసుడు ధృతరాష్ట్రాదులకు భారతరణ మృతులను రావించి చూపుట మరియొక అద్భుతఘట్టము. వనవాసమున నున్న ధృతరాష్ట్రుని జూచుటకై సపరివారముగ ధర్మరాజు వెడలును. వ్యాసమహర్షియు నేతెంచును. వ్యాసుడు ధృతరాష్ట్రాదులకు భారతరణ మృతులను రావించి చూపును. తిక్కన మాటలలో చెప్పవలెనన్న 'సకల జనుల నద్భుతరసమున మునుగజేసె నేమనగవచ్చు నా సంయమీంద్రు మహిమ' : ఆ|శ., 2-126 :. ఈ సమయమున ఆ కురువృద్ధునకు దివ్యదృష్టినొసగినాడు సాత్యవతేయుడు. అతని అగణిత తపఃప్రభావము గని జనులందరు అధిక విస్మయమును పొందిరట. అంతియుగాక అవ్విశేషము విని అద్భుత ప్రమాదభరితయై గాంధారి కూడ నిజ నయనంబుల బంధించిన పట్టము సడలించి వారల నందరను కనుగొనినదట. 'శారీరక పునరుత్థానము అసంభవము కాదని వాదించువారు అధునాతనులలో కలరు. "చూచినవారు" సాక్ష్యమును చెప్పుచున్నారు. జన్మాంతరము ఆత్మ యొక్క అస్తిత్వము మున్నగు వాదముల మాట అటుంచి భౌతికముగ "టెలివిజన్" వలె నది యొక వాస్తవభ్రాంతిని గల్పించు ఇంద్రజాలిక ప్రక్రియ కావచ్చును. ఏమైనను ఇట్టి "అతిలోక" సంఘటనకు కూడ భారతమున దృష్టాంతము లభించుట విశేషము'[23] అని నండూరి వారు చెప్పిన మాట ఎంతయు సత్యము.

'సాత్యవతేయుండు జాహ్నవీ సలిలావ
గాహన మొనరించి గారవమున
నింపారు నెలుఁగున నిందు రండనపుడు
నీకేమి సెప్పుదు నీటియందు

23. తిక్కన-భారతదర్శనము, పుటలు 390-91.

రవ మగ్గలముగ రారాజుఁ దమ్ములుఁ దత్కు-
మార వర్గము నభిమన్యుఁడాది
యగు పాండుపుత్రులు నర్కజుండును బాహ్లి
క ప్రముఖాఖిల కౌరవులును
ద్రుపద మాత్స్యులు వారి బంధువులను శకుని
యును దదీయానుజులును నాతని తనూజ
రాజియును భీష్మగురులఁ బురస్కరించి
కొనుచుఁ దమ దివ్యదేహముల్ గొమరు మిగుల'
'దివ్యమాల్యములును దివ్యాంబరరంబులు
దివ్యభూషణములు దివ్యలేప
నములుఁ జెన్నుఁజేయఁ దమమిత్ర సుభట సం
దోహములును దారుఁ దోఁచి రథిప' [24]

జనములు అధిక విస్మయచము పొందగ చూపబడిన ఇట్టి అతిలోక సంఘటనము అద్భుతరసాపాదిక మనుటలో నెట్టి సంశయమును ఉండబోదు. మృతవీరులను తెరమీద బొమ్మల వలె ధ్యానించి చూపుట అనునది నిజముగ అలౌకిక కృత్యము. ఈ కృత్యము అలంబనముగ అద్భుతరస మొదవినది. ఇచ్చటను విభావాది వివరణము లేదు.

మహాభారతము నందలి అద్భుతవృత్తములలో బోయ అర్జును నోర్చి యాదనాంగల సొమ్ము లపహరించుట ఒకటి అని నండూరి వారి అభిప్రాయము. [25] ధైర్య శౌర్య పరాక్రమ గుణగరిష్ఠుడగు అర్జునుడు, పలు యుద్ధములలో ఉత్కటోత్సాహమును ప్రదర్శించి జయలక్ష్మిని వరించిన అర్జునుడు, శస్త్రాస్త్రసంపన్నుడగు అర్జునుడు సామాన్యులగు బోయలచేతిలో ఓడిపోవుట అనునది కొంత ఆశ్చర్యావహమే.

వీరము నుండి అద్భుతము జనించునని కదా ఆలంకారికోక్తి. ఆ వీరము నాయకాశ్రిత మయినది. ఈ ఘట్టమున నాయకునిగా అర్జునిని గ్రహింపవలెను. అర్జునుడు ఓడిపోయిన ఈ ఘట్టమున అద్భుతరసము కలదని ఎట్లు చెప్పగలము?

---

24. ఆశ్రమవాసపర్వము, ఆ.2, పలు 118-19
25. తిక్కన-భారతదర్శనము, పు.392

కనుక డా॥ రామకృష్ణమాచార్యుల వారి అభిప్రాయము సమంజసము కాదని స్థూలదృష్టికి తోచును. కాని శ్రీకృష్ణుని నిర్యాణానంతరము అతని కృపాకటాక్షవీక్షణము సోకని అర్జునుడు మహాధన్వియైనను నిర్వీర్యుడు కాకతప్పదు. ఈ భావము మనమున మెదలినంతనె భగవల్లీల ఇట్టిది కదా! అని ఆశ్చర్యము పొందెదము. ఈ ప్రకారమున డా॥ ఆచార్యుల వారి అభిప్రాయమును సమర్థింపవలసి యున్నది.

బలరాముడు శరీరంబు విడిచి అనంతుని యందు కలియుసందర్భమునను అద్భుతరసము కొలదిగా చోటుచేసికొన్నది.

'తదనంతరంబ యద్దామోదరుఁడు రాము
వదన సరోజంబు వలన వెడలఁ
గనియె మహాభుజంగము నరుణచ్ఛాయ
మై పొల్పు వక్త్రసహస్రకంబు
మణుల వెలింగెడు ఫణములుఁ దెలుపారి
పర్వతాభోగనిభంబునైన
మేనిపెంపును గలదాని నట్లా బల
భద్రుండు నిజయోగబలము పేర్మిఁ
దనదు తనువు విడిచి చనియె వియద్వీథి
నంబునిధికి నమ్మహాత్ము నెదురు
కొనియె వరుణుఁ డధికవినయంబుతో నాగ
కులములెల్ల వచ్చి కొలిచె భక్తి' - మౌసలము, 1-75

అని వర్ణించినాడు తిక్కన. ఇదియు నలౌకిక వృత్తాంతమే. కాని విభావాది సామగ్రీపరిపోషితము కాదు.

ఈపర్వముననే ద్వారకానగరము సముద్రమున మునుగు ఘట్టము అద్భుతరస పూరము. దీనిని తిక్కన మాటలలో చెప్పవలె నన్న -

'వననిధిపురంబు ముంపఁగ
మనుజేశ్వర యెల్లజనులు మరలఁబడి కనుం
గొని రద్భుతరసపూరం
బున పెన్నిట్టఁ దమచిత్తములు మునుఁగంగన్'
'అపుడు రెండవ జలనిధియనఁగ జాలి
యద్భుతోద్భూతవాక్యచయంబు పేర్మి

ప్రోయు నా జనసంఘంబు మురవిరోధి
మఱది నడపించె దర్శితమార్గుఁడగుచు'[26]

అని అద్భుతరసపూరమున చిత్తములు మునుగునట్లు జరిగినదని చెప్పినాడు. ఇది అలౌకిక కార్య మనుకొనవలసి యున్నది. విభావాది పరిస్ఫురణము లేదు.

ధర్మజాడునశరీరముగ స్వర్గారోహణమును గావించుటయు అలౌకిక కృత్యముగుటచే కొంత అద్భుతరస స్ఫూర్తికి అవకాశము కలిగినది.

శస్త్రప్రయోగము నందు వీరము మాత్రమే చూపట్టు, అస్త్రప్రయోగము లందు అలౌకిక స్ఫురణంబున అద్భుతమే ఒప్పుచుండును. అట్టి సన్నివేశములు భారతేతిహాసమునం దెల్లెడల, ముఖ్యముగ యుద్ధపంచకము నందు కానవచ్చును. మహాభారతమున ఎన్నో తావు లందు, ముఖ్యముగా యుద్ధపంచక మందు – అద్భుత మున్నదని స్థూలదృష్టికి తోచును.

ఆయా యస్త్రముల వలన కలుగు చర్యలన్నియును నియతములే. ఆగ్నేయాస్త్రము గాని, వాయవ్యాస్త్రముగాని, ఇట్లే యస్త్రముల శక్తులు నియతము లగుటచే, ఆ నియతశక్తిజ్ఞానము అద్భుతమునకు బాధకము అగుచుండును. కనుక అద్భుతరసస్ఫూర్తి లేదు. అట్లుగాక, హఠాత్సంభవమై, అసంభావ్యమై, అలౌకికమైనదాని యందు, అద్భుతజకనత్వము ఉండును. కనుక ఆయా తావుల అద్భుతము లేదనుటయే లెస్స.

తిక్కనార్యుని భారతభాగమున అద్భుతరసమునకు కొన్ని తావు లందు ప్రవేశము కలిగినను ఎల్లెడల విభావాది సామగ్రీ పరిపోషితము గాదు. పలు తావుల నిది కేవలము ఆలంబన నిమిత్తముగనే పోషింపబడినది.

---

26. మౌసలము, ఏకాశ్వానము, ప॥ 178-79

# 13వ ప్రకరణము

## శాంతరసము – తిక్కన భారతము

**శాంతరసము :**

నవరసములలో శాంతము చివరిది. ఇది శమ స్థాయికము. శ్వేత వర్ణము. నారాయణ దైవతము । శాంతోఽపి నవమోరసః – అను విషయము రస సంఖ్య ప్రకరణమున విపులముగ చర్చింప బడినది ।. శాంతమును తొమ్మిదవ రసముగ స్థాపించిన అలంకారిక నిర్వచనములను పరిశీలించిన శాంతరస స్వరూపము విదితము కాగలదు.

నాట్యశాస్త్రమున ఇట్లు చెప్పబడినది – ఇది శమ మనెడి స్థాయి నుండి జనించును. మోక్షము నందు ఆసక్తిని కలిగించును. తత్త్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయశుద్ధి, మున్నగు విభావాదులచే కలుగును. యమ నియమములు, ఆధ్యాత్మిక ధ్యాన ధారణములు, ఉపాసనము, సర్వ భూతదయ, సన్యాస స్వీకారము, మున్నగు అనుభావములచే నిది అభినయింప బడును. నిర్వేదము, స్మృతి, ధృతి, సర్వాశ్రమ శౌచము, స్తంభము, రోమాంచము, మున్నగునవి వ్యభిచారి భావములు. ఈ విషయములను వివరించెడి ఆర్యలును గలవు.

'మోక్షాధ్యాత్మసముత్థ స్తత్వజ్ఞాన అర్థహేతు సంయుక్త ।
నైశ్శ్రేయ సోపదిష్టః శాంతరసో నామ సంభవతి'
బుద్ధీంద్రియ, కర్మేంద్రియ, సంరోధాదాధ్యాత్మ సంస్థితోపేతః
సర్వప్రాణి సుఖహితః శాంతరసోనామ విజ్ఞేయః'
'నయత్ర దుఃఖం నసుఖం నద్వేషో నాపి మత్సరః
సమస్సర్వేషు భూతేషు సశాంతః ప్రథితోరసః[1]

మోక్షము, అధ్యాత్మము, అనువాని వలన శాంతము జనించును. తత్త్వజ్ఞానము హేతువుగా కలదియును, మోక్షోపదేశకమును అగునది శాంతరసము. ఈ రసము

---

1. నాట్యశా., అ.6 । నాట్యవేదము, శ్లో. 283-85, పు. 234 ।

బుద్ధీంద్రియ, కర్మేంద్రియ సంయమము, పరమాత్మ యందును మనస్సును లగ్నముచేయుట అనువానితో కూడినదై సర్వప్రాణి సుఖహితమగును. సుఖ దుఃఖములు, ద్వేష మాత్సర్యములు లేక, సర్వభూత సమభావము గలది శాంతము.

ధనికుడు శాంతరస స్వరూపము నిట్లు చెప్పియున్నాడు -

'నయత్ర దుఃఖం నసుఖం నచింతా నద్వేషరాగౌ నచకాచిదిచ్ఛా

రసస్తు శాంతః కథితో మునీంద్రైస్సర్వేషు భావేషు శమప్రధానః' [2]

ఎచ్చట సుఖము గాని, దుఃఖము గాని, చింత గాని, రాగము గాని, ద్వేషము గాని లేక కోరికయే లేక యుండునో, అట్టిదానిని శాంతమని మును లందురు. శమమే సర్వభావము లందును ప్రధానమై నది.

'అనిర్వచనీయమగు నీ శాంతము నాస్వాదించు సహృదయులు లేరు. నిత్యసంతుష్టిమై త్రి, దయ, ఉపేక్ష మున్నగువాని రూపమున శాంతరస మందరిచేతను, ఆస్వాదింపబడు చున్నది. ఆ యాస్వాదమును, తక్కిన రసముల నాస్వాదించునపుడు గలుగు చిత్తద్రుతి వికాస విస్తారరూపమే యగును' అని సాహిత్యదర్శనము. [3]

సాహిత్యదర్పణమున ఇట్లు గలదు - 'శాంతమునకు శమము స్థాయి భావము. ఉత్తమ నాయకము. శ్వేతవర్ణము. నారాయణదైవతము ః బ్రహ్మ మని నరసభూపాలీయము ః. జగత్తు అనిత్యమని తెలియుటచే సంభవించిన పుణ్యాశ్రమ, హరిక్షేత్ర, తీర్థ రమ్యవనాదులును, మహాపురుషసాంగత్యాదులును ఉద్దీపన విభావములు. రోమాంచ, సంతోష, భూతదయాదులు అనుభావములు. నిర్వేద, హర్ష, స్మృతి, మతి, ఇత్యాదులు వ్యభిచారి భావములు.' [4]

కావ్యాలంకార చూడామణి కర్తయగు విన్నకోట పెద్దన -

'శమము విభావాదులచే

నమరం బరిపుష్టమైన నది శాంతమగున్

సమకొను నాలంబనమున

నతులము శాశ్వతమునైన యజపద మరయన్' - ఉల్లా., 2-131

అని చెప్పినాడు. వేదాంత చతుర సంభాషోదిత కౌతూహలములు ఉద్దీపనములు. ఖేదేతర సమదర్శన వాదములు అనుభావములు. రోమాంచ స్తంభాదులు సాత్త్వికములు.

---

2. కావ్యాలంకార సంగ్రహము ః సన్నిధానం వారి వ్యాఖ్య ః, పు. 295
3. సాహిత్యదర్శనము, పు. 201
4. సాహిత్య దర్పణము - 3-245-48 శ్లో॥ లు

నిర్వేదము, విద్యా, మతి, ధృత్యాదులు వ్యభిచారిభావములు అని చెప్పియున్నాడు.[5]

భరత విశ్వనాథుల లక్షణములలో రామచంద్ర హేమచంద్రోక్తములు గతార్థము లగుచున్నవి. జగన్నాథుడు చెప్పిన శత్రుమిత్రాదుల యందుదాసీనవృత్తియు, నాసాగ్రదృష్టియును ధనికుడు చెప్పిన ద్వంద్వాతీత స్థితియును, విన్నకోట పెద్దన నుడివిన వేదాంత చతుర సంభాషోదిత కౌతూహలంబును వానికి వ్యాఖ్యాప్రాయము లగుచున్నవి.

శాంతము అద్భుతము తరువాత పేర్కొనబడినది. శృంగారవీరాదులు ప్రవృత్తి రసములు. పురుషార్థములలో మొదటి మూడును వానికి విషయములు. శాంతము నివృత్తి రసము. తురీయ పురుషార్థము దీనికి విషయము. కనుక నిది చివరగా పరిగణింపబడుట సముచితమే.

శృంగార వీరములలో నేదియొ యొకటి నాటకమున అంగిగా నుండవలెనని లాక్షణికోక్తి యున్నను శాంతరస ప్రధానములగు కావ్యములు కూడ గలవు. కాని ఇవి అతి విరళముగ కలవు. దీనిని అంగిగా కూడ అంగీకరింపవచ్చునని అలంకారికులగు అభినవగుప్తాదులు చెప్పుచు ః దృశ్య కావ్యము లందు ః ప్రబోధ చంద్రోదయమునుః శ్రవ్య కావ్యము అందు ః, మహాభారతమును శాంతరస ప్రధానకావ్యములకు ఉదాహరణములుగపేర్కొని యున్నారు.

'భావావికారా రత్యాద్యా ః శాంతస్తు ప్రకృతిర్మత ః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే'
'స్వంస్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయేచ శాంతయేవో పలీయతే' [6]

శాంతము ప్రకృతి. రత్యాదులు తద్వికృతులు ప్రకృతి జన్యములైన ఆయా వికృతులు ఆయా నిమిత్తములు నశింపగనే తిరిగి ప్రకృతిలో లీనములగును అని వీని భావము.

దీని నాధారముగా గొని అభినవ గుప్తాదులు శాంతమునకు అంగిరసస్థానము నిచ్చుటతో తృప్తిపడక శాంత మొక్కటియే రసమని, అది ప్రకృతిరసమని, మిగిలినవి వికృతి రసములని వాదము లేవదీసిరి. వీరు శాంతరస సమీకరణవాదులు. ఈ శాంతరస సమీకరణము మహాభారతము నుండి యవతరించి యశ్వఘోషుని

5. కావ్యాలంకార చూడామణి, ఉల్లా. 2, ప॥లు 133-34, పు. 42
6. నాట్యశా., అ.6 ః నాట్యవేదము, శ్లో॥లు 286-87, పు. 234 ః

శారీపుత్రప్రకరణము, శ్రీ హర్షుని నాగానందము, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయము అనువాని యందు లక్ష్యసిద్ధి నాంది, ఆనందవర్ధన, అభినవగుప్తుల ప్రతిభావంతములగు వాదములచే సిద్ధాంతిత మయినది. వీరే శాంతమును రసరాజముగ కూడ పరిగణించిరి.

శాంతము ప్రకృతిరస మనుటకు అభినవగుప్తాదులు నాలుగు కారణములను చూపియున్నారు – 1. చతుర్విధపురుషార్థములలో నుత్తమము మోక్షము. తత్సాధకము శాంతము; 2. విషయ సంబంధము లేనిదగుట. సర్వ రసాస్వాదమును శాంతప్రాయమే యగును – 'తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదః విషయేభ్యో విపరివృత్త్యా'; 3. మరియు చిరంతన పుస్తకములలో : నా.శా. ప్రతులలో : శృంగారాదులకు పూర్వమే శాంతరస ప్రస్తావన కలదనియు, దానిని బట్టియే శాంతము ప్రకృతిరస మగుచున్నదనియు అభినవగుప్తుని వాదము; 4. 'భావావికారా . . . ' అని నాట్యశాస్త్రమున చెప్పబడుటయు నీతడు చూపిన కారణములలో నొకటి.

వీరి యుక్తివిధానమును ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తమ కావ్యమున చూపియున్నారు. 'నానావిధ రసభావములు పుట్టకపూర్వము స్వస్థముగా నుండు చిత్తవృత్తి శాంతమయము. ఆ చిత్తవృత్తిలో పుట్టిన ఈ రస భావములు దానిలో కలిగిన వికారములు. అనగా శాంతము ప్రకృతి, రత్యాదులు వికృతి. ఆ వికారములు ఆనందపర్యవసాయులయియో, కాకయో సమసిపోయిన తరువాత మరల చిత్తవృత్తి శాంతిమయమే అగును. రసానందము కూడ శాంతస్వరూపమే. కావున రసము లన్నియు చరమావస్థలో శాంతము నందే పర్యవసించు చున్నవి. మరియు ఈ రసము ఉత్తమ పురుషార్థమైన మోక్షము ననుసరించి యుండుటచే దానికి గల ప్రాధాన్యము వేరొకదానికి లేదు. అందువలన నిదియే రసరాజము'.

'ఈ పైవాదములో రెండు లోపములు కనబడుచున్నవి. 1. సామాజికుని మనస్సు స్వస్థముగా నున్నపుడు కలిగెడి వికారములే రసభావము లనుట నిజమే. కాని ఆ స్వస్థత మాత్రమే నిర్వికారచిత్తత కాదు. అనగా వైరాగ్యజనితమైన శమము కాదు. వైరాగ్యజనితమైన నిర్వికార చిత్తతయే : శమమే : శాంతమునకు స్థాయి. నాటకమును చూడబోవునపుడు గాని, కావ్యమును చేపట్టి చదువబోవునపుడు కాని మన మెవ్వరము వైరాగ్యజనితమైన శ్రమ ప్రధానులము కాము. 2. రసాస్వాదసవేళ మనలో సమస్త కాయిక మానసిక వికారములు సమసిపోవుటయు, ఆ యానందము శాంతిమయమై యుండుటయు యథార్థమే. అంతమాత్రమున రసము లన్నియు చరమావస్థలో శాంతముగనే భాసించుననుట సమంజసము కాదు. అట్లు చెప్పిన రసము లన్నింటికి

శమమే స్థాయి యని చెప్పవలసి వచ్చును. ఇది శాస్త్ర విరుద్ధము; లోకవిరుద్ధము'[7] ఇట్లు ఈవాదము పరాస్తము చేయుటకు కృషి జరిగినది. కాని కాంతి యందు వర్ణత్వము కానరాకయున్నను, విడివడిన కాంతి యందు - హరివిల్లు నందు - సప్తవర్ణములును భాసించినట్లే, శమము నందే అన్ని రసభావములును ఇమిడి యుండవచ్చును. మనకు వలసిన రంగును మనము ఎంచుకొన్నట్లే కవి ఆయా విభావాదులచే ఆయా రసములు స్ఫురింపజేయును. అనగా సర్వ వర్ణ సమ్మేళనము వెలుగైనట్లు, తదభిన్నము కానట్లు, సర్వ రసభావములును శమము నందే యున్నవి. అవి తదంతర్గతమును తదభిన్నములును అని యూహింపవచ్చును.

ఏది యెట్లున్నను, శాంతమును రసరాజముగ నంగీకరింపకపోయినను, అంగిరసముగా మాత్రము దీనికి స్థాన మీయబడినది. శాంతమునకు శృంగారము, రౌద్రము, హాస్యము, భయానకము విరోధములు. అమృతానందయోగి విరచితమైన అలంకారసంగ్రహమున శాంతము సర్వోత్కృష్టమని, దానికి మిత్రవిరోధములు లేవని 'శాన్తః సర్వ రసోత్కృష్టో నమైత్రీ నవిరోధితా'[8] అని తెలుపబడి యున్నది.

---

7. సాహిత్య శిల్పసమీక్ష పుటలు 165-66
8. అలంకారసంగ్రహము, తృ.పరి., శ్లో. 64

**భారతము – శాంతము :**

విరాటపర్వమున శాంతము రేఖామాత్రముగ గోచరించును. తిక్కన భారత భాగము నందలి తొలిపర్వ మగు విరాటమున రేఖామాత్రముగ నున్న శాంతము శాంతిత్రయ, ఆశ్రమవాస చతుష్టయము కడకు వచ్చుసరికి విస్తృతి నొందినదై 'భారతమునం దంగిరసము శాంతము' అని నిరూపణము చేయతగియున్నది.

ద్రౌపది కీచకునిచే పరాభవింప బడుటను చూచిన భీమసేనునకు కోపము గలిగి, ఆ కోపవేగమున కన్నుల నిప్పులు రాలినవి. అంగముల్దనరగ సాంద్ర ఘర్మసలిలములు గ్రమ్మినవి. నితాంత దంత పీడన రట దాస్యరంగ వికటభ్రుకుటీ చటుల ప్రవృత్త నర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణాపరిణద్ధమూర్తి అయినాడు. నేలయు నింగియు దాళములుగా చేసి ఏపున రేగి వాయించి యాడ, కుల పర్వతములు గూల్చి యొండొంటితో దాక తన్నియాడ, ఏడు సాగరములు నిక్కడక్కడ బెట్టి పలుచని రొంపిమై నలదికొనగ, దిక్కులు నాలుగు నొక్కచోటికి తెచ్చి పిసికి పిండిలిసేసి పిడుచకొనగ మిగిలి బ్రహ్మాండభాండము పగులవ్రేయ నప్పళించు ప్రళయకాలానలమున గండరించిన రూపంబుకరణి భీముడు అతి భయంకరాకారత నతిశయిల్లినాడు ॥ విరా., 2-133-34 ॥. ఇట్లు పేర్చిన కోపాటోపముచే నవిచారిత సమయవర్తనుడయి వృకోదరుడు కీచకుని గీటడగింపజూచి తత్సంబంధబద్ధుండును, ఆజ్ఞాపరిపాలకుండును కావున మత్స్యపతిని తనయలుకలోని వాని కాతలంచుచు, అచ్చేరువనున్న ఉన్నత వృక్షమును నిరీక్షించి, ఆననంబు పల్లటిల్ల ధర్మతనయుని కనుగొనిన, అతడు తన నయనాకారంబున వారించి ఇట్లు పలికినాడు –

'వలలుండెక్కడఁజూచె నొండెడ ససేవ్యక్ష్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖలొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీభూజము వంట కట్టియలకైఖండింగఁగా నేటికిన్' – విరా., 2-136

అని నిగూఢభాషణముల అయ్యాజాతశత్రుడు అనిలజా కోపరసపేర్మిని చెఱచినాడు. అతని శాంతింప చేసినాడు. విభావాది సామగ్రి ఏమాత్రము ఇచట కానరాకపోయినను శాంతము రేఖా మాత్రముగ భాసించుచున్నదని చెప్పవచ్చును.

విదురనీతి యందు ధర్మాధర్మ వివేచనాదుల వలన శాంతము నిలద్రొక్కు కొనుటకు ప్రయత్నించినను అది ఊషరక్షేత్రమున చల్లిన విత్తుల వలె నిష్ఫలమయినది.

సనత్సుజాతుడే దిగివచ్చినను ధృతరాష్ట్రు నిది యథాపూర్వబుద్ధియే. కనుక శాంతస్థితికి నందుటకు ధృతరాష్ట్రుని వంటి వానికి అధికారము నాటిదనుక ప్రాప్తము కాలేదనుట సువిదితము.

ఉద్యోగపర్వమున భీమసేనుడు కృష్ణునితో – 'మాకును వారికిఁ బ్రీతామహుండగు భీష్ముండు వినుచుండ సుయోధనుతోడం గురుకులేశ్వరు నాస్థానంబున నా వచనంబులుగా నిట్లనుము –

'అన్నదమ్ములమై యుండి యకట మనల
నౌరులు దలయెత్తిచూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి నీనేల పెద్దవారి
బుద్ధివిని పంచి కుడుచుట పోలదాక్కొ' – ఉదో., 3-49, 50

అని పలికి ఎవ్విధంబుననైన సంధి చేయవలయును. అదియే భూజనులకు నెల్లను హితమును, సౌఖ్యకరమును అని చెప్పినాడు. ఉద్ధతస్వభావము గల భీమసేనుని నోట ఇట్టి శాంతి ప్రదములగు పలుకులు వచ్చుట కడువింతగా నున్నది. ఇట భీమునిలో కొలదిగ శాంతమయ స్వరూపము పొడగట్టుచున్నది. కావుననే కృష్ణుడు 'ఎన్నడును వినని భీముపాల గడువింతలు వింటిమి' అని పలికినాడు. శమస్థాయికమగు శాంతమున కిట తావు లేకున్నను రౌద్రరసస్ఫూర్తి గల భీమునిలో శాంతప్రవృత్తిని ఈ సందర్భమున తిక్కనార్యుడు వర్ణించినాడు. ఇది శాంతరసమునకు ఉదాహరణము గాకున్నను భారతమున నామూలాగ్రము రౌద్రరసస్ఫూర్తియే గల భీమునిలో తిక్కనగా రిట్టి శాంత ప్రవృత్తిని కూడ చూపి యున్నారే అను విశేషమును చూపుట కిది యుదాహరణముగ నీయబడినది. ఈ సన్నివేశమును తమ నాటకమున వర్ణించు సందర్భమున తిరుపతి వేంకటకవులు భీమునకు క్రోధ మలంకార మయినట్లు శాంతములంకారము కాదు అనియు చెప్పియున్నారు.

ధర్మజధృతరాష్ట్రు లిరువురకును శాంతముపై చూపున్నదే కాని దానిని విపులముగ వర్ణింపక విడిచిపుచ్చుట రాబోవు యుద్ధవీరమునకు నీరసము కలిగింపకుండుటకే. అట్టియెడ యుద్ధపంచకమున శాంతమును వెల్లివిరియించుట మరింత దోషము కాగలదు. అయినను కావ్యమంతయు శాంతోన్ముఖము అగుటకు ఎడనెడ శాంతరసచ్ఛాయలు యుద్ధ పంచకము నను గలవు.

భీష్ముడు –

'తూర్పు తలగాఁగ నీసుతు
లేర్పడఁ గనుఁగొనుచునుండ నిలగంపింపన్
దర్పోజ్జ్వలుఁ డాభీష్ముఁడ
హర్పతి యస్త్రాద్రి సేరునట్లుగఁ బడియెన్'

'తనువు ధరఁబొందకుండఁగఁదల్ప భంగి
శరము లూఁతయై పొలుపారె నరవరేణ్య
యట్లు శరతల్పగతుఁడగు నమ్మహాను
భావు దేవవ్రతుని దేవభావమొందె' [9]

ఈ వర్ణనము నందు అన్నియు నుడిగి శాంతుడయి భీష్ముడున్నట్లు కనుపట్టుచున్నది.

'సంగరంబునఁ దన్వి సని శాంతిఁబొందిన
చిత్తంబుతోఁ దమసేన దిక్కు
గనుఁగాని పెలుచనోకర్ణ యోకృప యోను
యోధన పోర నన్నొత్తియెపుడుఁ
జెప్పుదురేను నాచే నయినంతయుఁ
జేసితి నింక నిశ్చింతవృత్తి
సుగతికిఁ జనఁగోరి తగనుజ్జగించెద
బాణాసనంబును బాణములును
దెల్పిగలిగి మనుండని పలికి శరస
రాసనములూడ్చి తేరిపై ననఘమూర్తి
యెప్పఁగూర్చుండి సంభృత యోగనిష్ఠ
నొంది తేజోమయాత్ముడై యుండె ......' [10]

ఈవర్ణనము నందు అస్త్రసన్యాస మొనరించిన ద్రోణుడు యోగనిష్ఠనొంది తేజోమయాత్ముడయి యుండుటచే ఒక మహాయోగి రూపమే మన మనమున పొలుచును. భీష్మద్రోణు లిరువురును ప్రతినాయక పక్షమున పోరినను వారిరువురు మహావీరులగుటచేతను, నాయక పక్షపాతులగుటచేత ను, అనేక సద్గుణగరిష్ఠు లగుటచేతను శాంతము నాయకనిష్ఠనూ అనునంత భ్రాంతి కలుగును.

9. భీష్మ., ఆ.3, పలు 413–14
10. ద్రోణ., ఆ.5, ప.322

శాంతి సప్తకమున శాంతము బహుధా పరిపుష్ట మయినది. ముఖ్యముగ శాంత్యానుశాసనిక పర్వము లందు ప్రతి అంశమును శాంతరస పరిప్లావిత మనవచ్చును. శాంతము ఒక్కయెడ సరమై, మరొక్కయెడ సరితమై, ఎల్లెడల సముద్రమై యుండెనా అనిపించును. కనుక ఈ పర్వము లందలి ఒండు రెండు ఘట్టములను మాత్రము పరిశీలింతము.

ధర్మజాడు జ్ఞాతి వధంబున అత్యంతము నిర్వేదము పొంది లోక విషయంబుల నిస్పృహుడయ్యెను. నెత్తుటికూటికి రోసి -

'మనకేటి రాజ్య మొండొక
జనపదమున కేఁగి భైక్షచర్యావిధి జీ
వనము నడిపికొనియుండుద
మనఘా యల్లయిన సుఖుల మవుదుము సుమ్మీ,[11]

అని పరిగ్రాహత్యాగశీలుండు జననమరణ దుఃఖంబుల బొరయడని శ్రుతులు సెప్పెడు. కనుక తనకు రాజ్యపాలనము వలదని తన నిర్వేదము నంతయు వెలువరించినాడు. అతని నంకెకు తెచ్చుటకు కృష్ణాదులు తలక్రిందులైరి. కడకు కృష్ణుడు ధర్మజానకు ధర్మోపదేశంబు సేయ భీష్ముని నియోగించెను. భీష్ముడు సెలవిచ్చిన వన్నియు భగవద్గీతకు ఉపాఖ్యాన పూర్వకములైన వ్యాఖ్యానములు.

'విను దుఃఖంబులఁ దెగఁ ద్రో
చిన పురుషుఁడు సౌఖ్యసక్తచిత్తుడు గాకా
రిన వైరాగ్యముఁ జెందిన
ననుపమమగు పరమపదము నమ్మెయినేర్చున్' - అ.4, ప. 105

'ఫలకాంక్షగాక నియతిం
జలిపిన నీయఖిల కర్మజాతంబును ని
ర్మలమోక్షపదముఁ జేర్చుట
గలుగు నవశ్యంబుఁ బుణ్యకరణప్రవణా' - 4-108

అను పద్యములందు పరమపదము చేరు మార్గము తెలుపబడినది.

'విను మందు నొకవిశేషం
బనఘా బుద్ధీంద్రియంబు లైదును బరముం

11. శాంతి., ఆ.1, ప. 43

గను వెలుఁగున కర్దము వా

ని నడంగింపంగ మనను నిపుణత యొప్పున్' - అ.5, ప. 106

ఈ పద్యము నందు పరమును గొను వెలుగు మనకు లభించుచున్నది. అంతయు పరమేశ్వరకృత ప్రవృత్తి నివృత్తులేనని చెప్పుచు -

'అవయవము లెల్ల కూర్మము

నివిడించును లోనికడఁచు నెదినట్టుల భూ

త వితతి భూతాత్ముండును

బ్రవర్తన నివర్తనముల పాల్పడఁజేయున్' - అ.5, ప. 162

అని భీష్ముడు చెప్పియున్నాడు.

'గంధర సాదుల కాంక్ష లోభము మోహ

మును దెచ్చు నద్దోషమునకు మనను

లోనైన ధర్మవిలోపంబు వాటిల్లు

దానఁబాపముసేయు తలఁపులొదవుఁ

బ్రజ్ఞనక్కొడులు భావించి సద్గోష్ఠిఁ

బరఁగంగ విషయతత్పరత మాను

నది ధర్మబుద్ధికి నాలవాలంబగు

ధర్మాచరణముల దనివి ననక

హృద్గతద్వంద్వముల నెల్ల నెడల విడుచు

ననఘ యనపాయమగు నుపాయమున ముక్తి

వడయుఁ బదపడి యేను నీ యడిగినంత

వట్టు దెలిపితి ధర్మ నిర్వాహివగుము' - అ.5, ప.365

ముక్తిపడయు మార్గమును ఈ పద్యము నందు వరుసగా వివరించినాడు.

అట్లే హంసగీత యందు సర్వ విషయములు సంగ్రహముగ ఉట్టంకింప బడినవి.

జ్ఞాతివధము వలన ధర్మజాడు నిర్వేదమును పొందినాడు. అతని మనమున ఐహికసుఖములయెడ వైముఖ్యమేర్పడినది. అతడు సర్వసంగపరిత్యాగము చేసి భైక్ష్యమున చరమ జీవితమును గడపదలచినాడు. కాని అతడు రాజు. చతుర్విధ పురుషార్థ ప్రవర్తకుడు. నిస్పృహుడైనను విధినిర్వహణము నందు జాగరూకుడై యుండవలెను. కర్మత్యాగమున కంటె నిష్కామకర్మయును, కర్మఫలపరిత్యాగమును,

లోక సంగ్రహమున కావశ్యకములు. రాజ్యతంత్రమును నిరీహుడై నడపుటకై అనునగు మనస్తత్వము నలవడజేయుటకు గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు అదను చూచి భీష్ముని నియోగించినాడు. దీనివలన నిర్వేదముతోపాటు సజ్జనసాంగత్యమును, ధర్మప్రవచనమును ధర్మజునకు లభ్యము లయినవి. ధర్మజుని తదనంతర కార్యకలాపము లన్నియు జనకుని మానసిక సంతులనస్థితి నుండి యొనర్చినవి. అశ్వమేధమును చేసినను, ముప్పదేండ్లు పాలనము గావించినను అతడు వెనుకటి ధర్మజుడు కాడు. శాంతమున పండిన పరమయోగి అతడు.

అంపశయ్యపై నున్న భీష్ముడు అంబుధిని యోగనిద్రనున్న నారాయణుని తలపించును. యోగేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణుని నియోగమున ముక్తి మార్గము నుపదేశించు భీష్ముడు శ్రీమన్నారాయణునిగ భాసించుట సమంజసమే.

అశ్వమేధ పర్వముననే గాక, భారతేతిహాసము నందలి యుపాఖ్యానములలో మకుటాయమానమైనది సక్తుప్రస్థోపాఖ్యాన మన్నను యతిశయోక్తి కాదు. ఈ యుపాఖ్యాన మూలకముగ హింసాత్మకమైన యజ్ఞము కంటె అహింసాత్మకమైన తపోయజ్ఞ మధికమని వైశంపాయనుడు జనమేజయున కెఱింగించును. ఈ పర్వమును అధ్యాత్మప్రబోధమును కలిగియుండి మోక్షపురుషార్థమునకు ప్రాధాన్యమిచ్చి, శమప్రధానమైన శాంతమును అంగిగా కలిగి యున్నది.

ఆశ్రమవాసపర్వము నాటికి ధృతరాష్ట్రుని మనస్సున శాంతము పండినది. పుత్రశతనాశనము, వార్ధక్యము, నష్టవిభవము, అస్వతంత్రవృత్తి, జనుషాంధతతోపాటు ధృతరాష్ట్రుని క్రుంగదీసినవి. గాంధారి స్థితియు నట్టిదే. ధర్మజుడు ఎంతగా నాదరించినను భీముని పలుకులు ఆ వృద్ధుల మనములకు ములుకులై లోచినవి. ఇట్టి స్థితిలో ఏనాటినుండియో విదురుడు చెప్పుచుండిన నీతులు ఈనాటికి మనమున నిలిచినవి. నిర్వేదమును శాంతోన్ముఖము చేయుటకు, శమ ప్రధానమగు శాంతముగ వ్యక్తమగుటకు విదుర సాన్నిహిత్యమున అతని బోధలును ఉపకరించినవి. శాంతము పుష్టమగుటకు యుద్ధానంతరము పంచదశ సంవత్సరములు పట్టినవి.

మౌసలము నందలి –

'బలమును బుద్ధియుఁ జేవయు
నలఘుమతియు యుల్లసిల్లునగుకాలము నం
బొలియుం గాలవిపర్యయ
కలనంబున బుధులకుబ్బుఁ గలఁకయుఁ గలవే'

'కాలమూలంబు సర్వంబుగాఁన దీని
కొండు తలఁపులు దక్కి మీరుత్తమంపు
గతికిఁ జనుడు నిశ్చింత వికారతనులు
విడిచి యార్యజనంబులు వినుతిసేయ'
'అన విని శోకమోహంబులు వాసిన
డెందంబు నిర్భరానందమొంద
.... .... .... ' - మౌసల, 221-23

అను పద్యములో మహాపురుషుని సాంగత్యము, మోక్షోపదేశము, అనువాని వలన శాంతము కలిగినట్లు విదితమగు చున్నది.

మహాప్రస్థానమున ధర్మజుడు -
'అర్జునుఁ డమ్మెయి నచ్యుతరామాది
యాదవజనుల వృత్తాంతములును
దనదు తెఱంగు సత్యవతీ తనూభవు
హితభాషణంబులు నేర్పడంగఁ
జెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబు
నకు మదియొలయ నన్నరునితోడ
నఖిలభూతంబుల ననఘ పాకంబుఁబొం
దించుఁగాలుండు మదీయబుద్ధి
కర్మ సంత్యాగ కలనంబు కార్యమిప్పు
డును వినిశ్చయమొందె .......... - ప. 3

అని పలికినాడు. శాంతిపర్వ మంతట వినవచ్చు కర్మపరిత్యాగ మిచ్చటను విననగు చున్నది.

ధర్మజు ననుసరించి వచ్చిన సారమేయము స్వర్గప్రవేశమున కనర్హమను ఇంద్రునితో -

... ... నన్ను
నత్యంత దృఢభక్తి నాశ్రయించి
పురమేను వెడలునప్పుడు మొదల్గాఁ దోన
చనుదెంచె నీ భవ్యసారమేయ

మిదియట రావలదే నామనంబు ని

షురవృత్తి కోర్వదు . . . . . ' - ప. 52

అని చెప్పి మరియు -

... ... ...

విను భక్తియుక్తుని విడుపు బ్రహ్మ

హత్యఁబోలెడి పాపమని చెప్పుదురు పెద్ద

లట్లుగావున దీని నఖిల ధర్మ

సారజ్ఞ విడుచుట సనదు దివ్యసుఖంబు

నకుఁ గాఁగ బాపంబునకుఁ జొరంగఁ

జాల . . . . . . . .. ..........' - ప. 55

అని పలికినాడు. ఈ మాటలలో ఈతని పుణ్యశీలతయు, దృఢమగు ధర్మదీక్షయు, ధృతియు, ఆశయశుద్ధియు - ఇత్యాదులు వ్యక్తము లగుచున్నవి. సర్వభూత దయావిశేషము నిందు ప్రతిపాదించినాడు.

స్వర్గారోహణమున ఆకాశగంగావగాహనము సలిపిన పిమ్మట మర్త్యభావ సంకలితమై యున్న అతని హృదయము దివ్యత్వము నావిష్కరించు కొనినది.

... ... ...

మానుషతనువు నమ్మాత్రన విడిచి ది

వ్యంబగు మహితదేహంబు దాల్చి

వైరమత్సర స్నేహసంవాస లౌల్య

గర్వ శోకాదులైన హృద్గత వికార

ములఁ దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు

పావకుండుఁబోలె శోభిల్లె .. .....' - స్వర్గ., ప. 52

ఈరీతిగా తత్త్వజ్ఞానము, వైరాగ్యము వలన జనించిన శమము సర్వభూతదయ అను భావముచే పోషింపబడి, ధృతి, స్మృతి, నిర్వేదము, ఇత్యాది వ్యభిచారులచే శాంతముగ పరిణమించినది. మోక్షమునం దాసక్తిని కలిగించు ఈ శమము తుదకు కావ్యనాయకుడగు ధర్మజునకు సశరీర స్వర్గప్రాప్తిని కలిగించినది.

**శాంతాభాసము :** డా ॥ రంగారావు గారు ఉద్యోగపర్వము నందలి కృష్ణరాయబార ఘట్ట సందర్భమున ద్రౌపది మనస్సును గూర్చి వివరించినవారై 'ఈ ఘట్టము శాంతాభాసముతో నారంభమై వీరరసముతో సాగి చివరకు కరుణము నందు

పర్యవసించు చున్నది' [12] అని చెప్పియున్నారు. కాని 'శాంతేచ హీననిష్ఠే' - హీననిష్ఠమగు శాంతము శాంతాభాస మగును. అను అలంకారిక లక్షణానుసారము ఇది శాంతాభాసము కాదని చెప్పవచ్చును.

శాంతిపర్వము నందలి కపోతోపాఖ్యానము నందు కపోతముల దేహత్యాగమును తలంచి బోయ వైరాగ్యమును పొందెను.

'కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం గారుణ్యమేపార ని
ప్పులుఁగిట్టిచ్చునె మేను నాదు చరితంబుల్ నిందకుం బట్టులై
తలవన్ వచ్చిన నింత కీడగునె యేతత్క్రూరతాఘోర చే
ష్టలు మానంగలవాఁడఁ బక్షిగురుఁడై సంధించె సద్బోధమున్'

అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరంబగుటయు నంత నిలువక -

'ఇది యిట్లాలిని బంధులం దొఱఁగితానీయగ్నిలోఁ గూలె నా
చ్చిదమై యుండఁగ నిట్టి తెంప యొలయం బెంపారు వైరాగ్య సం
పద పాపంబుల నెల్లఁద్రుంపఁగ మహాప్రస్థాన పుణ్యత్వమొం
దెద నేనిప్పుడయంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁడై'
'వలలోన నున్న పులుగుల
వెలువడగా విడిచి వలయు వెండియు దనకుం
గల పక్షినిహతి సాధన
ములు నచటనె యుండఁబోయె బోయ నియతుఁడై - శాంతి., 3-325-28

అతండు-

'ఏనును నిట్లగుదు ననుచు
నూనిన కౌతూహలమున నుల్లము వొదలన్
మేనెల్ల ముండ్లు సింపఁగఁ
గానఁదఱిసి గళితరక్త కలితాకృతియై'
'అరుగుచుండువాఁ డొకచో దవానలంబు
గట్టిదిరి కాననంబెల్ల ముట్టి మండ
సంప్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి
యొడలు దొఱఁగి దేవత్వంబు వడసియొప్పె' - 3-339, 40

---

12. Conception & Practice of Peotry of Kavitrayam & Nachana Somana

ఇట హీనసిష్ఠ మగుటచే శాంతాభాస మనదగును. కాని బోయయైనను 'ఒడలు దొరగి దేవత్వంబు వడసి యొప్పె' అని దేవత్వప్రసక్తిని తెచ్చుట వలన అభాసమును తొలగును. కనుక తిక్కన భారతమున శాంతాభాసము లేదనదగును.

మహాభారతమున పర్వములకు పర్వములే శాంతినిష్ఠములయి యుండుట వలన కావ్యేతిహాసముగ భారతమును తీర్చిదిద్ద దలంచిన కవిత్రయమునకు కొంత క్లేశమేర్పడినది. సామాన్య సామాజికునకు శాంతము వలన హృదయము స్పందింపదు. కనుక సహృదయమునకు 'పాడినదే పాటగ' నుండకుండుటకై తిక్కన విభావాది సామాగ్రీపరిపుష్టము కాకుండ ఏ ఒండురెండు అంశముల సాహాయ్యముతోడనో శాంతమును పోషించినాడు. శాంతిపర్వము మొదలుగా గల ఏడుపర్వము లందును ఈ స్థితియే గలదు.

# 14వ ప్రకరణము

## అంగిరసము – తిక్కన భారతము

అంగిరసము :

అంగిరస మన ప్రధాన రసము. భరత మతానుసారముగా కొందరి మతమున నెనిమిది రసము లున్నను, కొందరి మతమున తొమ్మిది రసము లున్నను, మహాకావ్యమున 'శృంగార వీరరసయో రన్యతరస్య ప్రాధాన్యం' అని ప్రతాపరుద్రీయ కర్తయు. 'శృంగారస వీర శాంతానామే కోఽంగీరస ఇష్యతే' అని సాహిత్యదర్పణ కర్తయు చెప్పియున్నారు. శాంతమును సాహిత్యదర్పణ కర్తయే పేర్కొనెను. కాని తదితర అలంకారికు లెల్లరును శృంగార వీరములలో నొక్కటియే అంగిరసము కావలెనని, మిగిలిన రసము లన్నియు అంగరసములని చెప్పిరి.

భరతుని నాట్యశాస్త్రమున 'అంగి–అంగ' రసవివేచన మనుపేర ప్రత్యేకముగ లేకపోయినను, దాని సంబంధమగు కొన్ని అంశములు గలవు.

'నానాభావార్థసంపన్నా : స్థాయి సత్వాభిచారిణః
పుష్పావ కీర్ణా:[1] కర్తవ్యాః కావ్యేషు హి రసాబుధైః' – నాట్యశా., 7–123

నానాభావార్థ సంపన్నములైన స్థాయి సాత్త్విక వ్యభిచారి భావములతో కూడిన రసములు పుష్పముల వలె సుకుమారముగా కావ్యమునం దంతటను వ్యాపింపవలె నని పైశ్లోకభావము. ఒకే రసము, ఒకేభావము లేక ఒకే వృత్తి గల కావ్యము ఉండుట కవకాశము లేదు. అనేక భావములును, రసములును, వృత్తులును, ప్రవృత్తులును ప్రయత్నపూర్వకముగ కావ్యము నందు సామర్థ్యముతో సంయోజనము చేసిన అది రాగరంజిత మగును.

మరియు నాట్యశాస్త్రమున –
'నహ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః
భావోవాపి రసోవాపి ప్రవృత్తిర్వృత్తి రేవచ'

---

1. 'పుంసాను కీర్ణః' అని ఒకపా గలదు.

'బహూనాం సమవేతానాం రూపం యస్యభవేద్బహు
సమంతవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణోమతాః'
'దీపయంతః ప్రవర్తంతే యేపునః స్థాయినం రసమ్
తేతు సంచారిణోజ్ఞేయా స్తేహి స్థాయిత్వమాగతాః'[2]

ప్రయోగమునుబట్టి చూచిన ఒకే ఒక్క రసము గాని, ఒకే ఒక్క భావము గాని, ఒకే ఒక్క వృత్తి గాని, ఒకే ఒక్క ప్రవృత్తి గాని కావ్యమున ఉండవు. ఉన్నరసము లన్నింటిలో ఏరసమునకు ప్రాచుర్యము ఉండునో దానిని స్థాయి రసమని, మిగిలినవి సంచారీరసములని అనవలెను. ఈ స్థాయి రసమే ప్రధానమై సంచారిరసములు అప్రధానములు అగును. ప్రధానరసమునే అంగిరస మనియు, అప్రధాన రసములు అంగరసము లనియు ఆనందవర్ధనాదులు పేర్కొనిరి.

'విభావనుభావయుక్తో హ్యంగవస్తు సమాశ్రయః
సంచారిభిస్తు సంయుక్తః స్థాయ్యేవతు రసోభవేత్' - నాట్యశా., 7-120

విభావానుభావ యుతమును, అంగవస్తు సమాశ్రమయమును, సంచారి యుక్తమును అగు స్థాయియే రసముగా భాసించు చున్నది.

రసము వేద్యాంతర స్పర్శ శూన్య స్వప్రకాశాఖండ స్వరూపము. దానికి మరొక రసముతో సమావేశము దుర్ఘటమనియు, స్వస్వసామాగ్రీప్రాప్త పరిపుష్టము లగు రసములకు ఏకత్ర సంఘటన పొసగదనియు, కనుక నొకదానికిని మరొక దానికిని అంగాంగి భావము అసంభవ మనియు శంక కలుగవచ్చును. ఇట్టి శంకలకు ఆచార్య నరసింహం గారు క్రింది విధముగా సమాధానము చెప్పిరి.

వీనిలో ఒకటి ప్రధానరసముగా వ్యవహృత మగుటకు కారణము తద్బహుళ వ్యాప్తియే. ఏరసమును నిఖిలేతివృత్తవ్యాప్తమై సహృదయుల కాస్వాద యోగ్యమగుచు అవిచ్ఛిన్నస్ఫూర్తిని కలిగి యుండునో అదియే ప్రధానరస మగును. తక్కిన రసములు కించిదితివృత్తానయవ వ్యాప్తములు మాత్రమే అగుచుండును. కావ్యమున పునఃపునరనుసంధీయమానమై, సమస్త ప్రబంధేతివృత్త వ్యాప్తమై, ప్రభాసించు రస మంగిరస మనుటలో నెట్టి శంకయు నవసరములేదు. సర్వప్రబంధ వ్యాపకేతివృత్త భూతమగు రసము అంగికాగా, అంశికేతి వృత్తవ్యాప్తమగు రసము దానికి అంగభూత మగును. కావున రసముల కంగాంగిభావము సముచితమే యగుచున్నది.[3]

---

2. నాట్యశా., అ.7, ః గుప్తభావ ప్రకాశిక, పు. 259ః
3. సాహిత్యదర్శనము, పు. 274

వీరి సాహిత్యదర్శనమున ఇంకను ఇట్లు గలదు -

'అంగరస చమత్కారము అంగిరస చమత్కారమున లీనమై ఆ అంగిని మరింత చమత్కారముగ చేయును.

ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారస నిబంధనే
ఏకోరసోఽంగీ కర్తవ్యస్తేషా ముత్కర్ష మిచ్ఛతా
రసాంతర సమావేశః ప్రస్తుతస్య రసస్యయః
నోప హస్త్యంగితాంసోఽస్య స్థాయిత్వే నావభాసినః

ప్రబంధములందు నానారస నిబంధనము ప్రసిద్ధమైన విషయము. ఆ రసముల కుత్కర్షను కోరు కవి, వానిలో నొక రసమును అంగిగా అంగీకరింపదగును. ప్రబంధ మందు ప్రధానమగుటచే ప్రస్తుతమును, పునఃపున రనుసంధీయమాన మగుటచే స్థాయియునై భాసమాన మగు రసము తన అంగిత్వమును రసాంతర సమావేశముచే విడువదు'.[4]

ఉదాత్త నాయకాశ్రితములైన శృంగారవీరములచే లోకకల్యాణకారకములైన సృష్టిస్థితులు కలుగుచున్నవి గాన వానినే కావ్యము అందు అంగిరసములుగా జేయవలెనని పలువు రాలంకారికుల ఆశయముగా తోచుచున్నది. ప్రకృష్టాస్వాద యోగ్యతను బట్టియును వాని కాస్థానము నిచ్చి యుండవచ్చును. కాని విశ్వనాథాదులు శాంతరసమునకు అట్టివానితో సమానస్థాన మిచ్చిరి. శాంతము కూడ ధర్మానుబంధము కలిగి లోకకల్యాణహేతు వగును కాన దీనిని కూడ అంగిరసముగా నంగీకరింప వచ్చును. శాంతరసమును కావ్యమున అంగిగా అంగీకరించుచు ప్రబోధ చంద్రోదయాదులు లక్ష్యములుగా నుదాహరించిన యాలంకారికులును గలరు. కావున శాంతమునకు శృంగారవీరముల వలె అంగిరస స్థానార్హత గలదు.

అద్భుతరసము శృంగారవీరాదులతో సంకరముగనే యుండును గాన దీనికి అంగిగ ప్రత్యేకస్థాన మీయనవసరము లేదు. కరుణమునకు హృదయ ద్రవీకరణ శక్తి అధికముగా కలదని, కరుణమును అంగిరసముగా కొందరు అంగీకరించి యున్నారు. రౌద్ర, బీభత్స, భయానక, హాస్యములకు లోకోత్తర నాయకాశ్రయత్వము అవసరము లేదని, వానికున్నంత ధర్మసంబంధము వీనికి లేదని, కావున శృంగార, వీర, శాంత, కరుణములకే కావ్యమున ప్రాధాన్యము స్వీకరింపబడినదని చెప్పవచ్చును. పూర్వాలంకారికులలో కొందరు శాంతమునకు వలె కరుణమునకు

4. సాహిత్య దర్శనము. పు. 276

ఉత్తరరామచరిత్రమును ఉదాహరణముగ చూపుదురు. కరుణమును అంగీకరింపనివారు ఈ కావ్యము నందలి రసము కరుణవిప్రలంభమే కాని, కరుణము కాదని, కావున కరుణరసప్రాధాన్యత నంగీకరింప వలసిన యావశ్యకతలేదని అందురు. ఎవరి అభిప్రాయము లెట్లున్నను, మానవజీవిత రంగమున దానికి గల స్థానము ననుసరించి, హృదయద్రవీకరణశక్తి విషయము ననుసరించి శృంగార, వీర, శాంతములతో పాటు కరుణమునకు కూడ కావ్యమున అంగిరస స్థానము నీయవచ్చునని, దీని నంగిగా నంగీకరించుటలో నెట్టి దోషమును లేదని అనిపించుచున్నది.

## భారతము – అంగిరసము :

పదునెనిమిది పర్వముల విస్తృతి గలది మహాభారతము. అందు తిక్కనార్యునిది పదునైదు పర్వములు; అవియును చరమ పర్వములు. కనుక మొత్తము భారతము నందలి అంగిరసమును తిక్కన భారతభాగము నందలి అంగి రసమును ఒక్కటే యనుట సమంజసము. వాస్తవమునకు ఏపర్వమునకు ఆపర్వమున గాని, ఏభాగమున కాభాగమున కాని అంగిరసమును నిర్ణయించుట అలంకారికపద్ధతికి విరుద్ధము.

భారతము నందలి అంగిరసము ఏది? అను ప్రశ్నకు సమాధానమును చెప్పుటకు ముందుగను, అంగిరస స్థాపనముచేయు సందర్భమునను ఇతిహాసము నందలి రసస్థితి ఎట్టిదో చూడవలసి యున్నది.[5]

మహాభారతము ఇతిహాసము. కావుననే ఇతిహాసము నందలి రసస్థితిని చూడవలసిన యావశ్యకత కలిగినది. ఇట రస మనగా నంగిరసము. ఇతి హాసము పురాణము వలె కేవలము విషయప్రధానముగాకయు, కావ్యము వలె కేవలము రస ప్రదానముగాకయు నుండును,సరస్వతీకంఠాభరణకర్తశాస్త్రేతిహాస కావ్యేతిహాస విభేదములను పేర్కొనెను. ఇతిహాసమునకు స్వతస్సిద్ధముగా గల మిశ్రస్వభావము వలననే ఇట్టి విశ్లేషణనకు తావు ఏర్పడినది. అలంకారికులు పేరు పెట్టి చెప్పకపోయినను రామాయణము నందలి కావ్యత్వప్రాధాన్యమును బట్టి దానిని కావ్యేతిహసముగను, బారతము నందలి శాస్త్రత్వప్రాధాన్యమునుబట్టి దానిని శాస్త్రేతిహాసముగను అనేకులు చెప్పుచున్నారు. కనుక భారతము ప్రధానముగా శాస్త్రవిషయసంభరితము. దాని యందు రసనైరంతర్యమును సంపాదించుట క్లిష్టము. అట నిది సాంద్రముగా నుండదు. కాని ఆమూల చూడావ గాహమున నందలి ప్రధానరసమును గుర్తింపగలము. అంగిరసమును క్రమ్మివేయునట్టి పద్ధతిలో గాకుండ ప్రాసంగికేతివృత్తము లందలి రసమును నిర్వహించుట 'ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య' వంటిది. కనుక కవి బహు జాగరుకుడై యుండవలెను.

భారతము నందలి అంగిరస విషయమును గూర్చి చెప్పు సందర్భమున 'శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని' అని యానందవర్ధనుడు చెప్పియున్నాడు. ఇట మరియొక్క విషయము విచారింపవలసి యున్నది. 'మోక్షలక్షణ ఏకైక పరః

---

5. ఇతిహాస స్వరూప వివేచనము ఇతిహాస భేదములు, ఇతిహాసము నందలి రసస్థితి ఇత్యాది ప్రకరణ విభాగము చేసి విపులమగు చర్చ గావించినారు. ఆచార్య చేతవరపు వారు - తిక్కన కావ్య శిల్పము, పుటలు 115 – 45

పురుషార్థః శాస్త్రనయే కావ్య నయే చ తృష్ణాక్షయ సుఖపరిపోష లక్షణః శాంతోరసః మహాభారతస్య అంగిత్వేన వివక్షిత ఇతి సుప్రతిపాదితః[6]

పురుషార్థములలో మోక్షమే అన్నింటికన్న మిన్నయైనది. శాస్త్రము వలనగాని, కావ్యము వలన గాని, తృష్ణాక్షయ మేర్పడి దాని వలన ఆనందము కలుగవలెను. ఆ రెండింటి వలనను భారతమున తృష్ణాక్షయ మేర్పడి శాంతము భాసించినది. కనుక భారతమున అంగిరసము శాంతము అగుచున్నది. ఆనంద వర్ధనాదుల వాదధోరణి యిది. కాని కొందరు భారతము ధర్మవీరము ప్రధానముగా గలది అను వాదమును లేవదీసిరి. ఈ రెండు వాదములను సమ్యక్ పరిశీలనము చేసిన పిదపగాని భారతము నందలి అంగిరస నిర్ణయము చేయుట కుదురదు.

భారతము నందు శాంతము ప్రధానమనుటకు ఆధారమేది? అను ప్రశ్నకు సమాధానము ధ్వన్యాలోకముననే విస్తరించి చెప్పబడి యున్నది.

'మహాభారతేఽపి శాస్త్రకావ్యరూపచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ విరసావసాన వైమనస్య దాయినీం సమాప్తిం ఉపనిబధ్నతా, మహామునినా వైరాగ్య జనక తాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచితః। ఏతిచ్చాంశేన వివృత మన్యైః వ్యాఖ్యా విధాయిభిః । స్వయమేవ చైతదుద్గీర్ణం తేనో దీర్ణమహామోహమగ్నం ఉజ్జిహీర్షతా లోకమతి విమల జ్ఞాన లోకదాయినా లోకనాథేన యథా యథా విపర్యేతి లోకతంత్ర మసారవత్, తథా తథా విరాగోఽత్రజాయతే నాత్ర సంశయః ॥ ఇత్యాది బహుశః కథయతా । తతశ్చ శాంతోరసః రసాంతరైః మోక్షలక్షణః పురుషార్థః పురుషార్థాంతరైః తదుపసర్జనత్వేన అనుగమ్యమానః అంగిత్వేన వివక్షావిషయః ఇతి మహాభారత తాత్పర్యం సువ్యక్తమేవ అవభాసతేః . . . ,'[7]

ఆనందవర్ధనాచార్యుడు భారతము నందు ప్రధానరసము అనగా అంగిరసము శాంతమే యని నిర్ణయించిన తీరిది. దీని తాత్పర్యము – మహాభారతము శాస్త్ర, కావ్యచ్ఛాయలు రెండును గలది. ఇది యాదవ పాండవు లిద్దరి యొక్క అవసానముతో సమాప్తమగు చున్నది. కనుక వైరాగ్యమును కలిగించుటకై వ్యాసభగవానుడు దీనిని రచించినాడు. తురీయపురుషార్థ ప్రతిపాదనమే దీని లక్ష్యము. శాంతము ఈ పురుషార్థమునకు ఆయువు పట్టు. తదితర పురుషార్థములు భారతమున ప్రసక్తములైనను,

6. ధ్వనిసారః, పు 64
7. ధ్వన్యాలోకము, చతుర్థఉద్యోతము ఃఉత్తరార్థముః

అవి తుదిదనుక నిలుచునవి గావు. కనుక శాంతమే భారతమున అంగిరసము అనునది స్పష్టము.

'యథా యథా విపర్యేతి లోకతంత్ర మసారవత్
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః'

అని భారతము ప్రతిపాదించు చున్నది. నశ్వరమైన లోకమును చూచిన తరువాత లౌకికవ్యాపారము లన్నియు నిస్సారములైనవే అని తెలిసియున్న నరుడు వీతరాగుడగు చున్నాడు. వీతరాగము మోక్షమునకు ఘంటాపథము. ఇట్టి ముముక్షయే భారతమున ప్రతిపాద్యమయినది.

ధర్మజుడు ఫలభాక్కు గనుకను, అతడే అధికారి గనుకను, కడదాక అతని చరితమే కొనసాగినది గనుకను, కొనదాక గడవక గతించిపోయిన కృష్ణార్జునులు భారతమున ప్రధానులుగారు గనుకను, ధర్మజుడే భారతబున నాయకుడని నిర్ణయించుట సమంజసము. నాయకుని కార్యకలాప మంతయు రసమును అభివ్యక్తము చేయును. నాయకుడగు ధర్మజుడు తొలుత వ్యసని. భారత కథ సభాపర్వముతోనే ముగిసినయెడల పాశ్చాత్య విషాదనాయక లక్షణములు ధర్మజునకు సంపూర్ణముగ వర్తించును. కాని మహాభారతయుద్ధము సంభవించినది. ధర్మజుని వీరము సౌప్తికపర్వము వరకును పరిపుష్టమయినది. స్త్రీపర్వము నుండియు ధర్మజుడు ముముక్షువు అయినాడు. కాని స్వర్గారోహణము వరకును అతడు సంపూర్ణముగ ముక్తుడు కాలేదు.

భారతము సభాపర్వముతోడనే ముగిసినయెడల భారతమున కరుణమే రసమనవలసి యుండును. అట్లుకాక యుద్ధపర్వములతో నంతమయిన యెడల వీరము భారతమున అంగిరస మనవలసి యుండును. స్వర్గారోహణ పర్వమునకు పూర్వము నాయకుని యందు స్వపర భేదములు పూర్తిగా నశింపలేదు. ఆకాశ గంగావ గాహనమున మాత్రమే అతడు సర్వ భౌతికవిషయ నిస్స్పృహుడయి వెలుగొందినాడు. అప్పుడే అతడు ముముక్షుస్థితి నుండి ముక్తస్థితికి చేరుకొనినాడు. నాటికి శమము సజాతీయ విజాతీయ భావములకు చెదరక స్వాద్యస్థితి నందుకొని శాంతమై పాలిచినది.

భారతమున ధర్మవీరమే ః ధర్మజుని వీరమే అన్నను అసమంజసము కాదుః అంగిరసము అను వాదమును ప్రధానముగ ఆధునికులలో ప్రతిపాదించినవారు డా॥. జి.వి. సుబ్రహ్మణ్యంగారు.[8] 'నయత్ర దుఃఖం, నసుఖం నచింతా, నద్వేషరాగౌ,

8. వీరరసము, పుటలు 192 – 3

నచకాచిదిచ్ఛా రసస్తుశాంతః' అను నాట్యశాస్త్ర లక్షణము ధర్మజునందు ఎచ్చటను కానరాదు అను వారి అభిప్రాయమును పరిశీలింపదగి యున్నది. రాజ్యసంపాదనాసక్తుడు, సోదరమరణ దుఃఖితుడునై చివరకు స్వర్గమున కూడ స్వపక్షవిపక్షములను గూర్చి రాగ ద్వేషములను ప్రకటించిన ధర్మజుడు శాంతమునకు ఆలంబము కాలేదని వారి వాదము నందలి ప్రధానాంశము. కాని ఈ వాదమంతయు ధర్మజుడు ఆకాశనదీ పావనసలిలముల మునిగి, భవ్యస్నానమంగళ మాచరించి మానుష తనువు నమ్మాత్రోన విడిచి, దివ్యంబగు మహిత దేహమును దాల్చి -

'వైర మత్సర స్నేహ సంవాస లౌల్య
గర్వ శోకాదులైన హృద్గత వికార
ముల దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు
పావకుడు బోలె శోభిల్లె . . . - స్వర్గారోహణ.,ప.52

ఈ స్థితి కలుగనంతవరకు డా॥ సుబ్రహ్మణ్యము గారు చెప్పినది సత్యమే. పార్థివదేహ మున్నంతవరకు ధర్మజుడు రాగద్వేషములకు పూర్తిగ అతీతుడు కాలేదు. కనుక అతని యందు శాంతము లేదని వారి ఆశయము. కాని డా॥ సుబ్రహ్మణ్యము గారు స్థాపింపదలచిన ధర్మవీరము అశ్వమేధము తర్వాత అడుగంటినదనియే స్థూలముగ చెప్పవచ్చును.

సారాంశమేమన ఆకాశగంగా స్నానమున ధర్మజునకు ప్రాప్తించినది. ముక్తత్వము. సహృదయుని యందు నెలకొన్నది శాంతము.

# 15వ ప్రకరణము

## రససాంకర్యము – తిక్కన భారతము

### రససాంకర్యము :

రెండు రసములు ఒకచో కలసి వచ్చిన అది రససాంకర్య మనబడును. ఈ రససాంకర్యమును గూర్చి రసార్ణసుధాకర కర్త సింగభూపాలుడు -

'కేచిత్సమాన బలయోరసయోః సంకరం విదుః' – రసికోల్లాసము, శ్లో. 251

సమానబలము కల రసములు రెండొకచో నున్నపుడు వానికి సంకర మగునని కొందరందురు అని చెప్పి దానిని మరల విమర్శించినాడు.

'సపరీక్షాక్షమ మిదం మతం ప్రేక్షావతాం భవేత్
తుల్యత్వే పూర్వ మాస్వాదః కతరస్యేత్య నిశ్చయాత్
స్పర్థా పరత్వా దుభయో రసాస్వాద ప్రసంగతః
తయో రన్యతరస్యైవ ప్రాయేణాస్వాద నాదపి
యుగప ద్రసనీయత్వం నోభయో రుపపద్యతే
ఏష అంగాంగి భావేన సంకరో మమ సమ్మతః'-రసికోల్లాసము, శ్లో.251-53

ఆలోచింపగా నిది ప్రేక్షకు లంగీకరింపని యుక్తిదూరమగు మతము. రెండును సమానము లగుచో నారెంటిలో తొలుత నేది ఆస్వాద్యమగునో నిశ్చయింపవీలుకాదు. నేనుముందు నేనుముందు అని ఆరెండును పోటీపడునపు డేదియు నాస్వాద్యము కాజాలదు. ఆరెంటిలో నొకటియే సామాన్యముగ నాస్వాద్య మగుచుండును. రెండు నొకేసారి ఎప్పుడును ఆస్వాద్యములు కాజాలవు. ఒకటి ప్రధానమై యింకొకటి దాని కంగమైనప్పుడు సంకర మగుట నాకును సమ్మతము'[1] అని చెప్పినాడు.

మరియు నీతడు ఒక్కచో రెండు రసములకు సమప్రాధాన్య ముండదని సందర్భానుసారముగ కవి అభిప్రాయ మొకదాని ముఖ్యత్వముననే గానబడుచుండునని చెప్పెను (శ్లో. 254).

1. రసార్ణవ సుధాకరము, బులుసు వారి వ్యాఖ్య, పు. 622, 623

'ఉభౌ శృంగార బీభత్సౌ ఉభౌ వీర భయానకౌ
రౌద్రాద్భుతా ఉభౌహాస్యకరుణౌ ప్రకృతిద్విషౌ
స్వభావ వైరిణో రంగాంగి భావేనాపి మిశ్రణమ్
వివేకిభ్యో నస్వదతే గంథగంథక యోరివ' - రసికోల్లాసము,
శ్లో. 255,256, పు.624

శృంగార బీభత్సములును, వీరభయానకములును, రౌద్రాద్భుతములును, హాస్యకరుణములును, పరస్పరము విరుద్ధములగు రసములు. ఇట్లు స్వభావముచే విరోధులగు రసములకు గంధగంధకములకు వలెనే అంగాంగి భావమున సాంకర్యమును వివేకులు సమ్మతింపరు అని పై శ్లోకముల భావము.

'విరోధినోఽపి సాన్నిధ్యా దతిరస్కార లక్షణమ్
పోషణం ప్రకృతస్యేతి చేదంగత్వం నతావతా
యత్కించి దుపకారిత్వా దంగస్యాంగత్వమంగిని
తత్సన్నిధాన మాత్రేణ చర్వణానుపకారతః' అనియు
'అన్యథా పానకాద్యేషు శర్కరాదే రివాపతేత్
అంతరా పతితస్యాపి తృణాదేరుపకారితా
తచ్చర్వణాభిమానే స్యాత్సతృణాభ్యవహారితా'
-రసికోల్లాసము, శ్లో " లు 257 - 60, పుటలు 624-26

అనియు చెప్పియున్నాడు.

విరోధములగు రసములు ఒండొంటితో ఎంతటి సాన్నిధ్యమును పొందినను వానిలో నొకటి మరియొకదానికి అంగముకాలేదు. అంగిరసప్రతీతి కుపకరించిననే, రెండవదానికి అంగత్వ మంగీకరింప వలెను. అట్లుగాక సాన్నిహిత్యము మాత్రమే అంగత్వమునకు లక్షణమయినచో, పానకమున పడియున్న గడ్డిపోచను గూడ పానకాంగముగ నంగీకరింప వలసిన దుస్థితి ఏర్పడును. అని పై శ్లోకముల భావము.

రసాభరణకర్త అగు అనంతామాత్యుడు 'మరి రస సంకరంబులు ఎట్టివనిన' అని ప్రారంభించి -

'రసములు రెండొకచోట బె
రసి వచ్చిన నివ్విధంబు రససంకరమై
యొసఁగును శృంగారముతోఁ
బొసఁగఁ రసము లిందుఁ దెల్లముగ రచియింతున్'[2]

2. రసాభరణము, 3వ ఆ., ప || లు 64, 65, పు. 28

అని రససాంకర్యమును గూర్చి తెలిపి శృంగార హాస్యములకును, శృంగార రౌద్రములకును, శృంగార కరుణములకును, శృంగార వీరములకును, శృంగార కరుణములకును, శృంగార భయానకములకును, శృంగారాద్భుతములకును, శృంగార శాంతములకును, రౌద్ర బీభత్సములకును గల సాంకర్యమును సోదాహరణముగ నిరూపించియున్నాడు.

వీని ననుసరించి రెండు రసములు ఒకదానితో నొకటి కలిసి యుండిన రససాంకర్యమగునని చెప్పవచ్చును. వీరశృంగారములు, శృంగారహాస్యములు, వీరాద్భుతములు, శృంగారద్భుతములు, వీరరౌద్రములు, భయానకబీభత్సములు పరస్పర విరోధరరహితములు. కావున వీనిని సంకరపరుప వచ్చును. కాని శృంగార బీభత్సములు, శృంగారకరుణములు, శృంగారశాంతములు, శాంత రౌద్రములు పరస్పర విరుద్ధ రసములు. ఇట్టి రస సాంకర్యమున అంగాంగిభావ మసంభవము. రసవిరోధము సాధారణముగ సామానాధికరణ్యము వహింపకుండుట వలనను, ఉన్మీల్య-ఉన్మీలకభావము వలనను అవి రెండు విధములుగా నుండును. ప్రథమ ప్రకారము విరుద్ధరసములకు ఎట్లో సాన్నిధ్యము సమకూర్పవచ్చునే గానీ, రెండవది అనగా ఉన్మీల్య-ఉన్మీలక భావవిరోధము మాత్రము పరిహరణీయము కాదు. 'అట్టి విరోధము గల రసముల కంగాంగిభావ మసంభవమే యగును. రతి యున్నచోట జుగుప్స జనింపనే జనింపదు. జుగుప్స గలచోట రతి యుండనేరదు. అట్లే భయోత్సాహము లొక్కచో నుండజాలవు. సర్వరాగనివృత్తిరూప మగు శమము. విషయేచ్ఛము జీవితముగా గలది రతి. ఈ రెండును పరస్పర విరుద్ధము లగుట స్పష్టమే. అనగా వీనిలో ఒకదాని నున్మీలింపక, ఇంకొకటి జనింపనేరదని భావము. ఈ రసములకు అంగాంగిభావ మసంభవము'[3] అని ఆచార్య నరసింహం గారు చెప్పి, మరియు ఇట్లు శంకింప బనిలేదని, ఈ విరోధమును పరిహరించు మార్గములను కూడ పేర్కొనియున్నారు.

విరుద్ధరసములకే కాశ్రయత్వము కల్పించిన అది సామానాధికరణ్యము లేదా స్థితి విరోధ మగును. ఇట్టి విరుద్ధ భావములు ఒక్కకాలముననే ఒకే వ్యక్తి యందుండుట అసంభావ్యము. వీనిని భిన్నాశ్రయములుగ వర్ణించినను, లేదా రసాంతరముచే వ్యవధానమును కల్పించినను ఈ దోషము పరిహరింప బడును. ఉదాహరణమునకు శాంత శృంగారముల నడుమ అద్భుతమును జొప్పించుట.

---

3. సాహిత్యదర్శనము, పు. 277

శృంగార బీభత్సముల నడుమ వీరమును సమకూర్చుట. అనగా రెండు విరుద్ధరసములు స్ఫురించు లోపల ఆ విరుద్ధరసములకు అవిరుద్ధమగు మరొక రసమును స్ఫురించునట్లు వర్ణించినచో నైరంతర్యము అనెడి రసవిరోధము తొలగును. అంగాంగిభావ మున్నయెడల దోషమే లేదు. అట్టియెడ రెండురసముల సాంకర్యము సముచితమే. కావ్యప్రకాశికాకారు ననుసరించి విరుద్ధరసమయినను స్మర్యమాణముగ నిబద్ధమయినచో దోషము లేదు. విరుద్ధరసములు సామ్యముచే వివక్షితము లయినను దోషము లేదు. మరియొక ప్రధాన రసమునకు అంగముగా వర్ణించినను దోషము కాజాలదు.

'స్మర్యమాణో విరుద్ధోఽపి సామ్యే నాథ వివక్షితః
అంగిన్యంగత్వ మాప్తౌ యౌ తౌర్యనదుష్టౌ పరస్పరమ్'[4]

అని కావ్యప్రకాశిక. 'వినేయులను సుముఖులుగా జేసికొనుటకును, కావ్యశోభను కలిగించుటకును చేయబడిన విరుద్ధరస సమావేశము దుష్టము కాదు. వినేయు లనగా శిక్షణీయులు. సుకుమార మతులగు రాజకుమారాదులు,'[5] అని సాహిత్యదర్శనము.

సాహిత్యదర్పణము ననుసరించి శృంగారమునకు కరుణ బీభత్స రౌద్ర వీర భయానకములు, హాస్యమునకు భయానక కరుణములు, కరుణమునకు హాస్యశృంగారములు, రౌద్రమునకు హాస్య శృంగార భయానకములు, వీరమునకు భయానక శాంతములు, భయానకమునకు శృంగార వీర రౌద్ర హాస్య శాంతములు, శాంతమునకు వీర శృంగార రౌద్ర హాస్య భయానకములు, బీభత్సమునకు శృంగారము - విరోధిరసములు.[6] ఈతని మతమున మాత్రమే శృంగారమునకు వీరము విరోధముగ చెప్పబడినది.

మొత్తము మీద రెండు రసములను ఒకదానితో నొకదానిని సమకూర్చిన అది రససాంకర్య మగునని, అవి రెండును పోషకరసములే అయినచో దోషములేదని, అవి పరస్పర విరుద్ధరసము లయిన విరోధపరిహార్యములేక సంకర పరుపరాదనియు తేటతెల్లమగుచున్నది. కావ్యాలంకార సంగ్రహమున 'నవరస సంకరము' చెప్పబడినది. కాని ఇట్టి నవరస సంకరము నేయాలంకారికుడును ఉదాహరింపలేదని సన్నిధానము వారు వ్యాఖ్యానించిరి.[7]

---

4. కావ్యప్రకాశిక సప్తమోల్లాసము, 7-65
5. సాహిత్యదర్శనము, పు. 262
6. సాహిత్యదర్పణము, 3-254-57
7. కావ్యాలంకార సంగ్రహము, పు. 427

## భారతము – రససాంకర్యము :

తిక్కనామాత్యుని భారతభాగమున రససాంకర్యము గల తావులు ఏ ఒకటి రెండు మాత్రమో కాననగును.

వీరరసమునకు శృంగారము కొందరి మతము ననుసరించి విరోధము. యుద్ధరంగమున వర్ణించుపట్ల ఈ శృంగారమును వీరముతో సంకరము చేయక రసవదలంకారముగ వాడినట్లు ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రి గారు తమ సిద్ధాంతవ్యాసములో చెప్పియున్నారు.[8] వీరు చూపిన ఒక ఉదాహరణము – సైంధవ వధానంతరము ఆరాత్రి కొంతవరకు యుద్ధము కొనసాగింపబడినది. చంద్రోదయ మగువరకు అర్జునుని హెచ్చరికను పురస్కరించుకొని ఉభయ సైన్యములు యుద్ధము నుండి విరమించి కొంతసేపు విశ్రమించిరి. ఈ సందర్భమును తిక్కన గారు –

'తరుణులు కుచములపై రతి
పరవశులై యొఱగు పతుల పగిది సమర సం
భరిత శ్రమమున నిద్రిం
చిరి కరికుంభముల చెంది చెన్నుగ జోదుల్' – ద్రోణ., 5-273

అని వర్ణించియున్నారు. ఏనుగు కుంభస్థలమును తరుణీ కుచసీమతో పోల్చుట కవి సమయము. ఇట అలంకారము ఉపమానము. ఉపమాన ఉపమేయములలో ఉపమేయమే ప్రధానమై ఉపమానముచే దీప్తిమంతము కావలయును. ఈ పద్యమున వట్టి శృంగారము కాక సంభోగశృంగారము కలదు. ఇది యుద్ధ రసములకు విరోధి. మనకు ఇట రససాంకర్యము కలదేమో యనిపించును. కాని ఇట రసవదలంకారముగ అనగా యుద్ధరసభావముల కలంకారముగ వాడబడినట్లు చెప్పికొన వచ్చును. విభావానుభావ సామగ్రి సమగ్రమైన సంభోగశృంగారము రసవదలంకారముగ ప్రవేశపెట్టబడినదని చెప్పి, అర్థాలంకార రసవదలంకారములకు గల భేదమును కూడ కేతవరపు వారు వివరించియున్నారు. ఇట్లు యుద్ధరసములను వర్ణించుపట్ల దానికి విరుద్ధమగు రసమును ప్రవేశపెట్టి ఆయా ప్రకరణము లందు ప్రతీయమానములగు యుద్ధరసముల అతిశయస్ఫూర్తిని అరికట్టి అంగిరస పోషణమునకు భంగము కలుగనిరీతిలో రచన చేయగల సమర్థుడు తిక్కన. ఇది ప్రత్యేకముగ రససాంకర్యము గాకున్నను ఒక రసమునకు అతిశయము కలుగనిరీతిలో వేరొక విరోధిరసము అలంకారముగ వాడబడుటచే నిది ఈ ప్రకరణమున చెప్పుట జరిగినది.

---

8. తిక్కన కావ్య శిల్పము, పుటలు 273-75

భీమసేనుని కీచకవధ, దుశ్శాసనవధ సందర్భము అందు బీభత్స భయానకములు రెండును స్ఫురించును. అవి ఆయా ప్రకరణములలో వివరింపబడినవి.

దుశ్శాసనుని వధ ముగిసిన తరువాత గద సేతంగొని, అంత్యకాల యమరేఖంబేర్చి రక్తంబు చాయతలిర్ప, ఉన్మదమాతంగములీల దోప, వికటస్ఫూర్తి స్ఫురన్మూర్తియైన భీమసేనుడు చలంబు నెఱయ నతని కాలు గేలనమర్చి మొగంబు గనుగొనుచు –

'ఏమిర పసులని యార్తువు
నీ మాటలు నిలువఁబడియె నేపసరమ మి
మ్మేమ్మ మగుడ నిది యార్చెద
మీ మాటకు మాఱుపల్క రెవ్వరుఁగంటే'

'నెట్టన యగ్గినందగునె నీళ్ళను ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగ భీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం జెలులు జూడ సభన్ నెఱిమాలి యమ్మెయి
దిట్టునకోర్చు టెందుగలదే నినుగెల్వరె జూదమెవ్వరున్'[9]

అని పలికి మరల కౌరవుల మీదికి బోయి, మరల దుశ్శాసనుని యొద్దకు వచ్చి–

'పైపడిపోయెగాక ధృతరాష్ట్రుడు గన్నదియేమి యా సభం
దావలదన్న గీడుడు గదా . . . . . . . . .' కర్ణ., 3-324

మున్నగు రీతిని మాటలాడినాడు. ఇట్లు చనిపోయిన వానియొద్దకు రెండు పర్యాయము లటుపోయి, ఇటువచ్చి, వాని నుద్దేశించి మాటలాడినట్లు తిక్కనగారు వ్రాయుటచే సహృదయుని పెదవులపై దరహాసము మెరవక మానదు. ఇట హాస్యస్ఫూర్తి యున్నది. రౌద్ర బీభత్స రసముల నుండి సహృదయుని బుద్ధి తొలగింపబడుట కిట్లు ఆది సభాపర్వము లందలి విషయములు ప్రవేశపెట్టబడినవి. ఇట రౌద్రముతో తద్విరుద్ధరసమగు హాస్యము కొంత సంకరము చెందినదేమో యనిపించును.

ఇట్లే యుద్ధభూమి యందు వీర ప్రతివీరుల సోల్లుంఠనవాక్యముల వలన వీరహాస్యముల సాంకర్య మేర్పడుచున్నది. అట్టి తావు లెన్నియేని తిక్కన గారి భారత రచనలో గలవు. ఉదాహరణమునకు 'అడుకులు దిన్నట్లగునే . . . (ద్రోణ., 4-89) అను దానిని పేర్కొనవచ్చును. 'తిండిపోత నీకు భండనంబేటికి . . . '

---

9. కర్ణ. , ఆ. 3, ప॥ లు 221-22

(ద్రోణ. , 4-239). ఇట్టివే మరికొన్నియును గలవు. ఇట్టిచోట్ల అంగాంగీ భావము సముచితముగా సమకూరుచున్నది.

తిక్కన గారి యుద్ధపంచకమున పలుచోట్ల - 'రౌద్ర బీభత్స కరుణ భయానకమై' (ద్రోణ. , 1-279), 'రౌద్ర బీభత్స భంగి' (ద్రోణ., 1-386), 'అద్భుతము బీభత్సము నావహింప' (కర్ణ. , 1-177), 'అద్భుతంబునకు, భయానకంబునకు బీభత్సమునకు నన్నేల నెలవగునట్లు . . .' సౌప్తిక. , 1-177) అనురీతిని వర్ణనలు కాననగును. ఒకే సందర్భమున మూడు లేక నాలుగు రసములు స్ఫురించునట్లు వర్ణనము చేసియుండుటచే ఇట సాంకర్యము కలదనియే చెప్పనొప్పును. కనుక ఏ యొక్క రసమునకు సంపూర్ణస్ఫురణ లేదు అనవలెను.+ ( కాని వానిలో నేయొక్కటైనను విభావాది సామగ్రీ పుష్కలము అయినచో అది ఆ రస ప్రకరణమున ఉదాహరణముగా చూపబడినది)

స్త్రీపర్వమున భూరిశ్రవసుని తల్లి తన భర్తకొరకు, సుతుని కొరకు దుఃఖించుచున్న ఘట్టము --

తన కోడండ్రను చూచి -
'వీరేవు రొంటిచీరలుఁ
దారును విరిదలలతోడ దద్దయు నడలుం
గూరి పలవించెదరు . . .' - స్త్రీపర్వ. , 2-128

అని పనవుచున్నది. అతని భార్యలలో అతి రమ్యమూర్తి యొకర్తె అర్జునునిచే నరుకబడిన కరమును తన యుత్సంగమున నిడుకొని -

'మెలుపారగాఁ బట్టి మొలనూలి మణులు గ
దల్చుచుఁ దిగుచుచుఁ దగులొనర్చుఁ
జనుగవమీఁది కల్లనవచ్చి లలిత వి
మర్దనంబున లజ్జ మరలఁదోచు
నాభియూరులు జఘనము మెత్తమెత్తన
యొత్తి ముదంబున నుల్లమూన్చు
నవయంబుఁ దిన్నని యనువున గనయంబు
ప్రిదులంగ మెలఁగి చొక్కాదవఁ జేయు

---

\+ దీనికి కారణము అధ్యాయాంతమున వివరింప బడినది.

నిక్కరంబు నెయ్య మెక్కింపనేరంగ
దగిలి సంతతంబుఁ దలఁచునట్టి
భంగి మెఱయఁ గీడు పఱుపంగఁ గొనియాడ
వలఁతి నీఱుసేయవలసె దీని'[10]

అని తన పూర్వ శృంగారానుభావములను స్మరించుచు విలపించుచున్నది. ఈ ఘట్టమున శృంగార కరుణరస సాంకర్యము గలదు. ఇందు కరుణము అంగి, శృంగారము అంగము. శృంగార, కరుణములు పరస్పరము విరుద్ధములైనను ఇట అంగాంగి భావనిరూపణమున సంకరము చేయబడినవి. విరుద్ధరసమే అయ్యును, శృంగార మిట కరుణమునకు పోషకమైనది.[11]

డా || రంగారావు గారు తమ సిద్ధాంత వ్యాసమున శృంగార కరుణములకు సమావేశము జరిగినది. అని కీచకుని శృంగార ఘట్టమును ఉదాహరణముగ చూపిరి. వీరు రాగరసపూర నిమగ్నుడయిన కీచకుని స్థితిని, ద్రౌపది స్థితిని వివరించుచు 'ద్రౌపది మహావిపత్తుగా భావించుచున్నది. కీచకుడు మహానందముగ చూచు చున్నాడు.' అని 'వెఱవక ననుజూచి వీడని యెదఁగలుషించిన నొండొండ చెమట వొడమ . . . ' (విరాట., 2-33) అను పద్యమును ఉదాహరణముగ చూపి ఇక్కడ కరుణ శృంగారములకు సమావేశము జరిగినదని చెప్పిరి. కరుణమునకు ద్రౌపదియు, శృంగారమునకు కీచకుడును ఆలంబన విభావములట. మరియు వీరు 'ఈ రెండును విరుద్ధరసములే. కాని శృంగారము నుండి హాస్యము, రౌద్రమునుండి కరుణము పుట్టునని యాలంకారికమతము. ఇక్కడ తద్విరుద్ధముగా శృంగారము నుండి కరుణము పుట్టుచున్నది. ఇదియొక విచిత్రమైన రస సమావేశము. ఇచ్చట కరుణము మొదట భయస్వరూపముతో ప్రారంభమయి, కరుణముగా మారి, వీరముగ పరిణమింపబోవు చున్నది. శృంగారము మాత్రము రసాభాసమే'[12] అని చెప్పియున్నారు.

---

10. స్త్రీ పర్వ., 2-133
11. విప్రలంభశృంగారమునకును, కరుణ (విప్రలంభము) నకును గల భేదము నిట అనుసంధించు కొనునది.
12. Conception and Practice of Poetry of Kavitrayam & Nachana Somana

ఈ రీతిగా తిక్కన గారు ఒకటి రెండు చోట్ల రససాంకర్యమును చేసిరి. దీనికి కారణ మిట్లూహింపవచ్చును. భారతమున అంగిరసమును శాంతము. కాని వీరాదులును విపులముగానే యున్నవి. ఈ అంగరసములు అధికముగా ప్రతీయమానములు కాకుండుటకు రససాంకర్యము పాటింపబడినది.

# 16వ ప్రకరణము

## ఉపసంహారము

తిక్కన వ్యక్తిత్వమును - సామర్థ్యమును, సౌజన్యమును - నిర్ణయించుటకు ఆయన రచనలు, ఆయనను గురించి ఇతరులు చేసిన ప్రశంసలును ప్రధానాధారములు. తిక్కన తన సామర్థ్యమును గూర్చి తానే చెప్పికొన్నది --

'అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిబాటించు శి
ల్పమునం బారగుడం గళావిదుఁడ నాపస్తంబసూత్రుండ గౌ
తమ గోత్రుండ మహేశ్వరాంఘ్రి కమలధ్యానైకశీలుండ న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁ దిక్కాఖ్యుండ సన్మాన్యుఁడన్'
- ఉ. రా. , 1-16

అను పద్యము. ఉత్తరరామాయణము రచన నాటికి తిక్కన మోమాటమిలేక ఆత్మ విశ్వాసముతో తన గుణములను ఏకరువు పెట్టినాడు. అతడు పేర్కొనిన విషయము లన్నియు ప్రత్యక్షరసత్యములని కావ్యానుశీలనము వలన సుస్పష్ట మగును. ఉత్తరరామాయణ రచానా కాలమునాటికి తిక్కన ఆంధ్రలోకమున నున్నట్టి పలువురు కవుల వలెనే సత్యమునైనను రజోగుణప్రధానముగ చెప్పికొనెను. కాని భారత రచన నాటికి పరిపక్వస్థితి నంది 'నానేర్చిన భంగి చెప్పి వరణీయుఁడనయ్యెద భక్తకోటికిన్' (విరా. , 1-28) అని వినమ్రుడై హరిహరనాథునకు నివేదించుకొనినాడు. ఉత్తర రామాయణ రచన కాలమునాడు మహేశ్వరాంఘ్రికమలధ్యానైక శీలు డయినను 'విష్ణు రూపాయ నమశ్శివాయ' అని హృత్సరోవరమున హరిహరుని పాదసరోజ ద్వయమును ప్రతిష్ఠించుకొనినాడు; కుండలీంద్రుడై మహాభారత రచనాభారమును తలనిడుకొనినాడు. పదునైదు పర్వములు అనర్ఘముగ తీర్చిదిద్ది 'హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్' అని భగవత్కృపాకటాక్షమును మాత్రమే అర్థించిన పరమయోగిగా తిక్కన భాసించినాడు.

ఈ మహామహుని గూర్చి కవులును, పండితులును వేనోళ్ల కొనియాడిరి. తిక్కన సామర్థ్యముతో పాటు సౌజన్యమును అతని కావ్యముల ప్రతిభాసించినను,

సౌజన్యము కంటె సామర్థ్యమే తదర్వాచీన కవులకు పొడగట్టుట కవకాశ మెక్కువ కలదు. కాని సమకాలికులైన వారికి తిక్కన సామర్థ్యముతో పాటు సౌజన్యమును అనుభవములోనికి వచ్చుటకు అవకాశము కలదు. తిక్కన సమకాలికులలో కేతన ప్రధానుడు. అతడు తన ఉపాధ్యాయుడగు తిక్కనను గూర్చి – 'వేదాది సమస్త విద్యాభ్యాస విభాసి ః 1-87ః, బహు కళాసంపన్నుడు ః1-89ః, సకల విద్యా కళాచణుడు ః 1-88ః. తెనుగున సంస్కృతమున చతురుడు ః 1-91ః, విద్యావైశారద్య సముద్యోతితమతి ః1-98ః, సకలాగమార్థ తత్త్వ విచారోదారుడు ః2-119ః, అనితర గమ్యవాఙ్మయ మహార్ణవ వర్తన కర్ణధారుడు ః8-194ః, విద్యా నిధానము ః10-192ః, మయూర సన్నిభ మహాకవిది ః1-6ః, సారకవితా నిర్మాణ చాతుర్యుడు ః7-164ః, కావ్య కళాజని భూమి ః5-134ః, భారవికల్పుడు ః9-85ః, ఆర్యభోజుడు ః2-20ః అని చెప్పియున్నాడు. ఇంతటి విద్యాంసుడు కావుననే కవులకు మిత్రులై కవిజన రాజ కీర సహకారము ః1-8!, సుకవీంద్ర బృందరక్షకుడు ః1-88ః, కవిసరోజ మార్తాండుడు ః1-99ః, కవీంద్ర లోకాధారుడు ః2-119ః, పోషిత సత్కవీంద్రుడు ః4-128ః, కవిలోక చాతక వ్రజ నవ జలద స్తనిత భాషణ ప్రకరుడు ః98-85ఫ', అయినాడని కేతనచే పేర్కొనబడినాడు.

కవిజన రాజకీర సహకారము, సుకవీంద్ర బృందారక రక్షకుడు, కవిసరోజ మార్తాండుడు, కవీంద్రలోకాధారుడు, పోషిత సత్కవీంద్రుడు, కవిలోక చాతక వ్రజ నవజలద స్తనిత భాషణ ప్రకరణుడు మున్నగునవన్నియు తిక్కన కేవలము కవి మాత్రమే కాక కవిజనాశ్రయు డనియు భావించుటకు ఆధారము లగుచున్నవి. విరాటము మొదలు స్వర్గారోహణము వరకును తిక్కన విరాట్ స్వరూపము ప్రతి పదమున సాక్షాత్కరించును. కేతన తన ఉపాధ్యాయు నందలి గౌరవాతిశయముచే అతని వ్యక్తిత్వమును గూర్చి అతిశయోక్తులు పలుకలేదని భారతమును పరిశీలించిన సుస్పష్టమగుచున్నది.

నన్నయ తిక్కనలతో సరి గద్దెనున్న ఎఱ్ఱన తిక్కనను గూర్చి 'తన కావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నాన్' ః హరివంశము, పూర్వభాగము, ప.5,పు. 1ః అని ప్రశంసించుట వలన తిక్కనది అనుకరణీయ కవితాసృష్టి అని విదిత మగుచున్నది. కవిసార్వభౌముడైన శ్రీనాథుని కాశీఖండమున 'వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసాభ్యుచితబంధముగ నాకొక్క మాటు'ః పీఠిక, ప. 13ః అని తిక్కన ప్రశంస

యుండుటచే భారతమును తిక్కన రసప్లావితము కావించినాడు అని సహృదయులు భావింతురు.

ఆధునికులలో విశ్వనాథవారు మొదలు శ్రీ శ్రీ వరకు గల వివిధ కవులు – వేరు వేరు రంగులలో తిక్కనను మనసార మెచ్చుకొనినవారే.

ప్రత్యేకముగ తిక్కన కవితను బహుదృక్కోణముల పరిశీలించి బృహద్గ్రంథములు వెలయించిన కవి పండిత విమర్శకులలో వేదం వేంకటరాయశాస్త్రి గారు, చిలుకూరి వీరభద్రరావు గారు, ఆచార్య భూపతి లక్ష్మీనారాయణ రావు గారు, ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రి గారు, ఆచార్య కోరాడ రామకృష్ణయ్య గారు, ఆచార్య యస్వీ జోగారావు గారు, డా॥ నండూరి రాయకృష్ణమాచార్యులు గారు, కాశూరి వ్యాసమూర్తి గారు, వజ్ఝ సూర్యనారాయణ గారు – మున్నగు వారెందరో గలరు. ఇందరు ప్రత్యేకముగ కృషిసల్పినను ఇది అంతయు దినపతికి దివ్వె ఎత్తుటయే అగును. అట్టి ఎడ 'మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి క్రమ్మ రాయంచలు కూయ, క్రౌంచమును నావల కూయకడంగు భంగి' ఈ సిద్ధాంతవ్యాస రచయిత్రి తిక్కనను ప్రత్యేకముగ కొనియాడుట ఒక దృష్టితో చూచిన అసంమజసమే యగును. కాని ఆ పూర్ణ పురుషుని యెడ భక్తితాత్పర్యములను వెలయించి ఉభయ కవిమిత్రుని సహస్రకిరణములలో ఒక్క రసకిరణమును మాత్రము సహృదయ పద్మకోరకములకు సోకించుటయే ఈ సిద్ధాంతవ్యాస రచయిత్రి సదాశయము.

# అనుబంధము – 1

## : 3. ఉ. రసదోషములకు :

తిక్కన వాచ్యము చేసిన రససందర్భములు --

**విరాటపర్వము :**

కరుణారసము వొంగి . . . :1-12:

దరహాసరసము . . . :1-14:

సద్భావాశ్రయములు దజ్జన్య రసాశ్రయములు . . . :1-241:

రాగరస మగ్నుడయ్యె . . . :2-63:

రాగరసమున గడలుకొనియె . . . :2-83:

భయరస వేగంబు పైకొని . . . :2-106:

కోపరసంబు పేర్మి చెటిచి . . . :2-137:

దయారసాను గతమాశుంభత్క్రియా . . . :2-209:

అంతరంగమున నిండిన హాస్యరసము . . . :3-37:

సల్లాపరసము ననుభవించు . . . :3-42:

రౌద్రరస మాకృతుల దాల్చి . . . :3-167:

వీరరసమయాత్మకు డగుచు . . . :5-3:

రౌద్రరస మహెూగ్రముగ . . . :5-56:

భయరసము వట్టు పెట్టున . . . :5-78:

రౌద్రరస వినోదియైన . . . :5-154:

రౌద్రరసము మనమున నడరగ . . . :5-259:

**ఉద్యోగ పర్వము:**

రౌద్రరస ముప్పొంగ . . . :2-188:

అద్భుత భయానక రసంబుల . . . :3-405:

మనమ్ము లాశ్చర్యరస నిమగ్నంబులు గాన్ . . . :3-410:

**భీష్మపర్వము :**

అనుమోద రసార్ద్రహృదయుడై . . . : 1-4:
వీరరసాంబు పూరయును . . . : 1-54:
భక్తిరసైకస్వాదన సుకరానంద . . . : 1-69:
వీరరస సంపూర్ణాంగమున్ . . . : 1-117:
రౌద్రరసంబు లోకసామాన్యముగాగ . . . : 1-261:
వీరరసోద్ధతి చూచి . . . : 2-228:
రౌద్రరసావేశంబొప్ప... . : 2-383:
రౌద్రరస మహోగ్రాకృతులై . . . : 3-87:

**ద్రోణపర్వము :**

క్రోధరసంబుగ్రముగాక యుండి . . . : 1-160:
అట్టియెడ వీరరస స్ఫురణంబునన్ . . . : 1-310:
రౌద్రరసోల్లసిత మూర్తియై . . . : 2-18:
కోపరస వేగమున . . . : 2-319:
రౌద్రరసము పొడవేర్పఱతున్ . . . : 2-352:
తమ చిత్తంబులు భక్తిరసంబున జొత్తిల్లుచుండు . . . : 2-363:
రౌద్రరసంబున దళుకొత్త . . . : 3-142:
రౌద్రరసంబు నలంకరింప . . . : 3-225:
మహోద్భుత రసమున మునిగె . . . : 4-331:
భక్తిరసాయత్తంబగు చిత్తంబునం . . . : 4-428:

**కర్ణపర్వము:**

రౌద్రరసంబు బెనిచె . . . : 1-74:
రౌద్రరసంబునం . . . : 2-343:

**శల్యపర్వము:**

రౌద్రరసము తొలుకాడంగన్ . . . : 1-336:
అద్భుతరస మగ్నులగుచున్న . . . : 2-338:

**స్త్రీ పర్వము :**

కామరసంబులు మధుసంచయనం . . . : 1-52:

**శాంతి పర్వము :**

కామరస సంబంధమున . . . : 3-459:

భక్తిరసైక పరాయణుండు . . . : 4-257:

ఆత్మానంద రసంబొక కణమైన . . . : 6-121:

కృపారసము . . . : 6-300:

**అనుశాసనికము :**

మనము లద్భుత రసమున మునుగుచుండ . . . : 2-320:

జనకుని మన మానందరసపూరము యతిం బొంగన్ . . . : 2-462:

అతని కృపారసమూని . . . : 3-316:

కామరసంబున సతితృష్ణుడై . . . : 5-235:

**అశ్వమేధ పర్వము :**

కరుణవడసి భక్తిరసము వొంగార...., . : 2-43:

సర్వజ్ఞుడు ప్రీతుడగు శాంతరస మొప్పుజూమీ . . . : 2-80:

అందరు నానందరసమున దేలి . . . : 4-157:

**ఆశ్రమవాస పర్వము :**

అందరు నద్భుతరసమున మునిగిరి. . . : 2-64:

జనుల నద్భుతరసమున మునుగజేసె . . . : 2-126:

**మౌసలపర్వము :**

అద్భుత రసంబున . . . : 178:

అమృతరస, సుధారస, ఆదరరస, ఆనందరస, అనుమోదరస – ఇత్యాది ప్రయోగములు నవరసార్థవిశేషములు కావు. సౌఖ్యరస, రాగరస, కామరస, కోపరస, క్రోధరస, ఆశ్చర్యరస – ఇత్యాదులను నవరసార్థవిశేషమున గ్రహించి యుండనోపు

# ఉపజీవ్య గ్రంథసూచిక

## సంస్కృత గ్రంథములు :

అభినవభారతి - లోచనము - అభినవగుప్తుడు

అలంకారసంగ్రహము - అమృతానందయోగి

కావ్యప్రకాశము - మమ్మటుడు

కావ్యమీమాంస - రాజశేఖరుడు

కావ్యాదర్శము - దండి

కావ్యానుశాసనము - హేమచంద్రుడు

కావ్యాలంకారము - భామహుడు

కావ్యాలంకారము - వాగ్భటుడు

కావ్యాలంకారము - వామనుడు

కావ్యాలంకార సూత్రవృత్తి - వామనుడు

దశరూపకలు - ధనంజయుడు

ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుడు

ధ్వనిసారము - జమ్మలమడక మాధవరామశర్మ

నాట్య దర్పణము - రాచంద్రగుణచంద్రులు

నాట్యశాస్త్రము - భరతుడు

ప్రతాపరుద్రీయము - విద్యానాథుడు

భావప్రకాశము - శారదాతనయుడు

మహాభారతము - వ్యాసుడు

రసగంగాధరము - జగన్నాథుడు

రసతరంగిణి - భానుదత్తుడు

రసరత్నప్రదీపిక - అల్లరాజు

రసార్ణవసుధాకరుము - సింగభూపాలుడు।
బులుసువారి వ్యాఖ్య।

రామాయణము - వాల్మీకి
వాక్యపదీయము - భర్తృహరి
సరస్వతీకంఠాభరణము - భోజుడు
సాహిత్యదర్పణము - విశ్వనాథుడు
సాహిత్యసారము - అచ్యుతరాయలు

## తెనుగు గ్రంథములు :

అప్పకవీయము - అప్పకవి
ఆంధ్రకవితరంగిణీ - చాగంటి శేషయ్య
ఆంధ్రకవి సప్తశతి - బులుసు వెంకరమణయ్య
ఆంధ్రకవిత్వ చరిత్రము - బసవరాజు వేంకటఅప్పారావు
ఆంధ్రకవిత్వ చరిత్రము - భోగరాజు నారాయణమూర్తి
ఆంధ్ర కవుల చరిత్ర - కందుకూరి వీరేశలింగం పంతులు
ఆంధ్ర దశరూపకము - మల్లాది సూర్యనారాయణశాస్త్రి
ఆంధ్రధ్వన్యాలోకము - వేదాల తిరువేంగళాచార్యులు
ఆంధ్రప్రబంధము-అవతరణ వికాసములు - ఆచార్య కె.వి.ఆర్. నరసింహం
ఆంధ్రభారత కవితా విమర్శనము - కోరాడ రామకృష్ణయ్య
ఆంధ్రమహాభారతము - ఛందః శిల్పము - పాటిబండ మాధవ శర్మ
ఆంధ్రమహాభారతోపన్యాసములు - ఆంధ్రసారస్వతపరిషత్తు
ఆంధ్రవాఙ్మయ చరిత్ర - కె. నాగేశ్వరరావు
ఆంధ్రవాఙ్మయ చరిత్ర - పేకుమళ్ల అచ్యుతరావు
ఆంధ్రవాఙ్మయ చరిత్ర - దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రవాఙ్మయ చరిత్ర - వంగూరి సుబ్బారావు
ఆంధ్రవాఙ్మయారంభదశ-నన్నయభట్టు - దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము - కె.వి. నారాయణరావు
ఆంధ్రసారస్వత వ్యాసావళి - ఆంధ్ర శేషగిరిరావు
ఆంధ్రసాహిత్య దర్పణము - వేదం వేంకటరాయశాస్త్రి
ఆంధ్రసాహిత్య దర్పణము - ఎన్. చలపతిరావు
ఆంధ్రసాహిత్య పునర్వికాసము - మద్దుకూరి చంద్రశేఖరరావు
ఉత్తరరామాయణము - తిక్కన

కరుణరసము-ఆంధ్రవాఙ్మయము - నండూరి రాధాకృష్ణ
కవి జీవితములు - గురజాడ
కవిత్రయము - నండూరి రామకృష్ణమాచార్యులు
కవిత్రయ కవితారీతులు-తరువాతి కవులపై వారి ప్రభావము - దేశిరాజు భారతీదేవి
కవిత్రయ కవితా విమర్శనము - గుత్తిం వేంకటసుబ్బరామయ్య
కవుల కథలు - సత్యనారాయణ చౌదరి
కావ్యజగత్తు - జి.వి. కృష్ణారావు
కావ్యదర్శనము - భూపతి లక్ష్మీనారాయణ
కావ్యప్రకాశమ వివరణము - కొండూరి నరసింహాచార్యులు
కావ్య శిల్పము - విన్నకోట మాధవరావు
కావ్యాత్మ - రాఘవ అయ్యంగారు
కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
కావ్యాలంకార సంగ్రహము - భట్టుమూర్తి
గౌతమి వ్యాసాలు - పింగళి లక్ష్మీకాంతం
తిక్కన కళాసామ్రాజ్యము - కాశూరి వ్యాసమూర్తి
తిక్కన కావ్యశిల్పము - కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి
తిక్కన-భారతదర్శనము - నండూరి రామకృష్ణమాచార్యులు
తిక్కన సూచనలు - వజ్ఝా సూర్యనారాయణ
తిక్కన సోమయాజి - చిలుకూరి వీరభద్రరావు
తిక్కన సోమయాజి విజయము - వేదం వేంకటరాయశాస్త్రి
తెనుగు కవుల చరిత్ర - నిడుదవోలు వెంకటరావు
తెలుగు వాఙ్మయ సంగ్రహచరిత్ర - కూర్మా వేణుగోపాలస్వామి
తెలుగు సాహిత్యములో హాస్యరసము - మాణిక్యం వేదవల్లి తాయారు
తెలుగు హాస్యము - ముట్నూరి సంగమేశం
దశకుమార చరిత్రము - కేతన
నవరసగంగాధరము - జమ్మలమడక మాధవరామశర్మ
నాట్య వేదము - - పైది -
నాట్యశాస్త్రము-గుప్తభావప్రకాశిక సహితము - పోణంగి శ్రీరామ అప్పారావు

| | |
|---|---|
| నా రేడియో ప్రసంగములు ః రసానుభూతి ః | - పింగళి లక్ష్మీకాంతం |
| పూర్వాంధ్రకవులు | - కాశీభట్ల సుదర్శనవేణు గోపాలమూర్తి |
| ప్రతాపరుద్రయశోభూషణము | - చెలమచెర్ల రంగాచార్యులు |
| ప్రాచీన కావ్యమంజరి | - జి.వి. సోయమాజి |
| భరతరస ప్రకరణము | - తిరువేంగళాచార్యులు |
| భారతము - తిక్కన రచన | - భూపతి లక్ష్మీనారాయణ |
| భారత కథాలహరి | - ద్రోణంరాజు సీతారామరాయలు |
| భారతయోధులు | - చిలుకూరి వీరభద్రరావు |
| భారతసారము | - కుప్పుస్వామయ్య |
| భారతవిశేషములు | - తిరుపతికవి |
| భారతామృతరసము | - కాళూరి వ్యాసమూర్తి |
| మహాకవి మార్గము-విరాటపర్వము | - యస్వీ. జోగారావు |
| మహాభారత విమర్శనము-ఉద్యోగపర్వము | - బ్రహ్మశ్రీ పార్నంది రామశాస్త్రులు |
| మహాభారత విమర్శనము | - పుటపర్తి నారాయణాచార్యులు |
| రమ్యాలోకము | - రాయప్రోలు సుబ్బారావు |
| రసగంగాధరము | - ధరణికోట వేంకటసుబ్బయ్య |
| రసభారతి | - జమ్మలమడక మాధవరామ శర్మ |
| విమర్శన వ్యాసములు | - శిష్టా రామకోటిశాస్త్రి |
| వీరరసము | - జి.వి.సుబ్రహ్మణ్యం |
| శ్రీమదాంధ్రమహాభారత సంశయవిచ్ఛేదము | - వజ్ఝా సూర్యనారాయణ |
| శృంగారరసము | - తిరుపతి వెంకటీయము |
| సమగ్ర ఆంధ్రసాహిత్యం | - ఆరుద్ర |
| సారస్వతావలోకనము | - రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ |
| సారస్వతనవనీతము | - దేవులపల్లి రామానుజరావు |
| సారస్వతవ్యాసములు | - కోరాడ రామకృష్ణయ్య |
| సారస్వత వ్యాసముక్తావళి | - బూర్గుల రామకృష్ణారావు |
| సాహితీసుధాలహరి | - సముద్రాల నాగయ్య |
| సాహిత్యకళ | - కాశీభట్ల సుబ్బయశాస్త్రి |

సాహిత్యజగతి - కాళూరి హనుమంతరావు
సాహిత్యతత్త్వ విమర్శనము - జొన్నలగడ్డ సత్యనారాయణ
సాహిత్యదర్శనము - కాకర్ల వేంకటరామ నరసింహం
సాహిత్యమీమాంస - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
సాహిత్యవ్యాసములు - డా॥ రామకోటిశాస్త్రి
సాహిత్యశిల్ప సమీక్ష - పింగళి లక్ష్మీకాంతం
సాహిత్య సంపద - దీపాల పిచ్చయశాస్త్రి
సాహిత్యసోపానములు - దివాకర్ల వేంకటావధాని
సాహిత్యసౌరభము - క్రొవ్విడి రామం
సాహిత్యోపన్యాసములు : 8 సంపుటములు।
A Critical introduction to Andhra Mahabarata - Malladi Suryanayana Sastry
Conception & Practice of Poetry of Kavitrayam & Nachana Somana - M. Rangarao

## ఆంగ్ల గ్రంథములు :

Agnipurana - S.D. Gyani's translation
A monograph on Bharatha's Natyasastra - P.S.R. Apparao
History of Sanskrit Poetics - P.V. Kane
History of Sanskrit Poetics - S.K. De
Indian Aesthetics - K.S. Ramaswamy Sastry
Introduction to Sahitya Darpana - P.V. Kane
Life & Teaching of Ramanuja
Man Visible & Invisible - C.W. Lead Beeter
Number of Rasas - V.V. Raghavan
Psychological Studies in Rasa - Rakesh Gupta
The Mahabharatha - V.V. Iyer
The Mahabharatha- A Criticism - C.V. Vaidhya
The Mahabharatha - C.V. Narasimham
Theory of Rasa in Sanskrit Drama - Hari Mishra

## హింధీ గ్రంథములు :

కరుణరస్ - శ్రీ వ్రజవాసిలాల్ శ్రీవాస్తవ
నవరస్ - గులాబ్ రాయ్

**ఆంధ్రపత్రికలు :**

1922 దుందుభి - తిక్కన కవిత్వము -భోగరాజు నారాయణమూర్తి

1923-24 రుధిరోద్గారి - ఏకోరసః కరుణఏవ - బసవరాజు అప్పారావు

1963-64 శోభకృత్తు - అమలిన శృంగారతత్త్వము - సి. నారాయణరెడ్డి

**ఆంధ్రవిశ్వకళాపరిషత్ కళాశాల తెనుగు సంఘ పత్రికలు :**

సంపుటి 32 - తిక్కన ప్రతిభ - పెద్దింటి రామస్వామి

సంపుటి 34 - రసపరిష్కారము - పాటిబండ మాధవశర్మ

**ఆంధ్రసర్వస్వము :**

సంపుటి 1 - ఆంధ్రవాఙ్మయ చరిత్ర - తిక్కనయుగము

**ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలు :**

1913-1914 - సంపుటి 2, సంచిక 4-శృంగారరస విమర్శనము - మల్లాది సూర్యనారాయణశాస్త్రి

1919- సంపుటి 8, సంచిక 4 - తిక్కనసోమయాజి జీవితము - మా. నరసింహాచార్యులు

1923 - సంపుటి 12, సంచిక 4,5 - మహాభారతచరిత్రము - పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

1926 - సంపుటి 14, సంచిక 1 - భారతరచనా విధానము -పెండ్యాలవేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

1926 - సంపుటి 15, సంచిక 1 - మహాభారత కథాతత్త్వ నిర్ణయము - మల్లాది రామకృష్ణశాస్త్రిచయనులు

1926 - సంపుటి 15, సంచిక 3,4 - మహాభారత మీమాంస - చెర్ల నారాయణశాస్త్రి

1926 -సంపుటి 15, సంచిక 5,6 - కరుణరసము - కాశీభట్ట సుబ్బయశాస్త్రి

1929 - సంపుటి 17, సంచిక 5 -ఆంధ్రమహాభారతోద్యోగపర్వవివాద పద్యవిమర్శనము - చంద్రా భట్టరామమూర్తి

1932 - సంపుటి 20, సంచిక 1 - నాటక రసవిచారణ - మల్లాది సూర్యనారాయణశాస్త్రి

1932 – సంపుటి 20, సంచిక 3 – మహాభారత విమర్శనము
– కేతవరపు వెంకటరామకోటి శాస్త్రి

1932 – సంపుటి 21, సంచిక 1 – శృంగారరసము – కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

1934-35 – సంపుటి 23, సంచిక 1 – రసస్వరూపము – బులుసు వెంకరమణయ్య

1935-36 – సంపుటి 24, సంచిక 5,6 – ఆంధ్రవాఙ్మయము – హాస్యరసము
– సాగి వెంకటనరసింహం

1937-38 – సంపుటి 26, సంచిక 4 – ఆంధ్ర వాఙ్మయము –కరుణరసము
– సాగి వెంకటనరసంహం

1938-39 – సంపుటి 27, సంచిక 3 – తిక్కన భారత రచన
– విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

1938 – సంపుటి 27, సంచిక 1 – తిక్కనార్యుని సంస్కృతభాషాభిమానము
– కాశీభట్ట బ్రహ్మయశాస్త్రి

1939 – సంపుటి 28, సంచిక 3 – నాటకములు – రసములు
– వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

1941 – సంపుటి 30, సంచిక – నాటకరస విమర్శ పర్యాలోచనము
– మల్లాది సత్యనారాయణశాస్త్రి

1952-53 – సంపుటి 41, సంచిక 4,6 – రసము కిన్నిష్టము–దివాకర్ల వేంకటావధాని

1953-54 – సంపుటి 42, సంచిక 1,2 – రససమీకరణము ఏకోరస :
– దివాకర్ల వేకంటావధాని

1956-57 – సంపుటి 45, సంచిక 1,2 – ఆంధ్రభారత విమర్శనము
– కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

1956-57 – సంపుటి 45, సంచిక 3 – రసరాద్ధాంతము – యస్వీ జోగారావు

1959-60 – సంపుటి 48, సంచిక 1,2 –తిక్కనసోమయాజి–వారణాసి సుభద్రమ్మ

1959-60 – సంపుటి 48, సంచిక 4 – తిక్కన భారతము–నాటకీయత
– కాకర్ల వెంకటరామనరసింహం

1959-60 – సంపుటి 49, సంచిక 5,6 – తిక్కన–ధర్మాద్వైతము
– దివాకర్ల వెంకటావధాని

1959-60 – సంపుటి 49, సంచిక 5,6 – ఆంధ్రకావ్యములు–హాస్యరసము
– శిష్ట్లా రామకృష్ణశాస్త్రి

1959-60 - సంపుటి 49, సంచిక - వ్యాసుడు-తిక్కన
-దివాకర్ల వేంకటావధాని

1959-60 - సంపుటి 50, సంచిక 5,6 - భారతపరిశీలనము - ధర్మస్వరూపము
- శ్రీ కృష్ణభిక్షు

భారతి :

1928 అక్టోబరు - సంపుటి 5, సంఖ్య 10 - తిక్కన విరాటపర్వము
- గుఱ్ఱం వెంకటరామసుబ్బయ్య

1930 నవంబరు - సంపుటి 7, సంఖ్య 10 - సంస్కృత సాహిత్యమున రసవిచారము
- సుశీలకుమారదేవ్

1934 జూలై - సంపుటి 11, సంఖ్య 10 - మహాభారతము-వ్యాసుని కూర్పు-
తిక్కనతీర్పు- మున్నంగి కేశవశర్మ

1935 మే - సంపుటి 12, సంఖ్య 5 - రసపరిష్కారము - పాటిబండ మాధవశర్మ

1935 సెప్టెంబరు - సంపుటి 12, సంఖ్య 9 - రసరాద్ధాంతము
- దువ్వూరి సూర్యనారాయణమూర్తి

1935 నవంబరు - సంపుటి 12, సంఖ్య 11 - శృంగారము - నీతి
- కాంభట్ల విశ్వనాథశాస్త్రి

1935 నవంబరు - సంపుటి 12, సంఖ్య 11 - రససిద్ధాంతము
- పాటిబండ మాధవశర్మ

1936 మే - సంపుటి 13, సంఖ్య 5 - రసాభాసము - గొల్లపూడి శ్రీరామశాస్త్రి

1938 ఏప్రిల్ - సంపుటి 15, సంఖ్య 4 - తిక్కన గద్యరచన - క్రొవ్విడి రామం,
భళ్లముడి నరసింహశాస్త్రి

1941 ఫిబ్రవరి - సంపుటి 18, సంఖ్య 1 - తిక్కన నవ్వులు - ఆంధ్ర శేషగిరిరావు

1947 ఏప్రిల్ - సంపుటి 24, సంఖ్య 4 - తిక్కన కావ్య నిర్మాణ వైభవము
- గడియారం వెంకటశేషశాస్త్రి

1947 మే - సంపుటి 24, సంఖ్య 5 - ఆంధ్రకవుల ఆదర్శములు
- అమాత్య తిక్కన- నోరి నరసింహశాస్త్రి

1947 జూలై - సంపుటి 24, సంఖ్య 7 - రసప్రకృతి - ఆమంచర్ల గోపాలరావు

1954 ఏప్రిల్ - సంపుటి 31, సంఖ్య 4 - శ్రీశంకుకుని అనుమితి వాదము
పైది -భావనావ్యాపారము -
పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి
1954 సెప్టెంబరు - సంపుటి 31, సంఖ్య 9 - రసావగతి
- పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
1954 అక్టోబరు - సంపుటి 31, సంఖ్య 10 - శృంగారరసము - పైది
1954 నవంబరు - సంపుటి 31, సంఖ్య 11 - హాస్యరసము - పైది
1954 డిసెంబరు - సంపుటి 31, సంఖ్య 12 - కరుణరసము - పైది
1955 జనవరి - సంపుటి 32, సంఖ్య 1 - అద్భుత రసము - పైది
1955 ఫిబ్రవరి - సంపుటి 32, సంఖ్య 2 - రససంఖ్య - పైది
1957 జనవరి - సంపుటి 34, సంఖ్య 1 - నానారసాభ్యుదయోల్లాసి
- రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి
1957 సెప్టెంబరు - సంపుటి 34, సంఖ్య 9 - తిక్కనశిల్పపు తెనుగుతోట
-యడవల్లి ఆదినారాయణ
1961 జనవరి - సంపుటి 38, సంఖ్య 1 - తిక్కన కర్ణపర్వ నిర్వహణము
- యడవల్లి ఆదినారాయణ
1969 మే - రసజగత్తులో సామాన్యుడు - సమీక్షకుడు -
కొండపర్తి శేషగిరిరావు

**కిన్నెర :**

1953 ఆగష్టు/అక్టోబరు - నాటకము-రసానుభూతి.-భూపతిలక్ష్మీనారాయణ
1954 జూలై - ఆంధ్ర సాహిత్యము-హాస్యము - వసంతరావు రామకృష్ణారావు

**పరిశోధన :**

1955-56 - సంపుటి 2, సంఖ్య 1 -రసరామణీయకం - బులుసు వెంకటరమణయ్య
1955-56 - సంపుటి 2, సంఖ్య 1 - ఆంధ్రనాటకపితామహుని హాస్యరసపోషణ
- దివాకర్ల వేంకటావధాని

**ప్రతిభ :**

సంపుటి 2 - శ్రీశంకురసవాదము - జమ్మలమడక మాధవరాశర్మ
సంపుటి 3 - రసాస్వాదము - తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులు

సంపుటి 3 - శాంతరసము - పైది

విజ్ఞాన సర్వస్వము - సంపుటి 6

**శారద :**

1924 - కరుణరసము - ట్రాజడీ - పా. రామమూర్తి

**సాహితి :**

1961 జనవరి - సంపుటి 1, సంచిక 1 - తిక్కన ఎక్కడివాడు
- దీపాల పిచ్చయశాస్త్రి

1964 జనవరి - సంపుటి 3, సంచిక 3 - తిక్కన తెనుగుతెన్నులు
- దీపాల పిచ్చయశాస్త్రి

1964 అక్టోబరు - సంపుటి 3, సంచిక 12 - సంజయరాయబారము
-తిక్కన కవితాశిల్పము - వక్కలంక లక్ష్మీపతి

**ప్రవంతి :**

1962 డిసెంబరు - తిక్కన - షేక్స్పియరు - ఆర్. ఎస్. సుదర్శనం

1963 ఆగస్టు / సెప్టెంబరు - సంచిక 5,6 - తెనుగు సాహిత్యంలో హాస్యం
- పోతుకూచి సాంబశివరావు

1964-65 డిసెంబరు/జనవరి - కవిబ్రహ్మ కళాప్రతిభ
- బొడ్డుపాటి కుటుంబరాయశర్మ

1969 జూన్ - రసం-దాని లౌకికత్వం - ముకురాల రామిరెడ్డి

# సంకేత సూచిక

| | |
|---|---|
| అ., అధ్యా. | –అధ్యాయము |
| అధి. | –అధికారము |
| అరణ్య. | –అరణ్యపర్వము |
| అశ్వ. | –అశ్వమేధపర్వము |
| ఆ. | –ఆశ్వాసము |
| ఆది. | –ఆదిపర్వము |
| అను. | –అనుశాసనికపర్వము |
| ఆంధ్ర.సా.ప.ప. | –ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక |
| ఆశ్ర. | –ఆశ్రమావాసపర్వము |
| ఉద్యో. | –ఉద్యోగపర్వము |
| ఉ.రా. | –ఉత్తరరామాయణము |
| ఉల్లా. | –ఉల్లాసము |
| కర్ణ. | –కర్ణపర్వము |
| చూ. | –చూడుము |
| తృ. | –తృతీయ |
| ద.కు.చ. | –దశకుమారచరిత్ర |
| ద్రో.,ద్రోణ. | –ద్రోణపర్వము |

| | |
|---|---|
| ద్వి. | -ద్వితీయ |
| నా.శా.,నాట్యశా. | -నాట్యశాస్త్రము |
| ప. | -పద్యము |
| పరి. | -పరిచ్ఛేదము |
| పు. | -పుట |
| ప్ర. | -ప్రథమ |
| భీ., భీష్మ. | -భీష్మపర్వము |
| మహాప్ర. | -మహాప్రస్థానము |
| మౌసల. | -మౌసలపర్వము |
| శల్య. | -శల్యపర్వము |
| శాంతి. | -శాంతిపర్వము |
| శ్లో. | -శ్లోకము |
| సౌప్తిక. | -సౌప్తికపర్వము |
| స్త్రీ. | -స్త్రీపర్వము |
| స్వర్గ. | -స్వర్గారోహణము |
| p. | -page |
| pp. | -pages |
| Vol. | -Volume |

# ఆంధ్ర (భమిడిమర్తి) కమలాదేవి



జన్మస్థలం : నరసాపురం, గోదావరిజిల్లా

జననీజనకులు : శ్రీమతి ఆంధ్ర లక్ష్మీభాయమ్మ,
కీ.శే.ఆంధ్ర శివప్రసాదరావుగారలు.

అత్తమామలు : శ్రీమతి భమిడిమర్తి రమణమ్మ,
కీ.శే.భమిడిమర్తి జగన్నాథరావుగారలు

విద్యాభ్యాసం : ప్రాథమిక విద్యమొదలు కళాశాల విద్యవరకు - విశాఖపట్నం
ఎం.ఏ.పి.హెచ్.డి - ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు
బి.ఇడి. - బొంబాయి విశ్వవిద్యాలయము, బొంబాయి
ఎమ్.ఇడి. - జయపూర్ విశ్వవిద్యాలయము, బికనేర్

ప్రస్తుత నివాసం : A-121, ఇంద్రపురి, న్యూఢిల్లీ.

అభిరుచులు : - సాహితీవ్యాసంగం - గేయ, కథానిక, వ్యాస రచనా,
వ్యాసంగాలలో, ప్రసంగాలలో అభిరుచి.
కొన్నిగేయములు వ్యాసములు ముద్రితములు.

---

ముద్రణ : ప్రింటోరియం, హైదరాబాద్

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖకాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్ధరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | |
|---|---|
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

**రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి**
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు**

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్థరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | |
|---|---|
| 1. 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహావైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

| | | |
|---|---|---|
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |
| 54. | దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. | గణపతిభాష్యం | 99-00 |
| 56. | యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. | నవయోగులు | 99-00 |
| 58. | ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. | సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. | సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. | సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. | ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. | బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. | సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. | శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. | శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. | మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. | మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. | చదరంగం | 99-00 |
| 70. | పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. | గరుడపురాణం | 40-00 |
| 72. | మాఘపురాణం | 36-00 |
| 73. | శివపురాణం | 36-00 |
| 74. | వైశాఖపురాణం | 36-00 |
| 75. | కార్తీక పురాణం | 36-00 |
| 76. | కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. | సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. | పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. | గాయత్రీ మహిమ | 36-00 |
| 80. | వృక్షదేవతలు | 63-00 |
| 81. | యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. | సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. | చతుర్వేదములు | 120-00 |
| 84. | నవగ్రహారాధన | 120-00 |
| 85. | తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. | మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |

| | | | |
|---|---|---|---|
| 87. | మానవధర్మములు | | 120-00 |
| 88. | వేదమంత్ర సంహిత | | 120-00 |
| 89. | సహస్రలింగార్చన | | 120-00 |
| 90. | శ్రీ శివగీత | | 120-00 |
| 91. | ద్వాదశఉపనిషత్తులు | | 120-00 |
| 92. | పురాణపండవారి సౌందర్యలహరి | (కేస్‌బైండ్) | 250-00 |
| | (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) | సాదా | 120-00 |
| 93. | బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | | 200-00 |
| 94. | బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 95. | బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | | 200-00 |
| 96. | కేదారనాధ్ బదరీనాధ్ యాత్రాగైడు | | 63-00 |
| 97. | దక్షిణావృత శంఖములు | | 63-00 |
| 98. | 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శిని | | 36-00 |
| 99. | ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | | 270-00 |
| 100. | భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | | 99-00 |
| 101. | చిలుకూరి బాలాజీచరిత్ర | | 36-00 |
| 102. | భగవత్‌స్తుతి | | 63-00 |
| 103. | సూర్యోపాసన | | 36-00 |
| 104. | కాశీఖండం | | 250-00 |
| 105. | దేవీభాగవతం | | 360-00 |
| 106. | శ్రీ ఆంజనేయం | | 216-00 |
| 107. | ధర్మసందేహాలు | | 216-00 |
| 108. | ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | | 250-00 |
| 109. | రామాయణం | | 600-00 |
| 110. | పోతన భాగవతం | | 900-00 |
| 111. | శివమంత్రములు | | 63-00 |

## 8. వైద్య గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. | మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. | ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. | గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. | గృహవైద్యసారం | 36-00 |
| 6. | హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. | ప్రకృతివైద్యం | 36-00 |
| 8. | ఆహారం-వైద్యం | 99-00 |

| | | |
|---|---|---|
| 9. | సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. | ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. | ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. | దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. | ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. | అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. | రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. | ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. | ఒబెసిటి | 99-00 |
| 18. | హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. | ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. | ఫుడ్‌థెరపి | 63-00 |
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20ని॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |

## 9. అయ్యప్ప - భవానీ రకాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |

